# పద్యానుభవం

**డా॥ జి. వి. పూర్ణచందు**

(ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, సాహితీవేత్త. శతాధిక గ్రంథకర్త,
తెలుగుభాష ప్రాచీనత, తెలుగువారి ఆహార చరిత్ర,
ఆహార సంస్కృతుల పైన విశేష పరిశోధన చేశారు.
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తెలుగు విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం,
ఇంకా అనేక జాతీయ, అంతర్జాతీయ సంస్థల పురస్కారాలు పొందారు
తెలుగు భాషోద్యమ ప్రముఖులు)

తిరుమల తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహకారంతో
ప్రచురితం

**PADYANUBHAVAM** (Literary Criticism)
Published in Sunday Edition, Visalandhra Daily

by : **Dr. G.V.Purnachand,** B.A.M.S.,

**First Edition : 2017**

**Copies : 1000**

**Price : Rs. 125/-**

Published on the occasion of
61st Birth Day of **Dr. G.V. Purnachand**

Title Design : Ramu Alahari

Type Setting :
MADHULATHA GRAPHICS,
Arundalpet, Vijayawada. Ph. : 0866-2434320

*Printed by :*
Sri Chaitanya Offset Printers
Vijayawada - 2.

*For Copies :*
**Susruta Ayurvedic Speciality Hospital,**
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-2.
Mobile : 94401 72642.

2



ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది.

---

# అంకితం



ఆ యిద్దరూ నాకు ఆప్తులు...
నేను ఆయుర్వేద వైద్యంలో చేరిన నాటి నుండీ
ఆయన పరిచయస్థులు
నాకు వైద్యవిద్యలో ఆమె సహాధ్యాయని
మేం మొదటి సంవత్సరం చదువుతున్నప్పుడే
వాళ్ళిద్దరి వివాహం జరిగింది
అప్పటి నుండీ ఆ యిద్దరూ
**డా॥ సామల రమేష్‌బాబు**
**డా॥ దుర్గావతి**
అన్నావదినలు నాకు !
అటు ఆయుర్వేద ప్రచారోద్యమంలోనూ
ఇటు తెలుగు భాషోద్యమంలోనూ
వారితో కలిసి పనిచేసిన ఆనందం,
ఎంతో కొంత సాధించామన్న సంతృప్తి...
అందుకే ఆ యిద్దరికీ
ఈ కృతి
పురస్కృతి !

**- పూర్ణచందు**

## నా మాటలు నాలుగు...

నాటిపద్యంలో నేటి సమాజానికి తగిలే బాణాలు చాలావున్నాయి. వాటిని ఆ కోణంలోంచి చూస్తేనే ఆ కవిత్వాన్ని ఆస్వాదించగలుగుతాం. పద్యంలో లోక రుగ్మతలకు “పథ్యం”గా పెట్టదగిన అంశాల్ని ఏర్చికూర్చిన గ్రంథం ఇది. అలంకార, వ్యాకరణ, ఛందో విషయాలకు మాత్రమే పద్యవిమర్శ పరిమితమైనందువలన సాహిత్య ప్రయోజనం సామాన్యుణ్ణి చేరలేకపోయింది. పైగా పద్యం అనేది బానిస భావాల్ని పెంచే ప్రక్రియగా ఈసడింపుకు గురయ్యింది.

ఈ పరిస్థితుల్లో “మంచి ఎక్కడున్నా తీసుకుందాం, మంచిని మాత్రమే తీసుకుందాం...” అని మాన్యమిత్రులు, విశాలాంధ్ర దినపత్రిక సంపాదకులు, అభ్యుదయవాది శ్రీ ముత్యాల ప్రసాద్ ఈ శీర్షికను నాకందించి బాధ్యతగా దీన్ని నెరవేర్చమన్నారు. దానికి ‘పద్యానుభవం’ అని ఆయనే పేరు పెట్టారు. శ్రీ ముత్యాలప్రసాద్ గారికి నా ధన్యవాదాలు.

గత నాలుగేళ్ళుగా విశాలాంధ్ర దినపత్రిక ఆదివారం అనుబంధంలో ఈ “పద్యానుభవం” శీర్షిక విశేష పాఠకాదరణ పొందింది. ఇందులో వెలువడిన వ్యాసాలను 2016లో ‘పద్యంలో మనం’ పేరుతో మొదటి సంపుటి శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణగా వెలువడింది. ఇప్పుడు ‘పద్యానుభవం’ పేరుతో మరికొన్ని వ్యాసాలు ప్రచురిస్తున్నాను. ఇందులో అధికభాగం భాషోద్యమ పరమైనవీ, శాస్త్రపరమైనవీ అనేక వ్యాసాలు వున్నాయి.

ఈ ‘పద్యానుభవం’ సాహిత్య విమర్శనా గ్రంథానికి ఆముఖాన్ని అందించిన ప్రసిద్ధ విమర్శకులు డా॥ కె. రామమోహనరాయ్‌గారు అత్యంత ఆత్మీయంగా నన్ను “పరిపూర్ణానంద’ అని ఆశీర్వదించారు. రాయ్ గారి మెప్పు పొందడం అనేదే పద్మశ్రీ కన్నా గొప్ప పురస్కారంగా భావిస్తాను. పెద్దలు, పూజ్యులు శ్రీ రామమోహనరాయ్ గారికి నమస్కృతులర్పిస్తున్నాను.

సునిశిత పరిశీలనా శక్తి, నిగూఢమైన పరిశోధనానుభవం కలిగిన సాహితీవేత్త, సన్మిత్రులు శ్రీ కంపెల్ల రవిచంద్రన్ ఈ పుస్తకం వెలువడటానికి ప్రధాన కారకులు. అంత మాత్రమే కాదు, నా షష్ఠిపూర్తి సందర్భంగా పుస్తక యజ్ఞం చేయాల్సిందిగా సూచించింది కూడా ఆయనే! శ్రీ రవిచంద్ర ప్రేరణతోనే, నా షష్ఠిపూర్తిని పురస్కరించుకుని 12 పుస్తకాలు వెలవరించ గలుగుతున్నాను. వారికి ధన్యవాదాలు ఎంత చెప్పినా తనివితీరదు. ఈ 12 పుస్తకాలతో మొత్తం అచ్చయిన నా రచనలు 107కు చేరుకున్నాయి. వాటిలో 15 ముద్రణలు పొందినవి కూడా వుండడం నాకెంతో గర్వకారణం.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆర్థిక సహకారం అందించినందుకు తి.తి.దే సంపాదక మహాశయులకు కృతజ్ఞతలు. ఇంకా, నా పుస్తక యజ్ఞానికి సహకరిస్తున్న శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్ - గుత్తికొండ సుబ్బారావు గారికి, శ్రీ మధులత పబ్లికేషన్స్ వి.ఎల్. నరసారెడ్డి గారికి, విక్షరీ పబ్లికేషన్స్ శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్‌గారికి నా ధన్యవాదాలు.

ప్రేమ, భక్తి, గౌరవం, అభిమానం ఇవి చాటుకోవడటానికి కాదు, భాషోద్యమంలో కలిసి పనిచేసిన తీపిగుర్తుకు సంతృప్తి కొద్దీ ఈ పుస్తకాన్ని పురస్కృతిగా స్వీకరించవలసిందిగా చిరకాల మిత్రులు మా పెద్దన్న గారు డా॥ సామల రమేష్‌బాబు గారిని కోరాను. కాదుకాదన్నప్పటికీ, సోదర వాత్సల్యాన్ని ఆయన కాదన లేకపోయారు. డా॥ సామల రమేష్‌బాబు, డా॥ దుర్గావతి దంపతులకు నా ప్రణామాలు.

డా॥ జి.వి. పూర్ణచందు

# పద్యానుభవాల వరుస ఇది...

# పరిపూర్ణానంద కవితా స్వాదన

డా॥ కడియాల రామమోహనరాయ్

డా॥ జి.వి. పూర్ణచందు నాకు పరిపూర్ణనందుగా కన్పిస్తారు. రచన, సభానిర్వహణ, ప్రచురణ ఏ పని చేపట్టినా ఎవరూ వేలెత్తి చూపకుండా, అందరికీ ఆనందం కలిగిస్తారు. వైద్యునిగా రోగానికి చికిత్స కంటే, అసలు రోగాన్నే దగ్గరకు రానీయని ఆహారము, ఆహారపుటలవాట్లూ ముఖ్యమని తలుస్తారు. *Healthy mind in a healthy body* ఆయన జీవన మార్గం.

నలభై సంవత్సరాలుగా ఈ పరిపూర్ణానందుని సాహిత్య ప్రస్థానాన్ని గమనిస్తున్నాను. కవితలు ఇతర రచనలు చదివి ఆనందిస్తున్నాను.

**'పద్యానుభవం'** చదివేదాక పరిపూర్ణానందుకి ప్రాచీనాంధ్ర సాహిత్యంపై ఇంతపట్టు వుందని అనుకోలేదు. మినీ కవితలను చదివి ఆనందించి, మినీ కవితలు రచించి, ఆనందింపజేయటమే గాక వాటిని అందంగా రాసి 1980లో ప్రదర్శనను నిర్వహించిన యువకుడిగా ఆయనను నేను ఎరుగుదును. ఆయన నిశితమైన కవిత్వ పరిశీలనా, లోక పరిశీలన నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేశాయి.

ఒక మంచి తెలుగు పద్యాన్నో శ్లోకాన్నో ఎంచుకొని దానికి తాత్పర్యం రాసి మరికొంత వివరణ జోడించిన రచయితలు కొంతమంది వున్నారు. పత్రికలే తప్ప ఉత్తమ గ్రంథాలు చదవని పాఠకులు - ముఖ్యంగా పద్యకావ్యాలు చదవని వారికి ఈ పద్య పరిచయాలు ఉపయోగకరంగా తోచాయి. అసలు కావ్యాలు చదవ లేకపోయినా యీ పద్యాల వల్ల ఎంతో కొంత ఆనందమూ, విజ్ఞానము పొందిన తృప్తి వారిలో కలిగింది.

**'పద్యానుభవం'** సంపుటిలో వివరణ కేవలం పద్యానికే పరిమితం కాలేదు. పద్యభావం ఆధారంగా ఇందులో సామాజిక విమర్శ చోటుచేసుకున్నది. కొన్నిచోట్ల యీ విమర్శ ఘాటుగా కూడ వున్నది. పరిపాలకుల అవకతవకలను బయటపెట్టటమే గాక వాటిని సరిదిద్దుకోవటానికి ఏమి చెయ్యాలో తెలిపే సూచనలు కూడ వున్నాయి.

సాహిత్యాభిమానులకు బాగా పరిచితమైన భారత భాగవత, రామాయణ పద్యాలున్నాయి. ప్రబంధాల్లో పద్యాలు కూడా వున్నాయి. రాయప్రోలు విశ్వనాథ మొదలైన ఆధునిక మహాకవుల రమణీయమైన పద్యాలున్నాయి. ఇంకా నోరూరగ చవులు పుట్టించే నీతి పద్యాలు, ఝటిత స్ఫూర్తి కలిగించే చాటు పద్యాలూ వున్నాయి.

ఇందులో విశేషమేమంటే సవరము చిననారాయణ నాయకుని కువలయాశ్వ చరిత్ర, గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి 'కుంతి' మొదలైన కావ్యాలను యీతరం పాఠకులు చదవకపోవటమే గాదు చూసి, వినికూడ వుండరు. మన పరిపూర్ణానంద తెల్పిన ఆ పద్యవిశేషాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

'ఏది పతనం?' వ్యాసంలో "యతిసంగంబున" అనే సుభాషితాన్ని (ఏనుగు లక్ష్మణ కవి) పరిచయం చేశారు. కష్టాలు ఎవరి వలనో వస్తాయనే భావన మనలో ఎక్కువ. "ఫలానా పార్టీవాళ్లు మోసం చేసి గెలిచారంటాడేగాని తన బలహీనత, తన చాలనితనం, తన వెలితి తనను ఓటమి వైపుకు నడిపించాయని ఓడిన ఏ ఒక్కడూ ఒప్పుకోడు". ఇటువంటి వ్యాఖ్యానాలు ఆలోచింపజేస్తాయి. చాలాకాలం జ్ఞాపకం వుంటాయి.

'విశాలాంధ్ర' ఆదివారం అనుబంధంలో పద్యానుభవంలో పద్యాలు వెలువడుతున్నప్పుడు చురుకైన పాఠకులను ఇవి విశేషంగా ఆకర్షించాయి. పత్రికరాగానే ముందుగా ఈ శీర్షికనే చదివేవాణ్ణి.

'కాకాలు తెలీని కాకి' చదువుతున్నప్పుడు సుప్రసిద్ధ రచయిత పత్రికా సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు గారి 'మాటామంతీ' వ్యాసాలు మనసులో మెదిలాయి. నార్ల వారిలాగే మన పరిపూర్ణానంద రచనలోను చక్కని తెలుగు నుడికారం వుంది.

తెలుగుభాషంటే పరిపూర్ణనందకు ప్రాణం. 'కుదురుదారి' వ్యాసంలో తెలుగుభాష కోసం అహరహమూ పరితపించిన 'కవిగారు' మారేపల్లి రామచంద్రశాస్త్రి గారి 'కుదురు దారి' పద్యాన్ని ఇచ్చి ఇప్పుడు తెలుగుభాష తెలుగు వారికే అక్కర బట్టక పోవటాన్ని గూర్చి ఆందోళన చెందారు. "బస్సురోడ్డున స్పీడుగా పోతోంది" అనే నాలుగు మాటల వాక్యంలో బస్సు,రోడ్డు, స్పీడు మూడూ పోతే, పోతోంది అనేది ఒక్కటే తెలుగు. అది కూడ ఎప్పుడు పోతుందో తెలియదు అని పరిపూర్ణానంద వాపోయారు.

ఒక ప్రముఖుడు చనిపోయిన సంగతిని మిత్రుడొకరు ఆయన ఎక్స్‌పైర్ అయ్యారు అని చెప్పారు. సులభంగా "ఆయన పోయారు" అని చెప్పవచ్చు- చెప్పేవారి ముఖకవళికలను బట్టి గొంతును బట్టి సంగతి తెలుస్తుంది. 'ఎక్స్‌పైర్' లాంటి మాటలు వాడటం మనభాషకు మనం కోరి దూరం కావటమే.

ప్రబంధ కవులను గురించి రాసినా, మాట్లాడినా 'సరస్వతీపుత్ర' పుట్టపర్తి నారాయణాచార్యులు వాళ్లను తనకు సమానస్థాయి కవుల్లాగే భావించే వారు. పరిపూర్ణనంద చెప్పినట్లు తెనాలి రామకృష్ణ కవిని "తెనాలివాడని అని ఎదురు వెటకారం చేస్తూ వ్రాసేవారు". "తెనాలివాడు నోరు పెట్టుకు బతికేదు" అన్నారొక సందర్భంలో! తెనాలి కవి తర్కశాస్త్రం అడ్డుపెట్టుకొని వాదనలు సలిపేవాడని పుట్టపర్తివారి ఉద్దేశ్యం.

తెనాలి రామకృష్ణకవి 'అయుతనియుతోపాఖ్యానం' (పాండురంగ మహాత్మ్యము)లో 'కలలో వార్తలు విప్పి చెప్పే అలవాటు హానికరమన్నాడు". ఉత్పుత్తి ప్రవచనకారుల్ని ముండధారులు" అని కూడ అన్నాడు. ఈ విషయంపై వ్యాఖ్యానిస్తూ మన పరిపూర్ణానంద "పత్రికాకారులైనా, ప్రవచనకారులైనా, వచనకారులైనా, వచన కవులైనా కలలో వార్తలు విప్పి చెప్పటం వలన ఈ లోకానికి ఒరిగేదేమీ వుండదు అని ఖండితంగా చెప్పారు. టీ.వి. భక్తి ఛానెల్స్‌లో ప్రవచనకారుల ప్రలాపాలు విన్నపుడు 'ముండధారులు' అనే మాట తప్పక గుర్తొస్తుంది. ప్రవచనకారుల కింతమంచిపేరు పెట్టినందుకు ఈ వ్యాఖ్యాతకు నా అభినందనలు.

"చద్దన్నం అంటే పెరుగన్నం" ; "చల్లంబలి అనే పారిజ్", "చిల్లర దేవుళ్లు"; "జాతివార్తలు"; "తోకనాయకులు"; "రాణించిన రాజు" మొదలైన వ్యాసాలు హృద్యంగా వున్నాయి.

పద్య కవితామాధుర్యాన్ని చవి చూడటానికి, లోకరీతిని, లోకనీతిని తెలుసుకోవటానికి ఈతరం పాఠకులు 'పద్యానుభవం' తప్పక చదవాలి.

**పద్యంతో ప్రయాణం అనేక తీర్థాలను సేవించిన ఆనందాన్ని కలిగిస్తుంది.**

# అతిథి మర్యాదలు

*శ్వశురగృహనివాసః స్వర్గతుల్యోనరాణాం*
*యది భవతి వివేకః పంచభిష్షడ్దినైర్వా*
*దధిమధుఘృతలోపో న్మాసమేకం నరాణాం*
*తదుపరి దినమేకం పాదరక్ష ప్రయోగః*

*(చాటువు)*

భారవి మహాకవి ఇల్లరికం వెళ్ళి అత్తగారింట్లో పొందిన భోజన అవమానాల కథ సాహిత్యంతో పరిచయం కలిగిన వారికి ఎరుకే! మామగారిల్లు స్వర్గలోక నివాసంతో సమానం. వివేకం కలిగి ఐదారు రోజులుంటే స్వర్గానికన్నా గొప్పగానే ఉంటుంది. ఆ తరువాత కూడా అల్లుడు అక్కడే కొనసాగితే భోజనం లోంచి క్రమంగా పెరుగు, తీపిపిండివంటలు, నెయ్యి ఇవన్నీ ఒక్కక్కటే అదృశ్యం అవుతాయి. అది గమనించి అల్లుడు ప్రయాణానికి ఏర్పాట్లు చేసుకుంటే మంచిదే! సిగ్గువిడిచి ఒక నెలయ్యాక ఒక్క రోజు ఉన్నా పాదరక్షల ప్రయోగం కూడా జరగవచ్చంటాడు కవి ఈ చాటుపద్యంలో!

అతిథి దేవో భవ' అనే సంస్కృతి మనది. అతిథికి వడ్డించి, ఆయన ముద్ద నోట్లో పెట్టుకున్నాకే గృహస్థు భోజనం ప్రారంభిస్తాడు. ఇది మన ఆహార సంస్కృతి. ఇందుకు విరుద్ధంగా ఇంగ్లండులో మొదట గృహస్థు ఆహారాన్ని నోట్లో పెట్టుకున్నాకే అతిథి తింటాడట. అది అక్కడి మర్యాద. ఈ మర్యాదలో ఆక్షేపించవలసింది కూడా ఏమీ లేదు. అది శబరి భక్తి లాంటిది. తాను కొరికి తియ్యగా ఉన్న పండునే రాముడికి పెట్టింది. ఇదికూడా 'అతిథి దేవో భవ' లాంటి మర్యాదే! భోజన మర్యాదలు మన సంస్కృతిని, సంస్కారాన్నీ తెలియచేస్తాయి.

తిథి వార నక్షత్రాలు చూడకుండా అప్పటికప్పుడు ఊడిపడతాడు అతిథి. అతని స్థాయి ననుసరించి అతనికి చేసే మర్యాదల స్థాయి కూడా ఉంటుంది. మర్యాదల్లో ఖరీదైంది భోజనమే! భోజనం దగ్గరే అసలు మర్యాదలు బయట పడతాయి. అల్లుడిమీద గౌరవంతో అత్తగారు గరిటెడు పెరుగుని మజ్జిగ గిన్నెలో తెచ్చి అల్లుడికి

ముందుగా ఆ పెరుగు వేసి, మిగతా అందరికీ మజ్జిగ పోస్తుంది. అల్లుడికి మర్యాద చేసినట్టు కొడుక్కి చేయాలంటే కుదరదు కదా! ఇంటిల్లిపాదీ మజ్జిగ పోసుకుని అల్లుడికి పెరుగు వడ్డిస్తారు. ఇక్కడ అల్లుడు ముఖ్యఅతిథి కాబట్టి!

మనిషిని సంఘజీవిగా ఏ అంశాలు ప్రేరేపించాయో ఆ అంశాలే మనిషిని కుటుంబ జీవిగా కూడా తీర్చిదిద్దాయి. వంటరిగా జీవిస్తున్నా ప్రతి మనిషీ ఒక కుటుంబీకుడే! కుటుంబం అనే భావనలోంచి మనిషి వేరు కాలేడు. కుటుంబంతో అల్లుకుపోతాడు కాబట్టి అతను అల్లుడు అయ్యాడు.

రోజులు మారాయి. ఇప్పుడు అత్తారింటికి అల్లుళ్ళ రాక అపురూపం అవుతోంది. గ్లోబలిజేషన్ కారణంగా మనిషి రోజురోజుకూ వంటరి వాడైపోతున్నాడు. అనుబంధాలు, బాంధవ్యాలు వదిలేసి తనచుట్టూ కేంద్రీకరించుకున్న వలయంలో వంటరిగా జీవించటానికి మనుషులు ప్రాధాన్యత నిస్తున్నారు. మూడొంతులమంది వంటరి భోజనమే చేస్తున్నారు. ఎవరి పనులు వారివి. అల్లుడొచ్చినా కొన్ని ఇళ్ళలో అతనికీ వంటరి భోజనం తప్పకపోవచ్చు!

వంటరి భోజనం వలన తిన్నది వంటబట్టదనేది ఇప్పుడు పరిశోధకులు చెప్తోన్న గొప్ప వైద్య రహస్యం. నొబుయూకి కవాయ్ అనే పరిశోధకుడు తన జపానుదేశంలో వృద్ధులు వంటరిగానే భోజనం చేస్తున్నారనీ, కుటుంబంతో కలిసి తీసుకోలేక పోతున్నారనీ వ్రాశాడు. సాధారణంగా ఇంట్లో వాళ్ళ మీద ఆధారపడి జీవించే వృద్ధులకు మన కుటుంబ వ్యవస్థలో నిజంగానే

ఆదరణ తక్కువ అవుతోంది. ఏదో ఒక సమయానికి ఆయనకింత భోజనం పెట్టేస్తే ఓ పనయిపోతుందని అనుకునే తీరులోనే వయోవృద్ధుల్ని చూడటం జరుగుతోంది.

వయో వృద్ధులు సామూహిక జీవనానికి ఎక్కువ ఇష్టపడతారు. కుటుంబంలో అందరితోనూ కలిసి చేసే భోజనాన్ని వాళ్ళు ఎక్కువ ఆస్వాదించ గలుగుతారనీ, అది ఆ వృద్ధుల జీవన ప్రమాణాలను పెంచుతుందనీ అలా కాకుండా వంటరిగా తింటే అది క్రమేణా డిప్రెషనుకు దారితీస్తుందనీ, అది ఆయుక్షీణకారకం అనీ ఆయన పేర్కొన్నాడు.

తల్లిగానీ, తండ్రిగానీ ఎవరో ఒక్కరే ఉన్న కుటుంబాల్లో ఆ ఒక్కరినీ ఒక మారుమూల గదిలో క్వారంటీన్లో ఉంచటం ఆ వృద్ధుల్ని ఆదరించినట్టు అవదని కూడా ఈ శాస్త్రవేత్త వ్రాశాడు. నిజమే! ఇంతకన్నా వాళ్ళని వృద్ధాశ్రమంలో చేర్చటం ఉత్తమం. అక్కడ అందరూ కలిసి జీవిస్తూ కష్టసుఖాలు పంచుకునే ఒక వ్యవస్థ ఉంటుంది. అది కుటుంబంలో కొరవడటం బాధాకరం! ఇష్టులందరూ కలిసి

ముచ్చటగా భోజనం చేస్తే మూడ్స్ ఉన్నతిని పొందుతాయి, తిన్నది వంటబట్టడానికి ఇది బాగా ఉపకరిస్తుంది, వంటకాలు ఎక్కువ రుచికరంగా అనిపిస్తాయి.

తిండిపోతులు, వంటరితనానికి అలవాటు పడిపోయిన వారు, నిరాశావాదులు, డిప్రెషన్లో ఉన్న వ్యక్తులు ఇలాంటి వాళ్ళు నలుగురితో కలవలేకపోతారు. అందుకని నిలువుటద్దం ముందు కూర్చుని ఆ అద్దంలో కనిపించే వ్యక్తిని చూస్తూ తింటే కొంత ఫలితం కనిపిస్తుందని కూడా ఈ పరిశోధనలు చెప్తున్నాయి.

వృద్ధుల విషయంలో సామాజిక కోణంలోంచి ఈ విషయాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. నొబుయుకి కవాయ్ గారు చేసిన పరిశోధనల్లో సామాజిక అంశాలు ఎక్కువగా ఉండటాన్ని మనం గమనించాలి.

పండుగలు, వ్రతాలు, నోములు, ఇతర సన్నివేశాలు ఇలా ప్రతినెలా ఒకటో రెండో మనకు వస్తూనే ఉంటాయి. అవన్నీ కుటుంబీకుల్ని ఒకచోట కలపటానికి ఉద్దేశించినవే! ఇంగ్లీషువాడు ఫ్యామిలీ మెంబర్ అంటాడు. దాన్నే మన వాళ్ళు కుటుంబ సభ్యుడు అని తెలుగులో పిలుస్తుంటారు. ఇదెక్కడి పదప్రయోగమో అర్థం కాదు. కుటుంబంలో సభ్యత్వం ఏమిటీ? కుటుంబం అంటే భార్య, భర్త, పిల్లలు, ఆధారపడిన ఇతరులు కలిసి జీవించే ఒక సమూహం. కుటుంబి అంటే కుటుంబానికి పోషకుడైన పెద్ద. కుటుంబిని అంటే ఆ కుటుంబానికి పోషకురాలైన స్త్రీ. కుటుంబంలోని వారంతా కుటుంబీకులే గానీ, ఆ కుటుంబంలో సభ్యులు కాదు. సభ్యత్వం అనడంలోనే వాణిజ్య సంస్కృతి ఛాయలు కన్పిస్తాయి. మనం అనాలోచితంగా అలాంటి పదాల్నీ, అలాంటి వ్యవస్థనీ తెచ్చి పెట్టుకుంటున్నాం.

కుటుంబంలో అందరూ కలిసి తలో చెయ్యి వేసి కష్టిస్తేనే సంసారం సాగుతుంది. అయినా చుట్టపు చూపుగా వచ్చే వాణ్ణి గౌరవిస్తాడు తెలుగువాడు. కలో గంజో ఏది ఉంటే అదే పోసి అతిథిని సాగనంపుతారు. కలి అంటే పులియబెట్టిన కడుగు నీరు. దీన్నే తరవాణి అంటారు. ఇది కొంచెం స్తోమత ఉన్న ఇంట దొరుకుతుంది. గంజి అంటే మెతుకు లేకుండా గుప్పెడు బియ్యాన్ని కుండెడు నీళ్ళలో వేసి కాచిన జావ. లేదా అన్నం వండేప్పుడు వార్చగా వచ్చిన ద్రవం.

అంతంతమాత్రమే ఉన్న ఇంటికి చుట్టం వచ్చినా తెలుగు కుటుంబీకులు అతిథి మర్యాదలు మాత్రం ఆపరు. అదే మన సంస్కృతి. మన సంస్కృతిలో చెడనిది మర్యాద ఒక్కటే!

# అచ్చతెలుగు ఉద్యమం

*"వివిధకళానిపుణుడు నభి*
*నవదండి యనంగు బుధజనంబుల చేతన్*
*భువి బేరుగొన్న వాడను*
*గని జనమిత్త్రుడను మూల ఘటికాన్వయుడన్"*

(కేతన – ఆంధ్ర భాషాభూషణం)

కేతన తెలుగు వారు ఘనంగా చెప్పుకోదగిన మహాకవి. శివభక్తుడు. తండ్రి మారయ, తల్లి సంకమాంబ. వెంటిరాల గ్రామానికి గ్రామాధికారిగా ఉండేవాడు. నెల్లూరుకు వలస వెళ్ళి తిక్కనగారికి సహచరుడయ్యాడు.

తొలి తెలుగు కథాకావ్యం 'దశకుమార చరిత్రం' చంపూకావ్యాన్ని వ్రాసి, తిక్కనగారికి అంకితం ఇచ్చాడు. 12 అధ్యాయాల్లో 1625 పద్యాలలో ఆనాటి తెలుగు సమాజాన్ని, ఆహార ఆచారాల్ని, అలంకారాల్ని, ఆంధ్ర ప్రాంతపు"కోడి పందాలాట"ను కూడా కేతన వర్ణించాడు.

అనేక కళల్లో నిపుణుణ్ణనీ, అభినవదండిగా ప్రసిద్ధుణ్ణనీ, జనమిత్రుణ్ణనీ ప్రకటించుకున్నాడు ఈ పద్యంలో కేతన. మూలఘటిక తమ ఇంటిపేరన్నాడు. 'కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ బరగ దశకుమార చరితంబు జెప్పిన ప్రోఢ నన్ను వేరె పొగడనేల' అన్నాడు. "విజ్ఞానేశ్వరీయం"పేరుతో తెలుగులో తొలి న్యాయశాస్త్ర గ్రంథాన్ని కూడా వ్రాశాడు.

సంస్కృతం రాజ్యం ఏలుతున్న కాలంలో క్రీ.శ. 13వ శతాబ్దిలోనే అచ్చంగా తెలుగును ఉపయోగించటం గురించి ఆలోచన చేసినవాడు కేతన.

'జాను తెనుగు' అని నన్నెచోడుడు, 'దేశికవిత' అని పాల్కురికి సోమనాథుడు స్వచ్ఛమైన తెలుగు మాటల్లో కవిత చెప్పాలని ప్రయత్నించగా, కేతన అచ్చతెలుగు ఉద్యమానికి బీజం వేశాడు. అసలైన తెలుగు భాషా పరిరక్షణ ఉద్యమం ఆ విధంగా కేతనతోనే మొదలయ్యింది.

తెలుగు భాష కోసం'ఆంధ్రభాషా భూషణం' అనే చిన్న వ్యాకరణ గ్రంథం వ్రాశాడు. 'మున్ను తెనుగునకు లక్షణ మెన్నడు నెవ్వరును జెప్పరే/జెప్పెద విద్వన్నికరము మది మెచ్చగ నన్నయభట్టాది కవి జనంబుల కరుణన్' అంటూ తెలుగు భాషకు లక్షణాలు చెప్పటం తన లక్ష్యం అన్నాడు.

సంస్కృతమే అన్ని భాషలకూ తల్లి కాబట్టి, సంస్కృత పాండిత్యం తల్లిసేవతో సమానం అనేది ఆనాటి పండితుల భావన. కానీ, మన 'అమ్మభాష' అచ్చతెలుగేననీ, అది స్వతంత్ర భాష అనీ అన్నాడు కేతన.

ఆంధ్రభాషాభూషణంలో తత్సమం, తద్భవం, అచ్చతెనుగు, దేశ్యం, గ్రామ్యం అని ఐదు రకాలుగా తెలుగు మాటలను విభజించాడు. తెలుగు, తెనుగు రెండు మాటలూ వాడాడు. పంపేరు, పాడేరు, అఘవలె, ఈడ, ఏడ, ఉండాడు లాంటి మాండలిక వ్యావహారిక రూపాల్ని కూడా ఉదహరించాడు. మాండలికాల ముద్ర వేసి, వాటికి ప్రధాన నిఘంటువుల్లో మన నిఘంటు కర్తలు చోటివ్వలేదు. కేతన వీటిక్కూడా ప్రాధాన్యత నివ్వాలన్నాడు.

పరభాష మాట్లాడక పోవటంతో సరిపెట్టకూడదని, భాష అంతరించి పోకుండా తెలుగు మాటల్ని వెదికి తెచ్చి సర్వసమగ్ర నిఘంటువు రూపొందించాలని కేతన గుర్తుచేశాడు.

తెలుగు భాష గంగ లాంటిది. గంగని చేరటానికి కాశీకి చాలా దార్లున్నట్టే, తెలుగు భాషాగంగను చేరటానికి ఆనాటికి తెలుగు ప్రాంతంగానే ఉన్న కంచి, నెల్లూరు, ఓరుగల్లు మీదుగా దారి చూపిస్తానన్నాడు.!

తెలుగుభాషకు స్వంత పదసంపద ఎంతో ఉన్నది, మనం సంస్కృతం, ఇతర భాషల మీద దృష్టిపెట్టి తెలుగు పదాలను మరిచిపోతున్నామని 800 ఏళ్ళ క్రితమే హెచ్చరించాడు.

పురాణాలు, ఇతిహాసాలు, ఉపనిషత్తులు ఇతర వైదిక సాహిత్యం తెలుగునేలమీద బాగా పాతుకున్నాక, తెలుగు మాటల వాడకం తగ్గిపోయింది.

హిమవంతుడి కూతురు హైమవతి. ఈమెను తెలుగులో ఎలా పిలవాలి? తెలుగు నేలమీద జీవించేవారికి మంచుకొండల పరిచయం ఉండదు కాబట్టి dew, fog, mist snow. snow, ice అనే పదాలకు సమానమైన తెలుగు మాటలుండవు. కొత్త పదాన్ని సృష్టించకపోతే, హిమమే తెలుగు వారి నాలుకల మీద స్థిరపడుతుంది.

ఇలాగే, రైలు, రోడ్డు, బస్సు లాంటి మాటలకు సమానమైన తెలుగు మాటల్ని పుట్టించలేకపోయాం కదా! చివరికి అవే తెలుగు మాటలై పోయాయి. అన్నం, పుస్తకం లాంటి సంస్కృతపదాలూ అలానే తెలుగులో స్థిరపడి పోయాయి.

కేతనగారు మంచుకొండని 'వలిగుబ్బలి' అనీ, హైమవతిని 'వలిగుబ్బలి రాచ కూతురు' అనీ అన్నాడు. "పవన శైత్యంబులు వలియనదగు" అనే సూత్రం ప్రకారం చలి, చలిగాలి, వణుకు వీటిని "వలి" అంటారు. పుట్టలోంచి పుట్టిన వాడు కాబట్టి, వాల్మీకిని "పుట్టబుట్టువు" అన్నాడు.

ఇలా వందలకొద్దీ పదాలు సృష్టించి, మన అవసరం కొద్దీ తెలుగులో కొత్త పదాలను ఎలా సృష్టించుకోవాలో కేతన ఒక దారి చూపించాడు. ఇది అలవోకగా కూర్చుని వండే వంట కాదు, చాలా పరిశ్రమ కావాలి. అది అందరికీ అర్థం అయి, ఇష్టంగా వాడే విధంగా ఉండాలి. వార్తాపత్రికలు, రేడియో, టీవీలు కొత్త తెలుగు

మాటల్ని ప్రచారం చేయటానికి ఈ రోజున ఎక్కువ అవకాశం ఉంది. వారు కూడా భాషోద్యమ స్ఫూర్తిని ప్రదర్శించాలి.

కొత్త మాటల్ని పండితులు పుట్టిస్తే, 'టూ వీలర్' అనేమాటకు ద్విచక్రవాహనం అన్నట్టుగా ఉంటుంది వారి సృష్టి. 'రెండు చక్రాల బండి' అని తెలుగులో ఆలోచించ లేరు. 'ఫ్లై ఓవర్'ని పై వంతెన అని పామరుడేఅనగలుగుతాడు.

కేతనకవి సంస్కృత భావజాలం లోంచి మనల్ని బయటకు లాగటానికి ప్రయత్నించాడు. మనం సంస్కృతంతో పాటు, ఇంగ్లీషు భావజాలం లోంచి కూడా బయటకు రాగలగాలి.

సంస్కృత భావజాలం అనే మాట కొంచెం ప్రమాదకరమైనదే! ఇది సంస్కృతభాష వ్యతిరేకతతో అంటున్నది కాదు, అమ్మనుడిని అక్కున చేర్చుకునేందుకు తలపడే ఉద్యమ భాష ఇది. సంస్కృతభాషకు వందనం. అమ్మనుడికి దణ్ణాలు.

ఆంగ్లభాషకు సరిపడ మాటల్ని తెలుగులో పుట్టించుకోవాలి. అందుకు సంస్కృతం మాటల్ని వాడుకున్నందువలన తెలుగుకు ఒరిగేదేమీ ఉండదనేదే ముఖ్య అంశం.

తెలుగుమాటలు రకరకాల కాలాలలో, రకరకాల కారణాలతో మరుగున పడిపోయాయి. చేతనైనంతమేర వాటిని వెదికి తెచ్చుకోవటం జరగాలి. అచ్చతెలుగు ఉద్యమంలో ఇది తొట్టతొలిగా జరగాల్సింది. సంస్కృతాన్ని కాదని తెలుగు ఎక్కడికీ పోలేదు. ఉన్నంతలో తెలుగు మాటలను ఏరుకోవటానికి తెలుగు అమ్మభాషగా ఉన్న సంస్కృతపండితులు సహకరించాలి! శపించకూడదు.

# అనువాదంలో తెలుగుదనం

*"మ్రింగెడివాడు విభుండని*
*మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్*
*మ్రింగు మనె సర్వమంగళ*
*మంగళసూత్రంబు నెంత మదినమ్మినదో!"*

(పోతన ఆంధ్రమహాభాగవతం)

సాగరమథనం జరుగుతోంది. సురాసురు లిద్దరూ పోటాపోటీగా మథనం చేస్తున్నారు. చల్లకవ్వంగా ఒక కొండ, కవ్వం తాడుగా ఒకపాము... అట్నుండి దేవతలు, ఇట్నుండి రాక్షసులు కలిసి చెరోవైపూ నిలబడి 'రాగుంజులాట, పోగుంజులాట' (టగ్ ఆఫ్ వార్) లాగా చిలకగాచిలకగా అమృతానికి బదులు హఠాత్తుగా హాలాహలం పుట్టింది.

అది సముద్రాన్ని దాటి పొంగిపొరిలి లోకం మీదపడి సర్వనాశనం చేయసాగింది.

రాక్షసులకు నిలువెల్లా విషమే కాబట్టి హాలాహలానికి వాళ్ళు పెద్దగా భయపడ లేదు. కానీ, దేవతలు బాగా వణికి పోయారు.

వాళ్ళ భయం వాళ్ళ గురించి కాదు. ఎందుకంటే దేవతలకు చావుపుట్టుకలూ, ఆకలిదప్పులూ ఉండవుకదా ......! లోకం గురించే వాళ్ళ ఆందోళన.

లోక క్షేమం గురించి ఆలోచించే వాడు దేవుడు, లోక సంక్షోభకారకుడు రాక్షసుడు. అందుకని దేవతలందరూ కలిసిశివుడి దగ్గరకు వెళ్ళి మొర పెట్టుకొన్నారు.

దేవదానవుల గొడవలో తలకాయ దూర్చకుండా వుండిపోయిన శివుడు విషప్రభావం వలన విశ్వం యావత్తూ అల్లకల్లోలం అవుతోంది కాబట్టి లోకాన్ని కాపాడటానికి ముందుకొచ్చాడు. ఆ హాలాహలం మొత్తాన్ని త్రాగేస్తానని ప్రకటించాడు! త్రాగే ముందు ఒకసారి తన భార్య పార్వతి వంక చూశాడు.

మామూలు ఇల్లాలైతే భర్త విషం తాగుతానంటే ఎలా స్పందిస్తుందో వేరే చెప్పనవసరం లేదు. కానీ, పార్వతీదేవి చిర్నవ్వు నవ్వి "హలాగేనండీ" అన్నదట!

ఈ పద్యంలో పోతనగారు ఒకే ఒకవాక్యంలో ఇలాచెప్తారు: "మేలని ప్రజకున్ మ్రింగుమనె సర్వమంగళ" అని!

ఆవిడ ధైర్యం అంతా తన మంగళ సూత్రమే! తన తాడు గట్టిది కాబట్టి, దాన్ని మహాదేవుడు కట్టాడు కాబట్టి, అది తేలిగ్గా తెగేది కాదు కాబట్టి, తనకు దాని మీద నమ్మకం వుంది కాబట్టి, జనం మేలుకోసం విషమైతేనేం తాగేయవయ్యా...... అని చెప్పిందట పార్వతి.

తన మాంగల్యం గట్టిని నమ్ముకున్నదనే సూచన కోసం ఆమెను 'సర్వమంగళా......' అంటాడు పోతన! మింగేది గరళం అయినప్పటికీ మింగే వాడు తన భర్త కాబట్టి, తన భర్తవలన సమస్త లోకాలకీ మేలు కలుగుతుంది కాబట్టి, ఆ సర్వమంగళ తన మనసులో మంగళసూత్రాన్నే ఎంతగానో నమ్ముకుని, శివుడికి తన అంగీకారం తెలిపిందని దీని భావం.

భర్త లోకోపకారం చేస్తున్నప్పుడు, ఏ తెలుగమ్మాయైనా స్వంత లాభనష్టాలను చూడదన్నమాట! ప్రతి పురుషుడి విజయం వెనుకా ఒక స్త్రీ ఉంటుందన్న ఆంగ్ల సామెతకన్నా ముందే ఈ అర్థ నారీశ్వర తత్వం పుట్టింది.

వీర తిలకాలు దిద్ది భర్తల్ని యుద్ధాలకు పంపిన వీరనారీమణులు, భర్త యుద్ధంలోంచి పారిపోయి వస్తే పసుపు నీళ్ళు పోసి తలంటి, రెచ్చగొట్టి మళ్ళీ యుద్ధానికి పంపిన మహాపతివ్రతలూ తెలుగు సంస్కృతికి వారసులు.

పార్వతి వాళ్లందరినీ ఒక్క క్షణం గుర్తుకు తెస్తుంది ఈ పద్యం ద్వారా!

శుకమహర్షి ఈ హాలాహలం కథ చెప్పినప్పుడు పరీక్షిత్తు మహారాజుకు సందేహం వచ్చి, "మహర్షీ! ఎంత మహాదేవుడైతే మాత్రం, గరళం తాగుతుంటే పార్వతి ఏమీ అనలేదా?" అని అడిగాడట. అప్పుడు శుకమహర్షి చెప్పిన సమాధానమే ఈపద్యం.

మూలభారతంలో, శివుడు పార్వతి వంక తాగమంటావా అన్నట్టు చూశాడని, ఆమె చిర్నవ్వుతో ఒప్పుకుందనీ వుంది! ఆంధ్రమహాభాగవత రచన కదాచేస్తోంది... అందుకని, పోతన పార్వతిని తెలుగమ్మాయిని చేసి, "నాతాడు గట్టిది!" అనిపిస్తాడు.

తాళిబొట్టుకు తెలుగు మహిళ ఎలాంటి ప్రాధాన్యత నిస్తుందో, ఈ ఒక్కమాట ద్వారా చెప్పేశాడు పోతన. అదీ కవిసమయం అంటే!

నిబద్ధత కలిగిన అనువాదకుడు తను తెలుగులోకి తెస్తున్న కథలో తెలుగుదనం నింపకుండా ఆపుకో లేడనటానికి ఇదేసాక్ష్యం.

తెన్నేటి సూరి రెండుమహానగరాలు నవలను ఆంగ్లంలోంచి తెలుగులోకి తెస్తూ, "సంగీతంలో సాపాసాలు తెలీనివాడు నేను పాడిన బిళహరి రాగాన్ని వెక్కిరిస్తే నాకేవిటీ ......?" అనివ్రాస్తాడు. అందుకే ఆ నవల గొప్ప అనువాద నవలగా వాసికెక్కింది.

# అవగుణ త్యాగం

*"అవగుణంబులు తనయందుఁ బరీక్షించి గావనిపుచ్చు సద్భావకులను*
*సద్గుణంబులు భక్త జనులం దనుష్ఠించి శరణని మ్రొక్కెడు సజ్జనులను*
*దొరికినయట్లు సంతోషించి విగతాంగ భోగులై చను మహాపురుషవరులఁ*
*సకల సుఖంబులు జంగమార్పణఁచేసి వెండియుఁదనియని పండితులను*
*తనను మఱచి భక్తతతిఁ గొనియాడూ ని గర్వలను గుణోపకారమతుల*
*శుద్ధ భక్తిరతుల సిద్ధప్రసాదులఁ జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు!!"*

(పాల్కురికి సోమనాథకవి చెన్నమల్లు సీసాలు)

దేశీయత గురించి వెయ్యేళ్ళ క్రితం మొదటగా మాట్లాడిన ముగ్గురు ప్రముఖుల్లో తొలి దేశవాది, 'నృత్యరత్నావళి' కర్త జాయపసేనాని. తరువాతి కాలం వాడు దేశికవిత సృష్టికర్త పాల్కురికి సోమనాథకవి, ఆ తరువాత అచ్చతెలుగుకే అంకితమై హరిహరనాథ తత్వాన్ని అందించినవాడు తిక్కనామాత్యుడు! ఈ ముగ్గురూ తెలుగు భాషా సంస్కృతులకు చేసిన సేవ అపురూపమైంది. "దేశేదేశే జనానాం యత్ రుచ్యా హృదయరంజకం/గీతంచ వాదనం వృత్తం తద్దేశీత్యభిధీయతే!" దేశంలోని ప్రజలకు ఇష్టమై, మనోరంజకంగా ఉండే కవిత, వాయిద్యం, నృత్యాదులు దేశ్యం అవుతాయి.

"తెలుగు మాటలనంగ వలదు/వేదంబుల కొలదియు కా చూడుడు" అన్నాడు సోమనాథుడు. సంస్కృతంలో వ్రాస్తేనే గొప్పనీ, సంస్కృతం మాటలు గుప్పిస్తే గానీ తృప్తి కలగదనీ భావించే పండితులు, సాహితీ వేత్తలు తెలుగును తక్కువగా చూడటం వలనే ఆనాడు సోమనాథుడు తెలుగే కదా అంటూ ఈసడించవద్దనీ, తెలుగుమాటల్ని వేదంతో సమానంగా గౌరవించాలనీ అన్నాడు. పురణేతిహాసాలను వ్రాసిన వైదిక పండితులు, పాళీ ప్రాకృతాలలో అద్భుత సాహిత్యాన్ని సృష్టించిన జైన, బౌద్ధ పండితులు ఎంతటి మునులో అచ్చతెలుగును కోరిన సోమనాథాదులు అంతే మునులు. అంతకన్నా ఎక్కువ వీరభక్తులు కూడా! వైదిక పండితులు తెలుగువారైనా, వారికి సంస్కృతం దేవభాష. సోమనాథుడికి తెలుగే దేవభాష. అదే తేడా!

సంస్కృత పదాలు లేకపోతే చదువరులకు ఎక్కదనే భావన ఆనాటి కవుల్ని ఆ విధంగా ఆలోచించేలా చేసింది. కానీ సోమనాథుడు తన తెలుగు కావ్యాల్ని ప్రజలు ఏలలుగా పాడుకుంటూ ఇంపుసొంపార చదువుకుంటున్నారని గొప్పగా చెప్పుకున్నాడు.

సంస్కృత పదం లేకుండా వాడుకభాష లేదు. అంతగా జనంలో సంస్కృతపదాలు వాడకంలోకి వెళ్ళిపోయాయి. ఇప్పటి ఇంగ్లీషు కూడా అంతే! జల్లించుకుని తెలుగును ఏరుకోవలసిన పరిస్థితి. వీలైనంత మేర సంస్కృతాంగ్ల పదాలకు సమానమైన తెలుగు పదాలను వెతకి తెచ్చుకోవటమే నేటి దేశీయ వాదం!

సామాన్య జనం ఏలలుగా పాడుకోవటానికి అనువుగా బసవపురాణం వగైరా గ్రంథాలు వ్రాశాడు సోమనాథుడు. సంస్కృతాంధ్ర మిశ్రితంగా వ్రాసిన ఈ చెన్నమల్లు సీస పద్యాలు కూడా అంతే జనాదరణ పొందాయి.

చెన్ను అంటే అందం, కాంతి సౌందర్యం, విధము అనే అర్థాలు కనిపిస్తాయి. చెన్నుడంటే అందగాడు. ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు 2423లో కన్నడ, తుళు, తెలుగు భాషల్లో చెన్ను అంటే తిన్ననైన, అందమైన, దర్శనీయ మైన, చక్కనైన, లాంటి విశేషణాలకు సంబంధించిన పదంగా పేర్కొన్నారు. Handsome అనే అర్థంలో పురుషపరమైన సౌందర్యానికి వాడే విశేషణంగా ఈ పదం కనిపిస్తుంది. ఆంగ్లభాషలో Beauty అనే పదం స్త్రీపరమైన అర్థంలో కనిపిస్తుంది. ఇది 'హన్న' 'షన్నాన్' అనే పదాలకి సంబంధించినదిగా చెప్తారు. ఒక ఐరిష్ నదికి అనే పేరుండటం విశేషం.

ఎత్తైన, అందమైన, పుట్ట చెట్టు లోయలతో నిండిన పర్వతాన్ని చెన్నమల అన్నారు. చెన్నమలకు అన్న(అయ్య) చెన్నమల్లన్న. జనం ఆప్యాయంగా ఆయన్ని చెన్నమల్లుడని పిలుచుకుని ఉండొచ్చు. తుమ్మపూడి కోటేశ్వరరావు గారు అభిప్రాయపడ్డట్టు చెన్నమల్లు 'అందమైన వీరుడు' కూడా కావచ్చు! బసవడితోనూ వీరశైవంతోనూ నిమిత్తం లేకుండా కేవల శివభక్తితో చెన్నమల్లుని కీర్తించాడు సోమనాథుడు.

శివభక్తి కావచ్చు మరొకటి కావచ్చు నిబద్ధత లేకపోవటం అవగుణం. అది తనలో ఉన్నదేమోనని వెతకి, కావని నిర్ధారించుకోవటం, ఉంటే వదిలేసి సద్భావకుడు కావటం ఒక మంచి గుణం. మంచి చెడ్డలు ఎంచి చూసుకుంటూ తనను తాను సంస్కరించుకునే వ్యక్తిత్వాన్ని ఈ సీసపద్యంలో ప్రస్తుతిస్తున్నాడు సోమన. సద్గుణాలు ఉన్నవారిని గుర్తించి వాళ్ళను శరణు అని మొక్కటం ఇంకో సుగుణంగా చెప్తాడు. దొరికినయట్లు సంతోషించటం అంటే ఉన్నదాంతో సంతృప్తి పడటం, ఇంతేనా అనని విగతాంగ భోగులైన మహాపురుషవరులను ఆదర్శంగా తీసుకోవాలన్నాడు. ఉన్నదంతా నిజమైన భక్తులకు అర్పించి ఇంకా ఇవ్వలేకపోయానే అని బాధపడే తత్వం కావాలన్నాడు. తనను తాను మరిచిపోయేటంత భక్తి ఉన్నా నిగర్విగా ఉండే శుద్ధ భక్తిరతులు, సిద్ధప్రసాదుల్లో నన్ను చేర్చవయ్యా చెన్నమల్లా!" అంటున్నాడు సోమన.

ఆస్తికమా ?నాస్తికమా?అనే చర్చ లేకుండా ఈ మాటల్ని పరిశీలిస్తే, తను నమ్మిన దానిపట్ల నిబద్ధత, అంకిత భావం, భక్తిభావం, నమ్మకాలతో ఎలా నడుచుకోవాలో సోమన ఈ సీసాల్లో చెప్పినట్టు కనిపిస్తుంది. అవగుణ త్యాగం ఎవరైనా చేయాల్సిందే! అలాంటి నిబద్ధత కలిగిన వాళ్ళలో నేను కూడా చేరాలని ప్రతిఒక్కరూ కోరుకోవాలి!

# అమలిన శృంగారం

*సరస సాంగత్య సుఖ వికాసములకన్న*
*దుస్సహ వియోగ భరమె మధురము సకియ!*
*బాధ లేక వ్యసనరుచి బోధపడదు*
*చీకటులు లేక దీపిక చెలగ నట్లు.*

రాయప్రోలు సుబ్బారావు అనే ఇరవై ఏళ్ళ ఒక తెలుగు యువకవి 1912-13 లలో శృంగారం అంటే ప్రేమేననీ, దాని పర్యవసానం పెళ్ళే గానీ సెక్సు కాదనీ, జంట కట్టేవాళ్ళు ప్రేమికులైన దంపతులు కావాలనీ ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దానికి అమలిన శృంగారం అని పేరు పెట్టి ఒక ఖండ కావ్యం వ్రాశాడు. దాని పేరు "తృణకంకణము". ఆ యువకుడే నవ్యాంధ్ర కవితా పితామహుడై ఒక వెలుగు వెలిగాడు. విశ్వనాథ, దేవులపల్లి, తల్లావఝుల, దువ్వూరి, వేదుల మొదలైన మహా కవులంతా ఆయన వెంట నడిచారు. రాయప్రోలు ప్రారంభించిన కవితా ప్రక్రియ ఒక ఉద్యమ రూపం పొందింది. నవ్యకవితోద్యమంగా అది ప్రసిద్ధి చెందింది.

ఒక వివాహిత తన పూర్వ స్నేహితుడితో కలయికను కోరినప్పుడు ఆ యువకుడు మృదువుగా ఆమెకు హితవు చెప్పి ఒప్పిస్తున్న సందర్భంలోది ఈ పద్యం. "సరసాలు, సాంగత్యాలు, సెక్సు సుఖవికాసాల కన్నా, కష్టతరమైనప్పటికీ వియోగాన్ని భరించటంలోనే మాధుర్యం ఉంది సకియ! చీకటి లేకపోతే దీపం అవసరం తెలియనట్టే బాధ లేకపోతే సుఖం రుచి బోధ పడదు" అంటాడతను. అతని హితబోధను ఆమె విన్నది. కామోత్సాహం చల్లారి పోయింది. తృణకంకణం (రాఖీ) కట్టించుకుంది.

"పట్టుతోరంబుపై నిల్చి కట్టువడినచూపు లంతంతకును సాంధ్యశోభ లట్లు వెనుదిరుగ, నొండొరుల జూచుకొనుచు వారునేగి రల్ల నల్లన దమ యిండ్లు సేర" తప్పు చేయకూడదనే నిర్ణయానికి వచ్చి ఆ యిద్దరూ ఎవరిళ్లకు వాళ్ళు ఒకరినొకరు చూసుకుంటూ, నెమ్మది నెమ్మదిగా వెళ్ళిపోయారని వర్ణిస్తాడు కవి.

ఆచార్య వెల్చేరు నారాయణ రావు కవితా విప్లవాల స్వరూపంలో ప్రతి కవితా ఉద్యమం తన పూర్వకవితా ఉద్యమాల పైన తిరుగుబాటుగానే వచ్చిందని వివరిస్తారు. భావకవుల తిరుగుబాటు వలన ప్రబంధ సాహిత్యంలోని శృంగార నాయిక స్థానంలో నవ్యకవిత్వంలో ప్రేయసి కవితా వస్తువు అయ్యింది. మితిమీరిన స్వేఛ్ఛా శృంగార

వర్ణనల స్థానే నవ్య కవిత్వంలో వియోగం, విరహం ప్రధానాంశాలైనాయి. నీతి, ధర్మం, దేశం, జాతి, వీటికి ప్రాధాన్యత పెరిగింది, దేశంలో స్వాతంత్రోద్యమం కూడా ఊపు అందుకోవటంతో దేశభక్తి కూడా ఈ కవులకు ప్రధానాంశం అయ్యింది. రాయప్రోలు వారే ఈ మార్పులక్కూడా ఆద్యుడు.

"ఏ దేశమేగినా, ఎందుకాలిడిన, ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురయిన, పొగడరా నీ తల్లి భూమి భారతిని, నిలుపరా నీజాతి నిండు గౌరవము"

"....చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్వలచరిత్ర, హృదయములు చీల్చి చదువుడో సదయులార!"

"కలదయేని పునర్జన్మ కలుగుగాక, మధుర మధురంబయిన తెనుగు మాతృభాష" అని తెలుగువారిలో రాయప్రోలువారు రేకెత్తించిన స్వభాషాభిమానం ఎన్నటికీ మరువరానిది.

అధునాతన నాగరికతలో స్త్రీ పురుష సంబంధాలు సెక్సుకి అతీతంగా ఉన్నప్పుడే స్త్రీ పురుష సమానత్వం సాధ్యం అవుతుంది. ఇద్దరు మగ స్నేహితులూ, ఇద్దరు ఆడ స్నేహితుల్లా ఇద్దరు స్త్రీపురుషులు ఉండలేరా...? ఉండకూడదా? ప్రతి దానికీ సమాజాన్ని నిందిస్తుంటాం గానీ, సమాజ ఆమోదానికి లోబడిన స్త్రీపురుష సంబంధాల వలన సమాజానికి మేలే కలుగుతుంది. స్నేహం అనేది సమాన స్థాయిగల వారి మధ్యే ఉంటుంది. స్త్రీ పురుషుల మధ్య నిజమైన స్నేహం పురుషుడితో స్త్రీ సమానం అయినప్పుడే వర్ధిల్లుతుంది.

పురుషద్వేషం వలన స్త్రీ సమానత్వం వస్తుందనే అపోహ మనలో చాలామందికుంది. ఆ మూసపదాల్లోంచి బయట పడితేనే కొత్త దారులు దొరుకుతాయి. పాశ్చాత్యుల్లో మహిళావాదం -- ఫెమినిజం స్థానే స్త్రీపురుష సమాన వాదం-- ఫెమెనిజం- (fe=స్త్రీలు, men-పురుషులు = femenism) సమానంగా బాధ్యతలు పంచుకునే ఒక కొత్త ఉద్యమం నడుస్తోంది. ఫెమెనిజం అంటే స్త్రీ పురుష సమానత్వం కోసమే పోరాటం. అమలిన శృంగార సిద్ధాంతం వందేళ్ళ క్రితం కోరింది ఇదే!

అమలిన శృంగార భావన లేకుండా మహిళా వాదం లేదు!

# అమాయక కష్టాలు

"తగు నిది తగ దని యెదలో
వగవక, సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్"

(నన్నయ భారతం ఆదిపర్వం1-1-85)

అర్జునుడి కొడుకు అభిమన్యుడు అతడి కొడుకు పరీక్షిత్తు. అతని కొడుకు జనమేజయుడు. ఈ జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పిన కథ మహాభారతం. అలా వైశంపాయనుడు కథ చెప్పాడని శౌనకాది మహర్షులకు రోమహర్షణుడనే మహర్షి ఈ మొత్తం భారత కథని చెప్పాడు. ఇలా చెప్పాడంటూ వ్యాసుడు మహాభారత రచన చేశాడు.

ఈ మహాభారతం ఉదంకోపాఖ్యానమనే కథతో మొదలౌతుంది. జనమేజయుడు సుదీర్ఘంగా సాగే సత్రయాగం ప్రారంభించాడు. సరమ దేవలోకంలోని ఓ కుక్క. దాని కొడుకు సారమేయుడనే పిల్లకుక్క అతను ఆడుకుంటూ ఈ సత్రయాగం జరుగుతున్న ప్రదేశానికి వస్తాడు.

జనమేజయుడి మనుషులు శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు వాణ్ణి పట్టి కొట్టి బాధిస్తారు. ఆ కుక్కపిల్ల అరుచు కుంటూ వెళ్ళి వాళ్ళ అమ్మ "సరమ"కు చెప్పుకొని ఏడుస్తాడు. అప్పుడు సరమ జనమేజయుణ్ణి రకరకాలుగా తిట్టిపోస్తుంది. "ఈపని తగినది, ఇది తగినది కాదు అని మనస్సులో ఆలోచించకుండా బీదాబిక్కీ జనాన్నీ, అమాయకుల్నీ, మంచి వాళ్ళనీ ఏ కారణం లేకుండానే కావాలని అపకారాలు చేసే నీలాంటి నీతిమాలిన వాళ్లకి కారణం లేకుండానే ఆపదలు ఎదురౌతూ ఉంటాయి" అంటుంది..

నన్నయ గారి ఆంధ్రమహాభారతం ప్రారంభంలోనే ఈ సూక్తి గొప్పగా పేలింది. "తగు నిది తగదని యెదలో! వగవక" అనేది పద్యాలతో పరిచయం ఉన్న ఎవరికైనా తెలిసిన పద్యమే! సరమను దేవతల కుక్కగా ఋగ్వేదం వర్ణిస్తుంది. పణుల బారినుండి ఆర్యుల సంపదను కాపాడిన సరమకథ "పణి-సరమ సంవాదం" పేరుతో ఋగ్వేదంలో మనం చూడవచ్చు.

ఈ పద్యంలో సరమ నేరుగా రాజుతో మాట్లాడింది. ఎంత నేరానికి ఎంత శిక్ష వెయ్యాలో తెలియని వాడుగా రాజుని నిందించింది. ఏ నేరానికి ఎంత శిక్ష తగును, ఎంత శిక్ష తగదు అనే వివేకం రాజుకు ఉండాలి. సాధారణంగా ప్రభుత్వ యంత్రాంగం ప్రతి వ్యక్తినీ నేరస్థుడుగా భావించి, పరిశోధన ద్వారా నేరస్థుడు కాదని నిర్ధారిస్తుంది.

అనాది నుండీ ఉన్న వ్యవహారమే ఇది. నేరస్థుడు కాదన్ని తుది తీర్పు వెలువడే సమయానికి అమాయకుడు చాలా శిక్ష/వేదన పొంది ఉంటాడు. అలా అకారణంగా వేధించిన ప్రభుత్వ యంత్రాంగానికి శిక్ష ఉండదు. అదే పాలనా వ్యవస్థలో అధికారగణానికి లోకువ.

శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనే ముగ్గురు అధికారులు ఒక కుక్కపిల్ల అటుగా వచ్చిన కారణాన దాన్ని పట్టి వేధించారు. అది ఏ నేరమూ చేయలేదు. "ఇది నిషిద్ధ స్థలం, అతిక్రమించిన వారు శిక్షారులు" అనే బోర్డు చదవటం రాని అమాయక జీవి పొరబాటున వస్తే, కావాలని నేరం చేయాలనే సంకల్పంతోనే వచ్చిందా...? లేక అమాయకంగా వచ్చిందా...? అనే విచక్షణ చేయలేని అసమర్థులు అక్కడ అధికారులుగా ఉన్నారు. ఆ అధికారులు ఆ అమాయకజీవిని పట్టి వేధించారు. అధికారులు చేసే తప్పులకు రాజు బాధ్యుడు. రాజు వెంటనే ఆ తప్పుడు అధికారుల్ని తొలగించి సమర్థుల్ని నియమించి ఉంటే నన్నయ గారు ఈ పద్యం ఇలా వ్రాసే పని ఉండేది కాదు. రాజు మౌనం వహించాడు. ఎందుకంటే నేరస్థులు రాజుగారి బ్రదర్సే! రాజును 'అన్నా' అని పిలవటం, నేరస్థులంతా తమ్ముళ్ళు అయిపోవటం మహాభారత కాలంలో కూడా ఉంది.

తమ్ముళ్ళు తప్పు చేస్తే రాజుగారు మాఫీ చేస్తారు. తమ్ముళ్ళు మాఫియాలైనా మాఫీలు సాగిపోతూనే ఉంటాయి. ఇలాంటి పాలనా వ్యవస్థలో అమాయకుడి గోడు పట్టించుకున్న వాడెవ్వడు....? తిట్టుకోవటం తప్ప అమాయకులు చేయ గలిగింది మాత్రం ఏవుందీ...?

దేవతల కుక్క 'సరమ' కూడా ఏమీ చేయలేకపోయింది, తన బిడ్డడు సారమేయుడికి తగిలిన గాయాల మీద నాలుకతో నాకి , ఓదార్చింది. రాజు దగ్గరకు వెళ్ళింది

*"క్షితినాథ! కదు నకరుణా న్వితులై*
*నీ తమ్ము లతి వివేక విదూరుల్*
*మతిఁ దలఁపక నా పుత్రకు*
*నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్"* –రాజా! ఏ మాత్రం దయాదాక్షిణ్యాలు లేకుండా, వివేకదూరులై నీ తమ్ముళ్ళు బుల్లి కుక్కపిల్లని... అది ఏ తప్పూ చేయక పోయినా పట్టి హింసించారు. ఇది అన్యాయం– అని నిలదీస్తుంది. అకారణంగా హింసించావు కాబట్టి, నీక్కూడా అకారణ కష్టాలు ఇలానే వస్తాయని తిట్టిపోస్తుంది.

పురాణకాలంలో బాధితులు అధికారులను తిట్టుకోవటాన్ని శాపాలనే వారు. ఆధునిక యుగంలో వాటికి ఏ సామాజిక వేత్త విలువైన పేరు పెట్టలేదు. అణచివేతకు వ్యతిరేకంగా జనఘోషకు ఈ దేశంలో పెద్ద పేరు లేదు.

# అవినీతికి బొడ్డుకోత

*తోరము కట్టిన కత్తిని*
*గోరదమున మంత్రసానికోసెను బొడ్డున్*
*నీరజము కాడచిదిమిన*
*నేరిమిని కలుక్కుమనె మనీషన్ విధియున్*

(విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షము)

కౌసల్యాదేవి ప్రసవిస్తోంది. రాముడు జన్మిస్తున్నాడు. మంత్రసాని ప్రసవం నిర్వహిస్తోంది. తోరము అంటే, వ్రత సూత్రం. వ్రత సూత్రం కట్టినది పవిత్రమైన దన్నమాట. ఇంగ్లీషులో స్టిరైల్డ్ అనడం లాంటిది. అలాంటి కత్తితో బొడ్డు తాడును కోస్తోంది. గోరదమున అంటే గోరుతో బొడ్డుతాడును నొక్కి పెట్టితే కోసిన తరువాత రక్త స్రావం జరక్కుండా (క్లాంపింగ్) ఆగుతుంది. అలా గోరదము చేసి, బొడ్డును కత్తిపెట్టి కోస్తోంది.

పుట్టబోయేవాడు సాక్షాత్తూ విష్ణుమూర్తి. విష్ణువు బొడ్డులోంచి పుట్టిన కమలం మీద బ్రహ్మగారు కూర్చునుంటారు.

ఈ బొడ్డు తాడుని కోస్తుంటే తాను కూర్చున్న కమలం కాడని కోస్తున్నట్టు బ్రహ్మగారి మనసు చివుక్కుమన్నదట...

ఎక్కడో కొడితే ఇంకెక్కడో తగిలినట్టు రామజననం రాక్షసులకన్నా ముందు బ్రహ్మగారికి తగిలింది.

బ్రహ్మగారికి తగిలితేనే ఆయన రాక్షస సంహారానికి కావాల్సిన రీతిలో విధి వ్రాతలు వ్రాస్తాడన్నమాట. అందుకే విశ్వనాథవారు అక్కడ తగిలేలా వ్రాశారీ పద్యాన్ని

క్యారం బోర్డు ఆడేప్పుడు స్ట్రైకరుతో ఒక కాయిన్ని కొడతారు. అది నేరుగా గోల్లోకి వెళ్ళవచ్చు. లేదా, మరో కాయినుకు తగిలి దాన్ని గోల్లోకి నెట్టవచ్చు. స్ట్రైకర్ తిన్నగా వెళ్ళి, కాయిన్ దాకా వచ్చేవరకూ ఆటగాడి గురి కాయిన్ మీదే ఉంటుంది. తరువాత కాయిన్ ఎటు పోవాలో స్ట్రైకర్ నిర్ణయిస్తుంది.

క్యారం బోర్డులో అసెంబ్లీ హాలు లాగా మధ్యలో ఓ పద్మాకారం ఉంటుంది. అందులో ఎర్ర కాయిన్ని, చుట్టూ తెలుపు నలుపు కాయిన్లనీ పేరుస్తారు. తెల్లకాయిన్లవాళ్ళు గానీ, నల్లకాయిన్ల వాళ్ళు గానీ, ఎర్రకాయిన్ని ముందు పడగొట్టాలని చూస్తారు, సరిగ్గా తమిళనాడు తక్షణ పూర్వ ముఖ్యమంత్రి పన్నీరుసెల్వం గారు ఈ ఎర్ర కాయిన్ లాంటి వాడు. అతణ్ణి స్వపక్షీయులైన తెల్లకాయిన్ల వాళ్ళు, అలాగే

ప్రతిపక్షం వాళ్ళైన నల్లకాయిన్ల వాళ్ళు కమ్ముకున్నారు మధ్యలో పన్నీరు సెల్వం....కన్నీటి కుప్పలా వున్నాడు... కేంద్ర ప్రతినిథిగా గవర్నరుది స్ట్రైకర్ పాత్ర.

అధికారాన్ని అమ్మపేరుతో నిలబెట్టటం, అమ్మ ఆశయాలను కొనసాగించటం తెల్లకాయన్ల లక్ష్యం. అందుకు అడ్డుగా ఉన్న ఎర్ర కాయన్ని గోతిలోకి తోసేయాలి. ఎర్రకాయ గోతిలో పడుతుందా పక్కకు తప్పుకుంటుందా అనే విషయం మీద దేశం అంతా టీవీల కంటుకుని ఎదురు చూసింది. అమ్మ అవినీతి, పిన్నమ్మ అవినీతి గురించి ఏ ఒక్కరూ మాట్లాడలేదు. దేశభక్తి నాకు కద్దనే పార్టీ వారు గానీ, దేశానికి స్వాతంత్ర్యం తెచ్చామనే పార్టీ వారుగానీ అస్సలు మాట్లాడనే లేదు.

ఈ క్యారం బోర్డుకి నాలుగు కంతలున్నాయి. ఒక కంత పేరు సుబ్రహ్మణ్యస్వామి. ఆయన పందొమ్మిదొందల తొంబై ఒకటి తొంబై ఆరు మధ్య ముఖ్యమంత్రిగా జయలలిత ఉన్న కాలంలో జరిగిన అవినీతి గురించి కోర్టుకెళ్ళాడు. ఆ తరువాత చాలా సార్లు జయలలిత ముఖ్యమంత్రిగా ఉన్నారు. ఆ యా కాలాలలో అవినీతి గురించి ఏ ఒక్కరూ మాట్లాడ లేదు. నూరుకోట్ల రూపాయల జరిమానా సొమ్ము వస్తుందన్న ఆనందంలో కేంద్రప్రభుత్వం తమిళ అవినీతి గురించి ఊసెత్తకుండా ఊరుకుంది.

ఈ నేపథ్యంలో ఎర్రకాయని అందరూ కలిసి కొట్టే ఊపొచ్చింది. కేంద్రం అనే ఆటగాడు గవర్నర్ అనే స్ట్రైకర్'తో మధ్యలో పేర్చిన కాయన్లంటికీ తగిలేలా చాచి కొట్టాడు.

కాయిన్లన్నీ చెల్లాచెదురై బోర్డంతా కమ్ముకుంటాయనీ, ఒక్కక్క దాన్ని విడివిడిగా కంతల్లోకి తోసేయొచ్చనీ ఊహించాడు ఆటగాడు. కానీ దెబ్బ సూటిగా తగలాల్సిన చోట తగలక పోవటం వలన నల్లకాయన్లన్నీ ఒక వైపు, తెల్లకాయన్లన్ని ఒకవైపుగా చీలాయి.

ఎర్రకాయన్ వంటరి దైంది. ఒకట్రొండు తెల్లకాయలు ఎర్రకాయనుకు పక్కనే ఉన్నట్టు కనిపించినా దూరంగానే ఉన్నాయి. ఎర్రకాయకు వంటరి చావులేదు. అది రాచపీనుగ లాంటిది. తోడు ఇంకో పీనుగ వెళ్ళాలి. లేకపోతే బ్రతికి మళ్ళీ బోర్డు మధ్యకొచ్చేస్తుంది.

ఈ లోగా పక్కనుంచి చిన్నమ్మ అనే తెల్లకాయన్ గోలు దాకా వచ్చి ఆగింది. సుప్రీంకోర్టు చిన్నమ్మని గోలు చేసింది. తెల్లకాయలన్నీ మూకుమ్మడిగా వచ్చి

ఎర్రకాయని వంటరిగా కంతలోకి తోసేశాయి. గోల్లోపడ్డా, జైల్లోపడ్డా శశికళ అనే తెల్లకాయ బిగ్గరగా అట్టహాసం చేసింది. నేనే గెలిచానంటూ.

గవర్నర్ గారు సంతసించారు ఓ తెల్లకాయన్ని బోర్డు మధ్యకు చేరేలా కొట్టి పట్టం కట్టించారు. కేంద్రం ఆట ఆపేసింది. ఆటా ఎప్పుడు ఆడాలో ఎప్పుడు ఆపాలో రాష్ట్రానికన్నా కేంద్రానికే ఎక్కువ తెలుసని ఋజువయ్యింది.

ఇప్పుడంతా గప్ చుప్. పందొమ్మిదొందల తొంబై ఆరు తరువాత తమిళనాడులో జరిగిన అవినీతి ఊసు ఎక్కడా వినిపించదు. ఆట చూస్తున్న పౌరసమాజం సుప్రీం తీర్పుని పురస్కరించుకునైనా మాట్లాడే ప్రయత్నం చేయలేదు.

రాముడి బొడ్డుకోస్తే బ్రహ్మగారికి బాధ కలగటంలో విచిత్రం లేనప్పుడు, చిన్నమ్మ జైలుకెడితే తమిళ ప్రజలు ఎందరో వణ్ణాలు మానుకోవటంలో విచిత్రమో, వింతో ఏవుంటుంది...?

# ఆంధ్రనాగరకత

*ఆంధ్ర దేశస్థ సర్వాపగా భంగాత్*
*రంగరంగముల శౌర్యముల నేర్చి*
*ఆత్మప్రలాప శౌర్యములు తాలిచి*
*సుమిత్రా బోర్నియో ద్వీపతతులు గెలిచి*
*వంగ మహారాష్ట్ర హద్దులు పరిచయ స్థలములై వినయమ్ము సలుప మెలగి*
*ఈజిప్టు నుండి కృష్ణాజలమ్ములకు బోరంబాటగా పరాక్రమము జూపి*
*సకల దీవుల విజయధ్వజములు నాటి*
*తనదు తెరచాప వార్ధిఉరాజునకు కట్టు*
*కోకగా పూర్వమాంధ్రుల నౌక రాజ్య*
*మమరజేసిన దేదు సంద్రములమీద*

(విశ్వనాథ సత్యనారాయణ-ఆంధ్రపౌరుషం)

కాశ్మీరు నుండి కావేరి దాకా ఆసేతుహిమాచలం ఆదిమ మానవ సమాజాలు విస్తరించి ఉండేవి. ఒకప్పుడు 12,000 యేళ్ళ క్రితం నాటికి భారత దేశంలో ఆదిమసమాజాలు కొత్త రాతియుగంలో తమ ఆహారాన్ని ఉత్పత్తి చేసుకోగల స్థితికి చేరాయి. ఈ యుగపు మానవుడు సాంస్కృతికంగా కూడా ఎంతో పరిణతిని సాధించాడు. ఆహారోత్పత్తి, ఆహార సేవనలు కూడా సంస్కృతిలో ఒక భాగం అయ్యాయి. కల్చర్ ఆర్కియాలజీ అనేది నేటి అత్యాధునిక పరిశోధనాంశంగా ఏర్పడింది.

పరిణత స్థితిలో ఉన్న సింధు నాగరికత అవశేషాలు పాకిస్తాను భూభాగంలో ఉండగా, భారతదేశంలో లోథాల్ నుండి మహరాష్ట్ర హద్దులవరకూ సింధునాగరికత తొలి నాటి అవశేషాలు కనిపిస్తాయి. సరస్వతీ తీరంలో తొలి దశకు చెందిన సింధు నాగరకత అవశేషాలు ఎక్కువ కనిపిస్తాయి అందుకని సింధు సరస్వతీ నాగరకతగా దానికి పేరు పెట్టాలని పరిశోధకుల కోరిక. ప్రొఫెసర్ యు ఆర్ రావు "it extended into Baluchistan, Afghanistan, Kashmir, and Tajakistan in the North and upto Godavari valley in the South, covering a Geographical area larger than that of Sumerian and Egyptian Civilizations put together" ఉత్తరాన బలూచిస్థాన్,ఆఫ్ఘనిస్థాన్, కాశ్మీర్, తజకిస్థాన్ ప్రాంతాల్లోనూ, దక్షిణాన గోదావరి లోయ దాకా తొలినాటి సింధునాగరికత విస్తరించి ఉండేదని అన్నారు. సుమేరియన్ ఈజిప్షియన్ నాగరకతలకన్నా సుమేరియన్ నాగరికత ప్రాచీనమైనది, పెద్దదని కూడా ఆయన తెలిపారు.

ప్రొఫెసర్ యు ఆర్ రావుగారు చెప్పిన అంశాల్లో ఆశ్చర్యకరమైన అంశాలు కొన్ని ఉన్నాయి:

1. హరప్పా మొహెంజదారో లోథాల్ మొదలైన పరిణత స్థాయి సింధునగారాలనుండి ప్రజలు కర్ణాటకలోని కోలార్, హట్టి బంగారు గనుల్లోంచి బంగారం తీసుకువెళ్ళేవారు.
2. కర్ణాటక బంగారు గనులవారు, సింధునగరాల వారూ మహారాష్ట్ర లోని దయిమాబాద్' ట్రేడింగ్ సెంటరులో కలిసే వారు.
3. దయిమాబాద్'లో దొరికిన కొన్ని ప్రాచీన కంచు విగ్రహాలు ఇందుకు సాక్ష్యం.
4. సింధు సరస్వతీ నాగరికత దక్షిణాన ఆంధ్రప్రదేశ్ దాకా విస్తరించి ఉండేది.
5. బంగారం, రాగి, కంచుతో పాటు ఆంధ్ర ప్రాంతపు కంచరులు ఇనుమును కూడా కరిగించగల నేర్పరులు కావటంతో ఇక్కడ ఉక్కు ఆయుధాలు, ఉక్కు పనిముట్లు విస్తారంగా తయారయ్యాయి. సింధువులతో ఆనాటి తెలుగు ప్రాంత ప్రజలకు నేరుగా సంబంధాలు నడిచేందుకు ఇది ఎంతగానో తోడ్పడింది.

రావుగారి ఈ వివరణ కృష్ణా తుంగభద్ర పరీవాహక ప్రాంతాలలో ఆనాటి మానవుల ఉనికికి సంబంధించిన అనేక ఆలోచనలు రేకెత్తించింది.

బంగారపు గనులున్నచోట పుట్టలు పెట్టిన చీమలు భూమిపైకి తెచ్చే రజనులో కొంత బంగారం ఉంటుంది. అక్కడ పెరిగే మొక్కల్లో కూడా బంగారపు అవశేషం ఉంటుంది. "చీమా చీమా ఎందుకు కుట్టావు?" అని అడిగే అనగనగా ఒక రాజు కథలో చీమ "నా బంగారపు పుట్టలో వ్రేలెడితే కుట్టనా?" అంటుంది. ఆ బంగారపు పుట్టలు కృష్ణాతుంగభద్ర లోయల్లో కనిపిస్తాయి.

సింధునది ముఖ ద్వారం నుండి, కృష్ణానది ముఖద్వారం వరకూ అంటే పంజాబసింధు ప్రాంతాలనుండి, కృష్ణా, గోదావరి ముఖద్వారాల దాకా విస్తరించిన ఈ నాగరికతని సింధు కృష్ణాలోయల నాగరకతగా పిలవాల్సిన అవసరం ఉంది. ఇది సంస్కృతీ నాగరికత. ఫ్రాంక్లిన్ సి సౌత్ వర్త్ అనే పండితుడు నైలు నుండి మొదలైన పరివ్యాపన క్రమంలో తొలిద్రావిడ ప్రజలు, సుమేరియా మీదుగా బంగాళాఖాతం గుండా కృష్ణా-గోదావరి ముఖద్వారాల్లోంచి తెలుగు నేలమీద మొదటగా పాదం మోపారని, భారతదేశంలో తొలి ద్రావిడులు తెలుగు ప్రాంతీయులేననీ స్పష్టంగా ప్రకటించాడు.

ఆంధ్ర దేశంలోని సమస్త నదీతీర ప్రాంతాలలో వెలుగులీనిన మహానాగరికతకు వారసులుగా తాము నేర్చిన శౌర్యాలను ప్రదర్శిస్తూ, సుమిత్రా బోర్నియో లాంటి ద్వీపాలను గెలుచుకుని ఆంధ్ర రాజ్యాలు స్థాపించుకున్నారు. వంగ, మహారాష్ట్ర

హద్దులవరకూ ఉన్న భూములు మాకు పరిచయాలే అన్నంతగా వినయసంపన్నతతో మెలగుతూ నైలు నుండి కృష్ణదాకా బోరంబాటగా తమ పరాక్రమం చూపించి సకల దీవుల్లోనూ విజయధ్వజాలు నాటి, తన తెరచాపని వార్థిరాజు అయిన సముద్రుడికి కట్టుబట్టగా ఇచ్చి పూర్వపు ఆంధ్ర రాజులు నౌకారాజ్యాన్ని అమరజేశారని విశ్వనాథ వారు తన ఆంధ్రప్రశస్తిలో వర్ణించారు.

ఇవి కవుల అతిశయోక్తులు కావు. విశ్వనాథ ఈ పద్యం వ్రాసిన 70 యేళ్ళ తరువాత ఈజిప్టు-తెలుగు ప్రజల మధ్య రాకపోకలకు సౌత్‌వర్త్ ఇచ్చిన పరిశోధనాత్మక వివరణ ఆసక్తి దాయకం అయ్యింది. 2008లో నేను వ్రాసిన నైలు నుండి కృష్ణ దాకా గ్రంథం ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణగా వెలువడింది.

2009 జనవరిలో కృష్ణాజిల్లా రచయితలసంఘం, ద్రావిడ విశ్వవిద్యాలయం సంయుక్తంగా విజయవాడలో నిర్వహించిన 'సింధు-కృష్ణ లోయల నాగరకతల అధ్యయన సదస్సు' కృష్ణాతీర ప్రాంత నాగరికతకు 'కృష్ణా నాగరకత లేదా ఆంధ్రనాగరకత' అని పేరుపెట్టి ప్రత్యేక శ్రద్ధతో అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పింది.

భారత దేశంలో మనలాగే చాలా ప్రాచీన నాగరికతలున్నాయి. సింధునాగరికతతో సమాన కాలంలో, సమాన స్థాయిలో వర్ధిల్లిన నాగరికతలే అవి! కానీ, కేవలం భారతదేశపు ప్రాచీన నాగరికత అంటే ఒక్క సింధూనాగరికత పేరు మాత్రమే చెప్పి సాంస్కృతికంగానూ, చారిత్రకంగానూ మనలాంటి ప్రాచీనుల్ని విస్మరిస్తున్నారు. వస్తే రానీ, పోతే పోనీ అనే ధోరణి మనది కదా! మనది సహజ మౌనం.

ఈ ఆంధ్ర పౌరుషానికి కనీసం 4,000 యేళ్ళ ప్రాచీనత ఉంది. ఆ పౌరుషాన్ని వెదకిపట్టుకోగలగటమే ఇప్పటి మన కర్తవ్యం.

# ఆంధ్రత్వం

*ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ*
*ప్రాభాకర పరిశ్రమః*
*తత్రాపి యాజుషీశాఖా*
*నాల్పస్య తపసఃఫలం"*

(అప్పయ్యదీక్షితులు)

ఆంధ్రత్వమూ, ఆంధ్ర భాష, ప్రాభాకర మీమాంస చదవటం, యజుశ్శాఖలో పుట్టటం ఎన్నో జన్మల తపస్సు వలన సిద్ధించే ఫలాలని ప్రకటించిన తెలుగుబిడ్డ అప్పయ్యదీక్షితులు 1520లో తమిళనాడు కంచి దగ్గరలోని అడయప్పాల్యం (ఆదిపాలెం)లో జన్మించాడు. ఈయన్ని ఆదరించిన ప్రభువు కృష్ణదేవరాయలేనా అనే అంశం మీద వివాదాలున్నాయి.

తండ్రి రంగరాజాధ్వరి. తాతగారు వక్షస్థలాచార్యులు.

కృష్ణదేవరాయలు తిరుమలదేవితో కలిసి కంచివరదరాజస్వామి సన్నిధికి వచ్చినప్పుడు "తిరుమలదేవిని చూసి లక్ష్మీదేవి అక్కడ ఉన్నదేమిటా అని తన వక్షస్థలాన్ని తడిమి చూసుకుని, సిగ్గుతో తలవంచుకున్నా"దంటూ తిరుమలదేవి పైన ఒక చమత్కార శ్లోకం చెప్పాడు. అలా "వక్షస్థలాచార్య"అయ్యాడాయన.

అప్పయ్య దీక్షితుడు అతి బాల్యావస్థలోనే న్యాయ, వ్యాకరణ, మీమాంసాది శాస్త్రాలు పాండిత్యంతో గెలిచి, "సర్వ తంత్ర స్వతంత్రుడు" బిరుదు పొందాడు. రత్నఖేట దీక్షితుడనే పండితుడు ఈయన్ని గెలిచి నమస్కారం పెట్టించు కుంటానని వాదానికి వెళ్ళి, ఓడిపోయి, కూతుర్నిచ్చి పెళ్ళిచేసి, మామగారిగా దణ్ణం పెట్టించుకున్నాడు.

అప్పయ్యగారు 104 గ్రంథాలు వ్రాశాడు. వాటిలో 74 వరకూ దొరుకుతున్నాయని నిడదవోలు వెంకటరావు గారు వ్రాశారు. దీక్షితులు చిదంబరంలో ఎక్కువకాలం జీవించాడు. ఆయన వార్ధక్యంలో విజయనగర సామ్రాజ్యం చంద్రగిరికి తరలి పోయింది. రాజు వెంకటపతిరాయలు అనేక ఈనాములిచ్చి ఈయన్ని పోషించాడు.

అప్పయ్య దీక్షితులు శివభక్తుడు. తన శివభక్తిని పరిక్షించుకోవటానికి ఉమ్మెతకాయలు తిని, ఆ ఉన్మాద స్థితిలో తను చెప్పేవి గ్రంథస్థం చేయాలని శిష్యులను ఆదేశించాడు. ఆ స్థితిలో 500 శ్లోకాల్ని భక్తిరసబంధురంగా చెప్పాడు. "ఉన్మత్త పంచశతి"గా అవి ప్రసిద్ధమైనాయి. ఆయన ఎంత శివభక్తుడో అంత విష్ణుభక్తుడు కూడా! వరదరాజాష్టకం లాంటివీ వ్రాశాడు. ఆయనది శివకేశవుల తేడాల్లేని అద్వైత మార్గం. "ఈ వైష్ణవ మతస్థులు వేదమార్గాన్ని వదిలేసి తమిళ పామర

జనం పాడుకునే పాటల్ని వేదాల్లాగా చదువుతూ మోసం చేస్తున్నారని, అరచేతిలో వైకుంఠం చూపిస్తున్నారనీ, గారడీ వాడు బుట్టకింద మామిడి మొక్కని మొలిపించి, పండు కోసి తినిపించినట్టు మాయచేస్తున్నారనీ వైష్ణవుల్ని తీవ్రంగా విమర్శించాడు.

రాయలవారు దీక్షితుల్ని శాంతింప చేశాడు. రాజగురువు తాతాచార్యులు ఈ సంస్థానానికి రాకముందు శివకేశవ భేదం ఎరుగని స్మార్తులకు ఎలాంటి గౌరవాలుండేవో వాటిని పునరుద్ధరించాలని కోరాడు దీక్షితులు.

రామరాజు సమక్షంలోనే అనేక సందర్భాల్లో తాతాచార్యుల్ని ఓడించి, తన భక్తినీ, ఆధిక్యతను కూడా చాటుకున్నాడు. రాయలు తాతాచార్యుల్నీ అప్పయ్య దీక్షితుల్నీ సమానంగా గౌరవించాడు.

చైనా వ్యాపారి తెచ్చిన రెండు విలువైన బట్టల్ని కొని, రాజుగారు ఇద్దరికీ చెరొకటీ బహూకరించాడు. అప్పయ్య దీక్షితులు ఇంటికివెళ్ళి ఆ బట్టని హోమాగ్నికి ఆహుతి చేస్తాడు. ఇది తెలిసి విలువైన కానుకని తగలబెట్టడం ధర్మమేనా అనడుగుతాడు రాయలు. "మీ విలువైన కానుకని నాలాంటి ఒక అశాశ్వతుడు కాక, శాశ్వతంగా ధరించేవాడికి కానుకగా ఇచ్చాను" అని చెప్తాడు అప్పయ్య. శాశ్వతమైన వాడు చిదంబరంలోని స్వామి ఒక్కడే అంటాడు. ఆరోజున చిదంబరస్వామికి వచ్చిన కానుకల వివరాల్ని తెప్పించి చూస్తే, అప్పయ్య దీక్షితుడే వచ్చి ఒక అమూల్య వస్త్రాన్ని స్వామికి సమర్పించినట్టు తేలింది.

రాయలు కొండవీటిని జయించాలని వెడ్తూ, ఆ ఇద్దరినీ కూడా తీసుకువెళ్ళాడు. అక్కడ జొన్నకూడునే శివుడికి నైవేద్యంగా పెట్టవలసి రావటంతో "కాలకూటవిషం భుంక్త్వా గర్వితోసి మహేశ్వర/అస్తే త్తవసామర్థ్యం యావనాళోదనంగిళ" అని ప్రార్థించాడు. కాలకూటవిషం తిన్నానని గర్విస్తున్నావా మహేశ్వరా! "ఈ జొన్నకూడు (యావనాళోదనం) తిని నీ సామర్థ్యం ఏమిటో చాటుకో" అని

కాశీయాత్రకీ ఇలానే ఈ ఇద్దర్నీ వెంటబెట్టుకు వెళ్ళాడు రాయలు. అక్కడ భైరవుడి విగ్రహం ముక్కున వ్రేలేసుకున్న భంగిమలో కనిపించింది. తాతాచార్యుడు ఒక శ్లోకం చెప్పాడు. భైరవుడు ముక్కున వ్రేలు తీయలేదు. అప్పయ్య దీక్షితుడు వ్రేలు తీయించగలిగితే తాను అంటరానివాళ్లలో కలిసిపోతా నంటాడు తాతాచార్యులు. "శివుడు-జగన్మోహినిలకు పుట్టిన భైరవుడికి తల్లి విష్ణువు కదా! ఆ విష్ణువు భార్య లక్ష్మి. ఆ తల్లికే ఇంకో బార్య ఉంటే ఆమెని ఏమని పిలవాలా... అని భైరవుడు ముక్కున వ్రేలేసుకున్నాడని చమత్కరించాడు దీక్షితులు. అది వినంగానే అంతా ముక్కున వ్రేలేసుకున్నారు. భైరవుడు మాత్రం వ్రేలు తీసేశాడు. దాంతోతాతాచార్యులు అంటరాని వాళ్లలో కలిసిపోక తప్పలేదు. విమోచనం అడిగితే, కోటి కన్యాదానాలు చేస్తే తిరిగి బ్రాహ్మణుడివౌతావంటాడు దీక్షితులు.

ఆ కోటిమందీ వైష్ణవ కన్యలే కావాలని ప్రయత్నించాడు తాతాచార్యులు. అంతమంది వైష్ణవ కన్యలు దొరకలేదు. కొత్తగా వైష్ణవం పుచ్చుకున్నా చాలని ఆహ్వానించాడు. తాతాచార్యులిచ్చే డబ్బుకోసం దొంగలు తాము వైష్ణవుల మంటూ రాసాగారు. అందుకని వచ్చినవారికల్లా వీపుమీద వైష్ణవముద్ర వేసి డబ్బులిచ్చాడట. తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదనే సామెత ఇలా పుట్టింది.

అప్పయ్య దీక్షితులకు చాలామంది సంతానం కలిగారు. ఎవ్వరూ ప్రతిభావంతులు కాకపోవటంతో వార్ధక్యదశలో, తన సోదరుడి మనుమడు నీలకంఠ దీక్షితుడనే పసివాడి ప్రతిభను గమనించి, అతనికి దీక్షనిచ్చి అతన్ని తన వారసుడిగా ప్రకటించాడు. విరోధించిన కొడుకులందరినీ శుంఠలవుతారని శపించాడు. ఈ కథనిబట్టే 'పండితపుత్ర-పరమశుంఠ' అనే సామెత ఏర్పడిందంటారు. తరువాతి కాలంలో నీలకంఠ దీక్షితుడు తాతగారు అప్పయ్య దీక్షితుడంతటి పండితుడయ్యాడు.

అప్పయ్యదీక్షితుడు మతసామరస్యానికి ప్రతీక. తమిళులు వైష్ణవాన్నీ, కన్నడిగులు శైవాన్ని అనుసరిస్తే, తెలుగు వాళ్ళు ఎక్కువగా అద్వైత హరిహరనాథ మార్గాన్ని అనుసరించారు. అందుకే, తాను తెలుగు వాణ్ణని అప్పయ్య దీక్షితులు సగర్వంగా ప్రకటించాడు. ఎంతో తపస్సు చేస్తే గానీ ఆంధ్రుడిగా జన్మించలేడన్నాడు. ఆంధ్రభాష మాతృభాష కావాలంటే పూర్వజన్మ పుణ్యఫలం కావాలన్నాడు. శివుణ్ణి కొల్చినా, విష్ణువుని కొల్చినా వేదమార్గాన్ని వదలకూడదన్నాడు. యజుశ్శాఖిగా పుట్టడం తన తపః ఫలమే నన్నాడు. వైదికదేవుడైన విష్ణువుని ద్రావిడవేదం పేరుతో అరవాన్ని వేదంలా చదువుతూ అర్చించటాన్ని ఆయన వ్యతిరేకించినట్టు కనిపిస్తుంది.

కీ. శే. గురుజాడ శ్రీరామమూర్తి వ్రాసిన అప్పయ్యదీక్షిత చరిత్రము అనే లఘుగ్రంథాన్ని వావిళ్లవారు 1951లో ప్రచురించారు. తెలుగువాళ్ళు భార్యని 'వశి-ఒసేయ్' అని పిలుస్తుంటారు. వశి వశి అని గడగడా చదివితే శివ శివ అవుతుందని దీక్షితులు చెప్పినట్టు ఇందులో ఉంది. ఇటీవల రావి నూతల శ్రీరాములు గారు అద్వైతాచార్య అప్పయ్య దీక్షితులు పేరుతో ఒక లఘుగ్రంథాన్ని వెలువరించారు. అందులో ఆసక్తి దాయకమైన కథలున్నాయి.

ఆంధ్రులకు శివుడైనా, విష్ణువైనా ఇంకా ఏ దేవుడైనా, తెలుగు, సంస్కృతం, ఉర్దూ, ఆంగ్లం ఏ భాషైనా సమానమే! అవసరమైతే ఆంధ్రాన్ని పక్కనపెట్టైనా సరే ఇతర భాషల్ని నేర్చి, ఆ భాషాపండితుల్నే ఓడించగల దిట్టలు ఆంధ్రులు. అలాంటి ఆంధ్రత్వం ఎన్ని జన్మల పుణ్యాలు సమకూరితే సిద్ధిస్తుందంటారూ...?

# ఆంధ్రవిష్ణువు

"దవనపున్నమ కాకుళాధ్యక్షుడైన
తెలుగురాయడు దేవతాధీశ్వరుండు
భువనహితముగ నుత్సవం బవధరింప
నందు బోయితి మీ పోయినట్టి యేడు"

మనది తెలుగు జాతి. 3,000 యేళ్ళ ఘనచరిత్ర గల మహోన్నత జాతి. మన గతం, వర్తమానం, భవిష్యత్తు అంతా భాషా సంస్కృతులను వికసింప చేసుకోవటం మీదే ఆధారపడి ఉంది. జాతి ఐక్యత, సంస్కృతీ సంపన్నతలను నిలబెట్టుకునే బాధ్యత మనదే! ఆంధ్రుల తొలిదేవత శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువే ఈ విషయంలో మనకు స్ఫూర్తి.

విజయవాడకు రమారమి 40కి.మీ దూరంలో దివిసీమలో కృష్ణానది ఒడ్డున శ్రీకాకుళం గ్రామం ఉంది. 3,000 యేళ్ళ క్రితం తెలుగువారి రాజధానిగా ఉన్న నేల అది. ఆంధ్రుల ప్రాచీనతా వైభవాన్ని చాటుతూ అక్కడ ఆంధ్రమహావిష్ణు దేవళం నేటికీ సజీవంగా నిలిచి ఉంది.

తెలుగు వల్లభుడు, సిరికాకొలని నాథుడు, తెలుగురాయడుగా ప్రసిద్ధుడైన ఆంధ్ర మహావిష్ణువు తెలుగువారి 'బాసదేవర. క్రీ.పూ. నాటి కాణ్వవ్యాకరణంతో ప్రారంభించి తెలుగు సాహిత్య వైభవాన్ని దీప్తిమంతం చేసిన వాడు. స్కాంద, బ్రహ్మాండ పురాణాలతోపాటు నారాయణ తీర్థుల కృష్ణలీలా తరంగిణి, మంచన కవి కేయూరబాహు చరిత్ర ఆయన్ని ప్రస్తుతిం చాయి. వల్లభాభ్యుదయం ప్రబంధం తెలుగు వల్లభుని దివ్యచరిత్రను చెప్తుంది. కాసులపురుషోత్తమకవి "చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్యభావ-హత విమతజీవ శ్రీకాకుళాంధ్ర దేవ!'' అనే మకుటంతో అంధ్రనాయకశతకం వ్రాశాడు. పూర్వగాథాలహరి శ్రీకాకుళాన్ని దివ్యతిరుపతుల్లో ఒక క్షేత్రంగా పేర్కొంది.

వినుకొండ వల్లభరాయుడు క్రీడాభిరామంలో శ్రీకాకుళంలో జరిగే తిరుణాళ్లను ఈ పద్యంతో ప్రారంభించి వర్ణించాడు. దవన పున్నమి రోజున శ్రీకాకుళ తిరుణాళ్ళు జరుగుతాయి. ఆరోజున దేవతాధీశ్వరుడైన తెలుగురాయుడు లోకోత్తరంగా జరిగే ఈ ఉత్సవాలను చూస్తానికి స్వయంగా వస్తాడట.

శాతవాహనులు అమరావతి (ధాన్యకటకం)కి రాజధాని తరలించే వరకూ శ్రీకాకుళమే ఆంధ్ర రాజధాని! శాతవాహనుల తరువాత కూడా సాలంకాయనులు, బృహత్పలాయనులు, విష్ణుకుండినులు, వేంగి చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజుల ఏలుబడిలో శ్రీకాకుళం ప్రముఖంగానే ఉంది.



1518 ఫిబ్రవరి 11 న సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవ రాయలు శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువును దర్శించుకుని, ఒక రాత్రి నిద్రచేశాడు. బాసదేవర రాయలవారికి ప్రత్యక్షమై 'తెలుగదేలయన్న దేశంబు తెలుగేను/తెలుగు వల్లభుండ, తెలుగొకండ /ఎల్లనృపులు గొలువనెరుగవే బాసాడి/దేశభాషలందు తెలుగులెస్స..!'అని తెలుగు భాషలో కావ్య రచనకు ఆదేశించినట్టు ఆముక్త మాల్యద కృత్యారంభంలో పేర్కొన్నాడు. ఆ విధంగా గొప్ప ప్రబంధ యుగానికి ఆంధ్రవిష్ణువు స్ఫూర్తి కారకుడయ్యాడు. రాయలవారి రాకకు ఇది 500వ సంవత్సరం

ఆముక్తమాల్యద కావ్య రచనకు శ్రీకారం చుట్టిన మంటపాన్ని ఆముక్తమాల్యద మంటపం అంటారు. శ్రీ మండలి బుద్ధప్రసాద్ ప్రేరణతో పదేళ్ళ క్రితం ఈ మంటపంలో రాయలవారు కూర్చుని కావ్య రచన చేస్తున్న విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. అనాటి నుండీ ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతికశాఖ కృష్ణదేవరాయ మహోత్సవాలను క్రమం తప్పకుండా నిర్వహిస్తూ వస్తోంది.

కౌండిన్య సుచంద్రుడి పుత్రుడైన ఆంధ్రవిష్ణువు నిశుంభుడనే స్థానిక రాజును ఓడించి, శ్రీకాకుళం రాజధానిగా నేటి శ్రీకాకుళం జిల్లాలోని మహేంద్రగిరి వరకూ ఆంధ్రరాజ్యాన్ని

విస్తరించాడని ఐతిహ్యం. శ్రీశైల, కాళేశ్వర ద్రాక్షారామాల త్రిలింగ క్షేత్రం లోని ప్రజల భాష తెలుగు భాషగాను ఇక్కడి ప్రజలు ఆంధ్రులుగానూ ప్రసిద్ధి పొందారు.

ఆంధ్రవిష్ణువు తెలుగువారి ప్రాచీన దేవత! బౌద్ధ జాతక కథల్లో అంధకవెణ్ణు (Andhaka Venhu)గా ఈయన కథలు అనేకం కనిపిస్తాయి. సిరివణిజ జాతకకథలో ఈ అంధకవెణ్ణు (వసుదేవ కృష్ణుడు) గురించి కొత్త సంగతులు కన్పిస్తాయి.

అంధకవెణ్ణు తన సోదరుడు బలరాముడితో కలిసి ద్వారక మీదకు యుద్ధానికి బయల్దేరతాడు. ద్వారకను ఒక గాడిద కావలి కాస్తుంటుంది. శత్రువు వస్తే, ఈ గాడిద పెద్దపెట్టున ఓండ్ర పెడుతుంది. వెంటనే ద్వారకానగరం గాల్లోకి లేచి పోతుందట. ద్వారక ఎగిరిపోకుండా బంధించటానికి ప్రయత్నించి విఫలుడై, చేసేది లేక ఆ గాడిద కాళ్ళు పట్టుకుని అరవొద్దని బతిమాలుకుంటాడు. అలా ద్వారకను బంధించగలిగినట్టు ఈ జాతక కథలో ఉంది.

"వసుదేవుడంతటి వాడు గాడిద కాళ్లు పుచ్చుకున్నాడు" అనే తెలుగు సామెత ఈ కథను బట్టే పుట్టింది. పోతన భాగవతంలో గానీ, మూలభాగవతంలో గానీ లేని ఈ కథ బౌద్ధ జాతక కథల్లో ఉంది. అంధకవెణ్ణు అనే ఆంధ్రవిష్ణువు కథ కాబట్టే ఇది తెలుగు నేలమీద మాత్రమే ప్రచారంలో ఉంది.

ఆంధ్రవిష్ణువు అనే రాజు విష్ణుమూర్తి విగ్రహం చెక్కించి దానికి ఆంధ్రవిష్ణువు అని నామకరణం చేశాడని కొందరు పండితులు భావిస్తారు. కానీ, బౌద్ధ జాతకకథలు అంధకవెణ్ణు అసలు విష్ణువని వర్ణిస్తున్నాయి. వైదిక ధర్మాలకు విష్ణువు విశేషాలను అందించిన వారు తెలుగు వారే కావచ్చు.

ఆంధ్రుల ప్రాచీనతను అర్థం చేసుకోవటానికి ఆంధ్రవిష్ణువు కథను అధ్యయనం చేయటం ఎంతో అవసరం.

# ఆడాళ్ళ చదువులు

*చదువన్నేర్తురు పూరుషుల్బలెనె, శస్త్రంబు ల్పతింపించుచో*
*నదమన్నేర్తురు, శత్రుసేనల, ధనుర్వ్యాపార ముల్మెచ్చుచో*
*నుదితోత్సాహముతోడ నేల గలరీ, యుర్విన్ బ్రతిష్ఠింపుచో*
*ముదితల్ నేర్వగరాని విద్య, గలదే, ముద్దార నేర్పించినన్*

(చిలకమర్తి లక్ష్మీనరసింహారావు గారి "ప్రసన్నయాదవం"నుండి)

నేర్పిస్తేనే ఏ విద్యలైనా నేర్చుకోవటం సాధ్యం అవుతుంది. జీవితంలో సంపన్నమైన విలువ ఏదైనా ఉంటే అది అధ్యయనమే! లెర్నింగ్ అనేది లింగభేదాలకు అతీతమయ్యింది. మనిషి ఉనికి అనేది కొత్త విషయాల అధ్యయనం మీదే ఆధారపడి ఉంది. నేర్పితే నేర్వడం తేలిక. నేర్పేవాణ్ణిబట్టి నేర్పు అలవడుతుంది. అన్ని సందర్భాల్లోనూ ఏకలవ్యుడి టైపు లెర్నింగు చెల్లదు. విల్లు పుచ్చుకోవటం, గురి చూడటం, బాణం వదలటం లాంటి అనుకరణలు చూసి నేర్చుకోవచ్చు. కానీ, గురి ఎవరి మీద ఎలా ఎక్కుపెట్టాలో లెర్నింగ్ వలనే తెలుస్తుంది. లెర్నింగ్ వివేకాన్ని, విచక్షణనీ ఇస్తుంది. అధ్యయనం అనేది మొదలయ్యేవరకూ మేథస్సు అణిగిమణిగే ఉంటుంది. ఒకసారి అది మొదలయ్యాక చైతన్యం ఉరకలెత్తుతుంది.

కదనరంగంలో కత్తి పట్టాలన్నా, అస్త్రశస్త్ర ప్రయోగ నైపుణ్యం కావాలన్నా, సాంకేతిక నైపుణ్యం సంఖ్యాశాస్త్ర ప్రావీణ్యతలు కావాలన్నా, కథలూ కావ్యాలూ రాయాలన్నా, అంతరిక్ష యానం చేయాలన్నా, పైలెట్లుగా రాణించాలన్నా, వ్యాపారాలు, ఉద్యోగాలూ సక్రమంగా చేయాలన్నా. చదరంగంలో విఖ్యాతి పొందాలన్నా, క్రీడా నైపుణ్యం ప్రదర్శించాలన్నా, రాజకీయాల్లోనూ, చట్టసభల్లోనూ గొంతువిప్పాలన్నా, నిస్వార్థంగా పనిచేయాలన్నా ఆడవాళ్లకు ఆయా విద్యలు నేర్పిస్తే చక్కగా నేర్చుకుంటారనే సూక్తి ఆది నుండి ఉంది. కానీ, మగాళ్లకే భయం...నేర్చుకుని రేపు తమని మించిపోతారని!

కన్యాశుల్కం నాటకంలో సుబ్బి తండ్రి అగ్నిహోత్రావధాన్లు "తాంబూలా లిచ్చేశాను-తన్నుకు చావ"మంటాడు. సుబ్బి తల్లి ఆశ్చర్యంగా "నాకు చెప్పకుండానే!?" అనడుగుతుంది. అప్పుడు సుబ్బితండ్రి "ఆడ...లతోనా వ్యవహారం?" అంటాడు ప్రల్లదనంతో! ఆడాళ్లతో ఒకసారి వ్యవహారాన్ని చర్చించటం మొదలు పెడితే, అది అలవాటుగామారి, రేపు తనతో చెప్పకుండా ఏమీ చెయొద్దనేదాకా వెళ్తుందని మగాడికి దడ. ఆఖరికి కూతురు పెళ్ళి సంగతి కూడా భార్యకు చెప్పాలసిన అవసరం లేదనే భావన మగాళ్లలో ఉంది. చర్చిస్తే ఏమౌతుందో కృష్ణుడి సంగతే ఉదాహరణ.

సత్యభామ సుకుమారంగా పెరిగిన రాకుమార్తె. కృష్ణుణ్ణి ఆకట్టుకుని, కట్టుకుని, గారాల భార్యగా జీవనరాగాలన్నీ అనుభవిస్తో సుఖంగా జీవిస్తోంది. అకస్మాత్తుగా నరకాసురుడి బెడద వచ్చింది. కృష్ణుడు తాను యుద్ధానికి వెళ్ళటానికి సిద్ధం అవుతున్నాడు. అది విన్న సత్యభామ నేనుకూడా వస్తానంటుంది. ఇదేమైనా సినిమాకా...? లేక షికారుకా ...? అంటాడు కృష్ణుడు. వెనక అవతారంలో రాముడిగా ఉన్నప్పుడు సీత ఇలానే వెంటబడింది. నేను లేకుండా నువ్వు ఒక్కడివే వెళ్ళి చేసేదేముంటుంది..? అంటుంది సీత. ఇప్పుడు సత్యకూడా అదే మాట అంది. యుద్ధం ఎంత భయంకరంగా ఉంటుందో తెలుసా... అనడుగుతాడు కృష్ణుడు.

"దానవులైన నేమి? మఱి దైత్యసమూహములైన నేమి? నీ/మానితబాహు దుర్గముల మాటున నుండగఁ నేమి శంక? నీ/తో నరుదెంతు" నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కె న/మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సరదృష్టిఁ జూడఁగన్" అంటూ ఓ అందమైన పద్యం చెప్తుంది! నరకుడైతే ఏంటిట...వాడి సైన్యం మొత్తం వస్తే మాత్రం ఏంటిట...? నీ చేతులనే కోటలో ఉన్న నాకు భయం ఏమిటి? అంటూ కృష్ణుడు ఐసైపోయేలా చూసి మొక్కిందనీ, చేసేది లేక కృష్ణుడు ఆవిడగార్ని బండెక్కించుకు వెళ్ళాడనీ వ్రాశాడు. చిలకమర్తి వారు పోతనకన్నా రెండాకులు ఎక్కువ చదివాడు. ఆయన జాతీయోద్యమ కాలం నాటి కవి. అందుకని స్త్రీ విద్య గురించి ప్రచారం చేయటానికి ఈ సంఘటనని ఉపయోగించుకుని పైన ఉదహరించిన పద్యం చెప్పాడు. ఆడది చదివితే లోకాలేలుతుందనేది దీని సారాంశం.

"విద్య నేర్పిస్తే స్త్రీలు పురుషుడితో సమానంగా చదవగలరు. యుద్ధవిద్యలు నేర్పిస్తే శత్రువును అణచగలరు. ధనుర్విద్య నేర్పిస్తే ఉత్సాహంతో నేర్చుకోగలరు. పదవినిచ్చి కూచోబెడితే అద్భుతంగా పాలించగలరు. స్త్రీలు నేర్వలేని విద్య ఉన్నదా...ముద్దారగా నేర్పరిస్తే...!" అంటాడు. ఈ మాటలు సాక్షాత్తూ కృష్ణుడి నోట పలికిస్తాడు. స్త్రీ విద్య ప్రచారానికి ఇంత అందమైన పద్యం ఇంకొకటి కనిపించదు. తన ఇరవైయో ఏట చిలకమర్తి లక్ష్మీనరసింహం( సెప్టెంబరు 26, 1867 – జూన్ 17, 1946)గారు వ్రాసిన గయోపాఖ్యానం గ్రంథం కనీసం లక్ష కాపీలు అమ్ముడుపోయి ఉంటుందని భావిస్తారు. స్వాతంత్రోద్యమం తెలుగునాట అంత విస్తృతంగా నడిచిందంటే చిలకమర్తి, ఉన్నవ లక్ష్మీనారాయణ, ముట్నూరి కృష్ణారావు లాంటి కవియోగుల పాత్ర ఎంతైనా ఉంది.

# ఆపరేషన్ రావణ

*అలసట దస్సి నా కడకు నావహనమాడగ రాకు మెప్పు, మి*
*క్కుటముగ నింతవాద ననుకొంచును యుద్ధము చేయబోకు, దోః*
*పటుతరశక్తి యస్త్రముల పట్టును ధారణచేసి రమ్ము, నెం*
*తటి రిపుశక్తి యెప్పుడునుఁ దక్కువ సేయగ రాదెరుంగకన్*

రామరావణ యుద్ధం ముగింపు దశకు వస్తోంది.

రోజుకో టెర్రరిష్టు బృందాన్ని రాముడి మీదకు పంపి ఇష్టం వచ్చినట్టు ఆడుకున్న రావణుడు యుద్ధరంగంలో అలిసిపోయాడు.

రావణుడి దగ్గర దివ్యాస్త్రాలున్నాయి. అవి రామదండులో కొంతభాగం సేనను నాశనం చేయగల శక్తిమంతమైనవి. కానీ, రాముడి దగ్గరున్న దివ్యాస్త్రాలు రావణుడితో సహా మొత్తం లంకా రాజ్యాన్నే నాశనం చేయగలవని విభీషణాదులు హితబోధ చేశారు.

అయినా రావణుడు టెర్రరిజాన్ని పోషించే విధానాన్ని వదల్లేదు. ఇప్పుడు పరిస్థితి పరాకాష్ఠకు చేరింది.

యుద్ధం నిరాఘాటంగా సాగుతోంది. అక్కడ రావణుడి తలతెగి పడ్తుంటే తిరిగి కొత్త తలలు పుట్టుకొస్తున్నాయి. ఇక్కడ రాముడి దగ్గర సంజీవని ఉంది. చచ్చిన వానర సైన్యం తిరిగి బతికొస్తున్నారు.ఎవరికీ గాయాల బాధ లేదు. గాయం తగలగానే మాయమైపోతోంది.

రావణుడిది వంటరి పోరాటం. శుద్ధ భారతీయ వ్యతిరేకత అతని విధానాలకు మూలం.

రాముడిది సమూహ శక్తి. తీవ్రవాద వ్యతిరేకత అతని విధానం.

విభీషణుడు ఐక్యరాజ్య సమితి లాగా టెర్రరిజం మంచిది కాదని, అది లంకకే చివరికి చేటు తెస్తుందని చెవినిల్లు కట్టుకు చెప్పాడు.

టెర్రరిజాన్ని ఆరంభించనే కూడదు. ఒకసారి అందులోకి దిగితే బయటకు రాలేరు, 'ఈత నేర్చినవాడు ఏటిలోనే పోతా' డనే సామెత మాఫియాలకు, డాన్లకు, టెర్రరిష్టు మూకను ప్రేరేపించే దేశాధి నేతలకు బాగా వర్తిస్తుంది. పాకిస్తాన్ పాలకులెవరికీ సహజ మరణం ఎందుకులేదో ఆ దేశీయులు ఆలోచించాలి. రావణుడి తత్వానికి ప్రతీకలైనవారికి అదే గతి పడ్తుంది.

యుద్ధం సాగుతున్న దశలో ఆ సాయంత్రం ఘడియల్లో రావణుడి చేతిలో ఆయుధాలన్నీ అయిపోయాయి. తెగిన అవయవాలను అతికించుకునే పనిలో పడ్డాడు.

రాముడి బాణాలను తిప్పికొట్టే అవకాశం లేకుండా పోయింది. తన సైన్యాన్ని, రాజ్యాన్ని కాకుండా తనను రక్షించుకునే పనిలో పడటం ఏ దేశాధినేతకైనా ఇబ్బందే!

యుద్ధంలో ఎల్లకాలం గెలుపు మన వైపే ఉంటుందని హుంకరిస్తే ఫలితం ఇలానే ఉంటుంది.

రావణుడు నిస్సహాయంగా నిలబడి పోయాడు. అలసట అతని ముఖంలో కొట్టొస్తోంది. ఆ సమయంలో రావణాసురుణ్ణి అంతం చేయటం రాముడికి చాలా తేలిక. కానీ, ఆయన అలా చేయలేదు. ''తెచ్చుకున్న ఆయుధాలన్నీ అయిపోయాయా...? బాగా అలిసి పోయినట్టున్నావు...నేడు పోయి రేపు రా'' అన్నాడు. ఈ సందర్భంలో శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథ సత్యనారాయణ గారు వ్రాసిన పద్యం ఇది.

"రావణా! అలిసి పోయాక కూడా నా ముందు నిలబడే సాహసం ఇంకెప్పుడూ చెయ్యకు. ఆయుధాలన్ని అయిపోయి దిక్కు తోచకపోయినా నేనింతవాణ్ణి అంతవాణ్ణి అని అహంకరించాలనుకోకు. ఇంటికి పోయి కాసేపు పడుకో...నీ చేతులకు కాస్త శక్తి వస్తుంది. అప్పుడు మళ్ళీ రా! వచ్చేప్పుడు నీ దివ్యాస్త్రాల మంత్రాలన్నీ ఒకసారి చదువుకురా! ఒక్క దెబ్బకు దిమ్మతిరిగి మంత్రం మర్చిపోయావంటే అసలుకే మోసం వస్తుంది. అవతలి వాడి శక్తిని అంచనా వేయటం చేతకాని వాడివి...నువ్వేం వీరుడివి...? ఇవ్వాళ్టికి పోయి రేపు రా!" అన్నాడు.

ఇది యుద్ధ నీతి. రాముడు దాన్ని పాటించాడు. భారతదేశంతో నాలుగుసార్లు యుద్ధంచేసిన పాకిస్తాన్ ప్రతి యుద్ధం లోనూ ఓడిపోయింది. అయినా, దానికి దివ్యాస్త్రాలతో పాటు జవసత్వాలను సమకూరుస్తున్న దేశాలు దాన్ని టెర్రరిజ స్థావరంగా మార్చేశాయి. టెర్రరిజం తాకిడికి గాయపడిన దేశాలు కూడా తమ రాజకీయ ప్రయోజనం కోసం పాకిస్థాన్‘కి సాయపడ్తున్నాయి. తమ మీద కాకుండా తమ శత్రువు మీద ప్రయోగిస్తే టెర్రరిజం మంచిదేననే భావన ప్రపంచ దేశాధినేతల్లో బలంగా ఉంది. ఇది ప్రపంచ శాంతికి భంగం కలిగించే అంశం.

"రిపుశక్తి యెప్పుడునుఁ దక్కువ సేయగ రాదెరుంగకన్" అనే పాఠాన్ని పాకిస్తాన్ ఎప్పటికీ నేర్చుకోదని అనేక సార్లు ఋజువయ్యింది.

పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీరులో సర్జికల్ స్ట్రైక్ పేరుతో జరిగిన భారత ప్రతీకార దాడి– చూసి రమ్మంటే హనుమంతుడు కాల్చి వచ్చిన సన్నివేశం లాంటిది. మచ్చుకి ఒకటిగా జరిగిన సంఘటన మాత్రమే!

అసలు యుద్ధం ముందుముందుంది. పాకిస్తాన్ అలిసిపోయి నిస్సహాయంగా నిలిచే రోజు దగ్గరలోనే ఉంది. ఈ 'ఆపరేషన్ రావణ' ఆఖరి టెర్రరిష్టు అంతమయ్యే దాకా ఆగకూడదు.

# ఏది పతనం?

*యతి సంగంబున, బాలుడాదరముచే జ్యాభర్త దుర్మంత్రిచే*
*శ్రుతిహీనిన్ ద్విజుడు అన్వయంబు ఖలుచే క్రూరాప్తిచే శీలము*
*ఉద్ధతిచే మిత్రతత చూపులేమి కృషి మద్యప్రాప్తిచే సిగ్గు*
*దుర్మతిచే సంపదల్ నశించున్ చెడు నర్థంబుల్ ప్రమాదంబునన్*

కష్టాలు ఎవరివలనో వస్తాయనే భావన మనలో ఎక్కువ. ఫలానా పార్టీవాళ్ళు మోసం చేసి గెలిచారంటాడేగానీ, తన బలహీనత, తన చాలని తనం, తన వెలితి తనను ఓటమి వైపుకు నడిపించాయని ఓడిన ఏ ఒక్కడూ ఒప్పుకోడు. మన కష్టానికి ఎవరో కారకులయ్యారంటే, మనం మోసపోవటానికి కావలసినంత అవకాశం మనమే ఇచ్చామన్నమాట.

భ్రష్టత్వం అనేది జారుడు బల్ల లాంటిది. దాన్ని ఎక్కి కూర్చుని, అన్యాయంగా అందరూ కలిసి నన్ను దిగజార్చా రని, తాను దిగిపోతుంటే అంతా చూస్తూ ఊరుకున్నారనీ, ఒక్కడూ తన రక్షణకు రాలేదనీ నేరాన్ని ఎవరిమీదకో నెట్టేస్తాం.

వైద్యుడిగా మా అనుభవంలో ఇలాంటి సంభాషణలు చాలా వింటూ ఉంటాం. ఒక ఆసామి ఇలా అన్నాడు: "పదేనేళ్ళ క్రితం ఓ డాక్టరుగారు జ్వరానికి ఇంజెక్షను ఇచ్చాడండీ...అప్పుడు మొదలయ్యింది నాకు షుగరు. ఇప్పటిదాకా తగ్గలేదు. ఏదైనా విరుగుడు మందిస్తారా?" అని! ఎవరిముఖమో చూసి నిద్రలేచినందువల్లనే మనకు సమస్తమైన సమస్యలూ వస్తున్నాయని గట్టిగా నమ్మే వాళ్ళు ఎక్కువగానే ఉన్నారు.

ఏనుగు లక్ష్మణకవి తెలుగు చేసిన భర్తృహరి సుభాషితాలలో పద్యం ఇది. ఎవరి మూలానో కాదు, మన మూలానే మనం దిగజారిపోతున్నాం అనీ, ఆత్మవిమర్శ చేసుకోవాలనీ, తప్పులు సరిచేసుకుని విజయ మార్గాన నడవాలనీ నచ్చచెప్తునాడీ పద్యంలో కవిగారు.

ఉన్నత స్థితిలోనే ఉన్నట్టు పైకి కన్పించినా వ్యక్తి పతనం ఎలా ఉంటుందో ఈ పద్యంలో వివరిస్తున్నాడు కవి. యోగులు, సన్యాసులు, పీఠాధిపతులు, ప్రవచనకారులు, మహా పండిత ముద్రాంకితులు, సాక్షాత్తు భగవత్స్వరూపులూ... వీళ్ళలో సెక్సు స్కాండల్స్', మాఫియా వలయాల్లో చిక్కుకున్న వాళ్ళను చాలా మందిని చూస్తున్నాం. దొరికితేనే దొంగలు కాబట్టి దొరికినవారి చరిత్ర అవశ్యం ఒక పాఠం నేర్పుతుంది.

పిల్లలు అతిగారాబం వలన ఎందుకూ కొరగానివారుగా మారతారు. "ఆటిజం" అనే ఒక వ్యాధి ఇప్పుడు బాగా ప్రచారంలోకి వచ్చింది. పెంకితనం అంటామే అది

తల్లిదండ్రులు, కుటుంబంలోని ఇతరుల కారణంగానే పిల్లల్లో పెరిగి, ముదిరి ఆటిజంగా మారుతుంది. దానికి ఇతర జన్యు కారణాలు, మెదడు సంబంధిత కారణాలు కూడా తోడౌతాయి.

జ్యాభర్త అంటే రాజుగారు. పాలకుడు ఎవడైనా సరే తన మంత్రులు, తన అధికారుల కూటమి వలనే పతనం అవుతాడు. తన యంత్రాంగాన్ని అదుపు చేయక పోతే దేశాన్ని ఏ విధంగా అదుపు చేయగలుగుతాడు...? అనేది ప్రశ్న.

తన పదవీకాలం పూర్తయ్యే వరకూ అధికారంలో కొనసాగవచ్చు. లేదా అవతలి పక్షం వాడు అంతకన్నా పతనావస్థలో ఉండటం కారణంగా తిరిగి పాలకుడుగా కొనసాగనూ వచ్చు. కానీ, స్వీయ యంత్రాంగం అదుపు తప్పితే అది పతనానికే దారితీస్తుంది.

'శ్రుతిహాని' అంటే వేదవిహిత కర్మల్ని వదిలేస్తే ద్విజుడు పతనం అవుతాడు.

ఒక్క చెడ్డవాడు పుడితే వంశ ప్రతిష్ఠ దెబ్బతింటుంది.

ఎంతగొప్పవాడేనా ఒక్క చెడ్డ స్నేహితుడుంటే ఎంత లోతుకైనా దిగజారిపోతాడు.

ముందు చూపులేకుండా వ్యవసాయం చేస్తే రైతు నష్టపోతాడు. పొగాకు రైతులు, పసుపు రైతులు, మిరప రైతులు, మిరప రైతులు, టమోటా రైతులు ఇలా చాలామంది మార్కెట్టు పోకడలు అవగాహన లేక చివరికి అప్పులపాలై బలవన్మరణాలకు బలౌతున్నారు. దేశానికి వెన్నెముకగా నిలవాల్సిన రైతు వెన్నువిరిగి కూలటం పతనమే!

త్రాగుబోతు సిగ్గును కోల్పోతాడు. మానమర్యాదల్ని మంటగలుపుకుంటాడు.

గొప్ప గొప్ప సంపన్నులు తమ సంపదల్ని పేకాటలోనో, గుర్రప్పందాలలోనో, రాజకీయాల్లోనో, రియల్ ఎస్టేటు వ్యాపారాల్లోనూ పెట్టి దివాళా తీస్తున్న వాళ్లనీ, జైలుపాలయిన వాళ్లనీ చూస్తున్నాం. ఇవి పతనాలు.

వీటన్నింటికీ ఎవరి ముఖమో చూసి నిద్రలేవటం కారణం అనుకుంటే మనల్ని మనం మోసం చేసుకుంటున్నట్టు లెక్క.

పతనం ఎలా ఉంటుందో వేరే ఉదాహరణలో ఇలా వివరించాడు భర్తృహరి: "ఆకాశంబున నుండి శంభుని శిరం, బందుండి శీతాద్రి, సు/శ్లోకంబైన హిమాద్రినుండి భువి, భూలోకమునందుండి య/స్తోకాంభోధి, పయోధినుండి పవనాంధోలోకమున్ చేరె గం/గా కూలంకష, పెక్కుభంగులు వివేక భ్రష్ట సంపాతముల్" ఆకాశం లోంచి శివుడి నెత్తిమీదకు, అక్కణ్ణించి హిమాలయాలకు, అక్కడనుండి నేలమీదకు, సముద్రంలోకి, ఇలా గంగా పతనం జరిగిందనేది ఇందులో భావం. పతనం లోకోపకారకమే అయితే సంతోషమే కదా!

‘కదిలింది కదిలింది గంగ/కదిలి ఉప్పొంగింది గంగ పరమ రాజసభావ పరిజృంభిత నిజాంగ/కదిలింది కదిలింది గంగ/కదిలి ఉప్పొంగింది గంగ” అని సినారే లాగా కవులు కీర్తిస్తారు కూడా!

మనం కష్టాలు కొనితెచ్చుకుని మనల్ని మనం నష్టపెడుతున్నామా లేక ఇతరులకు సాయపడుతున్నామా అనేది ప్రశ్న.

లోకోపకారం కోసం చేసే త్యాగాన్ని పతనం అనరు. రాజభోగాలన్నీ త్యజించి సన్యాసం స్వీకరించి క్రైస్తవ మతప్రచారకుడిగా మారిన జాన్ డి బ్రిట్టో లాంటి వ్యక్తుల నిర్ణయాల్ని పతనం అనకూడదు.

గంగ దివినుండి భువికి రావటం దేవతల దృష్టిలోనూ, మానవుల దృష్టిలో కూడా అది ఉన్నతిని కోల్పోవటం ఎంతమాత్రమూ కాదు. ఎందుకంటే అందులో లోకోపకారం ఉంది.

రాజు నుండీ బంటు దాకా మనుషులందరికీ లోకోపకారం చేసే అవకాశం ఉంది. అది ఆచరణలో లేనప్పుడు ఉన్నత స్థితిలో ఉన్నా పతనం కిందే లెక్క.

“దిగిరాను దిగిరాను దివినుండి భువికి” అని గంగ అనుకుని ఉంటే ఆవిణ్ణి గంగా మాత అని కీర్తించే అవసరమే ఉండదు కదా.

# ఏరు దాటిన వాగ్దానాలు

*"దాయమెత్తనో యీ సారె దాక నీక/కట్టి గెలిచెద నిదె పాసికలను వచ్చి*
*పట్టునో భూతమిందేమి ముట్టగలదొ/పొందవచ్చిన వ్రాలకు బోవు గాక"*

*(ఉత్తర హరివంశం, నాచన సోమన)*

కృష్ణుడు తన దేశానికి పాలకుడు. లోకపాలకుడు, విశ్వలోక పాలకుడు కూడా! ఆయనకు సత్యభామతో పాచికలాడే తీరిక దొరికింది. ఆటలో సత్యభామది పైచెయ్యి అయ్యింది. ఒక నిష్కంతో మొదలు పెట్టి, నాలుగు ఎనిమిది, పన్నెండు, పదారు ఇలా వరుసగా పందేన్ని రెట్టిస్తూ గెలుస్తోందామె!. కృష్ణుడి నిలవ సొమ్ము మొత్తం ఆమె మూలధనంలోకి చేరి పోతోంది. కృష్ణుడు లోలోపల కుతకుతలాడిపోతున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో పురప్రముఖులు గగ్గోలు పెట్టుకుంటూ వచ్చారు. పౌండ్రకుడిని చంపినందుకు ప్రతీకార చర్యగా కృత్య అనే భూతాన్ని కాశీరాజు ద్వారక మీదకు పంపాడని, అది జనాన్ని చంపుకు తింటోందనీ మొత్తుకున్నారు. 'ఆకొన మృత్యువులా, వెలిబ్రాకిన లయకాల రుద్ర ఫాలాగ్నిలా ఉన్నదా భూతం' అని చెప్పుకున్నారు.

కృష్ణుడు వినీ, విననట్టే కూర్చున్నాడు. పలక చెరిగిపోతుంది ఇంకో ఎత్తు వెయ్యమంటూ ఆమెను రెచ్చగొడుతున్నాడు. వాళ్ళేమో "విన్నపం బంగారు దేవా" అంటున్నారు. ఆమె పాచికలు 'తాలించి' వేస్తోంది... ఇదీ సందర్భం. నాచన సోముడి ఉత్తరహరివంశంలో తృతీయాశ్వాసంలోది ఈ పద్యం.

సత్యబామ పాచికలు తాలించి వేసిందట. తాలించటం అంటే చేతిలో అటూ ఇటూ పొర్లించటం. కూర. పప్పు, పచ్చడి, పులుసు, చారు, ఇలాంటి వంటకాలను వండినప్పుడు చివరలో తాలింపు పెడతారు. పోపు పెట్టటం, సాతాళించటం అని కూడా అంటారు. ఒక ఇనుప గరిటలో పోపు గింజల్ని లేదా సంబారాల్ని నూనెతోనో, నేతితోనో దోరగా వేయించి ఆ గరిటతో సహా తెచ్చి, వండిన వంటకంలో బోర్లించి అటూ ఇటూ కలియపెడతారు. అందుకనే "తిరుగబోత" పెట్టటం అనే మాట కూడా వ్యాప్తిలోకి వచ్చింది. సత్యభామ పాచికల్ని చేతిలో తాలించింది అనటంలో వంట చేసే చెయ్యి పాచికల ఆటలో నైపుణ్యాన్ని ప్రదర్శిస్తోందనే వ్యంగ్యం ధ్వనిస్తోంది.

పురజనం భూత భయంతో వణికి పోతున్నారు. సత్యభామ తటపటాయిస్తోంది. కృష్ణుడు పాచికలు వెయ్య మంటున్నాడు. ఈ సారి పందెంలో ఇప్పటిదాకా నువ్వు

గెలిచిందంతా తిరిగి నేను గెలిచేస్తాను...అన్నాడు. ఇంకోసారి నీకు పాచికలు ముట్టుకునే అవకాశం లేకుండా గెలుస్తానన్నాడు. ఆ భూతం వచ్చి ఈ పాచికల్ని ఎత్తుకెడుతుందా ఏంటి అని కూడా అనేశాడు. ఊరు జనం బిక్కచచ్చి పోతున్నారు.

'ఈ ఎత్తులో ఎవరికి లాభం రానుందో ఎవరికి తెలుసు... నువ్వు పాచికలు వెయ్యి' అన్నాడు. సత్య పాచికల్ని తాలిస్తోంది. 'త్వరగా వెయ్యి... పోయిన సొమ్మంతా గెలుచుకుని వెళ్ళి ఆ భూతం పని పడతాను..." అన్నాడు. ఆ మాత్రం భరోసా ఇచ్చాడు...చాలనుకుని సంతృప్తి పడ్డారు పౌరులు.

కష్టాలు, తుఫాన్లు, భూతాలు చెప్పిరావు. ముందుగా పసిగట్టి, రాకుండా అడ్డుకోగలిగే సమర్థత కలిగిన యంత్రాంగం లేనప్పుడు, జనం పోలీసులతోనూ, పోలీసులు మంత్రితోనూ, మంత్రి ముఖ్యమంత్రితోనూ మొరపెట్టుకుంటారు, సదరు పెద్దాయన భార్యతో ఏకాంతంగా ఉడి, 'కాసేపాగి వస్తాలే! ముందు మీరు పదండి...' అనే అంటాడు.

కృష్ణుడు భార్యతో జూదం ఆడుతూ, ఉన్నదంతా పందెంలో పోగొట్టుకుని, చూద్దాం చూద్దాం అంటూనే ఆఖరు ఎత్తు వేసి, పోయిందంతా గెలుచు కున్నాకే భూతాన్ని చంపటానికి వెళ్ళాడు. పోరాడి గెలిచాడు.

భూతం అక్కడ కొచ్చి ఆగడాలు చేయక మునుపే దాని రాకను పసిగట్టే సామర్థ్యం ఉంటే, జనం భయభ్రాంతు లయ్యే వారు కాదు కదా! అయినా, అంతిమ విజయం తరువాత తొలి కష్టాలను ప్రజలు పూర్తిగా మరిచిపోతారు, ఎన్నికల నాటికి ప్రభువుల పూర్వ పాపాలన్నీ జనం మరిచిపోయినట్టు!

ఎన్నికల ప్రణాళికలు, వాగ్దానాలు, పార్టీ మేనిఫెస్టోలు అన్నీ పచ్చి అబద్ధాలేనని తెలిసినా ప్రజలెందుకు నమ్ముతున్నారు..?

"చెయ్యను అనలేదు కదా.. చూద్దాం అన్నాడు – అక్కడికి అదే పదివేలు" అనే అల్పసంతోషం ఒక్కటే ఎన్నికల్లో ప్రధానపాత్ర వహిస్తోంది!

"చూద్దాం" అనడం మహానాయకుడి లక్షణం! అతను చేద్దాం అంటే ఎవరూ నమ్మరు – ఏరుదాటే వాగ్దానాలే అనుకుంటారు.

ప్రజలకూ నాయలకులకూ అదే తేడా!

ఓటుకోసం నాయకుడు వచ్చినప్పుడు ప్రజలు "చేద్దాం" అంటారు.

పనికోసం ప్రజలు నాయకుడి దగ్గరకు వెళ్ళినప్పుడు ఆయన 'చూద్దాం" అంటాడు.

ప్రజలు కూడా ''చూద్దాం'' అనగలిగనప్పుడే అది ప్రజాస్వామ్యం అనిపించుకుంటుంది.

# 'కట్టు' గుట్టు

*"నిను రప్పింపకమున్న వేడ్కపడి పూనెన్ శార్ఙ్గ కౌమోదకీ*
*వనమాలాంబుజ జక్ర భూమికలుఁ గైవారంబు జేయించె నే*
*లిన నాగారులచేత యాదవుల నోలిం గొల్చి కూర్చుండఁగాఁ*
*బనిచెన్ గేశవుఁడైంద్రజాలికు గతిం బ్రాతయ్యె నీకంతటన్"*

(నాచన సోమన ఉత్తర హరివంతం)

పెళ్ళి చూపుల్లో ఆడపిల్లలు అరువు నగల్ని, మగ పిల్లలు అరువు కళ్లజోళ్ళనీ, వాచీల్నీ పెట్టుకోవటం సర్వ సాధారణం. మన దర్పాన్ని ప్రదర్శించాల్సి వచ్చినప్పుడు ఇలాంటి అరువు అలంకారాలు, కృత్రిమ వేషధారణలు అవసరమౌతాయి. సముద్రుడు చర్మాంబర ధారి అయిన శివుడికి గరళాన్ని, పట్టు పీతాంబరధారి విష్ణువుకు కూతురినీ ఇచ్చాడు. అన్ని సందర్భాల్లోనూ గాంధీగారిలా బిళ్లగోచీ పెట్టుకుంటే పనులు కాగలవనే ధీమా ఏమీ లేదు. "అంబేద్కర్ గారు నేను కోటు మాత్రమే వేసుకుంటాను. నా హుందాతనం నాది" అన్నారు.

పరాయి వాళ్ళూ, శత్రువులూ వచ్చినప్పుడు పూర్వం రాజులు కూడా ఇలానే తెచ్చిపెట్టుకున్న అలంకారాలతో కొలువు దీరి కూర్చునే వాళ్ళట. నాచన సోమన ఉత్తర హరివంశంలో అలాంటి కృత్రిమ అలంకారాలు ఎలా ఉంటాయో చక్కని వివరణ ఇచ్చాడీ పద్యంలో. ఆయన్ని చూస్తూనే అవతలివాడు దంగై పోవాలని అలా చేస్తారట.

హంస, డిభకులనే రాక్షసులకీ కృష్ణుడికీ మధ్య యుద్ధాలు సాగుతున్నై. ఒకసందర్భంలో జనార్దనుడనే పెద్దమనిషిని కృష్ణుడి దగ్గరకి రాయబారం పంపారు. జనార్దనుడు కృష్ణుణ్ణి కలిసొచ్చి, ఆయన వైభవాన్నీ, ఆయన మాటల్నీ పూసగుచ్చినట్టు వర్ణించి చెప్తాడు. జనార్దనుడి మాటలకు పెద్దగా నవ్వారు హంస, డిభక సోదరులు.

"వరాలు ఉన్నాయి...అవి కాపాడతాయి అనుకుంటున్నారేమో... మీ ఇద్దరినీ వదలను. వదల కూడదు. మీకు వరా లిచ్చిన ఆ శివుడే దిగొచ్చినా లోకమంతా తెలిసే లాగా పారద్రోలి మీ ఇద్దర్నీ చంపేస్తా! యుద్ధం ఎక్కడ కావాలి? మధురలోనా? ప్రయాగలోనా? పుష్కర స్థలంలోనా? ఎక్కడంటే అక్కడే! ద్వంద్వ యుద్ధమా? ఆయుధాల్తోనా? ఏ ఆయుధంతో మిమ్మల్ని చంపాలో... మీరే నిర్ణయించుకోండి... వస్తున్నా! చూసుకొందాం! వస్తున్నా" ఇలా కృష్ణుడితో అనిపిస్తాడీ సందర్భంలో కవి నాచన సోమన. క్రీ.శ. 14వ శతాబ్దిలో సోమన పేల్చిన గొప్ప పంచ్ డైలాగ్ ఇది!

రాయబారిగా వెళ్ళిన జనార్దనుడు కృష్ణుణ్ణి చూసి నిజంగానే అదిరిపోయాడు. అతను తిరిగొచ్చి చేసిన కృష్ణస్తుతి విని నవ్వి, హంస డిభకులు హేళనగా ఇలా అన్నారు: "ఓరి పిచ్చివాడా! కృష్ణుడు భగవంతుడూ కాదు గిగవంతుడూ కాదు, ఆ శారంగ(విల్లు), కౌమోదకీ (గద) వనమాల (వైజయంతి అనే పూలమాల) చేత్తో పట్టుకున్న కలువపువ్వు (అంబుజం), సుదర్శన చక్రం, ఇవన్నీ నిజం అనుకుంటూన్నావా... ఎబ్బే ఉత్తుత్తివే! సభలో వీటిని అలంకరించుకుని కూర్చుంటాడు. నీ బోటి వాళ్ళు హడలి చావటానికి ఇలా లేని హంగూ ఆర్భాటాలు ప్రదర్శించాడు. నిన్ను ఫలానా రోజు రమ్మన్నాడు. నువ్వొచ్చే సమయానికి వేగంగా అలంకరించుకుని వచ్చి కూర్చున్నాడు. వందిమాగధుల్ని నిలబెట్టి పొగడ్తలతో హోరెత్తించాడు. నిన్ను అదరగొట్టాడు. అదంతా నిజమేనని, కృష్ణుడు భగవంతుడనీ నువ్వు భ్రమలో పడ్డావు. ఇలా చేయటం కృష్ణుడి కొక సరదా"అని!

ఇక్కడ "నా 'గారు'ల చేత" అని ఒక పదాన్ని ప్రయోగించాడు సోమన. పైకి చూస్తే నాగ+అరి=గరుత్మంతుడు అని అర్థం వస్తుంది. కానీ, నా 'గారు'లు అంటూ, 'గారు' అనే తెలుగు పదాన్ని వ్యంగ్యంగా తాబేదారనే అర్థంలో ప్రయోగించాడు. బ్యూరోక్రాట్లను ఇంగ్లీషులో "బాబు"లని పిలవటం లాంటిదే ఇది. "తన చంకల్లో మనుషుల్ని, చెంచాగాళ్లనీ పేరుపేరునా పిలిచి కూర్చోబెట్టాడు ...అవునా? ఇది కనికట్టు విద్య. కృష్ణుడు ఇందులో దిట్ట. లేనివన్నీ ఉన్నట్టు భ్రమింప చేస్తాడు. పెద్ద మాయావి. ఆ మాయలో పడి అందులో కిటుకు తెలుసుకోలేక పోయావు...." అని హేళన చేశారా రాక్షస సోదరులు.

కయ్యానికైనా వియ్యానికైనా అలంకారమే ప్రాణం. కృత్రిమ అలంకారాలు పెద్ద ప్రయోజనాల్నే తెస్తాయి. పంచె కట్టి, లాల్చీ వేసుకుంటే దేశభక్తుడైపోతాడు. కాషాయం కట్టి, నామాలు పెట్టుకుంటే మహాభక్తుడై పోతాడు. సూటూబూటూ వేసుకొంటే ఎక్కడలేని అరిస్టోక్రసీ కొట్టొస్తుంది. గాంధీ టోపీకి ఇప్పటికీ కొన్ని చోట్ల పనులు సమకూర్చే శక్తి ఉంది. కాళోజీ 'నాగొడవ' లో అంటాడు... "పెట్టుకున్న టోపీలు కాదు, పెట్టిన టోపీలు చూడా"లని! ఏది సహజాలంకారమో, ఏది కృత్రిమాలంకారమో తేల్చుకో గలిగే విచక్షణ మనకుండాలి. లోకజ్ఞానం అంటే అది!

# కలలో వార్తలు విప్పి చెప్పే కవులు

*వరసారస్వత పట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియున్*
*సరసావంతయు గానలేరు తుది యోషావిభ్రమాంబోధికిన్*
*విరసాంతఃకరణుండవై యెటులుగా నిందించెదో యయ్య! త*
*త్సరసాకార ముదారమన్మథకళాసర్వస్వశృంగారమున్!*

*(పాండురంగమహాత్మ్యం - తెనాలి రామకృష్ణ)*

వెటకార కవి తెనాలి రామకృష్ణుడికి ఎవరికో ఒకరికి తాటాకులు కట్టే చాకచక్యం ఎక్కువ.

పుట్టపర్తి నారాయణా చార్యుల వారు ఆయన గురించి "తెనాలి వాడు" అని ఎదురు వెటకారం చేస్తూ వ్రాసేవారు. ఈ తెనాలి వానికి ఏదైనా రుచి చూసి, ఆ అనుభవాన్ని ఆనందించాక మాత్రమే అందంగా వర్ణించటం అలవాటు.

చాలామంది కవులకు ఉత్తుత్తి నోటిమాటలే గానీ అనుభవించిన దాఖాలాలు లేవని ఈ పద్యంలో కవుల్ని ఎకసెక్కెం ఆడుతున్నాడు తెనాలాయన.

"వర సారస్వత పట్టభద్రులైన కవులు వర్ణించీ వర్ణించీ ఊదరగొడుతుంటారు. యోషావిభ్రమాంబోధి అంటే స్త్రీల శృంగార చేష్టలనే సముద్రం. సరసు అంటే దగ్గర అని! "సారెకు చుక్కల సరసకు బోవు" లాంటి ప్రయోగాల్లో దగ్గరగా పోవటం అనే అర్థం కనిపిస్తుంది. ఈ కవులు శృంగార మనే సముద్రం సరసకు కూడా పోయిన వాళ్ళు కాదు అంటూన్నాడు, "సరసావంతయు గానలేరు" అని! వీళ్ళ వర్ణనల్లో వట్టి వాచాలత్వమే తప్ప క్రియ శూన్యం. అందుకే "వట్టి మాటలు" కట్టి పెట్టమంటున్నాడు.

కవులు వ్రాసినవన్నీ స్వయంగా వాళ్లు చేసినవై ఉండాలంటే ఒక్కోసారి ప్రమాదమే కావచ్చు. ప్రతిదీ చేసి, చూసి అప్పుడే వ్రాయటానికి కవిత్వం వంటల పుస్తకం కాదు కదా! అయినా ఈ మధ్య వంటల పుస్తకాల్ని ఏనాడూ గరిట పుచ్చుకు ఎరగని వారుకూడా వ్రాస్తున్నారు.

రుచి అనే మహాసముద్రం సరసకు కూడా చేరని వ్యక్తి, రుచుల మీద పుస్తకం వ్రాస్తే ఎలా రుచిలేక చప్పగా ఉంటుందో, తనకు అనుభవంలేని విషయాలను కవులు వ్రాస్తే అంతే రసహీనంగా ఉంటుంది!

ఈ రహస్యాన్ని తెనాలి కవి శృంగారానికి వర్తింప చేశాడు. విరసాన్ని పెంచుకుని, సరసాన్ని నిందించకు, మన్మథ కళా సర్వస్వం మన ఊహలకు అందనిది. దాన్ని తక్కువ చేయవద్దనేది ఈ పద్యంలో హితవు!

రసమంటే తెలీని వెట్టికుట్టికి శృంగార వర్ణన దేనికనేది ఆయన ప్రశ్న. ఒక ప్రాంతంతోనూ, ప్రాంతీయ ఆచారాలతోనూ, స్థానిక సంస్కృతితోనూ, జన జీవనంతోనూ, భాషతోనూ, అక్కడి మాండలికాలతోనూ, వ్యక్తులతోనూ ఏ మాత్రం పరిచయం లేకుండా, అధ్యయనం లేకుండా ఎవరైనా ఆ ప్రాంతం గురించి వ్రాస్తే అది చప్పగా ఉంటుంది.

కవి స్వీయానుభవం లోంచి కావ్యం పుట్టినప్పుడే రసపుష్టి కలుగుతుంది.

వంటల గురించి వ్రాసినా, జనం తంటాల గురించి వ్రాసినా, శృంగారం గురించి వ్రాసినా, మార్కెట్లో బంగారం గురించి వ్రాసినా, మనిషి గురించి వ్రాసినా, మనసు గురించి వ్రాసినా వ్రాసేవాడికి ఆ విషయం మీద పట్టు-అథారిటీ- ఉండాలి. రచన లో రసరమ్యత కవి సాధికారికతను బట్టే వస్తుంది. అంతటి సాధికారికతను కలిగి ఉండటమే రసికత.

తెనాలి రామకృష్ణకవి పాండురంగ మహాత్మ్యం కావ్యంలో అయుతుడు అనే ఒక పాత్రని సృష్టించాడు. చదువంటే అయుతుడికున్న శ్రద్ధకి మెచ్చి అతని గురువు అగస్త్యుల వారు బ్రహ్మనడిగి అందమైన అమ్మాయిని తెచ్చి పెళ్ళి చేసుకోమంటాడు. అతను గురువు మాట కాదని హిమాలయాలకు తపస్సుకు పోతాడు. అతని ఉగ్ర తపస్సు ఘాటుకు ఇంద్రుడికి 'ఆవరసం' తాగినంత పనౌతుంది. దాంతో ఇంద్రుడు ముసలి వేషంలో దిగివస్తాడు. ఎలాగైనా అయుతుడి చేత తపస్సు మాన్పించి పెళ్ళికి ఒప్పించాలని ప్రయత్నిస్తాడు. ఇది ఈ పద్యానికి సందర్భం.

"సంసారం వద్దనీ, మోక్షం కోసం పాకులాడాలనీ రోజూ డబ్బాల్లో రాళ్ళు పోసి గిలకొట్టినట్టు టీవీల్లో ఎడాపెడా వాయిస్తూ వేదాంతులు చేసే వ్యాఖ్యానాలూ, ప్రవచనాలూ, ప్రసంగాలూ ఇవన్నీ నిజం అనుకుంటున్నావా...? అదంతా 'కలలో వార్తలు విప్పిచెప్పడం' లాంటిది" అని సాక్షాత్తూ ఇంద్రుడే చెప్పినట్టు నిర్మొహమాటంగా వ్రాశాడు తెనాలి రామకృష్ణ.

కలలో వార్తలు విప్పి చెప్పే అలవాటు హానికరమే!

స్వర్గ నరకాల గురించీ, మరణాంతర జీవనం గురించి, మోక్షాల గురించీ పదే పదే చెప్పిందే చెప్పి, అదేపనిగా విసిగించే వ్యక్తులు తమ అనుభవంలో లేని, తాము ఎరగని, తాము చూడని విషయాల గురించి ఇంత ఊదర గొడుతుంటే నోళ్ళు తెరుచుకుని మనం వినటం కూడా పొరబాటే!

సమాజనీతి గురించి, లోకరీతి గురించి, సమజీవనం, సహజీవనాల గురించీ కనీస ప్రస్తావన కూడా చెయ్యకుండా సమకాలంలో తాము జీవిస్తున్న సమాజం గురించి పూర్తిగా వదిలేసి, ఊరకే కలలో వార్తలు విప్పి చెప్తుంటారని 500 యేళ్ళ

క్రితమే తెనాలి రామకృష్ణుడు ఈసడించుకున్నాడు. అప్పటి పరిస్థితి నేటి పరిస్థితికి నకలుగానే ఉన్నదని కూడా అర్థం చేసుకోవచ్చు.

ఇలాంటీ ఉత్తుత్తి ప్రవచన కారుల్ని 'ముండధారులు' అన్నాడు తెనాలి రామకృష్ణ. అంటే బోడి తలలవాళ్ళని! బుర్ర పైనే కాదు, బుర్రలోపల కూడా ఏమీ లేనివాళ్లనేది ఇందులో వ్యంగ్యం.

వీళ్ళు చెప్పే మోక్షం "చింతకాయ కజ్జెం" లాంటిదని కూడా అన్నాడు. కజ్జెం అంటే కజ్జికాయ అనే స్వీటు. చింతకాయతో చేసిన కజ్జెం ఎలాంటిదో సరుకులేని ప్రవచనకారుల వచనాలు కూడా అలాంటివే నన్నాడు. స్వీయానుభవం లోకానుభవం లేని ఊహాత్మక అంశాలమీద అంత ఎక్కువ ప్రచారం మంచిది కాదని, దేవుడి గురించి చెప్పే అంశాలన్నీ ఈ జన్మలో నరోత్తముడిగా, దేవుడిలాంటి మనిషిగా ప్రతి ఒక్కరూ మారాలనే లక్ష్యంతో సాగితే, సామాజిక ప్రయోజనం నెరవేరినట్టౌతుందనీ మీడియా వారు కూడా గుర్తించాలని దీని భావం.

పత్రికాకారులైనా, ప్రవచనకారులైనా, వచనకారులైనా, వచనకవులైనా, కవులైనా కలలో వార్తలు విప్పిచెప్పటం వలన ఈ లోకానికి ఒరిగేదేమీ ఉండదు.

కలలో వార్తలు విప్పి చెప్పటం కన్నా వార్తల్లో వ్యక్తిగా రాణించటం మీద ఎక్కువ దృష్టి పెట్టాల్సిన అవసరం ఉంది.

# కా...కా...లు తెలీని కాకి!

***కాకేమి తన్ను తిట్టెనే? కోకిల ధనమేమి తన్ను గైకొమ్మనెనే***
***లోకము పగయగు, బరుసని వాకున, జుట్టమగు మధురవాక్యము కలిమిన్***

ఇదొక చాటు పద్యం. ఇందులో విషయానికి చాటు ఏమీ లేదు. బహిరంగమే! కాకిని ఛీకొడతాం, కోకిలను మెచ్చు కుంటాం. కాకి మనల్ని తిట్టిందీ లేదు, కోకిల పెట్టిందీ లేదు. మధుర వాక్యాలు పలికే వాడికి పెట్టబుద్ధి అవుతుంది, మాట కన్నా మాట్లాడే తీరే గొప్ప! "కాకః కాకః పికః పికః" అని సామెత. కాకి కాకే, కోయిల కోయిలే! అనేది దీని భావం.

ఊరిలో అశుద్ధాన్ని శుభ్రం చేసే స్కావెంజర్ లాంటిది కాకి. అయినా దాన్ని మెచ్చే వారుండరు. కోకిల వలన ఊరుకి ఏ ఉపయోగమూ లేకపోయినా దాన్ని తెలుగింటి ఆడపడుచన్నట్టు కీర్తిస్తారు.

కాకి ఎగిరీ ఎగిరీ అలిసి ఒక తాటి చెట్టు మీద వాలింది. సరిగ్గా అదే సమయానికి పుటుక్కున తాటి పండు ఆ చెట్టు మీంచి జారి పడింది. ఇది కాకి వాలినందువలనే జరిగిందని లోకం అపార్థం చేసుకుంది. కాకమ్మ కథలన్నీ ఇలాంటివే! కాకి దంతాలు వెదికే వాళ్లకు కాకుల మహాత్మ్యం ఏం తెలుస్తుంది...?

కాకులకు పాడటం చేతకాదనీ, దాని గొంతులో గరగర ఎక్కువనీ, కరక్కాయ కషాయం పోసినా అది బాగవదనీ అంటుంటాం. కానీ కాకుల బృందగానం ఎప్పుడైనా విన్నారా? ఇప్పటి సినిమా పాటలకన్నా వినసొంపుగా ఉంటుంది. "ఒపేరా" లకు కాకులే పితామహులు! అది 'కాకిగోల' అని అకారణ కాకిద్వేషం ఉన్నవారికే అనిపిస్తుంది.

కాకులకూ మనసుంటుంది. సుఖదుఃఖాలకు ప్రతిస్పందించే హృదయం వాటికుంది. ఒక కాకి ఆపదలో ఉన్నా చనిపోయినా వేలాది కాకులు వచ్చి మూగుతాయి. సంఘీభావాన్ని ప్రకటిస్తాయి. 'కాకి బలగం' అనేది ఒక తెలుగు జాతీయం. కాకికేమి తెల్సు సైకో ఎనాలిసిస్ అని మహాకవి అన్నాడు కానీ, కాకులకు మనో విశ్లేషణ బాగానే తెలుసు.

ఎంగిలి చెయ్యి విదిలించినా మెతుకులు ఏరుకుని రోజూ పెట్టిన సమయానికే వచ్చి వాలే మానవ నేస్తాలు కాకులు. అవి ఈ దేశంలో అణగదొక్కబడిన అభాగ్యులకు ప్రతినిధులు. అధములం మనమే! కాకిని కూడా మాలకాకి, నామాల కాకి అంటూ కులం పేరుతో పిలుస్తున్నాం. ప్రకృతికి కులమతాలను ఆపాదించటం, ఒక దౌర్భాగ్యం.

ఊళ్ళోనో ఊరికి దగ్గరగానో ఉన్న కొండల మీద బండరాళ్ళు ఆక్రమించి మతం గుర్తులు వేసే దురాక్రమణ దారులకు కాకిని నీచపక్షిగా మాట్లాడే హక్కు ఎక్కడుంది...?

కాకుల ధ్వనుల్ని బాగా విశ్లేషించిన శాస్త్రవేత్తలు అవి తమను మచ్చిక చేసుకున్న వ్యక్తుల ముఖాల్ని బాగా గుర్తుపెట్టుకో గలుగుతాయని కనుగొన్నారు. ఒక్కో మనిషిని ఒక్కక్క రకంగా 'కా...' అంటూ పిలుస్తాయిట. మనుషులకు తమభాషలో అలా పేర్లు పెట్టుకుని పిలుస్తున్నాయని ఒక పరిశోధకుడు పేర్కొన్నాడు. కాకు లెంతగా ప్రేమలో పడతాయో, అంతగా పగ పడతాయికూడా! అయితే అది పాము పగంత సీరియస్ కాకపోవచ్చు. కాకులు మనుషుల తలల మీద దాడి చేసి గాయపరచటానికి కారణం అదే! అకారణ కాకిద్వేషాన్ని అవి సహించవు. కించపరిచేవాడి మాడు పగలకొడతాయి.

కాకికి భయం అంటే తెలియదు. అపకారం జరుగుతుందని అనిపిస్తే తప్ప ఒకరి జోలికి వెళ్ళవు. రాబందులు వెంటపడితే కాకులన్నీ కలిసి రాళ్లను ముక్కున కరచుకుని వాటితో రాబందుల మీద ఎదురు దాడి చేసి చంపేస్తాయి.

వాటి శరీర పరిమాణంతో పోలిస్తే కాకుల మెదడు చాలా పెద్దది. వాటి జ్ఞాపక శక్తీ అమోఘమైందే! దొరికిన తిండిని అనేక రహస్య స్థావరాల్లో భద్రపరుస్తాయి. అలా భద్రపరచిన స్థావరాల్ని చక్కగా గుర్తు పెట్టుకుంటాయి కూడా!

కాకులజంట జీవితాంతం కలిసే కాపురం చేస్తాయిట. కాకులు 7-14యేళ్ళ వరకూ బతుకుతాయి. మగ కాకులకు పురుషావయం ప్రత్యేకంగా ఉండదనీ, వీర్యాన్ని ఆడకాకి జననాంగంలోకి విడుదల చేస్తుందనీ, ఇదంతా 15 సెకన్లలో జరిగిపోయే వ్యవహారం అనీ, ఆ కొద్ది సౌఖ్యానికే ఆడకాకి, మగ కాకికి ఆజన్మాంతం కట్టుబడి ఉంటుందనీ కాకి పరిశోధన లంటున్నాయి.

సరిగ్గా వొళ్లు తడవకుండా పిల్లలు రెండు చెంబులు నీళ్ళు గుమ్మరించుకుని వచ్చేస్తే "కాకిస్నానం" చేశావంటారు పెద్దవాళ్ళు. కానీ, కాకులు స్నానం చేస్తాయి. సన్ బాత్ ద్వారా 'డి విటమిన్ని తయారు చేసుకుంటాయి. అవి చీమల్ని పట్టి తమ రెక్కలకేసి రుద్దుకుంటాయి. ఆ చీమల వాసనకి ఇతర కృమి కీటకాలు శరీరం మీద చేరకుండా అలా చేస్తాయిట.

కాకులు పితృ దేవతలకు ప్రతినిధులు. మనకే కాదు, ఆఫ్రికన్ ప్రాచీన జాతులకు, కొన్ని ఇతర విదేశీ జాతుల వారికీ, కాకిని పితృదేవతగా ఆరాధించే ఆచారం ఉంది. కాకి అరిచిందంటే, చుట్టాలొస్తారనే నమ్మకం కూడా మనలో ఉంది. కాకికి భూత భవిష్యత్ వర్తమానాలన్నీ తెలుసని కూడా ఒక నమ్మకం.

కాకి గూడు నిర్మాణాన్ని పరిశీలిస్తే వాటిలో ఎంత గొప్ప ఇంజనీర్లున్నారో అర్థం అవుతుంది. దాని గూడుకు కావలసిన పుల్లలు, వివిధ సైజుల్లో వివిధ షేపుల్లో

ఉన్నవాటిని ఎక్కడెక్కడి నుంచో ఏరుకుని ముక్కున కరిచి తెచ్చి గూళ్ళు కట్టు కుంటాయి. అందులో కాకి దంపతులు, పిల్లలు, పెంపుడు పిల్లలు ఎంత సుఖంగా జీవితం గడిపేస్తారో ఆశ్చర్యం అనిపిస్తుంది.

పిల్లలు బట్టీకొట్టి చదువుతుంటే అలా ముక్కున పట్టి చదవద్దంటారు పెద్దవాళ్ళు. కాకి, తన గూడుకోసం ఒక పుల్లని ముక్కున కరిచి తెచ్చుకుంటూ ఉండగా దాని ఫ్రెండు ఎవరైనా 'కా...' అని పిలిస్తే ఇది కూడా నోరు తెరిచి 'కా...' అంటుంది. దాంతో పుల్లకాస్తా జారి పోతుంది. ముక్కున పట్టిన చదువు కూడా ఇలానే మధ్యలో జారి పోయి, పరీక్ష రాయటం మొదలెట్టే సరికి గుర్తుకు రాకుండా పోయే ప్రమాదం ఉంది. అందుకే ముక్కున పట్టి చదివి కాకిలాగా అవస్థ పడవద్దని పెద్దలు చెప్తారు.

కాకులు ఒకేసారి అనేక గూళ్ళు నిర్మిస్తాయి. వాటిలో అవి నివాసం ఉండేది ఒక దాంట్లోనే! తక్కినవన్నీ శత్రువుని తప్పుదారి పట్టించటానికేనట.

కాకుల్ని కొట్టి గ్రద్దలకు వేసేది వజ్రాల దొంగ వ్యాపారులే! కొండ లోయల్లో వజ్రాలు ఏరుకోవటం కోసం వ్యాపారులు కాకుల్ని చంపి వాటి మాంసాన్ని కొండ మీంచి లోయల్లోకి విసిరేస్తారు. చిన్నచిన్న వజ్రాలు ఆ మాంసానికి అంటుకుంటాయి. వాటిని గ్రద్దలు తన్నుకు పోయి కొండమీద పెట్టుకుని తింటాయి ఆ గ్రద్దల్ని వెళ్ళగొట్టి వ్యాపారులు మాంసాన్ని అంటుకుని ఉన్న వజ్రాలు ఏరుకుంటారు. కాకులు అలా దొంగ వ్యాపారులకు ఎర అవుతుంటాయి.

కాకులు ఏ విధంగా చూసినా లోకోపకారులే! అవి మనకు ఎలాంటి అపకారం చేయట్లేదు. కాకిని కించపరుస్తున్నది కూడా మనమే! ఇతర జాతులవాళ్ళు ఇలా కాకిని ఈసడించటం లేదు.

కేవలం కాకి గొంతు బాగాలేని కారణంగా వాటిని ఛీకొట్టడం మానవ జాతికి తగదు. చిలక కొట్టిన జామ పండునీ, కాకి కొట్టిన జామపండునీ ఒకేలా చూడగలవాడు ఉత్తముడు.

ఇప్పటికే పట్టణాలను ఛీ కొట్టి కాకులు అడవుల్లోకి వెళ్ళిపోయాయి. పల్లెలు కూడా పట్టణీకరణం చెందటాన అక్కడ కూడా కాకుల సంచారం తగ్గిపోయింది. మనుషులకు దూరంగా బ్రతకాలని కాకులు నిర్ణయించు కోవటం కాకి కన్నా మనిషికే ఎక్కువ నష్టం. "లోకులు పలు కాకులు" అనేది అందుకే!

# కాంతిస్వప్నాలు

*వినియె నెలల్చతుర్ద్ధ్యయిని వృష్టి దినాళికి, రాత్రికై దివం*
*బున, జరకై వయస్సునను బూని పరంబునకిప్పుడుద్యమం*
*బనువుగఁ జేయఁగా వలయునంచుఁ బురోహిత ధర్మ మాత్మ గీ*
*ల్కొన నల విప్రుఁడా ద్విజ్కులలోన సుభాషితముల్బఠింపగన్*

(ఆముక్త మాల్యద - శ్రీకృష్ణదేవరాయలు)

అనేక రోజులు విరహపడి, అదను చూసుకుని ఒక రాత్రి వేళ మధుర రాజ్యపాలకుడు పాండ్యుడు వేశ్య ఇంటికి బయల్దేరాడు. దారిలో పంతులుగారు పురాణ ప్రవచనం చేస్తున్నాడు. అది వింటూ ఆ దారిన సాగిపోసాగాడు రాజుగారు. అక్కడి వరకూ కథ బాగానే సాగింది. పంతులుగారు నీతిబోధన మొదలెట్టాడు. రాజుగారు వింటున్నారు. ఆ నీతి బోధే ఈ పద్యం:

కృష్ణదేవరాయలి ఆముక్తమాల్యద కావ్యంలోది ఈ పద్యం. ఈ పద్యంలో నాలుగు సూత్రాలున్నాయి.

1) రానుంది వానా కాలం. సరుకులు దొరకవు. కట్టెలు దొరకవు. రవాణా ఉండదు. అందుకని పొడిగా ఉండే కాలంలోనే ఆ నాలుగు నెలలకూ సరంజామా సమకూర్చుకోవాలి.
2) రాత్రికి చీకట్లో చాలా పనులు కుదరవు కాబట్టి వెలుతురుండగానే, పగటిపూటే పనులు చక్కబెట్టాలి.
3) వయసు ముదిరి వృద్ధాప్యం వచ్చాక ఏ పనీ చేయలేని స్థితి వస్తుంది. అందుకని జవసత్వాలుండగానే వృద్ధాప్యానికి తగిన ప్రణాళిక రచించుకోవాలి.
4) మరణించాక పరలోకానికి కావాల్సినవన్నీ జీవించి ఉండగా ఇహలోకం లోనే చక్కపరచుకోవాలి.

రాజుగారి మనసుకి ఈ సూత్రాలు బాగా వంటబట్టాయి. పరివర్తన పొందాడు. అదీ ఈ పద్యంలో కథ.

ఆయన రాజుగారు. రాజైనంత మాత్రాన లోకం మొత్తం రాయల వారికి అనుగుణంగా మారిపోదు. ప్రభుత్వ వ్యవస్థలోని అవినీతినీ, ప్రజా జీవితంలోని మౌఢ్యాలను కేవలం అధికారంతో అంతం చేయలేమని రాయలకు బాగా తెలుసు. ఆ విషయాన్ని అనేక పద్యాల్లో చాలా స్పష్టంగానే చెప్పాడు కూడా!

ఆయన వైష్ణవ భక్తికొద్దీ ఆముక్తమాల్యద కథాంశాన్ని ఎంచుకున్నప్పటికీ, అందులో రాజులకు, పాలకులకు, అధికారులకు, జనాన్ని ప్రభావితం చేయగలిగే సెలబ్రిటీలకు ఎన్నో నీతులు చెప్పాడు.

దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవా లనేది పైన చెప్పిన సూత్రాల్లో ముఖ్యాంశం. ఇప్పటి అవసరాల గురించి మాత్రమే కాదు, రేపటి గురించి కూడా ఇప్పుడే ఆలోచించటం విజ్ఞత. ఇది పాలకులకు అవసరం. అందుకనే పంతులుగారి చేత రాజుగారు వినేలా చెప్పించాడు రాయలు.

అంతఃపురంలో అందరు కాంతలు ఉండగా వేశ్యా వ్యామోహంతో బయల్దేరిన రాజుకి చేయవలసిన హెచ్చరికే ఇది.

వేసవి కాలంలో నీటి ఎద్దడి ఉంటుంది కాబట్టి ముందుగానే నీటి వనరులకోసం ప్రయత్నం చేయాలన్నాడు. వానాకాలం వచ్చే ఆహార కొరతను ఎదుర్కోవటం గురించి వేసవిలోనే ఆలోచించాలన్నాడు.

రేపు రానున్న కష్టాలను నేడే గుర్తించ గలవాడే నిజమైన పాలనా దక్షుడు. యుద్ధం వస్తే పోరాడి గెలిచేవాడు యోధుడు. యుద్ధం రాకుండా ముందస్తు చర్యలు తీసుకునేవాడు రాజనీతిజ్ఞుడు అవుతాడు.

కారు మంచిదే, డ్రైవరు మంచివాడే అయినా రోడ్డు బాగోకపోతే ప్రయాణం సుఖంగా సాగదు. పాలనా వ్యవస్థకు సరైన ట్రాక్ ఉండాలి. మంచి ట్రాక్ మీద ప్రభుత్వాన్ని నడపగలవాడే రాజనీతిజ్ఞు డౌతాడు.

రాజుల కాలంలో ప్రభుత్వాలు పడిపోతాయనే భయం లేదు. అయినా, రాజైనవాడు రేపు గురించి ఆలోచించాలన్నాడు రాయలు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఐదేళ్ళకు అధికారం కుదించుకు పోయినప్పటికి పాలకులకు లేదా ప్రతిపక్షాలకూ రేపు అనే భయం లేకపోవటం చాలా విచిత్రం.

రెండు పార్టీలు లేదా కూటముల వ్యవస్థ నడుస్తున్న నేటి కాలంలో రెండు పక్షాలకు రేపు తామే అధికారంలోకి వస్తామనే అతి నమ్మకమే ఇందుకు కారణం. నేటి రాజకీయాల మీద అది ఎక్కువ ప్రభావాన్ని కల్గిస్తోంది.

పెద్దల తరాన్ని మార్చడం కష్టమని భావించి మాజీ రాష్ట్రపతి కీ.శే. అబ్దుల్ కలాం యువత మీద ఆశలు పెట్టుకున్నారు. రేపటి కోసం నేడు బంగారు కలలు కనాలనేవారాయన.

కానీ, ఆధునిక వ్యక్తిత్వ వికాస నిపుణుల ధోరణి ఇందుకు భిన్నంగా ఉంది. నిన్న మనది కాదు, రేపు మనకు లేదు, నేడే నిజం అనుకోమని చెవినిల్లు కట్టుకుని వాళ్ళు కుర్రకారుని ప్రోద్బలం చేస్తున్నారు. రాయలవారి నీతులు, అబ్దుల్ కలాం నీతులు నేటి తరానికి చెవికెక్కే పరిస్థితి లేదు.

ఆర్థిక దృష్టికి తోడు సామాజిక దృష్టిని కూడా పెంపొందించే వ్యవస్థ ఇప్పుడు కావాలి. దేశం గురించి, మనుషుల గురించి మానవ సంబంధాలగురించీ మాట్లాడటం మొదలు పెట్టాలి. ఎంత మాట్లాడితే అంత ఫలితం ఉంటుంది. నేటి తరానికి కావలసినవి రేపటి గురించిన కాంతిస్వప్నాలు...గుప్పెడు కలలు...

# కుదురు దారి

సరిగా తెనుగు నేర్పు చక్కని యేర్పాటు
నాటలేదటంచు కనంగ వలయు
ఎల్లపల్కులకును తల్లి సంస్కృత
మనుకొనుట తప్పని కనుగొనవలయు
తెనుఁగు పుట్టును గుట్టు తెలిసికో,
తెన్‌'పల్కులెన్ని కావలెనని యెఱుఁగవలయు
అవి నేర్చుకొనుటకు అనువగు తెరవులు కని,
తెల్వి హెచ్చించుకొనగవలయు
ప్రాకృతము బాగుగా చదువంగవలయు
మదివిరియఁజేయ ఇంగ్లీషు చదువవలయు
తగిన పొత్తంబులన్ వ్రాసి తనర వలయు
ఇదియె తెనుఁగుతల్లిని కొల్చు కుదురుదారి

మారేపల్లి రామచంద్ర శాస్త్రి గారు కృష్ణాతీరంలో పుట్టి విశాఖ తీరంలో 'కవిగారు'గా ప్రసిద్ధులైన తెలుగు భాషాభిమాని. భాషోద్యమ ప్రవర్తకుడు.

తెలుగు వాళ్ళు ఆంగ్లాన్ని, సంస్కృతాన్ని బాగా చదవాలి. కానీ, వాళ్ళు ఆంగ్లమానస పుత్రులో సంస్కృత మానస పుత్రులో కాకూడదని, తెలుగుని స్వతంత్రభాషగా గుర్తించి, గౌరవించి తెలుగు పుత్రులుగా వెలగాలని చాటిన ఉద్యమ శీలి.

తెలుగు భాష దేశంలో రెంవ పెద్దభాష. హిందీ తరువాత దేశంలో ఎక్కువమంది ఈ భాషను మాట్లాడుతున్నారు. సంస్కృతం ఇంగ్లీషు ఇంకా ఇతరభాషలను తేలికగా ఇముడ్చుకోగల సౌలభ్యం ఈ భాషకు ఉంది. ఏ భాషా పదాన్నయినా దాని ఉచ్చారణను తెలుగులో వ్రాయగలిగే అనువు తెలుగు భాషకుంది. కాబట్టి, దీన్ని మహాభాషల్లో చేర్చాలని మొట్టమొదటిసారిగా కోరిన వ్యక్తి శ్రీ కవిగారు.

వాడుక భాషకు గిడుగు చేసిన సేవ ఎంతటిదో అసలైన తెలుగు భాషకోసం, దాని విరివి(వికాసం) కోసం, దాని 'కావలి' కోసం కవిగారు చేసిన కృషి కూడా అంతటిది.

మనం ఆంధ్రులం, తెలుగు వాళ్ళం అనుకుంటున్నాం గానీ మనలో ఆంధ్రత్వం, తెలుగుతనం కొరవడుతోంది. పేర్లలోనూ పలుకులోనూ, సంతకాల్లోనూ, ఆహార పానీయాల్లోనూ తెలుగుతనం పోతోంది.

పండుగలు పబ్బాల్లోంచి తెలుగుతనం మాయమై పోతోంది.

చదువుల్లో తెలుగు ఎప్పుడో పోతోంది.

పాలనలో తెలుగు  అసలు చేరనే లేదు.

వీధుల్లో బడ్డీకొట్లలో కూడా  ఇంగ్లీషులోనే  'తెలుగుతాంబూలాలు' అమ్ముకుంటూన్నారు.

పూటకూళ్ళ అయ్యలు అన్నాన్ని 'రైసు' అంటేనే జనం తింటున్నారని చెప్తున్నారు.

అమ్మలు 'మమ్మీ'లయ్యారు. 1930ల లోనే ఈ పరిస్థితి దాపురిస్తోందని వాపోయిన వ్యక్తి 'కవిగారు'.

రోజువారీగా మనం మాట్లాడే మాటల్లో ఇంగ్లీషు, సంస్కృతాలను వదిలేస్తే మిగిలే తెలుగు తక్కువ.

బస్సు రోడ్డున స్పీడుగా పోతోంది అనే 4 మాటల వాక్యంలో బస్సు, రోడ్డు, స్పీడు మూడూ పోతే, పోతోంది అనేది ఒక్కటే తెలుగు మాట. అది కూడా ఎప్పుడు పోతుందో తెలీదు.

కవిగారు  వీలైనంత వరకు సంస్కృతం లేదా ఇంగ్లీషు లేకుండా తెలుగు మాట్లాడటం, వ్రాయటం గురించి విశేష కృషి, ప్రచారం చేశారు. కవి గారు వ్రాసిన ఈ పద్యం వ్యాఖ్యానం అవసరం లేని తేటతెలుగులో ఉంది.

"సరిగా తెనుగు నేర్పే చక్కని యేర్పాటు ఈ రోజుల్లో లేదు. ఎల్ల పలుకులకీ అంటే భాషలకీ తల్లి సంస్కృతమే అనటం తప్పు. తెలుగు పుట్టు గుట్టు తెలుసుకోండి.తెలుగు లో ఉన్న సంస్కృత మాటలు తెన్ పల్కులే (తెలుగు మాటలే) కావచ్చేమో పరిశోధించి కనుక్కోండి. చక్కని తెలుగు మాటల్ని నేర్చుకోవటానికి అనువైన తెరవులు అంటే పద్ధతులు తెలుసుకుని తెలివి పెంచుకోండి. ప్రాకృతాన్ని బాగా చదవండి. ఆ భాషలో అచ్చతెలుగు పదాలు అనేకం కన్పిస్తాయి. మనో వికాసం కోసం ఇంగ్లీషు కూడా నేర్చుకోండి. చక్కటి తెలుగులో మంచి పొత్తాలు (పుస్తకాలు) వ్రాసి గొప్పవాళ్ళు కండి. ఇదే తెలుగుతల్లిని కొలిచే కుదురు దారి" అంటారు కవిగారు.

తెలుగు భాష సంస్కృతం లోంచి పుట్టిందనే వాదాన్ని ఆయన ఒప్పలేదు. సంస్కృతం, తెలుగు అక్కచెల్లెళ్ళే గానీ అమ్మాకూతుళ్ళు కారని, తెలుగులో కనిపించే చాలా సంస్కృతం మాటలు తెలుగు పదాలే కావచ్చని, అవి తెలుగులోంచి సంస్కృతంలోకి వెళ్ళినవి కావచ్చని ఆయన గట్టిగా నమ్మారు.

తెలుగు భాషని తెలుగు వాళ్ళకీ, తెలుగేతరులక్కూడా చక్కగా నేర్పేవాళ్ళు లేరని అభిప్రాయపడ్డారు. నిజమే! ఒక విదేశీయుడికి తెలుగు ఎలా నేర్పాలో మన పండితుల్లో ఎంతమందికి తెలుసు?

తెలుగు నేర్చుకుంటే తెలివి పెరుగుతుందనీ, ఇంగ్లీషు కూడా నేర్చుకుంటే మనో వికాసం కలుగుతుందనీ 80 యేళ్ళ క్రితం చాటిన మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారిని సముచిత రీతిలో గౌరవించుకోవటం మన ధర్మం.

భాషాభివృద్ధికి కృషి చేసే వ్యక్తులకు ఆయన పేరుతో ప్రభుత్వం పురస్కారం ప్రకటిస్తే భాషను, భాషోద్యమాన్నీ గౌరవించుకొన్నట్టు అవుతుంది.

# కొండమీది కొక్కిరాళ్ళు

*పండితులైనవారు దిగువం దగనుండగ నల్పు డొక్క దు*
*ద్దండత బీఠమెక్కిన బుధ ప్రకరంబుల కేమి యొగ్గగున్?*
*గొండొక కోతి చెట్టు కొనకొమ్మల నుండగ గ్రింద గండ భే*
*రుండ మదేభ సింహ నికురుంబము లుండవె చేరి భాస్కరా!*

(భాస్కర శతకం - మారయ వెంకయ్యకవి)

బాపూగారి ఒక సినిమాలో పంచాయితీ ప్రెసిడెంటు తన పాలేళ్ళను టీచర్లుగా చూపించి, లేని స్కూలుని ఉన్నట్టు నడిపిస్తుంటాడు. స్కూళ్ళ ఇన్స్పెక్టరు వచ్చినప్పుడు ఓ పాలేరాయన "నాను నాలుగో కలాస్సు పంతుల్నండీ"అంటాడు. ఇనస్పెక్టర్ గారు అతగాణ్ణి "విశ్వక్సేనుడు" అని పలకమంటాడు. అది భూస్వామ్య యుగంలో చెల్లింది. ఇప్పుడు నడుస్తున్నది స్వంతప్రజల స్వామ్య యుగం. అంటే తమ మనుషుల కోసమే పనిచేసే యుగం.

అధికారం చేజిక్కించుకొనే వరకూ ప్రజల కోసమే నిరంతరంగా జీవించిన పార్టీలు ఎన్నికైన మర్నాడే స్వంత ప్రజల సంక్షేమం భుజానకెత్తుకుంటాయి. ఆర్ కె లక్ష్మణ్ కార్టూన్ ఒకటుంది. "ప్రజలారా! ఇన్నాళ్ళూ వాళ్ళు ఇంతింత తిన్నారు. ఈసారి ఆ అవకాశం మాకు ఇప్పించవలసిందిగా కోర్తున్నాను" అంటాడో నాయకుడు. "ఇంతకాలం ప్రతి పక్షంలో ఉన్నాం... మా కార్యకర్తల్ని సంతృప్తి పరచొద్దా...?" అని బహిరంగంగానే అంటూన్న కాలం ఇది. ప్రభుత్వ వ్యవహారాల్లో ఇలాంటివి సర్వసాధారణం. దాన్ని ప్రజలే పెద్దగా పట్టించుకోరు. ఇలా పెద్దగా పట్టించుకోవలసిన అవసరంలేని వాటిలో ఇటీవల డాక్టరేట్ల కొనుగోలు కూడా చేరింది.

లేని విశ్వవిద్యాలయాల పేరుతో కొందరు డాక్టరేట్లు పంచేస్తుంటే చాలామంది 'లా' ఒక్కింతయు లేని వాళ్ళు డబ్బులు కట్టి డాక్టరేటు పుచ్చేసుకుని సన్మాన సభలు పెట్టుకుంటున్నారు. నిన్నటి దాకా మనతో భుజం మీద చెయ్యి వేసి తిరిగిన వ్యక్తి తెల్లవారేసరికి గౌరవడాక్టర్ అయిపోతున్నాడు. ఇప్పుడు అలాంటి డాక్టరేట్లు చక్కగా సిగ్గులేకుండా పుచ్చేసుకుంటున్నారు. మనమే ఇలా ఉంటే ప్రభుత్వం చేసే వాళ్ళు ఇంకెలా వుండాలి? న్యాయమూర్తుల నియామక విషయంలోనూ ఈ 'మనోళ్ళు' సిద్ధాంతం నడుస్తోందని, కొలీజియం అభాసు పాలౌతోందని అత్యున్నత న్యాయస్థానమే ఆమధ్య వాపోయిందొకసారి.

'మనోళ్ళ'ని 'వేనోళ్ళ'తో తిననిచ్చే ఈ ప్రక్రియను చూస్తోంటే, మృచ్ఛకటికం

నాటకంలో రాజశ్యాలకుడు (రాజుగారి బామ్మర్ది) లాంటి వాళ్ళు ప్రతీ యుగంలోనూ ఉంటారనిపిస్తోంది. అలాంటి వాళ్ళ గురించి పై పద్యం గొప్పగా వ్యాఖ్యానిస్తుంది. "మహాకవి పండితులు కింద కూర్చోవాల్సి వచ్చిందని ఏమీ చింతించకండి... గండ భేరుండ మదేభ సింహ నికురుంబములు చెట్టు కింద కూర్చుంటే, ఒక కోతి చెట్టు చిటారుకొమ్మ మీద కూర్చుని ఉంటుంది. అంత మాత్రాన కింద కూర్చున్న కవి పండితులకు లోటు జరిగిందేమీ లేదని ఊరడిస్తాడు. దీనికి ఇంతకన్నా అర్ధ వివరణ అక్కర లేదు.

భాస్కర శతకం వ్రాసిన మారయ (మారవి) వెంకయ్య కవి 1550-1650 మధ్యకాలంలో వాడు. శ్రీకాకుళం ప్రాంతంలో నివశించిన కళింగ కవి. ఆ ప్రాతంలో ఉన్న అరసవిల్లి సూర్యదేవాలయంలోని సూర్యభగవానుడిని సంబోధిస్తూ భాస్కర శతకం వ్రాశాడు. అందులోని నీతి బోధలవల్ల, కవిత్వ సౌందర్యము వల్లా ఈ శతకం బాగా ప్రాచుర్యం పొందింది.

కవి ఏ కాలానికి చెందిన వాడైనా రేపటి యుగానిక్కూడా వర్తించే విధానంలో సార్వకాలీనంగా వ్రాసిన వాడు చరితార్థుడు. అందుకే 500 యేళ్ళ తరువాత కూడా ఈ వెంకయ్య కవిత గొప్ప ఉదాహరణగా నిలిచిపోతుంది.

# కొనుక్కున్న పురస్కారాలు

*"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్*
*సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే*
*సమ్మెటవాటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ*
*బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్"*

(ఆంధ్ర మహా భాగవతం ప్రథమ స్కంధం)

వ్రాసే వాడికి వ్రాస్తున్నదాని మీద భక్తి ఉండాలి. ఆ భక్తిలో నిబద్ధత ఉండాలి. మనసా, వాచా కర్మణా తాను చూసి, అనుభవంలో గ్రహించి, నిజమని నమ్మిన దాన్నే వ్రాసే రచయితల భక్తి గొప్పది. అది సమాజ భక్తి.

తమ అనుభవంలో లేని, తాము చూడని, తమకు నిజంగా తెలీని విషయాలను డబ్బాలో రాళ్ళు పోసి ఆడించి నట్టు టీవీల్లో గలగలా గడగడా అప్ప జెప్పే ప్రవచన కారుల భక్తి కన్నా నిస్సందేహంగా సమాజ భక్తి గొప్పది. దేవుడి గురించి చెప్పీ చెప్పీ తామే దేవుళ్ళుగా మారిపోతుంటారీ భక్తివేత్తలు.

కానీ, సమాజభక్తిపరుడు మనిషి గురించి చెప్పీచెప్పీ తానూ మనుషుల్లో మనిషిగా మారిపోతాడు. సాహిత్యం అలాంటి సమాజభక్తి ప్రపత్తులున్నవాళ్ళ వలనే వర్ధిల్లుతుంది. పోతనగారి భక్తిని ప్రవచనకారుల భక్తి స్థాయికి దించడం ఒక మహోన్నత సాహితీ మూర్తిమతను తక్కువ చేయటమే అవుతుంది.

పోతన మనుజేశ్వరుణ్ణే అధము దన్నాడుగానీ, మనిషిని అనలేదు. అధములైన ప్రభువులకు కృతిని అంకితా న్నిచ్చి, వాళ్ళ పాద సేవలు చేస్తూ అగ్రహారాలు, పల్లకీ సేవలు, సొమ్ములు పుచ్చుకుంటే, రేపు శరీరాన్ని వదిలి పెట్టాక కాలుడి (యముడి) చేతికి చిక్కి సమ్మెట వేటులు పడతాయి. అంతకన్నా లోకానికి మేలుచేసే రచన చేసి ఆ దేవుడికే అంకితం ఇచ్చుకోవటమే గొప్ప దంటాడు బమ్మెర పోతన.

నాటి నుండి నేటిదాకా మనుజేశ్వరులు అధమాధమ స్థితిలోనే ఉన్నారు.

సమాజ భక్తుల్లో ప్రభుత్వ వ్యతిరేకత అలానే కొనసాగుతోంది.

మారిందల్లా సాహిత్య ముఖ చిత్రమే!

పెంపు చేసి పునర్ముద్రించిన పాత పుస్తకం (Revised Edition of a Old Book) లాంటిది కొత్త సమాజం! నిన్నటి మనుషులు నేటి సామాజిక గ్రంథానికి ఆకరాలు(రిఫరెన్సులు)! పాత సమాజంలో మనం కొత్తగా జీవిస్తున్నాం.

కుండలో నీళ్ళు తాగిన మనమే ఫ్రిజ్జులో నీళ్ళు తాగుతున్నాం. చద్దన్నం తిన్న మనమే పిజ్జాలు తింటూన్నాం. వ్యక్తులుగా మనమే మార్పుకు సాక్షులం. కర్తలం కూడా! కాలాన్ని మారుస్తున్నది మనమే! ఏమారుస్తున్నదీ మనమే!

పాత దారిలో కొత్త బస్సెక్కి ప్రయాణ చేస్తుంది నాగరకత. ఆధునీకరణ ప్రయత్నంలో వ్యక్తులు బస్సులు మారతారే గానీ, దారులు మార్చలేరు. కొత్తదారులు వేస్తూ, వేసేవారికి తోడ్పడేది సాహిత్యం.

రచయిత తన రచనలో ఈ లక్ష్యరేఖ మీద నిలబడే ప్రయత్నం చేస్తాడు.

రచయిత తనకు తానుగా శూన్యం లోంచి పుట్టుకు రాడు. గాఢంగా చదవక పోయినా ప్రతి రచయిత పైనా పూర్వ సాహిత్య ప్రభావం ఉంటుంది. దాన్లోంచి రచయిత కొత్తదారిని కూడగట్టుకోవటానికి చెయ్యగలిగినంత శ్రమ చేస్తాడు.

పాత దారాలు, కొత్త దారాలు పడుగు పేకల్లా అల్లిన కళాత్మకమైన కలనేత చీర లాంటిది కొత్త రచన. ఈ కళాత్మక కలనేతే సాహిత్యానికి ప్రాణప్రదం. పాఠకుడు ఆస్వాదించేదీ, విమర్శకుడు కొలవ గలిగింది, కొలవ వలసిందీ ఈ కళాత్మకతనే!

ఒక రచన చేయబోయే ముందు తాను ఉద్దేశించిన పాఠకుడి స్థాయిని నిర్దేశించుకుంటాడు రచయిత. తన పాఠకుడి స్థాయికి తగ్గ భాష, శైలి, వస్తువులు ఎంపిక చేసుకొనే హక్కు రచయితకుంది. పాఠకుడితో 'త్వమేవాహ స్థితి'ని రచయిత కోరుకుంటాడు. పాఠకుడి స్థాయికి తగినట్టుగా రచన వెలువడినప్పుడే సాహిత్య ప్రయోజనం నెరవేరుతుంది.

నెరవేర్చటానికి రచయిత పడే శ్రమని పాఠకుడు గమనించ గలిగినప్పుడు ఆ రచనను ఎక్కువ ఆస్వాదించ గలుగుతాడు.

రాజాదరణ కోసం, ప్రభుత్వ పురస్కారాల కోసం వెంపర్లాడుతూ వ్రాసిన రచనల్లో ఈ స్వారస్యం కలికానిక్కూడా కానరాదు.

రాజాదరణ కోసం వెంపర్లాడే వారికన్నా డబ్బులిచ్చి పురస్కారాలు కొనుక్కునే వాళ్ళు ఎక్కువ ప్రమాదకరం.

ఆయమన్న రచన ఒక్కటీ వ్రాయని ఒక పెద్దమనిషి ఇప్పటికి 60 జాతీయ, అంతర్జాతీయ పురస్కారాలు, జీవన సాఫల్య పురస్కారాలు పొందడాన్ని చూసినప్పుడు పోతనగారు చెప్పింది నిజం కావాలనిపిస్తుంది. అలా సాహిత్యం పేరుతో నకిలీ పురస్కారాలు, అక్రమ డాక్టరేట్లు, అన్యాయపు వరల్డ్ రికార్డులు కొనుక్కునే వాళ్ళు ముసలితనం వచ్చాక ముప్పుతిప్పలు పడతారనీ, యముడు వీళ్ళని కాల్చుకు తింటాడనీ పోతనగారు శాపం పెట్టాడు.

సాహిత్యం పట్ల నిజమైన భక్తి ఉన్న వాళ్ళు ఇలా డబ్బులెట్టి కొనుక్కున్న, లేదా అంకితం ఇచ్చి డబ్బులు పుచ్చుకున్న పాపాన్ని సరిచేసుకుంటే నరకలోకపు కష్టాలు తప్పుతాయి.

రచయిత తన రచనతో రాణించాలే గానీ, నకిలీ పురస్కారాలతోనూ, పెట్టుడు బిరుదులతోనూ కాదు!

అలాంటి రచయితల రచనలు జగద్ధితం అంటే లోకహితం కాలేవని పోతన గారి అన!

# గడ్డం నీతి

*"అహమేక శత వ్యాఘ్రాన్*
*పంచవింశతి కుంజరాన్*
*ఏక సింహం నభక్ష్యామి*
*గడ్డం వపనముత్యతే"*

(చాటువు)

మేకపోతు గాంభీర్యంలో ఒక రాజసం ఉంటుంది. లేడి కళ్ళలో అమాయకత్వం తాండవిస్తుంది. గుడ్లగూబ కళ్ళలో భయానక రౌద్ర రసాలు కొట్టొస్తాయి. కుక్క చూపుల్లో అనుమాన ధృక్కులు కనిపిస్తాయి. దేని పద్ధతి దానిది. చూపుల్ని బట్టి గుగణాలను ఊహించవచ్చు.

గోవిందరాజుల సుబ్బారావు గారిని "మీరు బాలనాగమ్మ సినిమాలో మాంత్రికుడిలా అలా ఎలా నడవగలిగారు?" అనడిగితే, "నా నడకే అంత!" అన్నాడట ఆయన. ఈ జీవులూ అంతే! వాటి నడత కూడా అంతే!

మేకపోతొకటి మేస్తూ మేస్తూ మందలోంచి తప్పిపోయింది. అంతలో పెద్ద గాలివాన రావటంతో అది ఒక సింహం గుహలో దూరింది. అదృష్టం కొద్దీ ఆ సమయంలో సింహం లేదక్కడ. చలికి వణుకుతూ అది గుహలో అట్లానే ముడుచుకు కూర్చుంది. అంతలో సింహం వచ్చి లోపలేదో జంతువుందని పసిగట్టి భయపడింది. సింహాన్ని చూసే సరికి మేకపోతుకి పై ప్రాణాలు పైనే పోయినట్టయ్యాయి. ఆ రెండు జంతువులకూ ఒకేసారి ప్రాణభయం పట్టుకుంది.

ఆచి తూచి వ్యవహరిస్తూ, సింహం ఒక అడుగు వెనక్కి వేసింది. మేకపోతు మాత్రం భయం కనపడనీయకుండా గడ్డం బాగా కనిపించేలా ముట్టిని ముందుకు చాచింది. ఇంత గడ్డం పెంచిన జంతువుని సింహం ఎప్పుడూ చూడలేదు. పాతాళభైరవిలో నేపాలమాంత్రికుడి శక్తులన్నీ వాడి గడ్డంలో ఉన్నట్టే, లోపలున్న ఈ జంతువు గడ్డం కూడా శక్తులు కలిగిందేమోనని దానికి అనుమానం వేసింది.

మేకపోతు గంభీరంగా ఇలా అంది: "ఇప్పటికి ఓ వంద పెద్దపులుల్ని తినేశాను. పాతిక ఏనుగుల్ని మెక్కేశాను. ఒక సింహాన్ని తిన్నాక ఇంక ఈ గడ్డం గీయుంచుకోవాలనుకుంటున్నాను. ఇన్నాళ్ళకి నాకు నువ్వు దొరికావు" అని!. ఇదీ పైన పేర్కొన్న చాటువు సారాంశం.

ఈ గడ్డపోడు నిజంగానే తినేస్తాడని భయంతో తోక ముడుచుకుని పరుగులు పెట్టింది సింహం. బతుకుజీవుడా అని మేకపోతు కూడా గుహలోంచి బయటపడి ప్రాణాలు దక్కించుకుంది. గడ్డాలున్న ప్రభువులకు ఈ సౌలభ్యం ఉంటుంది. గడ్డాల్లేని ప్రతిపక్ష నాయకులు వాళ్లముందు బలాదూరౌతారు.

అలాగని ఏ ప్రతిపక్ష నాయకుడైనా కుర్రతనం కొద్దీ గడ్డం పెంచితే, గడ్డమూ తలకాయి మాసిన వాడిలా కనిపిస్తాడే గాని, హుందాతనం ఉండదు. దేశంలో మేధావులు కూడా ఇలానే గడ్డాలు పెంచుకుంటారు. కొందరు నూరు ప్రభుత్వాలను కూలగొట్టి గానీ గడ్డం గీయించుకోను అని ప్రతిన బూనినవాడిలా నిక్కచ్చిగా ఉంటారు. చాలామందికి గడ్డం అడ్డం కాదు. ఐదేళ్ళయ్యాక ఈ పార్టీ ప్రభుత్వాలన్నీ కూలిపోతాయి. ఆ పార్టీ ప్రభుత్వాలు ఏర్పాటు చేసుకుంటుంది. ఏదైనా ఐదేళ్ళ ముచ్చటే కదా! వచ్చే ఎన్నికలనాటికి సీను రివర్సు కావచ్చు, కాకపోవచ్చు. వాన రాకడ ఓటరు పోకడా అర్థం కాదు. అర్థం అయినట్టే కనిపిస్తుంది. అక్కడే తప్పులో కాలేస్తారు రాజకీయ నాయకులు. ఓటరు గడ్డం పెంచినా పెంచకపోయినా మేకపోతు గాంభీర్యం ప్రదర్శించటం ఎప్పుడూ అవసరం.

ఎగ్జిట్‘పోలు వ్యాఖ్యాతలు అంతా తాము చెప్పినట్టే జరుగుతుందన్నట్టు ఫలానా పార్టీ వచ్చేస్తోందని ఊపునిస్తారు. ఫలానా వారి పని అయిపోయిందంటారు. ఇలా జరగటానికి తమ ప్రమేయం ఏమీ లేదనీ, ఓటరు తీర్పు అలా ఉండబోతోందనీ గాంభీర్యాన్ని నటిస్తారు. అసలు లెక్కలు తెలిసిన ఓటర్ మాత్రం చేత్తో గడ్డం నిమురుకుని నవ్వాడుకుంటాడు. ఆ నవ్వు పైకి కనిపించకుండా గడ్డం కమ్మేస్తుంది. ఆ ముఖంలో రాయికట్టిన గాంభీర్యం మాత్రమే కొట్టొస్తుంది.

ఉన్నను లేకున్నను పై
కెన్నడు మర్మంబుఁ దెలుప నేగకుమీ నీ
కన్న తల్లిదండ్రుల యశం
బెన్నఁబడెడు మాడ్కిఁదిరుగు మెలమిఁ గుమారా! అని కుమార శతకంలో ఒక హితోక్తి ఉంది. “పైకెన్నడు మర్మంబు తెలుపనేగకుమీ” అన్నాడు కవి. ముఖంలో ఫీలింగులు కన్పించకుండా గుంభనంగా వ్యవహరించాలని దీని భావం.

ముఖం ముఖపుస్తకం లాంటిది. “ఫేసీజ్ ఇండెక్స్ ఆఫ్ మైండ్” అనికదా ఆర్యోక్తి. అందుకే దాన్ని ఫేసుబుక్కు అని పిలుస్తున్నారు. అది తెరిచి చూస్తే అందులో ఇష్టారాజ్యంగా మనసులోని మర్మాలు ఆడితేలుతుంటాయి. లోకం ముందు కక్కలేనివన్నీ అక్కడ వెళ్ళగ్రక్కవచ్చు.

పత్రికల్లో ప్రచురించాలంటే ఒక ఎడిటరుంటాడు. ఆ రచనను ప్రచురించటమో, మానటమో సవరించటమో చేసే యంత్రాంగం ఉంటుంది. ముఖపుస్తకానికి అలాంటి ఇబ్బందులుండవు. ఇష్టారాజ్యంగా రాసి పారేసే సౌలభ్యం ఉంటుంది. అడిగే వాడుండడు. సభల్లో విన్నా, వినకపోయినా చప్పట్లు కొట్టినట్టు, ముఖపుస్తకంలో ఏది రాసినా అక్షరం చదవకుండా వందల లెక్కలో లైకులు కొట్టే పాఠకులుంటారు. ఈ పాఠకుల్ని ఫ్రెండ్సని సాంకేతికంగా పిలుస్తారు.

ముఖపుస్తకంలో ప్రతి స్నేహితుడూ రచయితే! రోజుకో కవిత చొప్పున ఎడాపెడా రాసేసి పాఠకులను తట్టి లేపాలని ఈ స్నేహరచయితల తాపత్రయం.

స్నేహానికిగల జిడ్డు అనే అర్థాన్ని ఇక్కడ నేను ఉద్దేశించట్లేదని మనవి. స్నేహ రచయిత వ్రాసినదాన్ని స్నేహపాఠకుడు ఓ లైక్ కొట్టి, లేకపోతే, వారేవా అని ఓ కామెంటు పెడతాడు.

మార్కెట్లో అమ్ముడు పోని సరకులా ముఖపుస్తకంలో చదవబడక కేవలం చూడబడ్డ అక్షరాలు లైకులమధ్య నలిగిపోతుంటాయి.

ఇదంతా మనసులోని మర్మాలను వెళ్ళగక్కు కున్నందువలన కలిగే దుస్థితి.

అందుకే కుమార శతకకర్త పైకి నీ మనసులోని మర్మం తెలీకుండా మేకపోతు గాంభీర్యం అలవాటు చేసుకోవాలని చెప్పాడు. దానివలన నీకీర్తి, నిన్ను కన్న తల్లిదండ్రుల కీర్తి వాసికెక్కుతుందన్నాడు. ముఖపుస్తకానికి ఆ అవకాశం లేదు కదా!

మేకపోతు గడ్డం కూడా మనసులోని మర్మాలను దాచుకోవాలనే నీతి చెప్తోంది. ప్రకృతిలోంచి పాఠాలు నేర్చుకోవటం అంటే ఇదే!

అరిచి సాధించాలనుకునే వాడికన్నా అరవకుండా వాతపెట్టేవాడు మేకపోతు గడ్డాన్ని ఆదర్శంగా తీసుకున్నట్టు!

గడ్డం నీతి మనకు చాలా విషయాలు నేర్పుతుంది.

# గాలివాటు పాలన

క్షీరాబ్ధిలోపల గ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగఁ
జూతఫలంబుల జుంబించు చిలుక
జాతిబూరుగుమ్రానిపండ్లు గన్గొనునె
రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర
మాకాంక్షసేయునే చీకటిఁ ద్రావ
విరిదమ్మివాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల
నెఱుఁగునే యల దిగ్గజేంద్రంబు కొదమ
యెఱపంది చనుసీక? నెఱుఁగవు గాక

బసవన్న బిజ్జలుడనే రాజు దగ్గర మంత్రి. ఆ రాజుగారు బసవన్న ఎంత చెబితే అంతగా పాలిస్తున్నాడు. సిబ్బంది జీతాలు, రాజుగారి పేరుతో జరిపే దానధర్మాలు అన్నీ బిజ్జలుడే స్వయంగా పర్యవేక్షిస్తున్నాడు. ఒకరోజు ఒక జంగముడొచ్చి నీ దగ్గరున్న డబ్బంతా నాక్కావాలని అడిగాడు. బసవడు మారుమాట్లాడకుండా కోశంలో ఉన్న డబ్బంతా ఇచ్చేశాడు. బసవడంటే గుర్రుగా ఉన్న కొందరు మంత్రులు దీన్ని రాజుగారి దగ్గరికి మోశారు. "చెప్తే కొండెం చెప్పినట్టు, చెప్పకపోతే రాజద్రోహం చేసినట్టు, అయినా చెప్తున్నాం...ఆ పైన మీ ఇష్టం" అన్నారు.

రాజుక్కూడా కోపం వచ్చింది. "బసవా! కోశం అంతా పాడుచేశావు. నీ మంత్రిత్వం నాకక్కరలేదు, నా డబ్బు కట్టి వెళ్ళిపో" అన్నాడు. అప్పుడు బసవడు చెప్పిన మాటలివి:

" రాజా! శివభక్తి అనే కల్పతరువుని, కనకాచలాన్ని, కామధేనువుని, చింతామణిని ఆశ్రయించిన పరమభక్తుడు పరధనాన్ని ఆశిస్తాడా? పాలసముద్రం లోపల విహరించే హంస నీటికుంటల్లో నీళ్ళు త్రాగటానికి ఇష్టపడ్తుందా? రాజసింహం గడ్డి మేస్తుందా? మామిడి పండ్లను తినే చిలుక బూరుగపండ్ల కోసం ఆశపడ్తుందా? వెన్నెలని ఆబగా త్రాగే చకోరం చీకటిని త్రాగటానికి ఇష్టపడ్తుందా? పూలవిరిలో మకరందాన్ని గ్రోలే తేటి గడ్డిపూలమీద వాల్తుందా? దిగ్గజేంద్రం పందిచనుబాలు త్రాగుతుందా? లింగ సదర్థుల ఇళ్ళలో ప్రియసేవకుడి నైన నాకు నీ డబ్బొక లెక్కా? నీ డబ్బు నేనాశించను. నేనిచ్చింది నీ డబ్బు కాదు, ఆ డబ్బునంతా ఇచ్చింది అయ్యలే! వారిచ్చింది వారికే ఇచ్చేశాను. నీ ఖజానాలో డబ్బు లెక్క చూసుకో నీ లెక్కలకు సరిపడే ఉంటుంది"

అన్నాడు. పెట్టెలు తెరిచి చూస్తే కన్పించిన డబ్బు కోశాగారం లెక్కలకన్నా ఎక్కువే ఉంది.

పాల్కురికి సోమనాథుడి ద్విపద రచనా విధానాన్ని తరువాత కాలంలో వచ్చిన పోతనగారు విష్ణుపరంగానూ, శ్రీనాథుడు శివపరం గానూ అనుకరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. సోమనాథుడు కాకతీయ ప్రతాపరుద్రుడి కాలానికి (క్రీ. శ. 1292-1326) చెందిన వాడు కాగా, బసవడు క్రీ.శ. 1168 దాకా జీవించి ఉన్నాడు.

సాహిత్యంతో పరిచయం ఉన్నవారికి ఈ "క్షీరాబ్దిలోపల గ్రీడించు హంస గోరునే పడియల నీరు ద్రావంగఁ" ద్విపద బాగా తెల్సు. ఇది చదివితే పోతనగారి "మందార మకరంద మాధుర్యమునఁదేలు మధుపంబు వోవునే మదనములకు" అనే పద్యం తప్పక గుర్తుకొస్తుంది.

స్వచ్ఛమైన కవిత్వసంపద మనకు పాల్కురికి సోమనాథుడి బసవపురాణం, పండితారాధ్యుల చరిత్ర మరికొన్ని ఇతర రచనల్లో కనిపిస్తుంది.

"వడిఁబాఱు జలమున కొడలెల్లఁ గాళ్ళు
పడిగాలు చిచ్చున కొడలెల్ల నోళ్ళు
వడివీచు గాడ్పున కొడలెల్లఁ దలలు
వడిఁజేయు బసవన కొడలెల్ల భక్తి- వేగంగా ప్రవహించే నదికి ఒళ్ళంతా కాళ్ళే! పడి కాల్తున్న కార్చిచ్చుకు ఒళ్ళంతా నోళ్ళే! వడిగా వీచే గాడ్పులకు ఒళ్ళంతా తలలే! భక్తుల సందడి చేసే బసవనికి ఒళ్ళంతా భక్తే" అని 800 యేళ్ళ క్రితం వ్రాయగలిగిన మహాకవి సోమన. శివభక్తి పరవశం అంటే ఎలా ఉంటుందో ఈ కవిత్వం చదివితే అర్థం అవుతుంది. బసవ పురాణంలో బెజ్జమహాదేవి, కన్నప్ప, లాంటి అగ్రవర్ణేతర భక్తులను ప్రధాన పాత్రలుగా అద్భుతమైన కథలు వ్రాశాడాయన. జనాలకు తెలియటం కోసం కావాలని జనం భాషలో ద్విపద ఛందస్సులో వ్రాశాడు. జానుతెనుగు ఆయన విధానం.

వర్షాఫలం (వడగళ్ళు), వాతపూర్ణాలు(గాలిగుమ్మటాలు), వ్యాసహస్తాలు(సీలింగ్ ఫ్యాన్లు), తాటి మాలలు (తాడు- జంధ్యం- వేసుకుని కులతత్త్వంతో అంటరాని తనాన్ని పాటించేవాళ్ళు), రాగుంజు పోగుంజులాట (టగ్ ఆఫ్ వార్ ఆట) మ్రింగన గౌండి (లంచాలు మింగేవాడు) ఇలాంటి పదాలు ఆయన సృష్టి.

పాలకుడి దగ్గర నమ్మకమైన మంత్రులు ఉండాలి. ఆ మంత్రుల మధ్య సఖ్యత ఉండాలి. పాలకుడికి స్థిరత్వం ఉండాలి. అధికారి కన్నా ప్రభువు లేదా పాలకుడు ఎక్కువ స్థితప్రజ్ఞుడై ఉండాలి. లేకపోతే అనుచరగణం పాలకుణ్ణి అడ్డం పెట్టుకుని

ఆడించేస్తారు. నిజాయితీగా ఉండటమే కష్టం. ఉండి నెగ్గుకు రావటం మరీ కష్టం. బసవడు బిజ్జలుడి దగ్గర ఎదుర్కొన్న పరిస్థితి అదే!

కూళల పడుపుకూడు లాంటిది రాజకొలువని పోతనగారు ఈసడించింది అందుకే! రాజాదరణ కోసం అనుక్షణం భయంతో బ్రతకాల్సిన అవసరం లేదని, సత్కవుల్ హాలికులైన నేమి?" అని పోతన గారు గట్టిగా అనటానికి ఇలాంటి ఉదంతాలే కారణం.

ముఖ్యమంత్రి సహాయ నిధిలాగానే, అతని కాలంలో ఆధ్యాత్మిక పరంగా వచ్చిన ధర్మనిధిని బసవడు రాజుగారి కోశానికే చేర్చాడు. పన్నులు, ఇతర మార్గాల ద్వారా వచ్చిన వసూళ్ళను వేరే చిట్టాలో వ్రాయించాడు. ధర్మనిధి సొమ్మును మాత్రమే ధార్మిక కార్యక్రమాలకు వెచ్చించాడు గాని, ప్రజాధనాన్ని వెచ్చించలేదని ఈ కథ ద్వారా తెలుస్తుంది.

ఈ కథలో ఒక నీతి ఉన్నది. ప్రభుత్వానికి ఒక సాంస్కృతిక విధానం ఉండాలి. దాన్ని అమలుపరిచే పటిష్టమైన యంత్రాంగం ఉండాలి. దానికి సంబంధీకులు ఆ విభాగాన్ని నిర్వహించేవారుగా ఉండాలి. తన విధానానికి పాలకుడు కట్టుబడి ఉండాలి. గాలివాటుగా పోతుంటే జాతి సంస్కృతికి తీరని అపకారం జరుగుతుంది...అని! నేటి పాలకులకు ఇది అవసరమైన సందేశమే!

# గిజిగాడి గూళ్ళు

*"అందమున నీకు నీడగు నందగాడు*
*గృహవినిర్మాణమున నిన్ను గెలుచువాడు*
*వైభవంబునఁ బోలు దేవతల లేఁడు*
*లేఁడురా గిజిగా! మొనగాఁడ వోయి"*

(జాషువా గిజిగాడు ఖండిక నుండి)

చెరువులోకి వంగిన తుమ్మ కొమ్మలకో, ఈత చెట్టుకో వేలాడుతున్న ఉయ్యాల ఇల్లు గిజిగాడి గూడు. అందులో ఆ బుల్లిపిట్ట రాజసం ఒలక బోస్తుంది. నింగికీ నేలకీ మధ్య వేలాడే ఆ గూళ్లలో, పార్టీషన్ ఉన్న గదులు, పడగ్గది ఏర్పాట్లూ అన్నీ ఉంటాయి. పాముల బారినుండి గుడ్లను రక్షించుకోవటానికి గిజిగాడి గూళ్లలో ఏర్పాటు వుంటుంది.

కాకులు దాడి చేస్తే, గిజిగాళ్ళు పెద్దపెట్టున అరుస్తూ, తుర్రున పారిపోతాయి. బుల్లిపిట్ట బుల్లిపిట్ట తుర్రుమన్నదీ అనే పాట దీన్ని బట్టే వచ్చింది.

గిజిగాడి గృహనిర్మాణ కౌశలం, దాని సాంకేతిక నిపుణత ఆశ్చర్యం కలిగిస్తాయి. మగపక్షి, గూడు అల్లడం పూర్తియ్యాక ఆడపక్షికి సంకేతం పంపుతుంది. ఆడపక్షికి ఈ గిజిగాడు అల్లిన గూడు నచ్చితే ఓకే చెప్తుంది. ఓకే అవకపోతే గిజిగాడు ఆ గూడుని వదిలి వేరే గూడు అల్లటం మొదలెడుతుందట. గూళ్ళు అల్లడమూ, పిల్లలకి ఆహారం నోటికందించడమూ, శత్రువుల్ని ఎదుర్కోవడమూ, ఆటలూ... పాటల్తో గిజిగాడు జీవితాన్ని బాగా ఎంజాయి చేస్తుంది. లోపలిగోడలకు బంకమట్టి అద్ది గూటికి బలాన్ని కలిగిస్తుంది. మిణుగురుపురుగులను తెచ్చి ఆ బంకమట్టికి అతికించి గూటిని చీకట్లోకూడా ప్రకాశించేలా చేస్తుందట

జాషువా గారు గిజిగాడు మీద చక్కని పద్యాలు వ్రాశారు, వాటిలో పైన పేర్కొన్న పద్యం ఒకటి.

అందంలో నీకు సరి రాగల అందగాడు, ఇల్లు కట్టే నేర్పరితనంలో నిన్ను గెలవగలవాడు ఆ బ్రహ్మ దేవుడు ఒక్కడే! గిజిగాడా! మొనగాడా! అని కీర్తించారాయన.

"తేలిక గడ్డి పోచఁలను దెచ్చి, రచించెద వీవు తూఁగటుయ్యేల గృహంబు, మానవుల కేరికి సాధ్యముగాదు, దానిలో జాలరు, లందులో జిలుఁగు శయ్యలు నంతిపురంబు లొప్పగా మేలు భళీ! పులుంగుటెకి మీదవురా గిజిగాఁడ? నీడజా!" అంటూ గిజిగాణ్ణి మెచ్చుకుంటారు కవి! లేత గడ్డి పోచలు తెచ్చి గిజిగాడు అల్లిన తూగుటుయ్యాల ఇళ్ళు రాజుల అంతఃపురాన్ని తలపిస్తాయట.

గిజిగాడు తన గూడు వదిలీ రాకున్నాడు సూరీడు రాలేదని
కొలనీలో కమలాలు తలదించుకున్నాయి పొద్దు పొడవలేదనీ" అని రాజన్న వ్రాసిన పాట ఇక్కడ గుర్తుకొస్తుంది!

భారత దేశంలో అత్యంత ప్రాచీన కాలంలోనే ఇళ్ళు కట్టే విద్యలో తెలుగు వాళ్ళు మొనగాళ్ళు. ఫ్రాంక్లిన్ సి. సౌత్‘వర్త్ అనే భాషావేత్త నైలూ నుండి బయలుదేరిన మూలద్రావిడ ప్రజలు బంగాళాఖాతం గుండా కృష్ణా, గోదావరి ముఖద్వారాల లోంచి తెలుగు నేలమీద ప్రవేశించారనీ, ఇక్కడ స్థిరపడ్డారని, ఇక్కణ్ణించే వాళ్ళు కర్ణాటక, మహరాష్ట్ర, గుజరాత్‘ల మీదుగా సింధు నగరాలకు చేరారనీ, సింధునగరాల నిర్మాణంలో ముఖ్య పాత్ర పోషించారనీ పేర్కొన్నారు.

శాతవాహనులకు పూర్వం పటిష్టమైన కోటలు గల ఆంధ్రరాజ్యాల గురించి విదేశీ యాత్రికులు కూడా పేర్కొన్నారు. ఉత్తర పారశీక (పర్షియా) దేశంలో అంక్షునదీ తీరంలో ఆంధ్రులు నివసించినట్టు కొన్ని పురాణాల్లో ఉంది. వింధ్యపర్వత శ్రేణుల్లో ఆంధ్రులు నివసించినట్టు ఐతరేయ బ్రాహ్మణంలో ఉంది. గంగా తీరంలో ఉన్నట్లు మరికొన్ని గ్రంథాల్లోఉంది. ఇవన్నీ నిజాలే కావచ్చు. ఈ అన్ని చోట్లా ఆంధ్రులు నివశించారు. సింధునాగరికతలో కూడా నివసించారు, నివసించటమే కాదు అక్కడ భవనాలు, రోడ్లు, మునిసిపాలిటీ తరహా వ్యవస్థ కలిగిన నగరాలే నిర్మించారు. లేదా అవి కట్టిన వారితో భాగస్వాములయ్యారు.

తెలుగువారికి ఈ నిర్మాణ కళా కౌశలం ఎక్కడిది...? గిజిగాణ్ణి చూసి నేర్చుకుని ఉండాలి. ఎంత నేర్చుకున్నా ఇప్పటి మన అపార్ట్‘మెంట్లలోకన్నా గిజిగాని గూడులో ఎక్కువ సౌకర్యాలు ఉంటాయట. సుఖంగా, విలాసవంతంగా, వేరొకరికి ఎలాంటి అపకారమూ చేయకుండా బతకటం ఎలాగో గిజిగాడు మనకు నేర్పుతోంది.

ఈత చెట్టు కొమ్మ ఉంటే చాలు, గూడు కట్టేయ గల నేర్పరి గిజిగాడు. "కాలు బొటనవ్రేలు మోపేందుకు అవకాశం ఇవ్వండి చాలు, మహా సౌధాన్ని నిర్మిస్తాను" అని పి వి నరసింహారావు అన్నట్టు అప్పట్లో హిందూ దినపత్రికలో ఒక కార్టూన్ వచ్చింది. ఆ పనిని అక్షరాలా గిజిగాడు మాత్రమే చేయగలడు.

ఊరుమ్మడి సొత్తు చెరువుల్ని కబ్జా చేసినా, బావుల్ని పూడ్చేసినా, చెట్లను నరికేసినా, కరెంటు తీగల మీద కూడా తన వ్రేలాడే ఇంటిని కట్టగలడు గిజిగాడు. బహుశా పర్యావరణాన్ని మనిషి నాశనం చేస్తున్నాడని మనిషికి నిరసన తెలపటానికి ఈ బుల్లిపిట్ట అలా ప్రమాదకరంగా కరెంట్ తీగలమీద ఇంటి నిర్మాణం చేస్తోందా...? బ్రిటిష్ వాడే నయం...కొద్దిపాటి నిరసన తెలిపినా అతిగా స్పందించే వాడు. ఈ యుగపు నేతల్లో అలాంటి స్పందన ఏదీ లేదనటానికి కరెంటు తీగలకు వ్రేలాడే గిజిగాడి గూళ్ళే సాక్ష్యం

# 'గిట్టు'బాటు

*"సర్వేక్షయాంతనిచయాఃపతనాన్తాఃసముచ్ఛ్రయాః*
*సంయోగావిప్రయోగాన్తామరణాంత చ జీవితమ్"*

*(వాల్మీకి రామాయణం అయోధ్యకాండ)*

"ఒక్కసారి మంత్రిచేసి చూడు గణనాథా! నువ్వు ఓడకుంటే ఒట్టుపెట్టు గణనాథా!" అని పాట ఉంది. మంత్రి పదవి వచ్చినవాడు మళ్ళీఎన్నికల్లో తిరిగి గెలవటం అరుదు. ఇప్పుడు "ఒక్కసారి యమ్మెల్లే చేసి చూడు గణనాథా!" అనిపాడాల్సిఉంది. యమ్మెల్లేల దాకా ఎందుకు...వార్డుమెంబర్లదీ అదే పరిస్థితి. ఈ సంగతి ప్రజల కన్నా గెలిచినవాడికి ఎక్కువ తెలుసు. అందుకనే దీపం ఉండగానే 'గిట్టుబాటు' చూసుకుంటారు.

భార్య శీలం గురించి అందరికన్నాఆఖరికి తెలిసేది భర్తకే నని ఆంగ్లసామెత. గెలిచిన వాడి అసలు రూపం గురించి అందరికన్నా ఆఖరికి తెలిసేది ఓట్లేసిన వాళ్లకే! ఇది ఆధునిక తెలుగు సామెత.

రామాయణం అయోధ్యకాండ (105-16)లో ఈ శ్లోకం చాటుతున్న సత్యం ఇదే! ఎంత పోగుచేసినా డబ్బు చివరికి నశించే స్వభావాన్నే కలిగి ఉంటుంది. పదవి కూడా అంతే నంటుంది ఈ రామాయణ శ్లోకం. ఎంత ఉన్నత పదవి పొందిన వాడైనా పతనం కాక తప్పదు. పుట్టినవాడు గిట్టకా తప్పదు.

ఈ శ్లోకంలో మొదటి భాగం డబ్బు గురించి చెప్తుంది. డబ్బు పోగు చేయటానికీ, పొదుపు చేయటానికీ చాలా తేడా ఉంది. పోగు చేసింది డాబు. అది అశాశ్వతం. పొదుపు చేసింది శక్తి. శక్తి నశించదు. ఒకరూపంలోంచి ఇంకో రూపంలోకి మారుతుంది. పొదుపు చేసిన డబ్బుతో ఇల్లు కొనుగోలు, అమ్మాయి పెళ్ళి... ఇలా మరో రూపంలో శక్తిగా మారుతుంది. కాబట్టి పొదుపు శాశ్వతం.

మహాభారతం శాంతిపర్వంలో "లోకము చందము గనికొని / యీ కానగనగు ధనాదులెల్లను  గాల / వ్యాకులత బొంద గలయవి / గాకుందమి యెఱిగి విడుపు గడు జదురెందున్" అనే పద్యం ఉంది. మొదట మనం లోకం తీరుతెన్నులు తెలుసుకోవాలి. ఈ కనిపించే డబ్బూ, దస్కం ఇవన్నీ కాలవ్యాకులత పొందేవే! అంటే కాలక్రమంలో నశించేవే!  ఈ సంగతి తెలుసుకుని డబ్బు జబ్బు లోంచి బయటపడాలని దీని భావం.

ఇది వ్రాసినంత తేలిక కాదు, చేయటం / డబ్బు సంపాదించవద్దని ఈ పద్యం

చెప్పటం లేదు. దానికోసం ఉచ్చనీచాలు మరిచి వెంపర్లాడటాన్ని ఈ పద్యం ప్రశ్నిస్తోంది. ఈ వెంపర్లాటనే డబ్బుజబ్బు అంటారు. డబ్బుజబ్బు చేసినవాడు డబ్బు పోగు చేస్తాడు. డబ్బు ఆరోగ్యం కావాలనుకునేవాడు డబ్బు పొదుపు చేస్తాడు.

పోగయిన డబ్బుని పెనుధనం అనీ, పొదుపయిన ధనాన్ని జనధనం అనీ పిలవొచ్చు. పెనుధనం పెనుచీకటి (పెంజీకటి)లాంటిది. ఈ చీకటి డబ్బునే నల్లడబ్బు అంటున్నాం. పెనుధనం లాంటిదే పెనుపదవి కూడా! ప్రభుత్వ పదవి అనడంలోనే అంతో ఇంతో 'ఆమ్యామ్యా' ఉంటుంది. ఈ పదవుల్లో పరాకాష్ట అనదగిన పదవిని పెనుపదవి అనవచ్చు. పెనుపదవి పొందిన వాడు తిరిగి గెలవటం అరుదు.

దీన్ని, 'పుట్టినవాడు గిట్టక తప్పదు' అనటం'తో పోలుస్తాడు కవి. పోగేసిన డబ్బుతో గిట్టినట్టు, పైరవీలతో పదవి పొందిన వాడు తిరిగి గెలవకుండా గిట్టినట్టు, పుట్టినవాడు గిట్టక తప్పదని ఈ రామాయణ శ్లోక సారాంశం. "మరణాంత జీవితం" గురించి ఆలోచించ మంటుంది ఈ శ్లోకం. గిట్టక తప్పదు కాబట్టి, పుట్టుక అనవసరం అనలేము కదా! మంత్రి పదవి వస్తే మళ్ళీ గెలవటం కష్టం అని, మంత్రి పదవి వద్దనగలరా... ఎవరైనా?

. గిట్టే పుట్టుకకు గిట్టుబాటు దక్కాలంటే గిట్టిన తరువాత కూడా బతికే ఆలోచన చేయాలి! మరణాంతర జీవితం అనేది మనం చేపట్టే గొప్ప పనుల వలన సాధ్యం అవుతుంది. మరణించబోయే ముందో, మరణించగానేనో చేసే అవయవ దానాలు కూడా మరణాంతర జీవితం ప్రసాదిస్తాయి. అది అవయవ దానం పొందిన వ్యక్తుల వ్యక్తిగత విషయం. కానీ, పదవీ యోగం పొందిన వాడు 'పనిదానం' చేస్తే,లోకానికి మేలు కలుగుతుంది.

పదవి కోసం పెట్టిన ఖర్చుకు గిట్టుబాటు చూసుకోవటానికే కాలం చాలని వాడికి మరణాంతర 'గిట్టు'బాటు గురించి ఆలోచించే తీరిక ఎక్కడుంటుంది...?

రామాయణం కోరుతున్నదొక్కటే! పదవి తీసుకున్నందుకు అప్పుడప్పుడైనా 'శ్రమదానం' ప్రజలకోసం చెయ్యాలని!

# గొంతెమ్మ కోర్కె

*కృపయో కోపమొ సర్వవేత్తయగు మౌనీంద్రుండు నా కిప్పుడే*
*యుపదేశించెను మంత్ర మొం, దది నిజంబొ కాదొ యం చూరకే*
*జపముం జేసితి నిన్దలంచి- యిది యిఛ్ఛావృత్తిచేఁ గాదు నా*
*యపచారమ్మును సైపుమయ్య! కనుమయ్యా నాదు కన్యాత్వమున్!*

(కుంతి - గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి)

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి గారు 1950లో వ్రాసిన కుంతి కావ్యాన్ని ఈ పద్యంతో ప్రారంభించారు. "ఇది వరమో శాపమో నాకే తెలియట్లేదు. నా మీద ప్రేమతో ఇచ్చావో, కోపంతో ఇచ్చావో అర్థం కావట్లేదు. అన్నీ తెలిసిన ముని ఇప్పుడే ఈ మంత్రాన్ని ఉపదేశించాడు. అది నిజమో కాదో చూద్దామని ఉబలాటం కొద్దీ ఊరికే మంత్రాన్ని జపం చేసి, నిన్ను తలచు కున్నాను. అంతేగానీ, కావాలని నేను ఇలా చెయ్యలేదు. ఇది నా తప్పే! మన్నించు! నా కన్యాత్వం చెడగొట్టకయ్యా!" అని సూర్యుణ్ణి కుంతి వేడుకోవటంతో ఈ "కుంతి కావ్యం" మొదలౌతుంది.

ఆమె పంచపాండవులకు తల్లి, పాండు రాజుకు భార్య, సాక్షాత్తూ కృష్ణుడి తండ్రి వసుదేవుడికి చెల్లెలు. ఆమె అసలు పేరు పృథ. పిల్లలు లేని 'కుంతి భోజుడు' ఆమెను పెంచుకోవటం వలన ఆమె కూడా 'కుంతి'గానే ప్రసిద్ధమైంది.

ఒక రోజు దుర్వాసుడు వచ్చాడు. కుంతి ఆయనకు భక్తితో సేవలు చేసింది. అందుకు మెచ్చి, ఆ మహర్షి ఒక మంత్రాన్ని ఇచ్చి, దాన్ని జపిస్తే దేవతలే వచ్చి వశమవుతారని చెప్పాడు. దుర్వాసుడు వెళ్ళాక మంత్ర బలాన్ని పరీక్షిం చాలనుకుంది. ఎదురుగా కన్పించిన సూర్యుణ్ణి చూసి, అంతటి కొడుకు కావాలని అడగాలనుకుంది. సూర్యుడు ప్రత్యక్ష మయ్యాడు. కుంతి భయపడింది. సూర్యుడు ఆమె కన్యత్వం చెడదని మాటిచ్చాడు. కోటి సూర్య ప్రభానీకాశ దివ్యదేహుడైన కర్ణుడు అప్పటికప్పుడు పుట్టాడు. ఆ బాలుణ్ణి ఎవ్వరికంటా పడకుండా తొట్టెలో పెట్టి నదిలో వదిలి పెట్టేసింది కుంతి.

కౌరవ, పాండవ యుద్ధం సమయంలో కృష్ణుడి మాట మేరకు కుంతి చాటుగా కర్ణుణ్ణి కలుసుకుంది. తన బిడ్డ వంటూ జరిగింది చెప్పింది. తన 5గురు కొడుకుల్ని చంపవద్దని కోరింది. అర్జునుణ్ణి తప్ప ఎవరిని వధించనంటూ మాతృ ధర్మానికీ విలువిచ్చాడు కర్ణుడు. చివరికి కర్ణుడే మరణించాడు. "నా యపచార ఘోర పరిణామఫలమ్మునఁ దాను బాధ్యుడై పోయెను గర్ణుఁ డే సుకృతపూర్ణులు పోయెడి దివ్యభూమికో!" అంటూ కర్ణుణ్ని తలచుకొని కుమిలి కుమిలి ఏడ్చింది.

అవధాని శేఖర గొట్టుముక్కుల రామకృష్ణశాస్త్రి (1911-1956) గారు ఈ లఘుకావ్యాన్ని ఒక ఆత్మకథ పద్ధతిలో కుంతి కోణంలోంచి విషయ పరిశీలన చేసి గొప్పగా వ్రాశారు. ఏ ఒక్క పద్యానికి టీకా తాత్పర్యాలు అవసరం లేనంత తేలిక భాషలో వ్రాశారు. ఈ పుస్తకాన్ని విశ్వనాథవారు, డా. బెజవాద రామచంద్రారెడ్డి (పూర్వపు మద్రాసు రాష్ట్ర స్పీకర్)ముందు మాటలు వ్రాశారు.

పెళ్ళి కాకుండా పిల్లవాణ్ణి కనడం, వాణ్ణి గుట్టుచప్పుడు కాకుండా వదిలించుకోవటం, ఆ తరువాత పెళ్ళయ్యాక పతియే ప్రత్యక్ష దైవంగా మారిపోవటం, భర్త కళ్లముందే మంత్ర శక్తితోనే ముగ్గురు పిల్లల్నికనటం, మాద్రికీ మంత్రోపదేశం చేసి మరో ఇద్దరు పిల్లలకు కారణం కావటం, పంచ పాండవులను పెంచటం కోసం తాను సహగమనాన్ని త్యాగం చేయటం, యుద్ధ సమయంలో కర్ణుడితో మాట్లాడి, గుండెలో భారాన్ని దించుకోవటం...ఇంకా తెరవెనుక భాగవతాలను ఈ కావ్యంలో కవిగారు గొప్పగా వర్ణించారు. తనకు బిడ్డలను పెనుచు భారమవశ్య రూపమై నిలిచిందట. ఏమిటా అవశ్యం? ధృతారాష్ట్రుని కొడుకులకంటే మించిన వాళ్ళుగా తన ఐదుగురునీ పెంచటం!

“ఇది అన్యాయం సూర్యా! నాదే తప్పనుకుందాం... పన్నెండేళ్ళ కన్నెపిల్లని, తప్పుచేస్తే బుద్ధి చెప్పి క్షమించాలి గానీ, ఇలా చేస్తావా?” అని కుంతి నిలదీస్తుంది. “ఇంక నా బ్రతుకు ఘోరకళంక దూషితగా చెయ్యాలని చూస్తున్నావా?” అనడుగుతుంది.

అక్రమ సంబంధాలు పెట్టుకునే వ్యక్తి సెలబ్రిటీ అయితే, అతని జీవితం వ్యక్తిగతం కాబోదు. సూర్యుడు చేసిన తప్పు కుంతి గుండెలో గునపం అయ్యింది. తప్పు చెప్పవలసిన వాడు తప్పు చేయకూడదనేది ఇందులో నీతి.

ఆదపిల్లల్ని లైంగికంగా వేధించే గురువులు, ఉద్యోగినుల విషయంలో కొందరు అధికారులు, ఇంకా కొందరు పెద్దమనుషుల విషయంలో కుంతీదేవి కథ ఒక హెచ్చరిక!

కురుపాండవ దాయభాగ నిర్ణయం అనే వ్యాసంలో బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు కౌరవ సామ్రాజ్యం ధృతరాష్ట్రుడిదే గానీ, పాండురాజుది కాదనీ, రాజ్యం మీద పాండురాజుకే లేని హక్కు పాండవుల కెక్కడినుండి వస్తుందని అడిగారు. పాండవులు న్యాయస్థులనటం, కౌరవులు అన్యాయంగా కుట్ర చేసి పాండవుల ఆస్తిని కాజేశారనటం మన నమ్మకాలే తప్ప వాస్తవం కాదని ఆయన తేల్చారు. ధర్మమే గెలుస్తుందనే నమ్మకం చివరికి గెలిచిన వాడిదే ధర్మంగా మారిపోయింది.

శ్రీశ్రీ అన్నట్టు నిజం గెలుస్తుందంటే ఒప్పుకుంటాం గానీ, గెల్చిందంతా నిజమేనంటే ఒప్పుకోలేం.

కర్ణుడి విషయంలో ఇది మరీ ముఖ్యం. అతను కృతజ్ఞతకు బద్ధుడు. ఋణం తీర్చుకోవటానికి దుర్యోధనుడు ఆడమన్నట్టుగా ఆడాడు. పాండవులూ గెలుపు కోసం ఆడవలసినవన్నీ ఆడారు. తెరవెనుక భాగవతాలు ఇరు వైపులా జరిగాయి. కుంతి కూడా ఈ తెరవెనుక భాగవతంలో ఒక భాగం అయ్యింది. రామకృష్ణశాస్త్రి గారు ఈ చిన్న కావ్యంలో ఇలాంటి అనేక విషయాలను ప్రస్తావించారు.

కుంతమ్మ లేదా గొంతెమ్మ కోరిక భవిష్యత్తులో ఏ ఆడపిల్లా కోరరానిది! భారతం మొత్తంలో కుంతి కోరినవన్నీ నిజంగా కోరరానివే! కర్ణుణ్ణీ, మిగతా పాండవుల్నీ కనడం అలా ఉంచితే అర్జునుడు గెలుచుకున్న అమ్మాయిని ఐదుగురు కొడుకులూ పంచుకోవాలని కుంతి కోరింది. తిండి విషయంలో భీముడికి ఎక్కువ వాటా ఇచ్చే కుంతి, భార్యవిషయంలో మాత్రం సమాన వాటా ప్రతిపాదించింది.

పంచపాండవుల్లో ఎవరూ ఒక అమ్మకు, నాన్నకూ పుట్టిన వాళ్ళు కాదని వైరివర్గం హేళన చేస్తే తప్పుబట్టాల్సిందేమీ లేదు. మీరంతా పుట్టినట్టే కర్ణుడు కూడా నాకే పుట్టాడని, కర్ణుణ్ణి వధించవద్దని కనీసం ధర్మరాజుకైనా కుంతి చెప్పి ఉండాల్సింది. స్త్రీ సహజమైన పాత్ర కుంతిది! అభిమన్యుణ్ణి అన్యాయంగా పొట్టనబెట్టుకున్న కర్ణుడి చావు గురించి నువ్వు ఏడుస్తున్నావా...? అని ధర్మరాజు అడిగాక గానీ ఆమె తెప్పరిల్లలేకపోయింది.

ఈ ఐటి యుగంలో ఆడపిల్లలకు కుంతి పాత్ర ఇచ్చే సందేశం చాలా ముఖ్యమైంది. తెలిసీతెలియని లేతవయసులో కుతూహలం కొద్దీ చేసే తప్పులు ఒక్కోసారి మహాభారత యుద్ధం దాకా దారితీస్తాయి! "అయినా ఆ దూర్వాసుడికేం పోయే కాలం, పెళ్ళికాని ఆడపిల్లలకు అలాంటి మంత్రాలా ఇచ్చేది...?" అని మీరడగవచ్చు. ఆడపిల్లలకు మగ పిల్లలక్కూడా ఇప్పుడు టీవీలు, సినిమాలూ అంతకన్నా పెద్ద మంత్రోపదేశాలే చేస్తున్నాయి. తస్మాత్ జాగ్రత...జాగ్రత

# చద్దన్నం అంటే పెరుగన్నం

సీ. మాటిమాటికి వ్రేలుమడచి యూరించుచు
నూరుగాయలు నుచుందునొక్క
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి
"చూడు లే" దని నోరు సూపు నొక్క
డేగు రార్గురు చల్దు లెలిమి బన్నిద మాది
కూర్కొని కూర్కొని కుడుచు నొక్క
డిన్ని యుండగ బంచి యిదుట నెచ్చలితన
మనుచు బంతెనగుండు లాడు నొకడు

ఆ. కృష్ణు జూడు మనుచు గికురించి పలు
మ్రోల, మేలి భక్ష్యరాశి మెసగు నొకడు
నవ్వు నొకడు, సఖుల నవ్వించు నొక్కడు,
ముచ్చటాడు నొకడు, మురియునొకడు.

(పోతన మహాభాగవతం)

బాలకృష్ణుడి చుట్టూ పద్మంలో రేకుల్లాగా కూర్చుని గోపబాలురు చద్దన్నం తిన్నారని పోతన గారు ఈ పద్యంలో వర్ణించాడు.

ఒక్కొక్కడూ ఒక్కోరకంగా చద్ది తిన్నారట-

వ్రేళ్ళ మధ్యలో ఊరగాయ ముక్క ఇరికించుకొని మాటి మాటికి పక్కవాడిని ఊరిస్తూ తినేవాడొకడు.

పక్కవాడి కంచంలోది చటుక్కున లాక్కొని మింగేసి, "నాదగ్గరేం ఉందీ" అంటూ నోరు చూపించేవాడు ఇంకొకడు.

పందెం కాసి ఐదారుగురి చల్దులు నోట్లో కుక్కుకొని తినేసే వాడు మరొకడు.

'స్నేహ మంటే పంచుకోడమేరా' అంటూ'బంతెనగుండు' ఆట ఆడుతూ తినేవాడింకొకడు.

'ఒరే కృష్ణుణ్ణి చూడు' అని దృష్టి మళ్ళించి, జట్టుగాడు తెచ్చుకున్నతీపి పదార్థాలు తినేసే వాడింకొకడు.

ఒకడు నవ్వుతున్నాడు. ఇంకొకడు నవ్విస్తున్నాడు. మరొకడు ముచ్చట్లాడుతున్నాడు. వేరొకడు ఉరికే మురిసిపోతున్నాడు.

ఇంతకీ వాళ్ళందరూ తిన్నది చద్దన్నమే! అంటే పెరుగన్నమే! అవును చద్దన్నం అంటే పెరుగన్నమే!

చద్దన్నం అనగానే మన నిఘంటు కర్తలు పర్యుషితాన్నం (stale food) – రాత్రి మిగిల్చి ఉదయాన్నే తినే పాచిన అన్నం అనే అర్థమే ఇచ్చారు. కాబట్టి, తప్పని సరిగా బాలకృష్ణుడు, అతని మిత్రబృందం పాచిపోయిన అన్నం తిన్నట్టే భావించాలి.కానీ, పోతనగారు ఆ చద్దన్నం ఏదో, దాన్ని ఎలా తిన్నారోవర్ణిస్తున్నారు చూడండి...

*"మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది ముద్ద*
*డాపలి చేత మొనయ నునిచి*
*చెల రేగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు*
*వ్రేళ్ళ సందులను దా వెలయ నిఱికి..."*

ఇంట్లో నానా యాగీ చేసి తెచ్చుకున్న ఊరుగాయ ముక్కల్ని వేళ్ళతో పట్టుకొని మీగడ పెరుగు వేసి మేళవించిన చల్దిముద్ద అంటే పెరుగన్నంలో నంజుకుంటూ తిన్నారట.

ఇక్కడ 'చలిది' అనేది 'చల్ల'కు సంబంధించిన పదం. చలిబోనం లేక చల్ది బోనం అంటే పెరుగన్నం! గ్రామదేవతల ఉగ్రత్వం శాంతించటం కోసం వేడి అన్నంలో పెరుగు లేదా చిక్కటి మజ్జిగ కలిపిన అన్నాన్ని చద్ది/చలిది అంటారు. చద్దన్నం అంటే ప్రొద్దున వండిన అన్నమే! పాచిన అన్నం కాదు.

ఇప్పుడంటే చద్దన్నం అనేది కూలి నాలి చేసుకొనేవాళ్ళు తినేదనే ఒక ఆభిజాత్యంతో కూడిన అపనమ్మకం మనలో బలంగా ఏర్పడి ఉంది. ఇందుకు మన నిఘంటువులు ముఖ్య కారణం కాగా, టిఫిన్లమీద వ్యామోహం కొంత కారణం అయ్యాయి, చివరికి ప్రొద్దున పూట మెతుకు తగలకూడదనే భావన వ్యాపించింది.

కృష్ణుడు చద్ది తినే పెరిగాడు. ఆయన మిత్రులు కూడా చద్దే తిన్నారు. కానీ, ఈ విషయాన్ని మరిచిపోయిన మనం ప్రొద్దునపూట పెరుగన్నం తినే వాణ్ణి చద్దన్నం గాడని చిన్నచూపు చూస్తున్నాం.

పొద్దున్నపూట టిఫిన్లు, మధ్యాన్నం పూట పలావులూ, బిరియానీలు, రాత్రిపూట నాన్'లూ. పారోటీలూ తినటం గొప్పనుకుంటున్న కాలం మనది! చద్దన్నం కాలం పోతనగారిది. దేవుడికి చద్దంటేనే ఇష్టం అని పోతనగారి నమ్మకం. చద్ది భోజనం ఆకలిని తీర్చి సంతృప్తి నిస్తుంది. రెండిడ్లీ సాంబారు, కాఫీ/టీ ఇవి ఆకలిని చంపి జీర్ణాశయాన్ని దెబ్బకొడతాయి.

చల్ల అనే పదం అత్యంత ప్రాచీనం మనకి. పూర్వ ద్రావిడ పదం 'సల్', పూర్వ తెలుగు భాషలో 'చల్' గా మారిందని ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువులో

పేర్కొన్నారు. పూర్వ ద్రావిడ 'సల్' లోంచి చల్ల (మజ్జిగ-Buttermilk), పూర్వద్రావిడ 'చల్' లోంచి చల్ల (చల్లనైన-cold, cold morning) వేర్వేరు అర్థాలు వాడుకలోకి వచ్చాయి. ఈ తేడాని గమనించాలి.

చలి పందిరి, చలివందిరి, చలివంద్రి, చలివెందర, చలివేంద్రము, చలివేందల, చలివేంద్ర... ఈ పదాలన్నింటికీ త్రాగటానికి నీళ్ళు అందించే పందిరి అనే అర్థాన్నే మన నిఘంటువులు ఇచ్చాయి. కానీ,చల్లనిచ్చిన కేంద్రం కాబట్టి చలివేంద్రం అన్నారు. చల్ల లేదామజ్జిగ ఇచ్చి దప్పిక తీర్చటం మన పూర్వాచారం. చల్లని దాహం(దప్పిక) అంటారందుకే! నిఘంటు కర్తలు పదాల మూలరూపాన్ని మరవటం వలన తెలుగు పదాలకు అన్యాయం జరిగింది.

"అయ్యా! మీరు చల్దివణ్ణం తించారా...?" అనే ప్రశ్న వినగానే కన్యాశుల్కంలో బుచ్చమ్మ ఎవరికైనా గుర్తుకు వస్తుంది. చల్దివణ్ణం అంటే, పెరుగన్నం! ఇంట్లో పెద్దవాళ్ళు కూడా అనుష్ఠానాలు చేసుకున్నాక ఉదయం పూట ఉపాహారంగా హాయిగా చల్ది తినేవారు.

ఏమాత్రం పోషక విలువలు లేని టిఫిన్లు పెట్టి బడికి పంపటం పిల్లలను బలహీనులుగా పెంచటమే! వాళ్ళకు చద్ది పెట్టండి. బల సంపన్నులౌతారు, శారీరికంగానూ, మానసికంగా కూడా! తెలివి తేటలు, జ్ఞాపకశక్తీ పెరుగుతాయి.

కృష్ణుడు ఈ చద్దన్నమే తిని గొప్పవాడయ్యాడని పిల్లలకు నమ్మంగా చెప్పండి.

రాత్రి వండిన అన్నంలో పాలుపోసి, నాలుగు మజ్జిగ చుక్కలు వేస్తే తెల్లవారే సరికి చక్కగా తోడుకుంటుంది. అందులో ఉల్లి, టమోటా, క్యారెట్ లాంటి ముక్కలుగా తరిగి కొత్తమీర వేసి తాలింపు పెట్టండి. కమ్మని 'దధ్యోదనం" అవుతుంది. ఇడ్లీ సాంబారు కన్న ఇది గొప్ప ఆహారం కూడా.... ఉదయాన్నే నాష్టా (Break Fast) లాగా తినటానికి!

లేదా ఉదయమే వండిన అన్నంలో పెరుగు కలిపి కూడా చద్దన్నం ఇలా తినవచ్చు.

ఇందులో ధనియాలు, జీలకర్ర, వాము వేయించి దంచిన పొడిని కొద్దికొద్దిగా నంజుకుంటూ తింటే చద్దన్నం తేలికగా అరుగుతుంది.

చద్దన్నం తింటే మత్తు వస్తుందనేది అబద్ధం. టిఫిన్లు తిన్నా మత్తు వస్తుంది! అలవాటు చేసుకుంటే అదే సర్దుకుంటుంది.

# 'చల్లంబలి' అనే పారిజ్

*"పనిచేసి గంజియైనను అంబలైనను నెద చల్లగా ద్రాగి యెచటనైన
పడియుండి వెన్నెల గుడిపాట పాడగా పేదల కాత్మ సంప్రీతి కలుగు"*

(వినుకొండ వల్లభరాయకవి, క్రీడాభిరామం)

ఇది క్రీడాభిరామంలో పద్యం. దీన్ని వినుకొండ వల్లభరాయుడు వ్రాశాడనీ, కాదు శ్రీనాథుడే వ్రాశాడని, లేదా ఆ రాజకవి పేరుతో ఈకవిరాజే వ్రాశాడనీ రకరకాల వాదనలున్నాయి.

శ్రమించి అలిసిన పేద కార్మికుడు కొంచెం గంజిగానీ, అంబలి గానీ తాగి, ఒకింత విశ్రాంతిగా కూర్చుని 'వెన్నెల గుడి పాట' పాడుకుంటూ ఉంటే కలిగే ఆత్మ సంప్రీతి గురించి ఈ పద్యం చెప్తోంది.

రాగులు, జొన్నలు, సజ్జల పిండిని ఉడికించి కాచిన చిక్కని గంజి లేదా జావ'ని అంబలి అంటారు. ఇప్పుడు అంబలి (గంజి) అనేది కూటికి గతిలేని వాళ్ళు తాగేదనే ఒక బలమైన అభిప్రాయం నాటుకుని ఉంది. అంబలి స్థానే రెండిడ్లీ సాంబారుకీ కప్పు చాయికీ అలవాటు పడటం తోనే శ్రమని మరిచిపోవటం అనే సుగుణాన్ని కోల్పోయాం.

ఇది కూలీనాలీ పనివారికే కాదు, శరీరశ్రమ ఉన్న ప్రతి ఒక్కరికీ సంబంధించినదే!

రాగి, జొన్న, సజ్జలంటే చిన్న చూపు వదులుకుంటే 'వెన్నెలగుడి పాట'ని ఆస్వాదించ గలుగుతాడు మనిషి.

రాయలసీమలో ఇప్పటికీ 'కుడి చెయ్యి'ని 'అంబటి చెయ్యి' అంటారు. అంబలిని తాగించే చెయ్యి అని అర్థం.

కుడిచే (అన్నం తినే) చెయ్యి -- కుడిచెయ్యి- అంబటి చెయ్యి అయింది!

'అంబటి పొద్దు' అంటే, ప్రొద్దునే అంబలి తాగే సమయం అని!

అంబలి అనేది చోడి (జొన్నలు) జావకు వర్తించే పదం. దీన్ని 'కూడునీరు' అని కూడా అంటారు.

ఈ అంబలి చిక్కదనాన్ని బట్టి యవాగువు, మండము, విలేపి అని సంస్కృతంలో పేర్లున్నాయి. ప్రాకృత భాషలో అంబలి, అమాగో, అంబిలో అనీ, పాళీ భాషలో అంబిలయాగు, మాగధి భాషలో అంబిల అనీ పిలుస్తారు..

తెలుగులో అంబలి, అంబకళము అంటారు.

కన్నడంలో కూడా అంబలి, అంబకళ, అంబిల, అంబులు అనే పిలుస్తారు.

తమిళంలో అంపలి అంటే రాగిజావ.

జి. బ్రొన్నికోవ్ అనే పరిశోధకుడు ద్రవిడియన్ ఎటిమాలజీ నిఘంటువులో 'అంబ' అనేది తొలి ద్రావిడ భాషాపదం అనీ, అది తెలుగులో 'అంబలి'గా పరిణమించిందని, తమిళులు తెలుగులోంచి దీన్ని స్వీకరించి 'అంపలి' అని పిలుస్తున్నారనీ అన్నాడు. తెలుగులోంచే ఈ అంబలి పదం ప్రాకృత, మరాఠీ మాగధి తదితర భాషల్లోకి కూడా వెళ్ళి ఉండవచ్చు.

'అంబ' అంటే, 'వండిన అన్నం' అనే అర్థం కూడా ఉంది. తెలుగులో 'కూడు', 'బువ్వ' లాగానే, సంస్కృత అన్నానికి 'అంబ' అచ్చమైన తెలుగు మాట. అంబాల్ అంటే ఆహారం. వల్ అంటే బియ్యం. 'వల్లంబా' అంటే బియ్యం గంజి.

బ్రాహుయీ అనే ద్రావిడ భాషలో పులిసిన అంబలిని 'అమ్రి' అంటారు. ఇండోయూరోపియన్ భాషలకు అమ్మభాష (proto- Indo European Language)లో am-(r-) అంటే, పుల్లనిదని అర్థం. సంస్కృతంలో 'ఆమ్ర', 'ఆమ్ల', జెర్మనీలో 'ఆమ్ఫాన్' అంటే పుల్లనిది అని! లాటిన్'లో 'అమారస్' అంటే పులుపు. ఇదంతా చూస్తే, మూలద్రావిడ 'అంబ' ఇండో యూరోపియన్ భాషల్లో 'అమ్ల' ఒకే మూలంలోంచి ఏర్పడిన పదాలుగా కనిపిస్తాయి.

ఋగ్వేదకాలంలో ఆమ్ర పదం లేదు. చూత, రసాల అనే మామిడిని పిలిచారు. ఆంధ్రుల ప్రస్తావన ఉన్న శతపథ బ్రాహ్మణంలోనే 'ఆమ్ర' శబ్దం కన్పిస్తుంది. తెలుగుమాటలు సంస్కృతంలోకి చేరిన వాటిలో ఆమ్ర కూడా ఒకటికావచ్చు.

కాశీనగరంలో శివుడి కోపానికి గురై ఆకలితో నకనకలాడిపోతున్న వ్యాసుడికి అన్నపూర్ణ ప్రేమతో వడ్డించింది ఈ అంబలినే! శ్రీనాథుడు 'అంబకళం' అని వర్ణించిన ఘనమైన వంటకం ఇదే! జొన్నగంజి (పారిజ్–porridge) అని దీని అర్థం.

ఈ గంజిని పెరుగు కలిపి చిలికితే పుల్లపుల్లగా ఉంటుంది. లేదా ఒకటీ రెండు రోజులపాటు నిలవవుంచి పులియబెట్టి, తాలింపు పెట్టి తాగుతారు. దేవతా పులుసు, లక్ష్మీ చారు, 'చల్లంబలి' 'పులిజావ' అని గమ్మత్తయిన పేర్లు ఉన్నాయి దీనికి. 'చల్లాయంబలి ద్రావితి' అని దీనంగా చెప్పుకున్న శ్రీనాథుడి చాటువు గుర్తుకొస్తుందిక్కడ!

'అంబలి'లో తెలుగుదనం నిండి ఉంది. అది గొప్ప ప్రత్యామ్నాయ ఆహార పదార్థం. శరీరానికి పుష్టిని, సంతృప్తినీ, కాంతినీ ఇస్తుంది. జొన్న అంబలి లాగానే రాగి అంబలి కూడా శ్రేష్టమైన పానీయాలలో ఒకటి! రాగి అంబలిలో కాల్షియం దండిగా ఉంటుంది. మొలకెత్తించిన సజ్జల అంబలిలో మాంసం కన్నా ఎక్కువ ప్రోటీన్ ఉంటుంది. కాబట్టి పిల్లలకు, పెద్దలకూ అందరికీ అంబలి మంచిది.

ఇలా అంబలి, (గంజి) అంటే పిల్లలు ముఖం చిట్లిస్తుంటే 'చంచం జంజం బంబం' అనే చైనా పేరు పెట్టండి. రోజూ అదే కావాలని అడుగుతారు.

# చిల్లరదేవుళ్ళు

*"అంగడి యూరలేదు, వరియన్నము లేదు, శుచిత్వ మేమిలే*
*దంగన లింపులేరు, ప్రియయమైన వనంబులు లేవు, నీటికై*
*సంగపడంగ బాల్పుడు కృపావరులెవ్వరు లేరు, దాతలె*
*న్నంగను సున్న గాన పలనాటికి మాటికి బోవనేటికిన్!"*

(చాటువు)

ఇది శ్రీనాథుడి చాటువే! పలనాడు పేరుపెట్టి పల్లెల్లో ఛిద్రమైన జీవనాన్ని ఆయన కళ్లకు కట్టించాడు. శ్రీనాథుడు గతించి 600 యేళ్ళు దాటిపోయాయి. నేటికీ తెలుగు నేలమీద పల్లెల్లో పరిస్థితి నాటి పరిస్థితికి నకలుగానే ఉంది.

శ్రీనాథుడు చూసిన పల్నాడు పల్లెల్లో నిత్యావసర వస్తువులు దొరకవు, ఐదు వేళ్ళూ నోట్లోకి వెళ్ళే పరిస్థితి లేదు. ఎక్కడ చూసినా చీదర అలుముకుని ఉంది. స్వచ్ఛభారత్ లాంటి నినాదాలు గాని, ఆరోగ్యభారత్ లాంటి విధానాలు గానీ అక్కడ లేవు. మనుషుల్లో సౌకుమార్యం నశించి పోయింది.

పర్యావరణానికి ప్రియమైన మొక్క ఒక్కటి మిగిలి లేదు. నీళ్ళు దొరకవు. జనం దాహార్తి తీరుద్దామని ఆలోచించే కృపావరుడైన పాలకుడు ఒక్కడు కూడా లేడు. దాతల గురించి మాట్లాడేదేమీ లేదు. నిండుసున్నా! అలాంటి పల్లెలకు పోవటం దేనికీ...? అంటాడాయన!

శ్రీనాథుడు వేసిన ఈ ప్రశ్నని ఇప్పుడు మనలో ఎవరైనా వేస్తే జవాబు చెప్పగలిగే పరిస్థితి ఉన్నదా?

పల్లెల ఈ దుస్థితిని పరిమార్చటానికి శ్రీనాథుడు 'కృపావరులెవ్వరు లేరు' అనటం ద్వారా ప్రభుత్వాలమీద అలాంటి ఆశలేమీ పెట్టుకోవద్దని స్పష్టం చేశాడు. తను స్వయంగా ప్రభుత్వాధికారి. బహుశా పల్నాడులో డి. యి. వో.నో, స్కూళ్ళ ఇనస్పెక్టరో అయి ఉంటాడు. – శుచిత్వ మేమిలేదంటూ విద్యాగంధం అక్కడ లేదని చెప్పకనే చెప్పాడు! మనుషుల్లో కోమలత్వం నాజూకు తనం లేదంటే చదువు సంధ్యలు కూడా లేవనే అర్థం.

ఈ పరిస్థితిని చక్కదిద్దే ప్రజా ఉద్యమం లేదనేదే ఆయన బాధ! ఈతి బాధలు వస్తే, నివారించుకోవటానికి ప్రజలు సమాయత్తం కావట్లేదనే ఆక్రోశం ఆయన చాటువుల్లో కనిపిస్తుంది.

అక్కడ మనుషులు అనాగరికులనీ, రోతగా ఉంటారనీ, పిల్లికి బిచ్చం వెయ్యరనీ...

ఇలా పల్నాడును ఆయన పల్లెత్తు మాట అనలేదు. అక్కడి పరిస్థితిని భవిష్యతరాలకు ఈ విధంగా చాటి చెప్పాడంతే. భవిష్యత్తులోనైనా ప్రజలు చైతన్యవంతమైన పాత్ర పోషించాలనే లక్ష్యంతోనే ఇలా చెప్పినట్టు కనిపిస్తుంది.

ఇది తెలుగు నేలమీద పల్లెనాటి సీమ పరిస్థితి.

''చిన్నచిన్న రాళ్ళు చిల్లరదేవుళ్ళు

నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు

సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును దేళ్ళు

పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు'' అనడం ద్వారా నాటి పల్లెటూళ్ళ సామాజిక ముఖచిత్రాన్ని మనకు చూపించాడు శ్రీనాథుడు.

వరి తినటం గొప్ప అనీ, సజ్జ జొన్నలనేవి కూటికి లేనివాళ్ళు తినేవనే అభిప్రాయం శ్రీనాథుడి కాలంలో బలంగా ఉండేదన్నమాట. నిన్నమొన్నటి దాకా మనం కూడా అలానే అనుకున్నాం. సజ్జలు, జొన్నలు అనేవి పశువులకు కోళ్ళకు దాణాగా వేసేవని...!

ఇప్పుడు సీను మారింది. షుగరు జబ్బు మితిమీరాక రాగులు, జొన్నలూ సజ్జలూ నాగరికులు తిని తీరవలసిన ఆహారంగా మారాయి. ఈ పద్యం చెప్పే నాటికి కచ్చితంగా శ్రీనాథుడికి షుగరు జబ్బు లేదని నమ్మవచ్చు. ఉండి ఉంటే సజ్జకూడు తినటానికి పల్నాడులోనే డ్యూటీ వేయించుకునేవాడు.

మనిషి ఆర్థికంగా బలపడితేనే నాగరికత వర్ధిల్లుతుంది. పూటగడవకపోతే అమెరికా కూడా దేబురించక తప్పదు. డబ్బుని బట్టే అహం'కారాలు-మిరియాలు' హుంకరిస్తుంటాయి.

ఈ పద్యం నూరు శాతం నేటి పల్లెలకూ వర్తిస్తుంది. ఏరువాక సీజను వచ్చిందంటే ముందు మార్కెట్లోంచి ఎరువులు మాయమౌతాయి. 'అంగడి యూరలేదు' అంటే అర్థం ఇది. పండిన పంటను మధ్యదళారీలే ఎత్తుకుపోతుంటే రైతుక్కూడా పట్టెడన్నం తినే పరిస్థితి లేదు. శుచిత్వ మేమిలేదంటే నిండుగా జీతాలు, వ్యాపారాలు చేసుకుంటూ పట్నవాసులు నాగరికంగా షోకులు చేసుకుంటుంటే పల్లెలు మురికి వాడలై పోతున్నాయి. పట్టు పావడాలు కట్టుకుని ఘల్లుఘల్లుమని గజ్జెలతో ఛెంగుఛెంగున ఎగుర్తూ తిరిగే ఆడపిల్లలు అక్కడ కనిపించరు.

వనాలు నరుక్కుని వాతావరణాన్ని నాశనం చేసుకున్నాం. ఇంక వానలు కురవ్వు. కాటకాలు వదలవు.

ఊరికి సౌకర్యాలు కల్పించే నిర్ణయాలను ప్రభుత్వాలు చాలా అరుదుగా చేస్తుంటాయి. ఊళ్ళో ఏవైనా గనులుంటే వాటిని తేరగా తరలించుకుపోవటానికి

ఘనులు స్వంతంగా రోడ్లు నిర్మించుకుంటారిక్కడ. ప్రభుత్వ యంత్రాంగం కళ్ళప్పగిస్తుంటుంది. అలా ఎవరి ప్రయోజనం కోసమో తప్ప మన ప్రయోజనం కోసం అక్కడ ఏమీ జరగదు. ఊరికోసం తుఫాను షెల్టరు కట్టిద్దాం, చలివేంద్రం, గంజికేంద్రాల్లాంటివి పెట్టిద్దాం అని ముందుకొచ్చే నాథుడే ఉండడు. గడిచిపోయిన ఎన్నికల వాగ్దానాలు రానున్న ఎన్నికలకు కొత్తగా ముస్తాబై సిద్ధంగా ఉంటాయి.

జనం పల్లెల్నుంచి పొట్ట చేత్తో పట్టుకుని నగరాలకు వలసలు పోయి, ఆ ఇంట్లో ఈ ఇంట్లో పాచిపనులు చేసుకుని బ్రతుకుతున్న పరిస్థితికి కారణం ఏమిటనేది ప్రశ్న. ముఖ్యంగా కర్నూలు, అనంతపురం జిల్లాలనుండి హైదరాబాదుకు, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలనుండి అమరావతి ప్రాంతానికి ఈ వలసలు ముమ్మరంగా ఎందుకు జరుగుతున్నాయి? అక్కడ పుట్టిన శ్రీకాకుళ పోరాటోద్యమ స్ఫూర్తి ఏమయ్యింది? దోపిడీ వ్యవస్థ కొనసాగుతోందా?

శ్రీనాథుడు తిట్టింది పల్లెల దుస్థితిని కాదు, దుస్థితికి కారణమౌతున్న వ్యవస్థమీద కన్నెర్ర జేయని చేతనా రాహిత్యాన్ని మాత్రమే! ఇదంతా పల్లెభారతంలో బాలకాండ! పోరాడితే పోయేదేమీ లేదు, యుద్ధకాండలో ఊరు బాగుపడటం తప్ప!

# చెట్టు-నీరు- మీరు

"వేములు పూసే వేములు కాసె ఓ మామిడి
వేముల పళ్ళు పక్షులు మేసె ఓ మామిడి
పక్షులన్నీ గంగ చేరె ఓ మామిడి
గంగా చేరి నీరు తాగె ఓ మామిడి
నీరు తాగి ఒడ్డుకెక్కె ఓ మామిడి
ఒడ్డునున్న బొడ్డుమల్లె ఓ మామిడి
కోసిపెట్ట ఎవరు లేరు ఓ మామిడి
కోసిపెట్టు కృష్ణమూరితి ఓ మామిడి
పంచిపెట్ట ఎవరు లేరు ఓ మామిడి
పంచి పెట్టు శ్రీలక్ష్మి ఓ మామిడి"

తెలుగువాళ్ళు బాలకృష్ణుణ్ణి గుమ్మడు అనీ, మామిడీ అనీ ముద్దుగా పిల్చుకుంటారు. ఈ జానపదగీతంలో మామిడి సాక్షాత్తూ ఆ కృష్ణమూర్తే! సంతానాన్ని'మాయింటి మామిడి' అని ఇప్పటికీ మనం ఘనంగా చెప్పుకుంటాం. పెరట్లో మామిడి పిందె పడగానే ఇంట్లో పసిబిడ్డ పుట్టినంత సంబరపడతాం.

ఇంటికే కాదు రాజ్యానికి కూడా అంతే! పంట బాగా పండితే పసిడి కాంతు లీనుతుంది రాజ్యం. ఆ పండేది వేప పండైనా సరే, అది రాజ్యానికి క్షేమమే! వేపపువ్వు పూసి, కాయ కాచి, పండైతే ఆ పండ్లని పక్షులు మేసి, గంగను చేరి నీళ్ళు తాగాయి. నీటి ఒడ్డున బొడ్డు మల్లెలు విరగబూశాయి. పూలు కోసేందుకు ఎవరూ లేరు నువ్వు కోసిపెట్టు...కృష్ణమూర్తీ! ఆ పువ్వుల్ని పంచేందుకు ఎవరూ లేరు, శ్రీ లక్ష్మి నువ్వు పంచిపెట్టూ...అంటుంది ఈ జానపద గీతం.

వేములు కాసినా, మామిళ్ళు కాసినా పచ్చదనమే పరివ్యాప్తం అవుతుంది. ఆ పచ్చదనాన్ని లోకమంతా పంచేందుకు లక్ష్మీదేవిని రమ్మంటోంది ఈ గీతం. నీరు-చెట్టు ప్రాధాన్యతని ఈ పచ్చపాట సూచిస్తోంది. ఎక్కడ పచ్చదనం ఉంటుందో అక్కడ లక్ష్మి ఉంటుందని దీని సారాంశం.

మామిడి తోరణాలు పచ్చదనానికి ప్రతీకలు. 'సర్వేజనాః సుఖినోభవంతు' సూక్తికి వాస్తవరూపాలు. ఇప్పుడంటే రంగుకాయితాలు కడుతున్నారు గానీ, ఊరంతా మామిడితోరణాలు కట్టే సాంప్రదాయం మనది! మామిడి కోసం ఉగాది ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తాం మనం. మామిడి ఆకులనే ముంగిట ముగ్గుల్లో చిత్రిస్తుంటారు మన ఆడపడుచులు.

ఒకసారి బుద్ధుడు మామిడి పండు తిని, దాని టెంకెని అక్కడ పాతి, చేతులు కడుక్కొన్నాడట. వెంటనే అక్కడ ఒక తెల్లని మామిడిమొక్క పూలూ, కాయలతో మొలకెత్తిందనీ, అప్పటి నుంచీ బౌద్ధులు మామిడిని పవిత్ర వృక్షంగా భావిస్తారనీ ఐతిహ్యం. జైనదేవత అంబ, మామిడి చెట్టుక్రింద కూర్చుని ఉన్నట్టు వర్ణన కనిపిస్తుంది. మన్మథుడికి మామిడి మొక్కకీ అవినాభావ సంబంధం ఉంది. పవిత్ర వృక్షాల్లో మామిడి కూడా ఒకటి.

ఋగ్వేదంలో మామిడిమొక్కని "సహ" అని పిలిచారు. తరువాతి కాలంనాటి సంస్కృత గ్రంథాలలో చూత, రసాల పేర్లతో పాటు సహకార అనే పర్యాయ పదం కూడా కనిపిస్తుంది. బృహదారణ్యకోపనిషత్తు, శతపథబ్రాహ్మణాలలో "ఆమ్ర" పదం తొలిగా కనిపించిందని పండితులు చెప్తారు. చరక, సుశ్రుతాది వైద్య గ్రంథాలలో 'ఆమ్ర' ప్రముఖ వృక్షం. బంగ్లాదేష్ తమ జాతీయ వృక్షంగా మామిడి మొక్కని గౌరవించింది. రవీంద్రుడు ఆమ్రమంజరి కావ్యం వ్రాశాడు. బుద్ధుడి శిష్యురాలు ఆమ్రపాలి ప్రసిద్ధి. మామిడిపండు రంగుని 'ఇండియన్'ఎల్లో' అంటారు.

మామిడిని (మాంగిఫెరా ఇండికా) 'మానుచెట్టు' అని తెలుగువాళ్ళు పిలుస్తారు. మానుగ అంటే, పెద్దది, యోగ్యమైనది, ప్రకాశవంతమైనది, మన్నోమైనది అని! మాను కాయ- మానుగాయ-మాన్గాయ- మాన్గో- Mango పదాలు ఏర్పడ్డాయి. mango పదానికి 'మానుగాయ' మూలం అనీ, పోర్చుగీసులే దాన్ని ఇంగ్లీషులోకి చేర్చారనీ పదాల మూలాలకు సంబంధించిన భాషావేత్తలు చెప్తారు.

మొఘల్ చక్రవర్తులు, సుల్తానులూ మామిడి మీద మనసు కొద్దీ మామిడి పళ్ళను రాజవంశీకులే తినాలని నిషేధం పెట్టారు. ప్రజా వ్యతిరేకత పెరగడంతో మామిడిమొక్కను జాతీయం చేసి అందరికీ దాన్ని పండించే అవకాశం ఇచ్చారు. అక్బర్ చక్రవర్తి పూనుకొని లక్ష మామిడిమొక్కలు నాటించగా, మామిడిమొక్క అంటు కట్టడాన్ని రాజోద్యాన వనాల్లో మాత్రమే జరపాలనే నియమాన్ని తొలగించి, రాజ్యం అంతా మామిడిని పెంచుకొనే అవకాశం కల్పించిన వాడు షాజహాన్.

పచ్చదనాన్ని పంచి మొఘల్ చక్రవర్తులు అలా వర్ధిల్లారన్నమాట!

పోర్చుగీసులు భారత దేశంలోకి వచ్చాక, క్రీ. శ. 15-16 శతాబ్దాల కాలంలో మామిడి రుచిని బాగా ఇష్టపడసాగారు. కానీ, ఆ రోజుల్లో సీజన్ కాని సమయాలలో మామిడికాయని తినాలంటే, ఊరగాయ పెట్టుకోవటం తప్ప వేరే మార్గం లేదు. అందుకని, ముఖ్యంగా పోర్చుగీసులు ఆవకాయ, మాగాయ, తొక్కుడు పచ్చడి లాంటి ఊరగాయలన్నింటినీ తెలుగు వారితో తయారు చేయించి ఎగుమతి చేసుకోవటం ప్రారంభించారు. తెలుగు నేల ఆ విధంగా ఊరగాయల తయారీకి కేంద్ర స్థానం అయ్యింది. తెలుగువారు రెచ్చిపోయి, బెల్లం ఆవకాయ, ధనియాల

ఆవకాయ, మెంతికాయ ఇలా లెక్కలేనన్ని ఆవకాయల్ని కనిపెట్టి తయారు చేసి ఎగుమతులు చేశారు. ఇది 18వ శతాబ్ది దాకా సాగింది.

ఆ రోజుల్లో తెలుగు వారి ఆవకాయలకు అమెరికాలో బాగా గిరాకీ ఉండేది. మిరపకాయలను కన్నతల్లి కదా ఆ ఖండం! చివరికి మాంగో అంటే pickle (ఊరగాయ) అనే అర్థంలో ఇది యూరప్ అంతటా చెలామణి అయ్యింది కూడా! ఆ తరువాత బ్రెజిల్, వెస్ట్ ఇండీస్, మెక్సికో దేశాలలో దీని సాగుకు అనుకూలత గమనించి అక్కడ మామిడి విస్తారంగా పండించటం మొదలుపెట్టారు. అక్కడి మిరపకాయలు ఇక్కడికి చేరాయి. ఇక్కడి అమృతఫలం మామిడి అక్కడకు తరలి పోయింది.

చింతపండుకు బదులుగా వంటకాలలో 'ఆమ్'చూర్' పనికొస్తుంది. మాంగో, టామరిండు రెండింటినీ కలిపి "మాంగోరిండ్" అనే కొత్తపదాన్ని అమెరికన్లు సృష్టించారు.

పచ్చదనం ఎక్కడ ఉంటే అక్కడ జాతి పసిడి కాంతులీనుతుంది. మనం మామిడి తోటల్ని కూలగొట్టుకుని రియల్ ఎస్టేట్లకు ధారాదత్తం చేసుకుంటున్నాం. వాళ్ళు ఇళ్ళు కట్టరు. వృక్షాల్ని బతకనివ్వరు. పచ్చదనం పంచటానికి ఈ రోజుల్లో శ్రీలక్ష్మితో అవసరమే లేకుండా పోతోంది. రియల్ ఎస్టేట్ వ్యాపారం బాగాలేదని అంటారు గానీ, పచ్చదనాన్ని నాశనం చేస్తే లక్ష్మీదేవి అక్కడ ఉండదని ఈ 'పచ్చపాట' హెచ్చరిస్తోంది.

# "జాతివార్తలు"

*ఒకచో శబ్ద నిగుంభనంబు, లొకచో యుక్తిక్రియా గౌరవం,*
*బొకచో నద్భుత జాతివార్త, లొకచో నుజ్జృంభితత్త్వద్రవ*
*ప్రకరంబుం గనిపించినన్, మదికి సంభావింపనరంబుగా*
*కకటా! యేమియులేని కబ్బమది యాహ్లాదంబు గావించునే?*

(కువలయాశ్వ చరిత్ర:: సవరం చిననారాయణ నాయకుడు)

ఒకమంచి రచన అంటే అందులో ఒకచోట శబ్ద నిగుంభనం ఉండాలి. ఒకచోట యుక్తిక్రియా గౌరవం కనిపించాలి. ఇంకోచోట అద్భుత జాతివార్తల ప్రయోగం, మరొకచోట ఉత్తేజపూర్వక ఉద్రేక పూర్వక విషయాలు కనిపించాలి. ఇలాంటి వేవీ లేని కావ్యం ఆహ్లాదం కలిగిస్తుందా? అనడుగుతున్నాడు కువలయాశ్వ చరిత్ర కావ్యకర్త 'సవరం చిననారాయణ నాయకుడు'. కావ్యంలో జాతివార్తలు కూడా ఉండాలంటాడు ఈ కవి! జాతివార్తలంటే ఏమిటి?

"జాతివార్తాకవిజనులకు ఆమోద సంధాయకముగా కవిత్వము చెప్పుదు" అని క్రీ.శ. 16-వ శతాబ్ది నాటి మతింగంటి సింగరాచార్యుడు కూడా తన అచ్చతెలుగు నిరోష్ఠ్య సీతాకల్యాణంలో చెప్పుకున్నాడు. 'అనఘ! ప్రేమాభిరామ ధనాభిరామ/ కావ్యములు జాతివార్తలు గడలుకొనఁగ/ద్విపదలుగఁ జేసితి'నని కూడా మతింగంటి సింగరాచార్య చెప్పుకున్నాడు. ఈ పద్యంలోనూ అలాంటి ధోరణే కన్పిస్తుంది.

జాతివార్తలు గడలు కొనటం అంటే ఏమిటీ? ఎద్దు మెడమీదకు కాడిని తెచ్చి అది కదలిపోకుండా బిగించడాన్ని 'గడలు కొనటం' అంటారు. జాతివార్తల్ని అలా కావ్యంలో బిగిసిపోయేలా ప్రయోగించాలనే భావన ఈ మాటల వలన తెలుస్తోంది. "వార్తలాడటం" అంటే వార్తికుడు(జర్నలిష్టు లేదా రిపోర్టర్) వార్తను అందించటం. వివేకరులు అని పిలవటంకన్నా వార్తికులు అనటం సుబోధకంగా వుంటుంది. వృత్తాంతం అనే పదానికి జనరవము, వివరణము, వార్త, సమాచారము, ప్రస్తావము అనే అర్థాలు కనిపిస్తాయి. వృత్తాంతంలో 'వృత్తి' అంటే, జీవనోపాయం, జీవనం, వర్తనం, కాయికం, కులకాయికం, నడవడిక అనే అర్థాలు కనిపిస్తాయి. 'జాతి వృత్తాలు' అంటే జాతీయులైన ప్రజల జీవన వర్తనాలకు సంబంధించిన విశేషాలు. ఈ విశేషాలను గడలుకొనాలని కవి ప్రయత్నించాడు. ఇవే జాతీయాలుగా ప్రసిద్ధ మయ్యాయి.

16-17 శతాబ్దాల కవులు జనవర్తనాలను, జాతివార్తలను తమ కావ్యాలలో పండించటానికి ఎక్కువ ప్రయత్నించారు. తంజావూరు, మధుర, చెంజిలకు చెందిన

దక్షిణాంధ్ర యుగం తెలుగు కవుల్లో ఈ లక్షణం బాగా కనిపిస్తుంది. రాజకవి అయిన సవరం చిననారాయణ నాయకుడు తన కువలయాశ్వ చరిత్ర కావ్యానికి సంభావనం వ్రాసుకుంటూ, అద్భుత జాతివార్తలు లేకపోతే అది కావ్యమే కాదని ధైర్యంగా చెప్పాడు.

సమకాలీనతను ప్రతిబింబించాలనే తపన నారాయణ నాయక కవికి ఎక్కువ. "కరువుకు తోడు ఆవపంట కలిగినట్టు", "ఇందు రమ్మన్నచోట ఇల్లెల్ల గొనుట" లాంటి ప్రయోగాలు ఈ కువలయాశ్వ చరిత్రలో అనేకం కనిపిస్తాయి. జాతివార్తలంటే ఇవే! చిరుసాన పట్టించి చికిలి సేయించిన అచ్చ తెలుగు మాటలతో భవిష్యకాలాన్ని కూడా ప్రతిబింబించేలా జాతివార్త లుండాలని ఆయన భావన! "కానీమన్నా!" "అందియ్యి" "బైట" లాంటి వాడుక మాటల్ని అవలీలగా ఈ కావ్యంలో ప్రయోగించాడు. ఇంచుమించు ప్రతీ పద్యంలోనూ ఒక లోకవ్యవహారం ఉండేలా జాతీయాలను యదేచ్ఛగా ప్రయోగించాడు.

"ఆయెనమ్మా! యిదేటి యాగడా? లిదియేమి యెఱుఁగు? నిన్నటి నేటి మెఱుఁ గుబోఁడి యెఱుఁగునా యనఁగూడ దిప్పుడిప్పుడు" అనే పద్యం ఒకటి ఈ కావ్యంలో కనిపిస్తుంది: "ఇదేం చోద్యం, నిన్నమొన్నటి బాలకు అప్పుడే వలపా? అని ఆశ్చర్యపోవాల్సిన రోజులు కావివి. చదువుకున్నది కాబట్టి, మనసు మరలుకొంది. లేవలకారి వగలతో గడితేరుతోంది... మంచి మగవాణ్ణి చూస్తే యవ్వనం ఊరజేస్తుంది. యీ బాములనుభవిస్తేగానీ తెలీవు. పేగులోపల తీటలాంటిది ప్రేమ! ఆ కసికోతలు పగవారిక్కూడా వద్దు... దీనికివి ఇప్పుడే వచ్చాయేమిటీ...?" అని ఆ పద్యంలో వ్రాస్తాడు.

16వ శతాబ్ది చివరిపాదం నాటి ఈ కవి "ఈ చదువుల వలన వయసు రాకమునుపే ప్రేమవ్యవహారాలు మొదలౌతున్నా"యనటం 21వ శతాబ్దిలో జరగబోయే విషయాలను చూసి వ్రాశాడా అనిపిస్తుంది.

మన పూర్వుల్లోనూ మహానుభావులున్నారు. మనకన్నా జీవితాన్ని ఎక్కువగా ఆనందించిన వారే వాళ్లంతా! ఆ నాటి వారసత్వమే ఈనాటికీ కొనసాగుతోంది.... కొంచెం ఎక్కువ మోతాదులో! అంతే!

# డామిట్! కథ అడ్డమే తిరుగుతుంది..

*"వంచన యెఱింగిన మఱి శపి*
*యించునొ సురకాంత చెప్ప కేగిన బ్రేమం*
*బంచశర శరపరంపర*
*బంచత బ్రాపించి మీఁదఁ బాపంబిదునో..."*

(మనుచరిత్రము తృతీయాశ్వాసం 125)

వరూధిని దేవతాస్త్రీ. పొరబాటున దారి తప్పి తిరుగుతున్న ప్రవరుణ్ణి మోహించింది. ఇది గమనించి ఓ గంధర్వుడు ప్రవరుడి వేషంలో వచ్చి వరూధినిని చేపట్టాడు. తృప్తి తీరా సుఖించాడు. వరూధిని గర్భవతి కూడా అయ్యింది. ఇంకా ఎక్కువ రోజులుంటే తన మోసం బయట పడితే శపిస్తుందేమోననే భయం పట్టుకుంది. చెప్పకుండా పారిపోతే తన వియోగంతో ఆత్మహత్యకు పాల్పడుతుందని శంకించాడు. ఇది మనుచరిత్ర ప్రబంధంలో అల్లసాని పెద్దన గారు సృష్టించిన సన్నివేశం. గురజాడ వారి కన్యాశుల్కం నాటకంలో గిరీశం కూడా అచ్చం ఇదే స్థితిలో పడి, "శీఘ్రంగా యిక్కణ్ణించి బిచాణా యెత్తి వెయ్యడమే బుద్ధికి లక్షణం గాని మధురవాణిని వదలడమంటే యేమీ మనస్కరించ కుండా వున్నది" అనుకుంటాడు. "యంగ్ వర్జిన్ విడో" ఎవరైనా దొరికితే కీర్తీ, సుఖమూ సమానంగా దక్కుతాయనే ఆలోచన చేస్తాడు.

మాయాప్రవరుడు వెళ్ళిపోవటానికే సిద్ధం అయ్యాడు. "ఈరాత్రి వరూధినికి పార్టింగ్ విజిట్ యివ్వందీ పోకూడదు" అని నిర్ణయించుకుని, నెమ్మదిగా వీడ్కోలు ప్రసంగం ప్రారంభించాడు. "నాకు పాదలేపనం ఇచ్చిన సిద్ధుడు హిమాలయాలకు వచ్చాడు. అక్కడ మా పొలాలన్నీ ఎండిపోతున్నాయట. పశువులకు ఆలనాపాలనా లేక బందీల దొడ్లో కట్టేశారట. నా స్టూడెంట్లు నేను చెప్పిన చదువంతా మరిచిపోయి తిరుగుతున్నారట. అప్పులు తీసుకున్న వాళ్లు వడ్డీలు కట్టట్లేదట. ఇళ్ళూ వాకిళ్ళూ తాకట్టులో పడ్డాయట. నేను వెంటనే వెళ్ళి పరిస్థితులు చక్కదిద్ది మళ్ళీ వచ్చేస్తాను. నాకు సిద్ధుడు ఈ సారి లేపనం తయారు చేసుకునే ఉపాయం కూడా చెప్పేశాడు. అందుకని ఎప్పుడు కావాలంటే అప్పుడు లేపనం పూసుకుని వచ్చేస్తాను" అని నమ్మకంగా పలికాడు.

వల వేయటం ఎలా? వలపించటం ఎలా? వదిలించుకోవటం ఎలా? అనేవి చాలా ముఖ్యమైన "లౌ"కిక విషయాలు. మాయా ప్రవరుడైన ఈ గంధర్వుడు వలవేయటం, వలపించటాలలో దిట్ట. మొదట మామూలుగా వలవేశాడు. వరూధిని

చిక్కలేదు. ఆమె ప్రవరుడి వెంటపడింది. అతను ఛీకొట్టి వెళ్ళిపోయాడు. ఇది గమనించిన గంధర్వుడు వెంటనే ప్రవరుడి వేషం కట్టాడు. అచ్చం ప్రవరుడేనన్నట్టు నటించాడు. ఆమెను మెప్పించాడు. వలపించాడు. ఇప్పుడు వదిలించుకునే సీను నడుస్తోంది.

ఎంత ప్రవరుడిలా నటించినా అతని మాటల్లో శుద్ధ శ్రోత్రియుడి జీవిత విధానం ప్రతిబింబించటం లేదు. నిజంగా ప్రవరుడైతే "మా ఇంట్లో నిత్యాగ్నిహోత్రం సాగటం లేదట... దేవతార్చన, మహానివేదన, యజ్ఞయాగాది క్రతువులు సాగటం లేదట...ఇలా చెప్పుకునేవాడు.

వ్యాపార సంస్కృతి కలిగిన గంధర్వుడు "అప్పులు తీసుకున్నవాళ్ళు వడ్డీలు చెల్లించక పోవటం గురించి, భూముల కౌలు, క్రయవిక్రయాలు, వ్యాపార విషయాలు ఇలాంటివి మాట్లాడాడు. ఆ మాటలకు వరూధిని అనుమానించి ఉండాలి. కానీ, ఇతను వెళ్ళిపోతాడనగానే ఆమె బుర్ర పనిచేయటం మానేసింది. మోహం మేథాశక్తిని కమ్మేసింది. నిత్యపెళ్ళికొడుకు, కాంట్రాక్టరుల వ్యవహారంలాంటి పరిస్థితిలో ఇరుక్కుంది వరూధిని.

కరివేపాకు వేసి వండటం వలన వంటకం సుగంధ భరితం అవుతుంది. తినేప్పుడు ఇంక దాని అవసరం లేదని పారేసినట్టే వరూధిని కరివేపాకుగా మారిపోయింది.

వాడుకు వదిలేసే మనస్తత్వానికి ఈ మధ్య "కమర్షియల్ బ్రైన్" అని ఒక అందమైన పేరు తగిలించారు. కమర్షియల్ అనే మాట ఈ యుగంలో చాలా పవిత్రమైనదిగా చెలామణిలో ఉంది. మాయా ప్రవరుడైన గంధర్వుడు ఆనాడే దాన్ని అమల్లో పెట్టాడు.

తెల్లవారే సరికి బిల్‌గేట్సుని మించి పోవాలి, ఐదు తరాల వరకూ తరగని ఆస్తి కూడబెట్టాలి, మనకు పేర్లు కూడా తెలీని కార్లలో ఎక్కి తిరగాలి...

బోరన్ టు ఎరన్... సంపాదించడానికే నువ్వు పుట్టావు... సంపాదించు... సంపాదించు... సంపాదించిన దానితో తృప్తి చెందేవాడు పుట్టినా గిట్టినట్టే... ఇలాంటి అందమైన విష నినాదాలతో వ్యక్తిత్వ వికాస నిపుణులు చెప్తోన్నదంతా ఇదే! మాయా ప్రవర గంధర్వుల్నీ, గిరీశాల్నీ మించిపోయిన వాళ్ళను తయారు చేయటమే కమర్షియల్ భావన అంతిమ లక్ష్యం.

"ఇంటికి వచ్చిన చుట్టం వెంటనే వెళ్ళకపోతే మీరు ఏం చేయాలి?" అనే అంశం మీద ఒక వ్యక్తిత్వ వికాస నిపుణుడు ప్రసంగిస్తుంటే విన్నాను. తాము పరోక్షంగా సమాజాన్ని వ్యాపారమయం చేసి, మానవ సంబంధాలను చెడగొట్టడానికి కారణమౌతున్నా మనే గ్రహింపు వీళ్ళకు లేదు. డబ్బాలో రాళ్ళు పోసి గరగరలాడించినట్టు మహాకవుల కొటేషన్లను కోటు చేసుకుంటూ వినేవాడిలో మాయో,

మోసమో, చౌర్యమో చేసైనా సరే, నమ్మినవాణ్ణి ముంచి డబ్బు సంపాదించాలనే ఆశని ప్రేరేపిస్తారు.

విచిత్రం ఏమంటే, "కోట్లు గడించటం ఎలా?" లాంటి పుస్తకాలు వ్రాసే వాళ్లలో కోట్లు గడించిన వాడు ఒక్కడూ లేకపోవటానికి కారణం ఏమిటి? వాళ్ళు చెప్పే సూత్రాలు వాళ్లని మహా సంపన్నుల్ని ఎందుకు చేయలేకపోతున్నాయి...?

మనిషి కమర్షియలైజ్ కావటం అంటే అవసరానికి వాడుకునే తత్వాన్ని పెంచుకోవటం. దాన్ని ఒక గొప్పతనంగా ప్రబోధించే వాళ్ళు, ఆచరించేవాళ్లు చివరికి గిరీశంలాగా "డామిట్ కథ అడ్డం తిరిగింది" అని వగచే ప్రమాదం ఉంది.

అవును! మానవ సంబంధాలను చెడగొట్టి, వాణిజ్య సంబంధాలను తెచ్చిపెడ్తే కథ అడ్డమే తిరుగుతుంది!

# తంజావూరు బ్యాండు

*మనుచరిత్రంబు కలిగిన మనుజచంద్ర*
*వసుచరిత్రంబు తెలిసికో వచ్చినాడ*
*అన్న సంబళ మిప్పించి మనుపునన్ను*
*రమ్యగుణ సాంద్ర శరభోజి రాజచంద్ర"*

పదికాలాలపాటు నిలిచే మనుజచంద్రుడి గొప్ప చరిత్రను తెలుసుకోవాలని వచ్చాననగానే సంబళం (దారిబత్తెం) ఇప్పించి, గౌరవించే రమ్యగుణ సంపన్నుడు" అని కీర్తించాడో చాటుకవి ఈ పద్యంలో శరభోజ మహరాజుని.

శరభోజ మహారాజు 1798లో తంజావూరు సింహాసనానికి వచ్చాడు. ఇంగ్లీషు వాళ్లతో సంధి చేసుకుని పాలనా వ్యవహారాలు వారికి అప్పగించి సారస్వత సేవకు తన సమయాన్ని పూర్తిగా వెచ్చించాడు. యుద్ధాలతో జననష్టం, ధననష్టాలకన్నా మెరుగైన మార్గాన్ని అనుసరించాడు. సంగీత సాహిత్య సేవకుడిగా చరితార్థు డయ్యాడు.

దేశీయ ప్రభువులు ప్రాబల్యం కోల్పోయి పోర్చుగీసు, ఫ్రెంచి, ఇంగ్లీషువాళ్లలో ఎవరో ఒకరికి దాసోహం అనాల్సిన స్థితిలో ఆయన రాజ్యానికొచ్చాడు. నిజాం నవాబు ఫ్రెంచి, ఇంగ్లీషు మధ్య దోబూచులాడుతున్న కాలం అది. 1765కే ఉత్తర సర్కారు జిల్లాలైన కోస్తా ఆంధ్ర భూభాగాన్ని నిజాం ఇంగ్లీషువాళ్ళకు ధారాదత్తం చేశాడు. మద్రాస్ నగరం ఏర్పడింది. ఇంగ్లీషు వాళ్ళ ఫ్యాక్టరీ (వాణిజ్య కేంద్రం)లు కూడా ఏర్పడ్డాయి. ఈ పరిస్థితిలో శాంతి మార్గాన రాజ్యాన్ని నడిపించే పద్ధతి ఎంచుకున్నాడు శరభోజీ.

ఆయన సాధించిన గొప్ప విజయాల్లో తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం ఏర్పాటు చెప్పుకోదగింది. అప్పటికే అచ్చయిన ఇంగ్లీషు, లాటిన్, గ్రీక్, ఫ్రెంచి, ఇటాలియన్ గ్రంథాలు నిఘంటువులు, వ్యాకరణ గ్రంథాలు, తెలుగు, తమిళ,కన్నడ భాషాగ్రంథాలు, తాళపత్రగ్రంథాలు లక్షకు పైగా కొని ఈ గ్రంథాలయంలో భద్రపరిచాడు. చేతిలో డబ్బు లేకపోతే మెడలో వజ్రాల హారం ఇచ్చి విలువైన తాళపత్ర గ్రంథాలు కొన్న సందర్భాలు కూడా ఉన్నాయి.

"దేవేంద్ర కురవంజి" అనే నాటకం వ్రాసి, ఆ కురవంజి చేత ప్రపంచంలో వివిధ దేశాల స్థితిగతులు ప్రజల జీవన విధానాలు చెప్పిస్తూ ఒక ఎన్'సైక్లోపీడియా లాగా దాన్ని రూపొందించాడు. స్వయంగా ఒక ప్రెస్సు పెట్టి పుస్తకాలు అచ్చు

వేశాడు. ఆయన కంటి వైద్యుడు కూడా. ఆసుపత్రి నడిపాడు. ఆయుర్వేద ఫార్మసీ నడిపాడు.

ఇవన్నీ ఒక ఎత్తు, సంగీతానికి ఆయన చేసిన సేవ ఇంకో ఎత్తు. మొదటిసారిగా పాశ్చాత్య సంగీత ధోరణుల్ని దక్షిణ భారత సంగీతంలోకి ప్రవేశ పెట్టిన ఘనత శరభోజీకే దక్కుతుంది.

స్వతహాగా శరభోజీ పాశ్చాత్య సంగీత ప్రియుడు. ఆయన్ని ఇంగ్లీషు వారికి సన్నిహితుణ్ణి చేయటానికి పాశ్చాత్య సంగీతం ఒక సాధనంగా ఉపయోగపడి ఉండవచ్చు. తంజావూరు పాశ్చాత్య సంగీత బృందాన్ని ఏర్పరచాడు. తంజావూరు బ్యాండు అంటారు దాన్ని.

వయొలిన్, క్లారనెట్, పియానో, జెర్మన్ ఫ్లూట్, తంబూరా లాంటి వాయిద్యాలెన్నో కొని, తను నేర్చుకుని కొందరికి శిక్షణ ఇప్పించాడు. థామస్ చాప్'మన్, వ్రాసిన నొటేషన్లను హోల్డ్'వర్త్ అనే ఆంగ్లపండితుడు కాపీ చేసి 1-3-1775న ఆయనకు ఇచ్చినట్టు ఒక నోట్సు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉంది.

దాదాపు 150 పాశ్చాత్య సంగీత గ్రంథాల్ని ఆయన సేకరించాడు. పాశ్చాత్య పండితుల్ని రావలసిందిగా కోరుతూ ఆయన వ్రాసిన ఉత్తర ప్రత్యుత్తరాలు సరస్వతీ గ్రంథాలయంలో ఉన్నాయి.

శరభోజీ మహరాజు కారణంగానే దక్షిణభారత దేశంలో వయొలీన్, పియానో బాగా వ్యాప్తిలోకి వచ్చాయి. టోరిన్ అనే ఇంగ్లీషు సంగీత విద్వాంసుడు ఒక జెర్మన్ ఫ్లూటుని 25-05-1804న ఆయనకు కానుకగా పంపించాడు.

భాగవత మేళా నాటక కళాకారులకు మాన్యాలు ఇస్తూనే పాశ్చాత్య సంగీతానికి తనవంతు పోషణ అందించాడు. త్యాగరాజును ఆదరించాడు. రాజకొలువు తిరస్కరించాడని త్యాగయ్య మీద కోపగించినా, స్నేహితుడిగా మారి ఆయనను గౌరవించాడు. త్యాగరాజు భక్తిగీతాల్ని అనుసరించి ఆనేక పదాలు, కీర్తనలు రచించి భద్రపరిచాడు.

తంజావూరు రాజ్య బడ్జెట్లోంచి 5,208 రూపాయలు సరస్వతీ మహల్ కోసం కేటాయిస్తే, అందులో సగం వరకూ సంగీతానికే శరభోజి ఖర్చు చేశాడని "టాంజోర్, ది సీట్ ఆఫ్ మ్యూజిక్" గ్రంథంలో ఎస్. సీతగారు పేర్కొన్నారు. భరతనాట్యంతో పాటు, హిందుస్థానీ, పాశ్చాత్య నాట్యరీతుల్ని కూడా తన ఆస్థానంలో ప్రదర్శింప చేశాడాయన. స్వయంగా అనేక శబ్దాలు, వర్ణాలు, పదాలు, స్వరజతులు, అభినయ పదాలు, తిల్లానాలు, గీతాలు, ప్రబంధాలు, అలరు(పుష్పాంజలి), జతులు ఇలాంటివి వ్రాసి, నట్టువనారులను ప్రోత్సహించి, నిధులిచ్చి ప్రదర్శింపచేశాడు.

త్యాగరాజు గారి గురువు శొంఠి వెంకటరమణయ్య, ఘనం కృష్ణయ్యర్, వెంకట సుబ్బయ్యర్, వేదనాయకం పిళ్ళై, ఆనాయ్ అయ్య, రామదాస్, వీణా సుబ్బుకుట్టి అయ్యర్, వీణా కాళహస్తి అయ్యర్, తలనాయర్ కృష్ణయ్యర్, వేయిగీతపైడాల గురుమూర్తిశాస్త్రి, తోడి సీతారామయ్యర్, శంకరాభరణ నరసయ్యర్, సవుకం సీను అయ్యంగార్, అద్దుఖాన్, సంస్కృత 'నౌకాచరిత్ర' కర్త వెంకట సూరి వీళ్ళంతా శరభోజీ ఆస్థాన సంగీత విద్వాంసులు.

వడివేలు తొలిసారిగా ముత్తుస్వామి దీక్షితార్ కృతులను వయొలీన్ మీద వాయించి, కర్ణాటక సంగీతానికి వయొలీనుని జతచేశాడు. అలా వయోలీన్ పాశ్చాత్య సంగీత పరికరం అనే ముద్ర తొలిగిపోయింది.

దక్షిణాంధ్ర యుగంలో శరభోజీ కాలం నుండీ, సుఖభావసంగీతం, శుద్ధ సంగీతం అనే పేర్లు వ్యాప్తిలోకి వచ్చాయి. వాయిద్య సంగీతానికి సమప్రాధాన్యం ఏర్పడింది. కచ్చేరీలు పెరిగాయి. వయొలీన్ తప్పనిసరి సహకార వాయిద్యం అయ్యింది. వయొలీన్ (సోలో) కచ్చేరీలు కూడా మొదలయ్యాయి. మృదంగం, వేణునాదం, నాగస్వరం, గోటువాద్యం, వీణ మొదలైన వాయిద్య కళాకారులకు ప్రాధాన్యత పెరిగింది. త్యాగరాజానంతరం ఈ ప్రాధాన్యత మరింత పెరిగింది.

తిరుకొడికవల్ కృష్ణ అయ్యర్, గోవిందస్వామి పిళ్ళై ప్రభృతులు, ఆధునిక యుగంలో ద్వారం వెంకటస్వామినాయుడు ఇంకా అనేకమంది సంగీత వేత్తలు శరభోజీ మహరాజు ఒరవడిని కొనసాగింపచేశారు. శరభోజి మహరాజు సాహిత్య సేవతో పాటు కర్ణాటక సంగీతానికి అంతర్జాతీయతను తేవటానికి చేసిన కృషి చిరస్మరణీయమైంది.

# తాను- సైతాను

*నైన దేవా న గంధర్వా న పిశాచా న రాక్షసా*
*న చాన్యే స్వయమక్లిష్టముపక్లిశ్నంతి మానవమ్*
*యేత్వేన మనువర్తంతే క్లిశ్యమానం స్వకర్మణా*
*న స తద్ధేతుకః క్లేశో నహ్యస్తి కృతకృత్యతా!*

*(చరక సంహిత, నిదానస్థానం 7/22-23)*

దేవతలు గానీ, గంధర్వులు గానీ పిశాచాలు గానీ, రాక్షసులు గానీ, ఇతర గ్రహాదులు గానీ, వ్యాధులు రావటానికీ లేదా తగ్గటానికీ కారణం కాదు. మన నిత్య జీవితంలో చేసే అనేక అనారోగ్యకర ఆహార విహారాలే వ్యాధుల్ని తెచ్చిపెడ్తున్నై. వ్యాధి రావటానికి ముందు వ్యక్తి అనాలోచితంగా, అజాగ్రత్తగా, చేసే పనుల్ని 'ప్రాక్తనకర్మ'లంటారు. చాలా వ్యాధులకు ఇవే కారణాలని చరకుడు 2000 యేళ్ళకన్నా పూర్వమే చెప్పాడు. ఇప్పటి కాలానికి ఇది బాగా వర్తించే సత్యం కూడా!

"ఈ సత్యాన్ని గ్రహించి ఆరోగ్యవంతమైన జీవన విధానాన్ని (హెల్దీ లైఫ్ స్టయిల్) అలవరచుకుంటే వ్యాధులు పుట్టకుండానే ఆగుతాయి, వచ్చినవి తేలికగా తగ్గుతాయి..."అంటున్నాడు చరకుడు.

చరకుడు భారతదేశపు తొలి ఫిజీషియను. సర్వప్రామాణికమైన సూత్రాలను వైద్యశాస్త్రానికి అందించాడు. దేవతల వలనో, రాక్షసులవలనో కాదు, తన వ్యక్తిగత జీవన విధానం వలనే మనుషులు రోగాలను 'కొని'తెచ్చుకుంటూన్నారన్నాడు.

మనిషి ఎప్పుడూ నాగరికంగా జీవించాలనే చూస్తాడు. తనకు పూర్వం ఉన్న జీవనాన్నంతా పాతచింత పచ్చడే అనుకుంటాడు. నాగరకతవైపు నడిచేకొద్దీ అతనిలో వ్యామోహాలు పెరిగిపోతాయి. ఈ వ్యామోహాలు ఒక విధమైన ఉన్మాద స్థితిని తెచ్చిపెడతాయి. తన మూలాల్ని మరిచిపోయేంత దాకా ఈ ఉన్మాద వ్యామోహాలు మనిషిని నెట్టుకెడతాయి. తన భాష పట్ల, తన సంస్కృతి, తన జాతి, తన దేశం, తన ఆహారం, తన ఆచారాల పట్ల చిన్నచూపును ప్రదర్శిస్తాడు. ఇది అనాదిగా సాగుతూ వస్తోన్న ఆచారమే! లోకం తీరే అంత... అది ఎగువకు పారే ఏరు లాంటిది.

చరకుడు ఈ సూత్రాన్ని ఉన్మాద ప్రకరణంలో చెప్పాడు. అక్కడే ఎందుకు చెప్పాడంటే, వ్యామోహం కూడా ఉన్మాద జనితమే కాబట్టి!

సంస్కృతి గురించి మాట్లాడటం చాందసవాదం అని కొందరంటారు. దేవుడు

లేకపోయినా, దెయ్యాలున్నా మనిషి బ్రతుక్కి వచ్చే ధోకా ఏమీ లేదు. మనిషి మతం మీద ఆధారపడి జీవించటం లేదు. మతమే మనిషిమీద బదనికలా పాకుతూ బతుకుతోంది. భాషా సంస్కృతులు మతంతో కాక, మనిషి జీవనంతో ముడిపడి సాగాల్సిన అంశాలు. మనిషి కన్నా ముందు నడుస్తూ, మనిషిని తనవెంట నడుపుకుపోవలసినవి. వాటిని అణగద్రొక్కే ప్రయత్నాలు సాగుతున్నాయి.

మన భాష ఏ విధంగా పరిణామం చెందుతోందో, మన వేషభూషణాలు ఏ విధంగా మార్పులు చెందుతున్నాయో, మన ఆలోచనా విధానం ఏ విధంగా కొత్తదనానికి అర్రులు చాస్తుందో మన జీవన విధానం కూడా అలానే అనేక పరిణామా లకు లోనౌతుంది. ఈ పరిణామాలలో కొన్ని మనకు అనుకూలమైనవి ఉంటాయి. వాటితో పురోగమిస్తాం. కొన్ని సరిపడనివి కూడా ఉంటాయి. అవే వ్యాధులకు దారి తీస్తాయి.

ఆరోగ్యవంతంగా జీవించటాన్ని అలవరచే సంస్కృతిలో మనిషి జీవించాలి. కానీ, అప్పుడప్పుడూ వ్యామోహాలు, ప్రభావాలు మితిమీరి ఉన్మాద స్థితిని తెస్తాయి. సినిమాలు, మీడియా ల్లాంటివి అప్పటికన్నా ఇప్పుడు ఉన్మాదాన్ని ఎగదోసే అవకాశం ఉంది కాబట్టి, చరకుడి కాలం కన్నా ఈ ఉన్మాద వేగం ఇప్పుడు పెరుగుతోంది.

గ్లోబలిజేషన్ అనే ఉన్మాద సుడిగాల్లో మనం చిక్కుకున్నాక మొదటి దాడి సంస్కృతిమీదే జరిగింది. క్రీ. శ. 2000 మిలీనియం సంవత్సరం తరువాత మన జీవన విధానంలో వచ్చిన విచిత్ర మార్పులే ఇందుకు సాక్ష్యం. అత్తా, మామా, పిన్నీ, బాబాయి అనే ఆత్మీయమైన పిలుపులు లోకువయ్యాయి. మానవ సంబంధాలు చిన్నబోయాయి. తల్లిదండ్రుల వృద్ధాశ్రమ తరలింపు తప్పులేని ఘనకార్యం అయ్యింది.

కెరీర్ పేరుతో పిల్లల్ని రెసిడెన్సియల్ స్కూళ్లలో పారేయటం ఒక తప్పనిసరిగా మారింది. కుటుంబ వ్యవస్థలో ఆత్మీయానురాగాలు అదృశ్యం అయ్యాయి. "ఐతే నాకేంటి" అనే తత్త్వం పెరిగింది. కోట్లు ఖర్చు చేసి, పెళ్ళిళ్ళు చేస్తే, ఏడాది తిరక్క మునుపే విడాకులకోసం కోర్టులచుట్టూ తిరుగుతున్న వాళ్ళే ఎక్కువ. ఇవన్నీ నాగరికత అనే ఉన్మాదానికి లోనైనందువలన కలుగుతున్న ఫలితాలు.

మనిషి శారీరిక మానసిక ఆరోగ్యాల మీద వీటి ప్రభావం దారుణంగా పడుతుందని చరకుడు ఆనాడే హెచ్చరించాడు.

ఇంక, ఆహారానికొస్తే ఇంటి తిండి చేదైంది. పూటకూళ్ళ మోజెక్కువైంది. ఉదయం పూట మెతుకు తగలకూడ దంటూ బజ్జీలు, పునుగులు టిఫిన్ల జాబితాలో చేర్చేశారు! చద్దన్నం అంటే మజ్జిగ అన్నమే కానీ పాచిపోయిన అన్నం కాదని చెప్పినా వినే స్థితి

లేదు. ఇళ్లలోంచి చల్లకవ్వాలు మాయమయ్యాయి. రాత్రిపూట అన్నం మానేసి ఆరోగ్యం కోసం బట్టర్ నాను, కర్రీలు  తింటున్నానని గర్వంగా చెప్పుకోవటం ఎక్కువైంది. ఇదంతా పాశ్చాత్య వ్యామోహ ఉన్మాద ప్రభావం.

ప్రొద్దున్న మొదలెట్టి అర్థరాత్రి దాకా జ్యోతిషాలు, వాస్తులు,న్యూమరాలజీలు నూరి పోస్తుంటే, వ్యామోహ ఉన్మాదం వలన కలిగే రోగాలకు జనం పరిష్కారాలను ఈ ఛానళ్లలో వెతుక్కుంటున్నారు.

దేవతలు, గంధర్వులు, పిశాచాలు, రాక్షసులు ఎక్కడో లేరు, వ్యామోహం అనే మన భావనా స్థితిలోనే ఉన్నారు. 'డ్రైవ్ ది డెవిల్ ఔట్-నీలో సైతాన్ తరిమేయ్' అనేది నేటి కాలానికి కావలసిన ఒక మార్గదర్శక సూత్రం.

# తుఖ్ఖాపంచకం

*చరన్వనాంతే నవ మంజరీషు, నష్టప్పదో గంధఫలీ మజిఘ్రత్*
*సాకిం నరమ్యా నచకిం నరంతా బలీయసీ కేవలమీశ్వర్ణా*

(తుఖ్ఖాపంచకం మొదటి శ్లోకం)

రాజుల కథలన్నీ జనంలో 'ట'కార ప్రయోగంతోనే వ్యాప్తిలో ఉంటాయి. అనగనగనగనగా... అంటూ సాగదీసి చెప్పే కథల్లో నిజాలకన్నా కథకుల వ్యక్తిగత అభిప్రాయాలకు ప్రాధాన్యత ఎక్కువ. వేదంలో హరిశ్చంద్రుడు మాటమీద నిలబడని అబద్ధాలకోరు. కానీ కావ్యంలోకి వచ్చేసరికి సత్యవ్రత సంజాతుడిగా కనిపిస్తాడు. కవుల చేతుల్లో పడ్డాక రాజుల కథలన్నీ మౌలిక స్వభావాన్ని కోల్పోతాయి. దురదృష్టవశాత్తూ అవే చరిత్రగా చెలామణీ అవుతాయి కూడా!

కృష్ణదేవరాయలు గజపతిని ఓడించి, అతని కూతుర్ని పెళ్ళాడాడనే కథ తెలిసిందే! "కృష్ణరాయవిజయము" వ్రాసిన కుమార ధూర్జటి (కాళహస్తీశ్వర శతకం వ్రాసిన ధూర్జటి గారి మనుమడు) రాయలు పెళ్ళాడిన గజపతి కూతురు పేరు 'తుఖ్ఖాజి' అని వ్రాశాడు. తుఖ్ఖ – తుర్క– అనేవి దుర్గమ్మకు తెలుగు రూపాలు. ఆమెకు వరదమ్మ అనే పేరు కూడా ఉంది. రాయవాచకంలో జగన్మోహిని అనీ, టైలరు దొర 'రుచీదేవి' అనీ, కొన్ని విజయనగర కడితాల్లో (రికార్డ్సు)లక్ష్మీదేవి అనీ, 'నరపతి రాజుల చరిత్రం'లో లుఖాదేవి అనీ, నాదెండ్ల గోపమంత్రి ప్రబోధ చంద్రోదయంలో సుభద్ర/భద్ర అనీ వ్రాశారు.

రాయలు పొట్టునూరు జయించాక అనీ, కొండవీడు గిరిని జయించాక అనీ కొందరు రాయల పెళ్ళి గురించి చెప్తారు.

పిల్లనిచ్చిన మామ ప్రతాపరుద్ర గజపతి లేక వీరరుద్ర గజపతి అనే విషయంలో కూడా వివాదం ఉంది. ఆ ఇద్దరూ తండ్రీ కొడుకులని కొందరు వ్రాశారు. ప్రతాపరుద్రుడే లొంగిపోయి తానే కూతుర్ని ఇస్తానన్నాడని, కొందరు రాయలే బలవంతంగా వీరరుద్ర గజపతి కూతుర్ని ఎత్తుకుపోయాడనీ రెండు కథనాలూ ఉన్నాయి.

కృష్ణరాయలకు పిల్లనిచ్చిన గజపతి గారి ముత్తాత కపిలేశ్వర గజపతి. ఆయన కొడుకు పురుషోత్తమ గజపతి (1470-1497) ఒరియా ప్రాంతంలో చాలా ప్రసిద్ధుడు. ఇతను కంచిని పాలించే రాజుగారి కుమార్తెని తనకిమ్మని అడిగాడట.

గజపతి మౌలికంగా శివభక్తుడు. కానీ, పూరీ జగన్నాథుడి విషయాని కొచ్చేసరికి విష్ణుభక్తిని కూడా ప్రదర్శించేవాడు. భక్తికొద్దీ రథం తిరిగే ప్రాంతాన్ని స్వయంగా

ఊడ్చేవాడట. కంచి రాజు విష్ణుభక్తుడు. కాబట్టి, అన్యమతస్థులకు తన పిల్లనివ్వనన్నాడు. పైగా, వీధులు ఊడ్చే వాడికి అసలివ్వనన్నాడు. దాంతో కోపించి పురుషోత్తమ గజపతి కంచిని జయించి, రాకుమారిని బంధించి తీసుకుపోయాడు. తనను వీధులూడ్చేవాడని అన్నందుకు ఆ రాకుమారిని వీధులూడ్చే వాడికే ఇచ్చి పెళ్ళి చేస్తానని శపథం చేశాడు.

అంతలో, పూరీ జగన్నాథ రథోత్సవం వచ్చింది. యథావిధిగా రాజు భక్తికొద్దీ రథ మార్గాన్ని ఊడ్చి శుభ్రం చేస్తున్నాడు. ఆ సమయంలో అతని మంత్రి కంచి రాకుమారిని అక్కడకు తెచ్చి, వీధులూడుస్తున్న గజపతి ప్రక్కన కూర్చోబెట్టి, "ఈమెను ఇప్పుడు మీరు పెళ్ళాడితే, వీధులూడ్చే వ్యక్తికిచ్చి పెళ్ళిచేస్తానన్న మీ శపథం నెరవేరుతుంది, ఈమెను పెళ్ళాడాలనే మీకోరికా తీరుతుంది" అని సూచించాడట.

ఇలా కులనిందకు గురైన గజపతులు రాయల కులాన్ని ఈసడించారంటే నమ్మబుద్ధికాదు. ఒరియా చరిత్ర కారులు రాయలతో గజపతి కూతురి పెళ్ళే జరగనే లేదని వాదించారందుకే!

రాయలవారి పెళ్ళికూతురు తుఖ్ఖాజీ రాయలుతో విడిపోయి కడపజిల్లాలో వంటరిగా జీవించింది. అక్కడ నాలుగు కొండల మధ్య ఒక చెరువు త్రవ్వించింది. కానీ, పనులు సాగకపోతే ఒక ముసలావిడ ఈ తటాకం నరబలి కోరుతోందంటూ పెదకంబయ్య, చిన కంబయ్య అనే తన బిడ్డల్ని బలిపెట్టింది. అలా, పెదకంబం, చినకంబం అనే రెండు ఊర్లు ఆ తటాకం ఆ ఇద్దరి పేరునా వెలిశాయి.

నిజానికి, రాయలకూ ఈమెకీ మధ్య వైరం ఈమె తండ్రి గజపతి వలనే కలిగింది. కూతురు ద్వారా రాయలును అంతం చేయదలిచాడు గణపతి. కానీ, రాయలు ఆ హత్యాయత్నంలోంచి తప్పించుకున్నాడు. ఫలితంగా రాయలే ఆమెను వదిలేశాడో, లేక కులం తక్కువ వాడని ఆమే రాయల్ని వదులుకున్నదోగానీ, ఆమె కడపజిల్లా కంబం దగ్గర ఉండిపోయింది.

కొంత ఆవేశకావేషాలు చల్లారాక తుఖ్ఖాపంచకం లేదా భృంగ పంచకం పేరుతో ఐదు శ్లోకాలు వ్రాసి రాయలకు పంపింది. రాయలు తనను నిర్లక్ష్యం చేసిన ఆవేదన, దానితోపాటు ఆమెలో కలిగిన పరివర్తన ఇందులో కనిపిస్తాయి.

1. ఈ అడవిలో పూలగుత్తులమీద వ్రాలే తుమ్మెద సంపెంగ పువ్వు మీద కూడా వాలింది గానీ, దాన్ని ఆఘ్రాణించటంలేదు, సంపెంగపువ్వుకు మంచి రంగు, రుచి సువాసన కూడా ఉన్నాయి. అయినా తుమ్మెదకు దాని మీద ఆసక్తి లేకపోవటానికి విధి కారణం. ఈశ్వరాజ్ఞ ఆవిధంగా ఉంది.

2. ఓ మోదుగ పువ్వా! ఈ తుమ్మెద తలమీదే తిరుగుతోందని విసుక్కుని ముకుళించాలని చూడకు. ఒక్కక్షణం ఆగు! మాలతి వలన విరహాగ్నిని పొందిన తుమ్మెద నిన్ను చూసి అగ్ని అనుకుంటుంది.
3. ఓ తుమ్మెదా! దిగంతరాళాలన్నీ తిరుగుతుంటావు కదా! ఎక్కడైనా జాతీ కుసుమం(జాజిపువ్వు) లాంటి పువ్వుని చూశావా? విన్నావా? ఆస్వాదించావా? పక్షపాతం లేకుండా నిజం చెప్పు!
4. బొమ్మలు గీసే చిత్రకారులు ఎన్నెన్నో పువ్వుల్ని అందంగా చిత్రిస్తారు కదా! కానీ ఆ పూలకు పరిమళం ఉంటుందా? ఆ బొమ్మ పూలలో తేనెని తుమ్మెదలు త్రాగగలవా?
5. ఆరు కాళ్ళున్న తుమ్మెద మాలతీ పుష్పాన్నీ, నన్నూ వదిలేసి తుమ్మి పూలను ముద్దాడుతోంది. ఆ తుమ్మెదకు కొంచెమైనా బుద్ధి ఉందా! నాలుగు కాళ్ళున్న వాటిని పశువులంటారు. ఈ ఆరుకాళ్ల తుమ్మెద అంతకంటే అధమం.

ఈ పంచకంలో మొదటి పద్యం చదవగానే "నానా సూన వితాన వాసనల నానందించు సారంగమే" అనే పద్యం గుర్తు కొస్తుంది. తనను తుమ్మెద నిర్లక్ష్యం చేసిందనే బాధతో, సంపంగిపువ్వు బ్రహ్మనుద్దేశించి తపస్సు చేసి అందమైన ఆడపిల్ల కొన దేలిన ముక్కులాంటి ఆకారాన్ని వరంగా పొందినట్టు "నంది తిమ్మన" వ్రాశాడు. అలా ఆయన 'ముక్కుతిమ్మన' అయ్యాడట. ఇది వసుచరిత్రలో పద్యం. రామరాజభూషణుడు ఈ పద్యాన్ని నంది తిమ్మనగారి దగ్గర కొనుక్కున్నాడట. రాజులకథలు, కవుల కథలూ ఇలా 'ట'కార ప్రయోగాలతో కూడుకున్నవే ఎక్కువ.

తన అల్లుడైన కృష్ణరాయలు చచ్చిపోయిన విషాదంలో విజయనగరం ఉన్నప్పుడు సుల్తానుల కన్నా ముందే గజపతి విజయనగరం మీదకు దాడివచ్చినట్టూ, ఈ తుఖ్ఖాదేవే తండ్రిమీదకు స్వయంగా సైన్యాన్ని నడిపించి వీరపత్ని అనిపించున్నట్టూ ఒక చాటువు చెప్తుంది. బహుశా తుఖ్ఖాపంచకం చదివాక రాయలు, ఆమే తిరిగి కలిసి ఉండవచ్చు కూడా!

అంతఃపురగాథలు జనంలోకి యథాతథంగా రావు. గొప్పవారి గోత్రాల గురించి జనం అల్లుకునే కథలే ఎక్కువ! వాటిలో రాముడూ-రజకుడూ కథలూ ఉంటాయి. ఆ కథల్లోంచి నిజాలు ఏరే ప్రయత్నమే ఈ తుఖ్ఖా పంచక విశ్లేషణ.

కృష్ణదేవరాయల పుట్టుక, కులం, భాష, పెళ్ళిళ్ళు, పరిపాలనకు సంబంధించిన కథలన్నీ ఇంచుమించు పుక్కిటి పురాణాలుగానే కనిపిస్తాయి. ఈ కల్పిత గాథల్లో రాయలు తుఖ్ఖా సంసార వ్యవహారం కూడా ఒకటి.

# తెలుగక్షరాల్లో తెలుగమ్మాయి

*"కన్నులు దీర్ఘముల్, నగుమొగంబవురా! తలకట్టు తుమ్మి పూ*
*పున్నమ చందమామలకుఁబొక్కిలి చక్కదనంబుఁజెప్పఁగా*
*నున్నదె? మేలు బంతులు పయోధరముల్ మఱి కౌనుసున్నయౌ*
*నెన్నిక కెక్కు వ్రాతఫల మివ్వరవర్ణినికి న్నిజంబుగన్"*

(చేమకూర వేంకటకవి విజయవిలాసం)

చేమకూర వేంకట కవి విజయవిలాసం కావ్యంలో తళుక్కున మెరిసిన ఈ పద్యం తెలుగక్షరాల ఔన్నత్య వర్ణనని అంతర్లీనంగా చేస్తుంది.

17వ శతాబ్ది తొలి పాదం నాటి చేమకూర వెంకట కవి తంజావూరు రఘునాథ నాయకుడి ఆస్థానంలో ఉండేవాడు. బహుశా ఈ విజయవిలాసమే ప్రబంధాలలో చివరిది కావచ్చునని పండితుల భావన. ప్రతి పద్యంలోనూ ఏదో ఒక చమక్కు ఉండేలా ఈ కావ్యాన్ని వ్రాశాడు.

కొందరి వ్రాతఫలం గొప్పగా పెట్టిపుట్టినట్టు ఉంటుందిట. వ్రాతఫలం అంటే. బ్రహ్మగారి వ్రాత వలన కలిగిన అదృష్టం.

ఈ అదృష్టం ఎవరికి దక్కిందీ...? ఒక వరవర్ణినికి!

అఆఇఈలన్నింటినీ కలిపి అక్షరమాల లేదా వర్ణమాల అంటాం కదా...అలాంటి 'వరవర్ణ సంపద' కలిగిన తెలుగుభాష లాంటిది ఆమె శరీర సౌందర్యం! మంచి శరీర వర్ణం కలిగినదనీ, వరాలన్నింటినీ కలిపి చేసిన గొప్ప వర్ణన లాంటిదనీ కూడా దీనికి అర్థాలు చెప్పుకోవచ్చు. వ్రాతఫలమా అన్నట్టుగా ఆ వరవర్ణిని ఉన్నదంటాడు

రైవతకోత్సవానికి వచ్చిన సుభద్రని చూసి యతివేషంలో ఉన్న అర్జునుడు తనలో తాను అనుకుంటున్న మాటలివి!

ఇది సుభద్రకు ఆపాదిస్తూ చేసిన ఓ తెలుగమ్మాయి వర్ణన.

తన అక్షరాలను వెన్నెట్లో ఆడుకునే ఆడపిల్లల్తో పోల్చుకున్న తిలక్ ఆలోచనలకు ఈ పద్యం ఒక ప్రేరకం.

అందమైన తెలుగు అక్షరాల్లా పొందికగా ఉన్నది సుభద్ర అని చెప్పదలచాడు కవి. తాను తెలుగు వాడు కాబట్టి, వ్రాస్తున్నది తెలుగు ప్రబంధ కావ్యం కాబట్టి, తన తెలుగు అక్షరాల్లా ఆమె అందంగా ఉందని ఒక అద్భుత భావన చేశాడు.

తెలుగు వ్రాతపతిని చూసినప్పుడు దీర్ఘాలు, తలకట్లు, సున్నాలు ఎంతో అందంగా

అమరిన పంక్తులు ఇవన్నీ మన వ్రాతఫలమా అన్నట్టు జరీ అంచు చీరలా చూడముచ్చటగా ఉంటాయి. సుభద్ర కూడా అలానే ఉన్నదిట!

ఆమె కన్నులు దీర్ఘాల్లా ఉన్నాయి....

ఆమె నవ్వుముఖం తలకట్టు (గుడి)లాగా, తుమ్మిపూవులాగా, పున్నమి చంద్రుడిలాగా గుండ్రంగా వెలిగి పోతోంది... పొక్కిలి అంటే నాభి. దాని (శ అక్షరం లాగా శంఖాకృతిలోఉన్న) అందం చెప్పనక్కరలేనంత గొప్పగా ఉంది...

ఇలా వర్ణిస్తూ, పయోధరాల దగ్గరకు వచ్చే సరికి అవి మేలుబంతుల్లా ఉన్నాయంటాడు...

పైకి ఈ అర్థంలోనే అన్నట్టే కనిపిస్తుందిగానీ, ఒక మహా కవి అంత తక్కువస్థాయికి దిగజారి అని ఉంటాడా...? లేదు.

ఇందులో ఇంకేదో నిగూడార్థం ఉండే ఉంటుంది...! ఇక్కడ మనం వ్రాతఫలం గురించి చెప్పుకుంటున్నాం కాబట్టి, మేలుబంతులు అంటే చక్కగా అక్షరాలు పొదిగిన వ్రాత పంక్తులతో ఆమె పాలిండ్లను పోల్చాదన్నమాట. పాలిండ్ల విషయంలో పంక్తిని బంతి అనటమే చమత్కారం.

ఇప్పుడంటే చూచివ్రాత లేదా కాపీ రైటింగ్ పుస్తకాల వాడకం తగ్గిపోయింది. నాజూకు చదువులొచ్చాక వ్రాతఫలం తగ్గిపోసాగింది. ఒకప్పుడు తెలుగు అక్షరాలను లోతుగా చెక్కేవారు. వ్రేలుని ఆ అక్షరాల గుంటలోకి పోనిచ్చి వ్రాసేవారు అలా గుండ్రని వ్రాత వచ్చేలా సాధన చేయించేవాళ్ళు. కాపీ పుస్తకాల్లో పైన ఒక పంక్తిని గుండ్రంగా వ్రాసి, అలాగే క్రిందపంక్తుల్లో వ్రాయిస్తారు. ఆ మొదటి పంక్తిని 'తలబంతి' 'ఒజ్జబంతి' అంటారు. నిపుణుడు వ్రాసేది కాబట్టి తలబంతి గుండ్రంగా వుంటుంది. అదీ మేలుబంతి అంటే!

ఇంక నడుము విషయానికి వస్తే, అది ఉన్నట్టా లేనట్టా అన్నట్టు సున్నాలాగా ఉందంటాడు.

చేమకూర వేంకట కవి మాతృభాషాభిమానం అంతా ఈ పద్యంలో గూడు కట్టుకుని ఉంది. తెలుగు భాషలోని అక్షర సోయగాన్ని ఒక మహా సౌందర్యవతి అవయవ శోభతో పోల్చే ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది.

మన భాష వరవర్ణిని అనీ, మనది వ్రాతఫలం కలిగిన అంటే అద్భుత సాహిత్య సంపద కలిగిన భాష అనీ చాటి చెప్పదలచుకున్నాడాయన. మహాకవి కాబట్టి మన అక్షర వైభవాన్ని సుభద్రకు ఆపాదిస్తూ ఈ పద్యం వ్రాశాడు. అది మన వ్రాతఫలం.

# తెలుగులో ఏలుమన్నా!

*ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి*
*కేలూత యిచ్చి యెక్కించుకొనియె*
*మనుచరిత్రం బందుకొనువేళ బురమేగఁ*
*బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తె*
*బిరుదైన ఘనగండపెండేరమున కీవె*
*తగునని తానె పాదమున దొడగె*
*కోకట గ్రామా ద్యనేకాగ్రహారంబు*
*లడిగిన సీమలయందు నిచ్చె*
*నాంధ్రకవితాపితామహ! యల్లసాని*
*పెద్దన కవీంద్ర! యని నన్ను బిలుచునట్టి*
*కృష్ణరాయలతో దివి కేగలేక*
*బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబు కరణి.*

*(అల్లసాని పెద్దన చాటువు)*

కృష్ణదేవరాయలు మరణవార్త విని హతాశుడైన అల్లసాని పెద్దనగారు శోక సముద్రంలో మునిగిపోయాడు. ఆ శోకంలోంచి పుట్టిందే ఈ పద్యం.

తనని కృష్ణదేవరాయలు ఎంత ఆదరించాడో ఈ శోకసందేశంలో చెప్పుకున్నాడాయాన.

"రాచవీధిలో వెడుతూ ఎదురైనప్పుడు, భద్రగజం మీంచి కిందికి దిగి చేయందించి నన్ను ఏనుగెక్కించు కున్నాడు. మనుచరిత్ర అంకితం పుచ్చుకునే సమయంలో పల్లకీ ఎక్కించి ఆ పల్లకీని తన భుజస్కంథాలమీద మోస్తూ నన్ను ఊరేగించాడు. బిరుదైన ఘన గండపెండేరానికి నువ్వే తగినవాడివి అంటూ తన చేతులతో నా పాదానికి తొడిగాడు. కోకట గ్రామం మొదలైన అగ్రహారాలని కోరుకున్న సీమల్లో ఇచ్చాడు. "ఆంధ్రకవితా పితామహా! అల్లసాని పెద్దన కవీంద్రా" అని నన్ను పిలిచే ఆ కృష్ణరాయలతో దివికి వెళ్ళలేక ఇంకా బతికున్నాను, జీవచ్ఛవంలా..." అని వాపోయాడు అల్లసాని పెద్దన.

ఇవేవి అతిశయోక్తులు కావు. వాటికి శాసనాధారాలున్నాయి.

కడప జిల్లా కామలాపురం తాలూకాలోని కోకట గ్రామంలో దొరికిన క్రీ. శ. 1518 నాటి రెండు శాసనాలలో అల్లసాని చొక్కయ్యంగారి పుత్రులయిన

పెద్దయ్యంగారు తనకు కృష్ణదేవరాయలు ఇచ్చిన కోకట సర్వమాన్యా గ్రహారం లోంచి, అక్కడి శివాలయానికి కొంత భూమిని దానం చేసినట్లుంది.

కృష్ణదేవరాయలు దత్తం చేసిన తనైపూండి గ్రామంలో ముప్పాతిక భాగాన్ని అమ్మి కుంతళ సుందరీదేవికి కిరీటం, బంగారు పిడి చామరం, అరివాణం సమర్పించినట్లు చిత్తూరు జిల్లా మేల్పాడి గ్రామంలో దొరికిన ఇంకో శాసనంలో ఉంది. అగ్రహారాలివ్వటమే కాకుండా, సీమాధిపత్యం కూడా ఇచ్చినట్టు నేలటూరి వెంకట రమణయ్య గారు పేర్కొన్నారు.

అందుకే వాటిని సత్తెకాలపు రోజులన్నారు. సత్యం వర్ధిల్లిన రోజులని దాని భావం! కానీ, నోట్లో వ్రేలెడితే కొరకటం చేతకాని అమాయకులున్న రోజులని దాని అర్థం కాదు. కవులకు, కళాకారులకు, ఇతర రంగాల ప్రముఖులకు రాజాదరణ ఉన్న రోజులవి. ఇప్పుడా పరిస్థితి లేదు. అందుకే గొప్పపాలకుడెవరని అడిగితే కృష్ణదేవరాయలు అంటారే గానీ, ఫలానా ముఖ్యమంత్రి అనే వాళ్లు మనకు కనిపించరు. కారణం వాళ్లు సారస్వత పోషణ చేయకపోవటమే!

ఓ ఆసామి దారిలో పొలాలు, గట్లూ చూపిస్తూ "అవన్నీ మనవే! కౌలుకిచ్చేశాను" అంటే, వెంటనే మంగళంపల్లి వారు "అన్నీ కవులకేనా, మాబోటి సంగీతం వాళ్ళకూ ఏమైనా ఇచ్చారా...?" అనడిగాడట. కవులకు, మడులు, మణులు ఇచ్చే పాలన స్వాతంత్ర్యం తరువాత పూర్తిగా కనుమరుగైంది. కౌలుకిచ్చుకునే వాళ్ళే గానీ, కవుల కిచ్చే నాథుడే లేడు!

ఆధునిక యుగంలో ఏ కవీ మణిమాణిక్యాలు ఆశించి కవిత్వ రచన చేయలేదు. ఎందుకంటే ఇక్కడ అలాంటి ఆశలు నెరవేరే సరసత్వం, రసికత, రసాస్వాదన, రసపోషణ లాంటి విశేషణాలు వెయ్యదగిన వ్యక్తిత్వాలేవీ లేవు కాబట్టి!

పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కర్ణాటకల్లో కవులకు, కళాకారులకూ ఉన్న గౌరవం, గుర్తింపు తెలుగు రాష్ట్రాల్లో లేవు. అక్కడ వీధులకు, పేటలకు, ప్రాజెక్టులకు, సంస్థలకు కవులు, కళాకారుల పేర్లు పెడతారు. ఇక్కడ "మట్టిఖర్చులు" కూడా లేని స్థితి!

కర్ణాటకలో 18 అకాడెమీలు పనిచేస్తున్నాయి. జానపద కళల నుండి, క్లాసికల్ కళల దాకా అక్కడ ప్రోత్సహించే యంత్రాంగం ఉంది. ఇక్కడ తెలుగు పేరెత్తటానికి వీల్లేదనే ధోరణి!

ఇంగ్లీషుకు అడ్డంగా ఉన్నతెలుగు మీడియం స్కూళ్ళను రద్దు చేసేస్తానంటూ మొన్న ఒక మంత్రిగారు అంకమ్మ చిందులు తొక్కారు. విద్యావ్యవస్థలో పైస్థాయిలో ఉన్న చాలామందిలో గూడుకట్టుకున్న మాతృభాషా ద్వేషానికి ఈ చిందులు ప్రతీక.

ప్రజల్లో ఇంగ్లీషు వ్యామోహాన్ని సొమ్ము చేసుకోవాలనే తహతహలో అప్పుడప్పుడూ ఇలా తెలుగు మీద విరుచుకు పడుతుంటారు. వాళ్లని అలా ఎగిరేలా చేస్తోంది మనలోని ఆంగ్ల వ్యామోహమే కదా!

"తెలుగదేలనన్న" అని ప్రశ్నించి కృష్ణదేవరాయలు 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్నాడు.

మన రాష్ట్రంలో "తెలుగేలనన్నా...?" అనడుగుతున్నాడు విద్యాధికారి!

"తెలుగులో ఏలనన్నా!" అంటూన్నాడు ఐయేయస్ అధికారి.

తెలుగు భాషకే దిక్కులేదు, ఇంక భాషను ఆశ్రయించుకు బ్రతికే కవులకు ఉంటుందా?

కృష్ణదేవరాయలు తాను చేసిన యుద్ధాల వలన కాదు, తన సాహితీ పోషణ వలన ప్రజల్లో చిరస్థాయిగా నిలిచి పోయాడు. ఆ మహాయోధుణ్ణి బ్రతికించింది కవులూ కళాకారులే! స్వాతంత్ర్యం వచ్చాక ఒక్క కవి లేదా కళాకారుడు ఫలానా ముఖ్యమంత్రి లేదా మంత్రి తనకు చేయందించి గౌరవించాడని ఘనంగా వ్రాసుకున్నాడా? అసలలాంటి దృశ్యాలు మన ఊహకందేనా?

కవులకు ప్రభువులు ఇచ్చింది వృధా పోదు. అంతకు అంతై తిరిగి కీర్తి రూపాన వస్తుంది. ఈ చిన్ని సూక్ష్మాన్ని గ్రహించలేని రాజకీయవేత్తలు పదవులు దిగాక కాలగర్భంలో కలిసిపోయారు... తలచుకునే వాడే లేక!

"కారే రాజులు? రాజ్యముల్ కలుగవే? గర్వోన్నతిన్ బొందరే? వా/రేరీ? సిరి మూట కట్టుకొని పోవంజాలిరే? భూమిపై పేరైనం గలదే? శిబి ప్రముఖులున్ ప్రీతిన్ యశఃకాములై/ఈరే కోర్కెలు? వారలన్ మరచిరే ఇక్కాలమున్ భార్గవా!"అన్న పోతన గారి పద్యం గుర్తుకొస్తుంది. గర్వోన్నతిని పొందిన ప్రభువుల్ని కాలం మరిచిపోతుందంటారీ పద్యంలో పోతన.

ఈ ఘోషంతా భాషా సంస్కృతుల పట్ల శత్రువైఖరి విడనాడాలని కోరటానికే! భాషని మనం బతికిస్తే భాష మనల్ని బతికిస్తుంది. భాష నశిస్తే జాతి ఉనికి నశిస్తుందన్న సత్యాన్ని గుర్తు చేయటానికే! నాలుగేళ్ళుగా ఒక్క పుస్తకమూ కొనని గ్రంథాలయ వ్యవస్థని కూర్చోపెట్టి పోషించే ప్రభుత్వం ఈ భూమ్మీద ఇంకొకటి ఉంటుందా...?

# తోకనాయకులు

*రాగలదోయి! ధర్మసమరం బిది భారతజాతి ముక్తికై*
*సాగినదోయి దాస్యమునజచ్చియుజావనివారలందఱున్*
*ద్యాగముశాంతిసత్యమునుదప్పనియస్త్రములై, జగజ్జయ*
*శ్రీగురియింపసంగరముసేయుచు, త్రోయుదుమాతృదుఃఖమున్*

(మహాత్మకథ: తుమ్మలసీతారామమూర్తిచౌదరి)

గాంధీజీసహాయనిరాకరణోద్యమానికిపిలుపిచ్చాడు. దేశప్రజలు ఈఉద్యమంలో ఎలా పాల్గోవాలో, కర్తవ్యబోధచేశాడు. ఆసందర్భంలో పద్యం ఇది. తుమ్మల సీతారామమూర్తి చౌదరిప్రాసిన 'మహాత్మకథ' కావ్యంలోది ఈ పద్యం.

తెలుగులెంక, అభినవ తిక్కనగాప్రసిద్ధులైన తుమ్మల సీతారామమూర్తి (డిసెంబరు 25, 1901 - మార్చి 21, 1990) తెలుగుదనం మూర్తీభవించిన జాతీయోద్యమ కవి. గాంధీదర్శనాన్ని, దేశభక్తిని, తెలుగు ప్రశస్తిని లోకానికి చాటుతూ శతాధిక గ్రంథాలు వ్రాశారు. బాపూజీ ఆత్మకథ, మహాత్మ కథ వ్రాశారు.

ఆయనకు గల అభినవతిక్కన బిరుదుని ప్రశ్నిస్తూ, మీ పద్యాల్లో అత్యుత్తమమైంది, తిక్కన పద్యాల్లో పరమ చెత్తగా ఉన్నదీ ఏరి, దానికన్నా మీ ఉత్తమ పద్యం ఎలా గొప్పదో చెప్పాలని అడిగాడట ఓ ఆగంతకుడు. "నన్నుఅభినవతిక్కన అని వాళ్ళూ వీళ్ళూ అంటూంటే ఊరుకోవడం పొరబాటని ఇప్పుడు తెలిసింది. ఈ సభాముఖంగా నేను ఆ బిరుదు వదిలేస్తున్నాను. తెలుగు లెంకగానూ, మహాత్ముని ఆస్థానకవిగానూ పిలిపించుకోవటానికి అర్హత నిలబెట్టుకుంటాను" అన్నారట ఆయన. గాంధేయ వాదాన్ని మనసా వాచా కర్మణా నమ్మిన వ్యక్తి తుమ్మలవారు.

గాంధీ సహాయనిరాకరణ ఉద్యమంలోకి రావలసిందిగా దేశప్రజ లందరికీ పిలుపు నిచ్చాడు. ప్రభుత్వానికి ఏవిధంగానూ సహకరించకుండా ఉండటం ఆ ఉద్యమం.

"ఓభారతీయులారా! ధర్మయుద్ధం రాబోతోంది. భరతజాతి దాస్య విముక్తి కోసం జరిపే ధర్మయుద్ధం ఇది. బానిసల్లా, జీవచ్ఛవాల్లా బతుకుతున్న దేశీయులంతా త్యాగం, శాంతి, సత్యం సూత్రాలను విధిగా పాటిస్తూ పోరాట దీక్ష తీసుకోవాలి. ఇవే ఆంగ్లేయులను తరిమేసే ఆయుధాలు మనకి. గెలుపు స్వంతం చేసుకోవటం కోసం పోరాడండి. భరతమాత శోకాన్ని తొలగించండి" అని గాంధీ పిలుపు నిచ్చినట్టు తుమ్మలవారు వర్ణిస్తారు. త్యాగం, శాంతి, సత్యం ఆయుధాలుగా చేసుకోగలిగాడు కాబట్టే, ప్రపంచంలో విముక్తి పోరాటాలకు గాంధీ మార్గం ఆదర్శం అయ్యింది.

స్వాతంత్ర్యం తరువాత పుట్టిన వారికి లేదా పెరిగిన వారికి స్వాతంత్రోద్యమం నాటి అనుభూతులను అనుభవించే అదృష్టం లేదు. ఆనాడు ఏకనాయకత్వాన్ని

ఆమోదించి దేశీయులంతా గాంధీ వెంట నడవటానికి, ఈరోజున అలాంటి ఏకనాయకత్వం లేకపోవటానికీ కారణాలను మనం పరిశీలించవలసిందే! ఒక రంగంలో కాకపోతే మరొకరంగంలోనైనా ప్రజలను సామూహికంగా నడిపించగలిగే ప్రతిభావంతుడి కోసం జనం ఎదురు చూస్తోన్నారు.

నిజానికి స్వాతంత్రోద్యమ దీప్తి రేకెత్తించి, ప్రజల్లో స్వాతంత్ర కాంక్ష కసిగా రగిలేలా చేసినవాడు లోకమాన్య బాలగంగాధర తిలక్. బ్రిటిష్ వారితో కన్నా కాంగ్రెస్ వారితోనే ఆయన ఎక్కువ పోరాడవలసి వచ్చింది. తిలక్ చరమాంకంలో గాంధీ రాజకీయ రంగం మీదకు వచ్చారు. భగవద్గీతను అమూలాగ్రం శోధించిన తిలక్ మహాశయుడి మాదిరే గాంధీ కూడా సంస్కృత శ్లోకాలను ఉదహరిస్తూ జనాన్ని ఆకట్టుకోవటం మొదలు పెట్టాడు. తన గురువుగా తిలక్'ని గాంధీ గౌరవించాడు. కానీ, త్యాగం, శాంతి, సత్యం సూత్రాలలో శాంతి (అహింస) విషయంలో తిలక్ గాంధీతో విబేధించినా గాంధీ అహింసాత్మక పోరాట బాట వదల్లేదు.

తిలక్ అనుభవాలు తిలక్'వి. 1907 సూరత్ కాంగ్రెస్ సభలో ఎవరో విసిరిన బూటు తిన్నగా వెళ్ళి స్టేజీ మీద కూర్చున్న సురేంద్రనాథ్ బెనర్జీకి తగిలింది. అది తిలక్ మాట్లాడుతుండగా జరిగింది. బూటు తిలక్ మీదకే విసిరేరో, సురేంద్రనాథ్ బెనర్జీ మీదకే విసిరేరో తెలీదు. తిలక్ వర్గీయుల్ని వేదిక ఎక్కనీయకుండా చేసిన కుట్రకు బదులుగా తిలక్ వర్గీయులు ఆ రోజు వేదిక మీదకు దూసుకొచ్చి స్టేజీ మీద ఉన్న వాళ్ళందరినీ తన్ని తరిమేసి వేదికను హస్తగతం చేసుకున్నారు.

అహింసావాదాన్ని అందుకే తిలక్ అంగీకరించ లేకపోయాడు. గాంధీ క్రమేణా అతివాదులైన తిలక్ వర్గీయుల్నీ, మితవాదులైన తిలక్ వ్యతిరేక వర్గీయుల్ని తనదారికి తెచ్చుకోవటానికి అహింసనే వాడుకున్నాడు. దేశ ప్రజలు ఆ తేడాని గుర్తించారు. గాంధీ వెంటనడిచారు. తిలక్ మరణించిన తరువాత 1921లో బెజవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో తిలక్ వారసుడిగా, కాంగ్రెస్ నాయకుడిగా గాంధీ ఎంపికయ్యారు.

విజయవాడలో ఇప్పటి గాంధీనగరంగా పిలువబడుతున్న ప్రాంతం ఆరోజున ఖాళీస్థలం. అక్కడ జరిగిన బహిరంగసభలో గాంధీ సూచన మీద పింగళి వెంకయ్యా రూపొందించిన జాతీయజెండాని గాంధీజీ ఆవిష్కరించారు. అయితే ఎజెండాలో ఆ విషయాన్ని పెట్టటానికి సమయం లేకపోవటం వలన అధికారికంగా ప్రకటించ లేకపోయారు. స్వాతంత్ర్యానంతరం ఆ జెండానే జాతీయజెండాగా ఆమోదించటం జరిగింది. కానీ, ఆవిషయాన్నీ, దాని రూపకర్త పింగళి వెంకయ్యగారి పేరునూ ప్రభుత్వం రికార్డ్ చేయలేదు. చేయకపోవటం వాళ్ల తప్పు. వెంటపడి చేయించుకోక పోవటం మనవాళ్ళ తప్పు. "మీరు ఢిల్లీ వచ్చేది ఒకరి మీద ఒకరు చాడీలు చెప్పుకోవటానికేగా?" అని గాంధీ మననాయకుల్ని ఈసడించాడంటే సిగ్గుపడాల్సింది మనం.

తోకనాయకులే తప్ప మనకో లోకనాయకుడు లేని లోటు స్పష్టంగా కనిపిస్తోంది.

# దాచిన వెన్నెల

*కలనాటి ధనము లక్కర*
*గలనాటికి దాచ, గమలగర్భుని వశమా?*
*నెలనడిమినాటి వెన్నెల*
*యలవడునే గాదెబోయ నమవసనిసికిన్*

(అల్లాసాని పెద్దన 'మనుచరిత్ర')

ఇది అల్లసాని పెద్దనగారి ప్రసిద్ధ పద్యం. తెలుగు పద్య సాహిత్యంతో పరిచయం ఉన్నవారందరికీ తెలిసిన పద్యమే! ప్రతీ మనిషి జీవితంలోనూ 'కల' రోజులుంటాయి. 'లేని' రోజులూ ఉంటాయి. రేపెప్పుడో అవసరం అవుతాయని తన డబ్బంతా ఇవ్వాళ అవసరాలు తీరకుండా దాయటం అనేది ఆ దేవదేవుడికీ సాధ్యం కాదు. నెలనడిమి నాటి వెన్నెల్ని అమవసనిసి కోసం దాయటం ఎంతకష్టమో కలనాటి ధనాన్ని అక్కరగలనాటికి దాచటం అనేదీ అంతే కష్టం అంటాడు కవి. కష్టమే కాదు, నష్టం కూడా!

డబ్బు ఎప్పుడూ అందరి చేతుల్లో తిరగాలి. కొందరి బీరువాల్లోనో, నేలమాళిగల్లోనో, బాత్రూం అటకమీద లాకర్లోనో బందీ కాకూడదనే సత్యం పెద్దనగారి మాటల్లో కనిపిస్తుంది. ఈ పద్యంలో ఆమావాస్యనిశి అనటానికి "అమవసనిసి" అని ప్రయోగించాడని పెద్దన మీద తెనాలి రామకృష్ణకవి పెద్ద ధ్వజం ఎత్తాడు. దీర్ఘాలు, వత్తులు తీసేసి "ఎమితిని సెపితివి కపితము/బ్రమపడి వెఱిపుచ్చ కయ వడి దిని సెపితో/యుమెతక్కయ దిని సెపితో/యమవసనిసి యన్నమాట యలసని పెదనా" అని ఎద్దేవా చేశాడు.

పెద్దన 15వ శతాబ్ది వాడు. డబ్బుకు ప్రాధాన్యం లేని రోజులవి! అప్పటికి జనం అవసరాలు కూడా తక్కువ. అందుకనే, డబ్బు ప్రాధాన్యత పెరిగితే భాష మీద కూడా దాని ప్రభావం ఉంటుందని గ్రహించాడు పెద్దన. డబ్బు చుట్టూ పెనవేసుకు పోయిన ఈ 21వ శతాబ్దపు జీవన వ్యవస్థలో మాటల పొందికలో చాలా మార్పులు కనిపిస్తాయి. సంక్షిప్త సందేశాలు, యస్సెమ్మెస్ మెసేజీల్లో అక్షరాల కుదింపు ఇందుకు మంచి ఉదాహరణ. for కి 4 అని వేయటం, గుడ్'మార్నింగ్ అనటానికి జియం అనటం 'అమవసనిసి' లాంటి ప్రయోగాలే! ఇలాంటి ప్రయోగాలకు వెఱ్ఱిపుచ్చకాయనో ఉమ్మెత్త కాయనో తినాల్సిన అవసరం లేదు. డబ్బు దోచి దాచేయటాన్ని ఎద్దేవా చేస్తున్నాడు కాబట్టి పెద్దనగారు అక్షరాల పొదుపుతో 'అమవసనిసి' అన్నాడు. తెనాలి కవి పెద్దనగారి ఈ కవిహృదయాన్ని సరిగా అర్థం చేసుకోలేదు.

ఊరి సంపదనంతటినీ ఒక్కడే హక్కుభుక్తం చేసుకొని తరువాతి తరాలవారికి గుట్టలుగుట్టలుగా అందించాలని అనుకోవటాన్ని ఈ పద్యం తీవ్రంగా తప్పుబడ్తోంది. నల్లడబ్బుని పోగేయటాన్ని అమావాస్య కోసం పున్నమి వెన్నెలను దాచి ఉంచటంగా పోల్చటం గొప్పగా ఉంది. ఇది బడాబాబుల నల్లడబ్బుని తప్పుపడ్తోందే కానీ, సామాన్యుడు పొదుపుగా జీవించటాన్ని కాదు. మిగులు ధనాన్ని అమావాస్య చీకటితో పోల్చటం ద్వారా అది నల్లడబ్బు అనే భావనని కూడా కలిగించాడు పెద్దనగారు.

చెలామణిలో ఉంటే డబ్బు కొరత ఉండదు. చెలామణిని అరికట్టే పనులు జనసామాన్యం వలన కూడా జరుగుతుంటాయి. పుకార్లను నమ్మి సామాన్యుడు చేసే పొరబాట్లు అప్పుడప్పుడూ ఈ పరిస్థితిని తెస్తాయి! ఏరువాక సీజన్ రాగానే ఎరువుల రేట్లు పెరుగుతున్నట్టు పుకారు వ్యాపిస్తుంది. దాంతో ప్రతి ఒక్కరూ మళ్ళీ దొరకవేమో అన్నట్టు అవసరానికి మించి అధిక ధరలకు కొనేయాలని చూస్తారు. దాంతో డిమాండ్ పెరిగి కొరత ఏర్పడుతుంది. చివరికి అది రైతుల ఆత్మహత్యదాకా వెడుతుంది.

మోడీగారు నోట్ల రద్దు ప్రకటన చేసిన మూడోరోజు కిలో ఉప్పు ప్యాకెట్టు రూ. 300 అయ్యిందంటూ పెద్ద పుకారు లేచింది! అంతే! వెంటనే జనం ఉప్పుకోసం కిరాణా షాపుల మీద ఎగపడ్డారు. ఒకాయన లైన్లో నిలబడి ఖరీదైన చొక్కా చింపుకుని, కిలో 120 చొప్పున 4 ప్యాకెట్లు ఏకంగా కొనగలిగినందుకు వెలిగి పోతున్న ముఖంతో కనిపించాడు. నిజానికి ఉప్పు కొరత లేనే లేదు. దాని అసలు ఖరీదు 12 రూపాయలు. అది బాగానే దొరుకుతోంది ఆ సమయంలో! జనమే అనాలోచితంగా ఎగబడి నల్లవ్యాపారానికి కారకులయ్యారు. ఇదీ అమవసనిసి అంటే!

షాపింగ్ మాల్స్ మనచేత అవసరానికి మించి కొనిపించే పనిని బాగా చేయిస్తున్నాయి. బెజవాడలో ఒక "పెద్ద" షాపింగ్ మాల్లో అవసరానికి మించి కొనటమే తెలివి గలవారి పనిగా ఒక నినాదం కూడా వ్రాసి బోర్డు పెట్టారు. నెలకి 2 పెద్ద సబ్బులు సరిపోయే చిన్న కుటుంబం చేత 5 సబ్బులు కొంటే ఒక సబ్బు ఉచితంగా ఇవ్వటం ద్వారా మూడునెలలకు సరిపడ కొనుగోలు చేయిస్తున్నాడు షాపు యజమాని. పున్నమి వెన్నెలను అమావాస్య కోసం దాచిపెట్టుకోవటమే తెలివి అని మనల్ని నమ్మమంటున్నాడు. మనం అధికంగా కొన్న ఆ వస్తువులను ఏం చేసుకుంటామన్నది వేరే సంగతి, కానీ, రేపటి వ్యాపారాన్ని ఇవ్వాళే చేసేస్తున్న వాళ్ళ తెలివి ముందు మనం బలాదూరైపోతున్నాం.

పెన్షన్లు, ఇన్సూరెన్సులూ, బ్యాంకుల్లో ఫిక్సెడ్ డిపాజిట్లు, పోస్టల్ వారి పొదుపుపథకాలు ఇంకా ఇతర ప్రైవేట్ కంపెనీల పొదుపు-మదుపు వ్యాపారాలు ఎన్నో మనకు వృద్ధాప్యం అమావాస్యకోసం వెన్నెలను దాచుకోవాలనే చెప్తున్నాయి.

డబ్బు చెలామణిని ఈ రకం దాపరికం నిరోధించదు కాబట్టి, ఇది అమవసనిసి లాంటి ఎర్రిపుచ వ్యవహారం కాదు. కానీ, బాత్రూం లాకర్లోనో కారు డిక్కీలోనో వందలాది కోట్ల 2,000 రూపాయల నోట్లు దాచటం ఉందే...అదీ ఉమెతకయ తిన్న వ్యవహారం.

ఇక్కడ బ్యాంకుల్లోనూ, ఏటీయమ్ముల్లోనూ చిల్లర కోసం రోడ్డు చివరి దాకా వ్యాపించిన క్యూ లైన్లో నిలబడ లేక సొమ్మసిల్లిన ఓ పెద్దాయన్ని ఒక బ్యాంకు మేనేజరు గారు "మా బ్యాంకులో డబ్బులు వెయ్యమని మిమ్మల్నేమైనా బతిమాలామా?" అనడిగాడట.

అలాంటి వాళ్ళు కూడా మనుషుల్లో తప్పబుట్టిన వాళ్ళుంటారు. ఆయన ఉమెతకయ తిని అలా వాగి ఉండవచ్చు, కొత్త డబ్బు వచ్చిన నెలరోజుల్లోపే కోట్ల సంఖ్యలో నేలమాళిగల్లోకి చేరటానికి ఇలాంటి ఉమెతకయల సహకారం లేకుండా సాధ్యమౌతుందా?

నోట్ల రద్దువలన ఇంతమంది నల్లమనుషులు బికారులైనట్టు ప్రభుత్వం ప్రకటించిందా?

నోట్లరద్దు తర్వాత దేశంలోనూ, రాష్ట్రంలో కూడా జరిగిన ఎన్నికల్లో డబ్బు ప్రవహించిన సంగతి బహిరంగమేకదా!

నోట్లరద్దు తర్వాత పాకిస్థానీ పోషక గడుసువాదం ఏ కాస్తైనా తగ్గిందా? పైగా పెరిగింది?

దేశంలో 'ఉమెతకయ' లాంటి అధికారులు, గన్నేరుపప్పులాంటి పై స్థాయి పెద్దలు, లోకానికి జిల్లేడుపాలు పోసే పాలనా వ్యవస్థ వున్నంతకాలం రేపటి చీకటి కోసం నేటి వెన్నెల ఎక్కడున్నదా అని సామాన్యుడు వెదకులాడక తప్పదు.

# 'దెప్పిపొడుపు'

*చచ్చిరి సోదరుల్, సుతులు చచ్చిరి, చచ్చిరి రాజులెల్ల, రీ*
*కచ్చెకు మూలకందమగు కర్ణుడు మామయుఁజచ్చి,రీ గతిం*
*బచ్చని కొంప మాపితివి, బాపురె, కౌరవనాథ!, నే సగం*
*బిచ్చెద, జీవితేచ్ఛ గలదేని బయల్పడుమయ్య! గ్రక్కునన్*

*(తిరుపతి వేంకట కవులు – పాండవ విజయము--సప్తమాంకము)*

తిరుపతి వేంకట కవుల ప్రసిద్ధ 'దెప్పిపొడుపు' పద్యం ఇది. దెప్పిపొడుపు మాటలు వేధింపు కాదని వరకట్న కేసులో ఢిల్లీ కోర్టు వ్యాఖ్యానించిన తరువాత ఈ పద్యానికి ప్రాముఖ్యత ఉంది కూడా!

క్వతిష్ఠ తస్తే పితరౌ మమేతి
అపర్ణ యోక్తే పరిహాస పూర్వం
క్వవా మమేవ శ్వసురౌ తవేతి
తామీరయన్ సస్మిత మీశ్వరోవ్యాత్ (శ్రీ కృష్ణకర్ణామృతమ్) అనే శ్లోకంలో 'నాకున్న గొప్ప తల్లిదండ్రులు నీకు లేరు' అంటూ శివుణ్ణి దెప్పిపొడిచింది పార్వతి. 'నాకున్న గొప్ప అత్తమామలు నీకూ లేరుగా!' అని బదులు చెప్పాడు శివుడు. ఇద్దరి దెప్పిపొడుపులు ఇంత ముచ్చటగా ఉన్నాయి.

భార్యా భర్తల దెప్పిపొడుపులు అర్ధనారీశ్వర తత్వానికి నిదర్శనాలు కాబట్టి, ఢిల్లీ హైకోర్టు ఈ దెప్పిపొడుపుల్ని గృహహింస కాదుపొమ్మంది.

దెప్పిపొడుపులో దెప్పు, పొడుపు అనేవి వేర్వేరు పదాలు. దెప్పు అనే పదానికి బ్రౌన్ ఇచ్చిన ఆంగ్ల సమానార్థకాలు To taunt, quiz, gibe at, slander, tell tales of satirize అని! దెప్పుడు మాటల్ని sarcasm అంటారు. పొడుపుడు మాటని a taunt or jeer అంటారు.

ఈ పద్యంలో ధర్మరాజు దుర్యోధనుణ్ణి దెప్పిపొడుస్తున్నాడు. అలాగే, ఎత్తిపొడుస్తున్నాడు కూడా. పొడవటం అంటే మాటల్తో వేధించటమే!

వేధింపుని హింసకాదని సదరు కోర్టులవారు ఎలా ప్రకటించారో తెలీదుగానీ, ఖచ్చితంగా హింసించటం కోసమే ధర్మరాజు ఈ పద్యం చెప్పాడు. కత్తితో కోసి హింస పెడితే ఆ గాయం మందుతో తగ్గుతుంది. మాటలతో హింసపెట్టిన గాయానికి మందులుండవు. దీర్ఘకాలం మాదకుండా బాధిస్తాయి.

యుద్ధంలో వైరి వర్గాలు దెప్పిపొడుచుకున్నారంటే అర్థం చేసుకోగలం, సంసారంలో భార్యాభర్తలు హింసపెట్టటమే ధ్యేయంగా దెప్పిపొడుచుకొంటే ఎంత సాంకేతికంగా చూసినా అది గృహహింస కాకుండా పోతుందా?

'దెప్పిపొడవటం' అనటంలో ఉన్నంత హింస sarcasm అనటంలో లేకపోయి ఉండవచ్చు. అందుకని కోర్టు అలా తీర్పు ఇచ్చి ఉండవచ్చు.

దుర్యోధనుడు పాండవులతో యుద్ధం చేయలేక తనకు తెలిసిన జలస్తంభన విద్యతో ఒక నీటి మడుగులో దాగున్నాడు. దుర్యోధనుణ్ణి వెదుకుతూ పాండవులు ఆ నీటిమడుగు దగ్గరకు వచ్చారు. కృష్ణుడు కూడా వాళ్లతో ఉన్నాడు. నీళ్ళలో దుర్యోధనుడున్నాడని పసిగట్టారు.

నాటకీయత కోసం దుర్యోధనుణ్ణి యుద్ధంలో మిగిలిన వాళ్లతో పాటు చంపేయకుండా ఈ నీటిమడుగు సీను సృష్టించారు కవులు. మడుగు ఒడ్డున నిలబడి ధర్మరాజు దుర్యోధనుడికి వినపడేలాగా బిగ్గరగా ఇలా మాట్లాడాడు:

దుర్యోధనా! నువ్వు ఈ మడుగులో దాగావని మాకు తెలుసు. నీ వందమంది తమ్ముళ్ళూ చచ్చారు. మీ పిల్లలూ చచ్చారు.నీకు మద్దత్తుగా వచ్చిన రాజులంతా వాళ్ల సైన్యాలతో సహా చచ్చారు. ఈ యుద్ధానికి మూలకందమైన కర్ణుడు, నీ, మేనమామ శకుని కూడా చచ్చారు" అన్నాడు.

అది విని ఏడ్చుకుంటూ దుర్యోధనుడు మడుగులోంచి బయటకు వచ్చేస్తాడని ధర్మరాజు కూడా ఏమీ దురాశపడలేదు. దురోధనుడికి ఆత్మాభిమానం ఎక్కువని పెద్ద పేరుకదా!

చాలామంది తాము నిర్మొహమాటంగా మాట్లాడతామని గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. కానీ, ఎదుటిమనిషి నిర్మొహమాటంగా మాట్లాడితే ఒక్క నిమిషం కూడా సహించలేరు. ఎదుటి మనిషిక్కూడా ఆత్మాభిమానం ఉంటుందని గుర్తించలేక పోవటమే ఈ ధోరణికి కారణం. దుర్యోధనుడి ఆత్మాభిమానం అలాంటిదే!

ఇప్పుడు అలా ధర్మరాజు నిర్మొహమాటంగా ఒక మాట అన్నాడు. "దుర్యోధనా! నీకు బతకాలని ఉంటే బయటకు రా! అర్ధరాజ్యం నేనే ఇస్తాను" అని!

ఆ రోజు ఐదూళ్ళు అడిగితే, సూదిమొన మోపినంత నేల కూడా ఇవ్వనన్న తనతో ఇవ్వాళ ధర్మరాజు " నీకు బతకాలని ఆశ ఉంటే బయటకు రా! అర్ధరాజ్యం ఇస్తా!" అనటం దెప్పిపొడుపే.

దెప్పిపొడవటం సరస సంభాషణలోనూ, విరస సంభాషణలోనూ రాణిస్తుంది. సరసం ప్రేమానుబంధాలు పెరగటానికి దోహద పడితే, విరసం విరోధుల్ని హింసించటానికి కారణం అవుతుంది.

అర్ధనారీశ్వర తత్వంలో సరసానికి మాత్రమే చోటుంటుంది.

# నదికిచ్చే మాట పుష్కరం

*తెలుగు నేల పొలాలకు జలములొసగి*
*తెలుగువారల మతులకు తేజమిచ్చి*
*తెలుగు దేశమ్ము కీర్తికి వెలుగు కూర్చు*
*కృష్ణవేణీ నది ! నమస్కృతులు గొనుము....*

(డా. దివాకర్ల వేంకటావధాని కృష్ణవేణి కవితలోంచి)

డెల్టా అనేది గ్రీకు వర్ణమాలలో నాలుగో అక్షరం. దీన్ని త్రికోణం ఆకృతిలో వ్రాస్తారు నదీజలాలు ఎంతమేర భూభాగానికి ప్రవహించి ఒండ్రును తెచ్చి అందిస్తుందో అంతమేరనీ 'డెల్టా' అంటారు.

గ్రీకు వర్ణమాలలో డెల్టా అనేది నాలుగో అక్షరం. త్రికోణం ఈ అక్షరానికి సంకేతం. నదికి నాలుగు మూలలకు కాలువల ద్వారా నీటిని మళ్ళిస్తే నదినీ, నదీ ముఖద్వారాన్నీ(సాగర సంగమ స్థలి), కాలువల చివరి అంచు పంటభూమినీ కలిపిన త్రికోణాకృతిని ఈ 'డెల్టా' పేరుతో డెల్టాభూములని వ్యవహరిస్తారు.

నైలూ నదీపరీవాహక ప్రాంతాన్ని మొదటగా 'డెల్టా' పదంతో వ్యవహరించారు. నది పరిసర భూముల్లోకి నదీ జలం ఎంతమేర అందుతుందో అంతమేర డెల్టాయే!

డెల్టా ఎప్పుడూ ఉంది. వరదలొస్తే ఎంత మేర భూమి మునుగుతుందో అంతమేరను మాత్రమే 'డెల్టా' అనేవారు. కాటన్ పుణ్యవశాన గోదావరి, కృష్ణా నదుల మీద ఆనకట్టలు ఏర్పడ్డాయి, ఆనకట్టల నుండి వేల ఎకరాల భూములను తడిపే వీలుగా కాలువలు తవ్వి, ఆధునికంగా కృష్ణా, గోదావరి డెల్టాలను రూపొందించారు.

అంతకు మునుపు గుంటూరు కరువుగా ప్రసిద్ధమైన 'ధాతకరువు'తో కృష్ణాతీరం అతలాకుతలం అయ్యింది. కూలంకషంగా అంటే, నది ఇరుగట్టుల్నీ ఒరుసుకుంటూ నీళ్ళు నిండుగా ప్రవహిస్తున్నప్పటికీ కృష్ణానది ఒడ్డున పంటభూములన్నీ ఎండిపోయి, కరువు పరిస్థితులు తరచూ తలెత్తుతున్నప్పుడు,1792లో మేజర్ అలెగ్జాండర్ బీట్స్ బెజవాడ వద్ద కృష్ణమ్మకు ఆనకట్ట కట్టాలని సూచించాడు.

కానీ, ఆనాటి బ్రిటిష్ వలస ప్రభుత్వం ఆయన సూచనను పక్కనపెట్టేసింది.

బ్రిటిష్ అధికారులే అనేకమంది అనేక విజ్ఞప్తులు చేసిన పుణ్యానికి లండన్ ప్రభుత్వం కొంత కదిలింది. కొంచెం పెట్టుబడి పెట్టి ఆనకట్ట కట్టిస్తే పంటలు బాగా పండుతాయి. అందువలన రెట్టింపు ఆదాయం సమకూరుతుందని ఒప్పించినవాడు కాటన్ మహాశయుడు.

ఎవరికి ఏది చెప్తే పనౌతుందో దాన్నే చెప్పి ఆ కలను సాకారం చేసినవాడు కాటన్.

గోదావరి ఆనకట్ట నిర్మాణం పూర్తికాగానే కాటన్ సహాయకుడిగా పనిచేసిన "కెప్టెన్ అలెగ్జాండర్ ఆర్" ఈ నిర్మాణాన్ని 1855లో పూర్తిచేశాడు. ఆనకట్ట 15 అడుగుల ఎత్తు, 6 అడుగుల మందం, 3,900అడుగుల పొడవు కలిగిన గోడ.

కొండరాళ్ళు గానుగసున్నంతో తెలుగువారి నిర్మాణ పద్ధతిలోనే గోదావరి, కృష్ణా రెండు ఆనకట్టల నిర్మాణాన్ని పూర్తి చేసి కాటన్ మహాశయుడు తెలుగు వారి నిర్మాణ చాతుర్యాన్ని లోకానికి చాటాడు. అప్పట్లో దాని ఖర్చు 15 లక్షలు.

ఆనకట్ట నుండి కాలువలు త్రవ్వి అటు గుంటూరు, ఇటు కృష్ణాజిల్లాల్లో లక్షలాది ఎకరాల భూమికి సాగునీటినీ, ప్రజలకు త్రాగు నీటిని అందించటం ద్వారా ఈనాటి కృష్ణాడెల్టా రూపు దిద్దుకుంది.

మద్రాసుకూ మంచినీటిని అందించే "తెలుగుగంగ" కూడా ఏర్పడింది.

నది మీద మాత్రమే ఆధారపడి సాగు అయ్యే భూముల్ని 'నదీమాతృక' లంటారు. ఆనకట్టకు ముందు నది వెంబడీ ఉన్న భూములే నదీ మాతృకలు.

కానీ, బెజవాడ ఆనకట్ట తరువాత కాలువలద్వారా నీటిని అందించటంతో, నాగార్జున సాగర్ కాలువలు కూడా చేరువ కావటంతోనూ కృష్ణాడెల్టా బహుదా విస్తరించింది. అంటే నదీ మాతృకలు బాగా విస్తరించాయి

దివాకర్ల వేంకటావధానిగారు భక్తితో కీర్తించింది ఇంతలా ఆయకట్టు భూముల్ని విస్తరించుకున్న కృష్ణమ్మనే! తెలుగు నేల పొలాలకు జలాలిచ్చి, తెలుగువాళ్ళ మతులకు తేజాన్నిచ్చి, తెలుగునేలకు కీర్తినిచ్చి, వెలుగుల్చిన కృష్ణవేణీ నది! నీకు దణ్ణాలు" అని ఆయన స్తుతించాడు.

నేల నీరు నిప్పు గాలి ఆకాశం అనే పంచ మహాభూతాల్లో జీవప్రకృతి ఉంది. ఈ పంచ భూతాలు అడుగంటితే జీవప్రకృతి విధ్వంసం అవుతుంది. నిప్పుకూడా అనాలోచిత చర్యలవలన అడుగంటే స్థితి ఉంది. గ్యాసు మీద, కరెంటు మీద ఆధారపడి వంటలు చేసుకుంటున్నాం. ఒక్కరోజు గ్యాసు, కరెంటు లేకపోతే మనం చిందులు వేయాల్సిందే! నీరేకాదు నిప్పు కూడా పరిరక్షణ చేసుకోవాల్సిన అంశమే! కృష్ణమ్మ ఇస్తున్న విద్యుత్తుని పొదుపు చేసుకోవటమూ అవసరమే!

నది తనతో నాగరకతను నడుపుకొస్తుంది. నది తనతో సంస్కృతిని ప్రసరింప చేస్తుంది. నది ఒక ప్రసార మాధ్యమం. నదికి నమస్కరించటం ఒక కృతజ్ఞత, జల సంరక్షణ, సంప్రోక్షణ, స్వచ్ఛతలను కాపాడతాననే ఒక నిబద్ధత.

గోదావరి, కృష్ణాపుష్కరం అంటే జలసంపదను పుష్కలం చేసుకొంటామని గోదాతల్లిగా కృష్ణమ్మకు మనిషి చేసే వాగ్దానం. నిలబెట్టుకుంటే నిలబడగలుగుతాడు మనిషి.

# నోట్ల రద్దు

*అదను దలంచి కూర్చి ప్రజనాదర మొప్ప విభుండు కోరినన్*
*గదిసి పదార్థ మిత్తు రటు కానక వేగమె కొట్టి తెండనన్*
*మొదటికి మోసమౌఁ బొదుగు మూలము గోసిన బాలు వచ్చునే*
*పిదికినఁ గాక భూమిఁ బశుబృందము నెవ్వరికైన భాస్కరా !*

సూర్యుణ్ణి దేవుడిగా భావించి మయూరుడు సూర్య శతకం వ్రాస్తే, సూర్య వరప్రసాదియైన మారవి వెంకయ్య కవి 'భాస్కరా' అనే మకుటంతో భాస్కరశతకాన్ని వ్రాశాడు. 1550-1650 కాలంలో విశాఖపట్నం, శ్రీకాకుళం, ప్రాంతాల్లో నివశించిన ఈ కళింగ కవి అరసవిల్లి సూర్యభగవానుణ్ణి స్తుతిస్తూ భాస్కర శతకం వ్రాశాడు.

"భాస్కరా ! రాజు ప్రజారంజకుడైతే, ఎంత పన్ను వేసినా ప్రజలు ఉదారంగా కట్టేస్తారు. అట్లా కాకుండా వాళ్లని కొట్టి తెమ్మని పీడిస్తే మొదటికే మోసం వస్తుంది. పశువుల పొదుగు పిదికితే పాలు వస్తాయి. పొదుగు కోస్తే రావు" అంటాడి పద్యంలో కవి.

ప్రజల అవసరాల కొద్దీ ప్రభువు పాలిస్తుంటే, ఆ ప్రభుత్వ ప్రయోజనాలకోసం ప్రజలు కష్టాలు భరించి సహకరిస్తారు. "నేను అర్థరాత్రి నిర్ణయం తీసుకున్నాను. దీనివలన ప్రజలారా! మీకు కష్టాలు కలుగుతాయి. భరించి సహకరించండి... అని ఏ రాజు గారైనా అంటే ఆయన పాలన ప్రజారంజకం అయినప్పుడు ప్రజలు కొన్నాళ్ళు తప్పకుండా భరిస్తారు. సహకరిస్తారు!

రైలురేట్లు ఘనంగా పెంచిన ఒక రైల్వే మంత్రిగారు అదేమిటండీ అనడిగినవాళ్ళని, "మీకు రైల్వేలు బాగు పడాలని లేదా?, దేశం బాగు పడాలని లేదా?" అనడిగితే, ప్రజలు భరించారు. ప్రభుత్వ భాషలో సహకరించారు. ప్రజలు సహకరించడం అంటే ఏమిటీ...? వేసిన పన్నుల్నీ, పెంచిన రేట్లనీ, చేసిన తప్పుల్నీ ఔదల దాల్చటం. కుయ్యోమొర్రో అని మూలక్కుండా బాధే సౌఖ్యమనే భావనలో జీవించటం .... అంతేకదా!

రేట్లు పెంచినా ప్రజలు రైళ్ళెక్కుతున్నారు కాబట్టి, ప్రజలు ఆమోదించి సహకరించినట్టే! నోట్లు రద్దు చేసినా బ్యాంకు వాళ్ళ ఛీత్కారాలను భరిస్తూ క్యూలో నిలబడి వంటా వార్పు మానుకుంటున్నారు. కాబట్టి, ప్రజల ఆమోదానికి, మోదానికి అది సంకేతంగా ప్రభువులు భావిస్తారు.

పంచాంగ ముహూర్తం ప్రకారం స్వాతంత్ర్యం అర్ధరాత్రి వచ్చిందే గానీ, నిర్ణయం అర్ధరాత్రి తీసుకున్నది కాదు. నోట్ల రద్దూ అంతే! అది సరికొత్త అద్భుత ప్రయోగం కూడా కాదు. 1973లో జనతాపార్టీ పెద్దనోట్ల రద్దు ప్రయోగం చేసింది. కానీ, దాని ఫలితాల మీద విశ్లేషణ లేదు. అ అనుభవాన్ని పరిగణనలోకి ఈ ప్రభుత్వం తీసుకున్నట్టు, అప్పటికన్నా ఇది ఏ విధంగా మెరుగైనదో తెలీదు. ఇప్పుడు పాతనోట్లు పోయి కొత్త నోట్లు అంతకన్నా పెద్ద డినామినేషన్లో వస్తున్నాయి. ఇవి ప్రజల చేతుల్లో నలక్కుండా నల్లబాబుల నేలమాళిగల్లోకి చేరవన్న హామీ ప్రభుత్వం అధికారికంగా ఇవ్వలేదు.

1968-నూజివీడు హైస్కూల్లో చదువుకునే రోజుల్లో మహాకవి దుర్గానంద్ గారితో నాకు బాగా సాన్నిహిత్యం ఉండేది. వారబ్బాయి అంబికానాథ్ నా సహాధ్యాయి. అంతర్గోళాలు, చిరంతన, భీతాంగన లాంటి రచనలు చేశారాయన. చిరంతన ఖండకృతి వ్రాస్తున్నప్పుడు వారిదగ్గరే ఉన్నాను. నాలో సాహిత్య పిపాస కలగటానికి ఆయన ప్రథమ కారకుడు.

అద్భుతమైన సిద్ధాంతాలు అనేకం ప్రతిపాదించేవారాయన. అవి కనీసం యాభై యేళ్ళ తరువాత గానీ జనానికి అర్థం కానివిగా ఉండేవి. 1960ల్లోనే ఆయన 'డేటెడ్ కరెన్సీ' ఉండాలని, నల్లధనాన్ని అరికట్టాలంటే అది చాలా అవసరం అనీ వ్రాశారు. ఆయన సూచించిన పద్ధతిలో మూడేళ్ళ వరకే ఈ నోట్లు చెల్లుతాయని, 1920 వరకే చెల్లుబాటు అని ఎక్స్‌'పైరీతేదీతో నోట్లను ముద్రించి జనవరి 1 నుండీ అమల్లోకి తెస్తే సామాన్యుడికి ఇబ్బంది కలగని రీతిలో తీవ్రవాదుల దగ్గర దొంగ నోట్ల చెలామణీని అరికట్టగలిగి ఉండేవారు. మూడేళ్ళకు మించి డబ్బుని ఎవరూ నేలమాళిగల్లో నిలవచేసే అవకాశం ఉండదు.

యూపీ, పంజాబు ఎన్నికలయ్యాక, ఈ నోట్ల రద్దు నిర్ణయం వలన దేశానికి ఆర్థికంగా ఇంత ఆర్థిక ప్రయోజనం కలిగిం దని ప్రధాని ప్రకటిస్తే, ప్రజలు కష్టాలు పడినందుకు ఫలితం దక్కింది లెమ్మని సంతోషించి వుండేవారు. భాస్కర శతక కర్త కూడా తనమాట నిజమైందని సంతోషించేవాడు.

గేదె పాలిచ్చినంత సేపూ అది తన మహిమే నంటాడు. దాని పొదుగు కూడా కోయాలని చూసిన రోజు పాడిగేదె తన ప్రతాపం చూపిస్తుంది. అందాకా దేశం భూమాతలా భరిస్తుంది. దేశంలో నల్లబాబులెవరో చిన్న పిల్లవాణ్ణడిగినా చెప్తారని ప్రధానే స్వయంగా అన్నారు. ఆ నల్లబాబులు 2017లో కూడా అధిక ధనవంతుల జాబితాలో కొనసాగితే, మన నాయకులంతా ఇదే పద్ధతిలో ధన రాజకీయాలు కొనసాగిస్తే, యథాప్రకారం కొండచిలువ మాదిరి రేట్లు పెరుగుతూ పోతుంటే, నోట్ల రద్దు అనేది కొత్త మిలీనియంలో పెద్ద ప్రహసనమే అవుతుంది. అలా కాకూడదనీ, ప్రధాన మాట నిజం కావాలనీ దేశంలో ప్రతి ఒక్కరూ ఆశిస్తున్నారు'

# పట్టుబట్టు

*నానా సూన వితాన వాసనల నానందించు సారంగమే*
*లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం తపంబంది యో*
*షా నాసాకృతి బూని సర్వ సుమనస్సౌరభ్య సంవాసియై*
*పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబులిర్వంకలన్*

(రామరాజభూషణుడి వసుచరిత్ర)

రామరాజభూషణుడి అసలు పేరు భట్టుమూర్తి. కృష్ణదేవరాయల కాలానికి అతను చాలా చిన్నవాడు. క్రీ.శ. 1510-1585 మధ్యకాలంలో జీవించి ఉంటాడని భావిస్తున్నారు. ఇతను కృష్ణదేవరాయలి అల్లుడు అళియరామరాజు ఆస్థానంలో కవి అయి ఉంటాడనీ, భువనవిజయం అష్టదిగ్గజాలలో ఒకడు కాకపోవచ్చునీ పరిశోధకుల భావన! అతను కూడా రాజకవే!

రాజులైన కవులకు, రాజాశ్రయం దొరికిన కవులకు ఎక్కువ గుర్తింపు సహజం. వాళ్ళ రచనలకు వ్యాప్తి ఎక్కువ ఉంటుంది. వాళ్ళలో మహాకవులు లేకపోలేదు. రామరాజభూషణుడు పెద్దనాదులతో సరితూగగల కవి. కాబట్టే, మధ్యయుగంలోని ఎనిమిది మంది ప్రసిద్ధ కవుల్లో నందితిమ్మననీ, రామరాజ భూషణ్ణి కూడా చేర్చి గౌరవించుకున్నారు సాహిత్యాభిమానులు.

ఈ ఎనిమిది మంది ఒకే కాలం వాళ్లనీ, కృష్ణదేవరాయల ఆస్థానకవులేననీ అనటానికి వీల్లేనప్పటికీ, ఈ ఎనిమిది మందీ దిగ్గజాల్లాంటి మహా కవులే ననటంలో ఎలాంటి సందేహం లేదు. విజయనగరం సంస్థానంలోనే వివిధ కాలాలలో వీళ్ళంతా వర్థిల్లి ఉండవచ్చు. 'రాయ' శబ్దంతోనే ఎక్కువమంది విజయనగర ప్రభువులను సంబోధించటం చేత వీళ్ళంతా వివిధ రాయప్రభువుల కాలాలలో కవులనటంలో సందేహం లేదు.

పండితులు వసుచరిత్రలోని ఈ పద్యాన్ని 'ముక్కుపద్యం' అని గమ్మత్తుగా పిలుస్తారు. నంది తిమ్మనగారి ముక్కు పెద్దది కావడం వలన ఆయన్ని "ముక్కు తిమ్మన" అని పిలిచి ఉంటారనీ, ఈ ముక్కు పద్యం వ్రాసిన కారణంగా ఆయన ముక్కుతిమ్మన అయ్యాడనీ వాదాలున్నాయి. ముక్కుతిమ్మన వ్రాసిన ఈ పద్యం రామరాజ బూషణుడి వసుచరిత్రలోకి ఎలా వచ్చిందంటే దాన్ని తిమ్మన గారినుండి కొనుక్కుని, రామరాజభూషణుడు తన వసుచరిత్రంలో చేర్చుకున్నాడని కూడా చెప్తారు. ఎరువు తెచ్చుకున్న పద్యాలతో రామరాజు భూషనుడు వసుచరిత్ర వ్రాశాడంటే నమ్మలేము. కొన్ని కథల్ని కాకమ్మ కథలుగా చదివి వదివేయాలి.

రామరాజ భూషణుడు చమత్కార కవి. మాటలతో ప్రయోగాలు అనేకం చేశాడు. వసు చరిత్రకు తాపీ ధర్మారావు గారు వ్రాసిన వ్యాఖ్యానానికి హృదయోల్లాస వ్యాఖ్య అని పేరు పెట్టి, ఈ చమత్కారాలలోని మర్మాన్ని అంతే చమత్కారంగా వ్యాఖ్యానించా రాయన.

వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలని చెప్పే ముఖ్య పద్యం ఇది! సారంగం అంటే తుమ్మెద. అది నానా సూన వితాన వాసనల్ని అంటే రకరకాల పూల సుగంధాన్ని ఆస్వాదిస్తూ ఉంటుంది. ఆ తుమ్మెద స్పర్శతో పువ్వుపడుచు పులకించిపోవటం అనేది గాఢాలింగనం వలన కలిగే పులకింతతో సమానంగా భావించటం ఒక చక్కని ఊహ. ఈ ఊహతోనే, చలం కూడా తుమ్మెద స్పర్శతో పులకించే పువ్వు మీద "ఓ పువ్వు కథ" వ్రాశారు.

అన్ని పువ్వుల మీదా వాలే గండుతుమ్మెద తన దగ్గరకు రాదేమిటని సంపెంగ పువ్వుకు బాధ కలిగింది. వాటిలాగే తనూ సుగంధాన్ని ఇస్తున్నప్పటికీ తనకు లేని దేమిటో, వాటికి ఉన్నదేమిటో... గండుతుమ్మెద తనని ఒల్లనంటుందేవిటో... ఆ గంధఫలి (సంపెంగ)కి అర్థం కాలేదు.

సమాజంలో ప్రతిఒక్కడూ తమ ఓటమికి అవతలివాడు మోసం చేయటమే కారణం అంటాడు. ప్రొద్దున్నే ఎవ్వరి ముఖం చూసి నిద్రలేచానో కడుపులో నొప్పి వచ్చింది...అంటాడు. ఆ విధంగా తన కష్టానికి కారణాన్ని ఇంట్లోనో ఇంటిపక్కనో తనకు ఇష్టం లేని వ్యక్తి మీదకు నెట్టాలని చూస్తారు. అది రాత్రి తను తినిన పచ్చిమిరపబజ్జీ వలన వచ్చిందని ఏ ఒక్కడూ పొరబాటున కూడా అంగీకరించడు. ఇది మానవ సహజ లక్షణం.

సంపెంగ పువ్వు మనుషులకన్నా చాలా గొప్పది. అది ఆత్మ విమర్శ చేసుకుంది. తనలో లోపం ఏమిటనే దాని మీద దృష్టి పెట్టింది. అసలు కారణాన్ని కనుక్కుంటే సమస్య శాశ్వతంగా పరిష్కారం అవుతుంది ఎప్పటికైనా! కుంటి సాకులు వెదుక్కొంటే సమస్య పునరావృతం అవుతూనే ఉంటుంది.

ఆత్మవిమర్శానంతరం సంపెంగ పువ్వు ఒక గట్టి నిర్ణయం తీసుకుంది.'బల్కాకన్ దపంబంది-' మందు వేసవి ఎండలో కూచుని దేవుడికోసం తపస్సు చేసింది. దేవుడు వచ్చి కనిపించాడు. కోరిన వరం ఇచ్చాడు. ఆ వర ప్రభావంతో...యోషా నాసాకృతి దాల్చి... అందమైన ఆడపిల్ల కొనదేలిన ముక్కు లాంటి ఆకారాన్ని అది పొందింది.

సర్వ సుమనః సౌరభ్య సంవాసియై- సృష్టిలోని పువ్వులన్నింటి గుభాళింపుకు అది నెలవయ్యింది! అప్పటివరకూ ఎలాంటి ఆకర్షణా లేక ఎవ్వరి మెప్పూ పొందక అల్లాడిపోయిన ఆ సంపెంగకు రూప లావణ్య సుగంధాలు వరప్రసాదా లైనాయి.

పూనెన్ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్... ముక్కు ఆకారంలోని ఆ సంపెంగకు ఇర్వంకలా -రెండు వైపులా-మధుకరీ పుంజాలు- గండు తుమ్మెదల బారులు, పూనెన్- పొందటం, ప్రేక్షణ- రోజూ కనిపించే దృశ్యం అయ్యిందట. ఇదీ సంపెంగపూవు పట్టుదలతో సాధించిన ఒక విజయం. ఆత్మ విమర్శవలనే ఇది సాధ్యం అయ్యింది.

వేసవిలో సంపెంగలు పూయవు. అందుకని వేసవిలో తపస్సు చేసిందనటం ఒక చమత్కారం. గండు తుమ్మెదలు వాసనకోసం కాక తేనె కోసం అని ఝుమ్మని నాదం చేస్తూ కాలేజీ కుర్రాళ్ళ మాదిరి పూలచుట్టూ తిరుగుతుంటాయనటం ఇంకో చమత్కారం. కుర్రాళ్ళు సహజంగా కొంచెం నదురుగా కనిపించే అమ్మాయిల చుట్టూ ఎక్కువ తిరుగుతారు. అందుకని సంపెంగ పువ్వు తనకు సువాసన కన్నా చక్కని రూపాన్ని ఎక్కువ కోరుకున్నదనటం మరో చమత్కారం. చివరికి అది అందమైన ఆడపిల్ల కొనదేలిన ముక్కులాంటి రూపాన్ని వరంగా పొందటం, తుమ్మెదల బారు ఒక నిత్య కృత్యం కావటం ఇదంతా గమ్మత్తయిన ఊహ!

తనకు ఉన్నదానితో సంతృప్తి చెందటాన్ని బలమైన కెరీరు కోరుకునే వాళ్ళు సరయిన సిద్ధాంతంగా అంగీకరించరు. ఉన్నదేదో చాలనుకుంటే ఉన్నత శిఖరాలెక్కేవాళ్ళెవరుంటారు...? ఈ కథలో సంపెంగలాగా ఎవరికివాళ్ళు తపస్సు(కృషి) చేసి ఎవరికీ దక్కనిది తనకు మాత్రమే దక్కేలాగా శ్రమించాల్సి ఉంటుందనేది కవి సందేశం. అందుకు ఆత్మ విమర్శ కావాలి. కృషి, దీక్ష పట్టుదలలు కావాలి. కెరీర్ కోరుకునేవారికి కాన్'సంట్రేషన్(C), ఇంట్రస్ట్ (I), డెడికేషన్ (D) ఈ మూడూ కావాలి. ఈ సి ఐ డిలు మనతో ఉంటే మనం కెరీర్ నిర్మించుకోగలుగుతాం.

అబ్రహాం లింకన్ అన్ని ఎన్నికల్లోనూ ఓడిపోయాడు. చిట్టచివరి సారిగా అమెరికా అధ్యక్ష పదవికి ఎన్నికై చరిత్ర సృష్టించాడు. కాబట్టి, పట్టుదల వీడకూడదనే నీతి ఇందులో కనిపిస్తుంది.

లోకం చుట్టు తిరిగితే కాళ్ళరుగుతాయి గానీ ఫలితం ఉండదు. లోకాన్ని తన చుట్టూ తిప్పుకొనే చాతుర్యం కావాలి. అది అదృష్టం వలన దక్కేది కాదు. కృషీ, దీక్షా, పట్టుదలలు కావాలి.

# పడుచుదనం యజ్ఞాలు

*"యౌవనమందుయజ్వయు, ధనాఢ్యుడునై, కమనీయకౌతుక*
*శ్రీనిధిగూకటుల్గొలిచిచేసినకూరిమిసోమిదమ్మసో*
*ఖ్యావహయైభజింప, సుఖులైతల్లిదండ్రులుగూడిదేవియున్*
*దేవరపోలెనుండియిలుదీర్పగ, గాపురమొప్పువానికిన్"*

(అల్లసాని పెద్దన – మనుచరిత్ర)

ఆ ఊరిపేరు అరుణాస్పద పురం. ఆ ఊళ్ళో ఓ బ్రాహ్మలాయన ఉన్నాడు. కుర్రాడేగాని, మంచిశ్రోత్రియుడు. ఆయన పేరు ప్రవరుడు. అల్లసాని పెద్దన గారు ఆయన గురించి లోకానికి తెలిసేలా మంచిగా వ్రాసి, ఆ ప్రవరాఖ్యుణ్ణి చరితార్థుణ్ణి చేశాడు.

ప్రవరుడు చరితార్థుడు ఎలా అయ్యాడోఈ పద్యంలోచెప్తున్నాడుపెద్దనగారు:

అతను యౌవనంలో ఉండగానే యజ్ఞాలు చేశాడు. డబ్బుసంపాదించాడు. ఈడూ జోడైన భార్య సోమిదమ్మ ఉంది. ఆవిడ వరూధినిలా నాజూకైనదేనా? లాంటి ప్రశ్నలకు తావు లేదు. ఇద్దరూ ఈడూ జోడూగానే ఉన్నారు. ఆవిడ అతన్ని బాగానే సుఖపెడ్తోంది. అతనూ ఆమెను చక్కగా చూసుకుంటున్నాడు. పార్వతీ పరమేశ్వరుల్లాంటి తల్లిదండ్రు లున్నారు. వాళ్ళే ఇంటి వ్యవహారాలన్నీ నడిపిస్తున్నారు. వాళ్ల కాపురం బాగా ఉంది. కాబట్టి ప్రవరుడు చరితార్థుడే!

ప్రవరుడి ఈడు యువతీయువకులు ఇప్పుడు కూడా ఇలాగే వ్యవహరిస్తుంటే వాళ్ళూచరితార్థులే! 20వశతాబ్దిలో మగాళ్ళు జీవితంలో స్థిరపడాలంటే కనీసం నలబైయేళ్ళయినా పట్టేది. ఆడవాళ్లకు స్థిరపడటం అనేది వేరే ఉండేదికాదు. పెళ్ళికావటమేస్థిరపడటమంటే! ఇప్పుడు 21వశతాబ్దిలో పాతికేళ్ళకే గొప్పయజ్ఞాలు చేయగలిగేంత స్థాయిలో యువతీయువకులు రాణిస్తున్నారు. గొప్పయజ్ఞం అంటే, బాగాజ్ఞానాన్ని సంపాదించేందుకు పడే శ్రమ అనే అర్థాన్ని అన్వయించుకోవాలి.

ప్రవరుడు యవ్వనకాలంలోనే తన వృత్తిలో రాణించి ధనవంతుడైనాడు. ఈరోజుల్లో యువతీయువకుల్లో తమ తల్లిదండ్రుల కన్నా ఎక్కువగా సంపాదించ గలుగుతున్న వాళ్ళే ఎక్కువ. అల్లసానిపెద్దన ఆశించినస్థాయిలో ఈనాటి యువత ఉందనటంలో ఎలాంటి సందేహంలేదు. అయితే వాళ్లలో ప్రవరులెంతమంది అనేది వేరే ప్రశ్న.

ఆధునిక యుగానికి మరో పేరు కెరీరు. కెరీరు ముఖ్యం అనీ ఆలోచించే వాళ్లకి ఆదర్శం ప్రవరుడే! కిండర్ గార్టెన్లో పసిబిడ్డణ్ణి చేర్చేప్పుడేవాడు డాక్టరో, యాక్టరో,

ఇంజనీరో కావాలని తల్లిదండ్రుల "కెరీరుకలలు" ప్రారంభమౌతాయి. ఇంటర్మీడియట్లో ఏ గ్రూపు తీసుకోవాలో ఎనిమిదోతరగతిలోనే నిశ్చయం అయిపోవాలి. అక్కణ్ణించీ 'యజ్ఞం' అనేది ప్రారంభమౌతుంది. ఆవయసులో కుర్రకారు బంగారుకలలు కనాలని మన మాజీరాష్ట్రపతి సూచించారు.

బంగారుకలలంటే అత్యున్నతమైన దాన్ని అందుకోవాలని కోరుకోవటం. వృక్షాల్లో రావిచెట్టునీ, జంతువుల్లోసింహాన్నీ నేనేనంటాడే...... గీతాకారుడు... అలాగే ఉన్నత శిఖరాన అత్యున్నతమైనది తానుకావాలని కోరుకోవటం బంగారుకల. కలల్లోబంగారుకల గొప్పది. యవ్వనకాలం లోనే అలా తన వృత్తిలో మంచి నైపుణ్యాన్ని సంపాదించి, కెరీరు నిలబెట్టుకున్నాడు ప్రవరుడు. నేటి యువతకు అది ఆదర్శంకావాలి.

జపాన్లో యువతీయువకులు కెరీరులో స్థిరపడ్డాకే పెళ్ళి అంటున్నారు. పెళ్ళి జరిగితే సుఖం అనేది రెండునిమిషాలే అనీ, కెరీరు పెరిగితే సంతోషం శాశ్వతం అనీవాళ్ల నమ్మకం. అందుకని నలభైయేళ్ళొచ్చి స్థిరపడ్డాకే పెళ్ళిళ్ళు, పిల్లలు, సంసారం అంటున్నారు. పాతిక నుండి ముప్పైయేళ్ళకి ఉద్యోగం లేదా వృత్తిలో చేరితే పదిపదిహేనేళ్ళలో స్థిరపడతారు. అప్పుడు పెళ్ళిచేసుకున్నా సుఖమూ సంతోషమూ దక్కుతాయని వాళ్ల సిద్ధాంతం.

కెరీర్ సాధించుకోవాలంటే మూడు ముఖ్యమైన అంశాలు కావాలి. మొదటిది తదేకదీక్ష. అది కుదరాలంటే లక్ష్యం పెట్టుకోవాలి. ఆ లక్ష్య సాధన కోసం శ్రమించటానికి మనిషికి దాన్ని ఇష్టత కావాలి. ఇష్టపడి కష్టపడాలి.స్కూల్లో మిస్సుగారు తిడతారనో ఇంట్లో అమ్మానాన్నలు కేకలేస్తారనో చదివే వాళ్ళకు కెరీర్ ధ్యాస ఉండదు. అదృష్టాన్నో ఇతర మార్గాలనో నమ్ముకోవటానికి ప్రయత్నిస్తారు.మనిషికి దీక్ష, ఉత్సాహం పట్టు ఉన్నప్పుడు ఆ యజ్ఞానికి ఫలమూ ఉంటుంది. అలాంటి యజ్ఞాలు చేశాడు కాబట్టే ప్రవరుడు చరితార్థుడు అయ్యాడు.

రిటైరయ్యాక ఐఏఎస్ వ్రాస్తానంటే కుదరదు కదా! పునాదులు బలంగానూ, లోతుగాను వేగంగానూ పడాలి! 'పదుచుదనం' అనేది జీవితంలో విలువైన కాలం. క్రికెట్టు ఆడటానికి పనికొచ్చే వయసులోనే కెరీర్ నిర్మిణం పూర్తి కావాలి. వయసు దాటాక వగచి ఉపయోగం లేదు.

# పదభండారం

*"సుబలతనయ గుణమహిమన్*
*ప్రబలి తనకు దార ధర్మపాలనలీలన్*
*సొబగొంది వన్నెదేగా*
*విబుధస్తుతుఁడన్విభుండు వెలసెన్ ధరణిన్"*

*(పింగళి సూరన 'కళాపూర్ణోదయం')*

సినిమాకళలోనూ. చిత్రకళలోనూ లేని అందాల్ని ఉన్నట్టు చూపించ గలిగే చాతుర్యం ఉంటుంది. పద్యాలలో కూడా అలాంటి గమ్మత్తులు, జిమ్మిక్కులూ చేసిన మహాకవులున్నారు. తన ప్రతిభను చాటుకోవటానికి ప్రతీకవీ సహజంగా తాపత్రయ పడతాడు. కొందరికి ఈ తాపత్రయం కొంచెం ఎక్కువ పాళ్లలో ఉండవచ్చు కూడా!

ఒకే మాటని రెండర్థాల్లో ప్రయోగించటం ఒక చాకచక్యం. కానీ ఒకే పద్యాన్ని అటు రామాయణం అర్థంలోనూ, ఇటు భారతం అర్థంలోనూ చెప్పటం అంటే ఇంకా ఎక్కువ ప్రతిభ కావాలి. అలాంటి పద్యాలతోనే రెండర్థాల కావ్యం మొత్తం చెప్పటం అంటే అది మామూలు కసరత్తు కాదు. గొప్ప సర్కసు ఫీటేనని చెప్పాలి. ఇలాంటి కావ్యాలను ద్వ్యర్థి కావ్యాలంటారు.

పింగళి సూరన ద్వ్యర్థి పద్యాలను అవలీలగా చెప్పగలడని ప్రసిద్ధి పొందాడు. ఇలాంటి పద్యాలు వ్రాయాలంటే, భావుకతతో పాటు 'పదాలగారడీ' విద్య కూడా బాగా సాధన చేసి ఉండాలి.

ఒక పదం చివరి అక్షరానికి రెండోదాని మొదటి అక్షరానికి గొళ్ళెం పెట్టి గొప్ప ప్రయోజనం సాధించాడీ కందపద్యంలో సూరనకవిగారు.

దీనికి రామాయణ పరమైనలో అర్థం ఇలా వస్తుంది.

సుబలత–చాలా బల సంపన్నత కలిగిన

నయగుణ మహిమ– నయగుణం అంటే మంచీ చెడుల విచక్షణతో తన బలాన్ని ఉపయోగించ గలగటం

ఉదార ధర్మ పాలన– రాజ్యపాలనా ధర్మన్ని సక్రమంగా నెరవేర్చగలిగిన వాడు.

విబుధ స్తుతులు: దేవతలు తమకు సాయం చేసినందుకు కృత్షతగా పొగుడుతూ ఉండగా...

దశరథుడు గొప్ప బలశాలి. సుబలత కలిగినవాడు. ఆయన తనబలాన్ని మంచికి మాత్రమే ఉపయోగ పడాలనే నయగుణం కలిగినవాడు. అందుకే దేవాసుర సంగ్రామంలో దేవతలకు సహాయంగా యుద్ధానికి వెళ్ళి గెలిపించి వచ్చాడు. దేవతలు

కృత్జ్ఞతగా చేస్తున్న పొగడ్తల మధ్య ఆయన భూమ్మీద కొచ్చాడట.

ఇదే పద్యం భారతం అర్థంలో మరోలా కనిపిస్తుంది :

సుబలతనయ: ధృతరాష్ట్రుడు కళ్ళులేని బలహీనుడు ఆయన భార్యకు కళ్ళున్నాయి. కానీ, వాటిని ఆమె గంతలు కట్టుకుని మూసేసుకుంది. కాబట్టి, ఆ ఆడకూతురు(గాంధారి)ని సుబలతనయ అన్నాడు కవి.

**గుణ మహిమతో** : గాంధారికి పాతివ్రత్య ధర్మం బాగా తెలుసు. తన పాతివ్రత్య మహిమతో

**దారధర్మ పాలన లీలన్** : భార్యాధర్మాన్ని గొప్పగా నిర్వహిస్తూ ఉండగా

**విబుధ స్తుతు దవ్విభుండు వెలసెన్ ధరణిన్** : అలాంటి పతివ్రత భార్యగా కలిగిన ధృతరాష్ట్రుడు దేవతల చేత కీర్తించ బడ్తున్నాడని భారతార్థం. అంటే అయ్యగారి మహాత్మ్యం అంతా భార్య పాతివ్రత్యం మీదే ఆధారపడి ఉందన్నమాట!

ఈ 'కందపద్యం' లో సూరనగారు సుబలతనయ గుణమహిమన్', అని భారతార్థంలోనూ, 'సుబలత నయగుణ మహిమన్' అని రామాయణార్థంలోనూ,

"తనకు దార ధర్మ పాలనలీలన్"అని భారతార్థంలోనూ, "తనకు దార ధర్మ పాలన లీలన్" అని రామాయణార్థం లోనూ విశ్లేష ప్రయోగం చేశాడు. పదాలను అలా విరిచి చదివే నేర్పూ, పాండిత్యం, పరిజ్ఞానం రచయితతో సమాన స్థాయి కలిగిన పాఠకులే ఈ కవిత్వాని ఆస్వాదించ గలుగుతారు. లేదా దాన్ని మంచి విశ్లేషకులు విడమరచి చెప్పి పాఠకుడిని జ్ఞానవంతం చేయగలగాలి.

ఇలా వ్రాయటాన్ని 'సభంగశ్లేష' అంటారు. సభంగశ్లేష పండాలంటే కవి తనకు తానే ఒక ఒక 'పదభండారం' కావాలి. ఆ సమయానికి తగిన పదం తట్టాలి. అందుకు సాధన కావాలి. ఇదంతా శ్రమే! మేథో శ్రమ!

ఒక పద్యం రాసి జనం మీదకు వదలటానికి ఇంత కసరత్తు చేయాలా...అనడిగితే, ఇతరుల కన్నా భిన్నంగా చెప్పాలనే తపన ఉన్న కవి ఎప్పుడూ కసరత్తు చేయాలనే చూస్తాడు కదా...అనేది సమాధానం! ఆ రోజుల్లో వ్యాప్తిలో ఉన్న కవితా రీతిలో ఒకడుగు ముందుకు వేసే ఒక ప్రయత్నం అది!

ఒక పద్యంలో రెండర్థాల పదాలు వేసే వారొకరైతే, ఒకే పద్యంలో రెండు వేర్వేరు భావాలు పలికిచే వారిం కొకరైతే వీరందరి కన్నా ఘనులుగా. మూడర్థాల త్ర్యర్థి కావ్యాలు కూడా రాసిన మహాకవులూ ఉన్నారు. కుస్తీపట్టాలే గాని, భావచతుర్థిని పండించ గలగటం కూడా సుసాధ్యమే! అది సాధ్యం కావాలంటే కవికి తెలుగు భాష మీద పట్టుండాలి!

భాష మీద పట్టు పద్య కవికే కాదు, వచనకవిక్కూడా అవసరం. ఎలా వ్రాయాలో

ఎందుకు వ్రాయాలో తనకు తానే నిర్ణయించు కోగలగటానికి నేటి కవులు ప్రాచీన సాహిత్యాన్ని చదవటం అవసరం కూడా! ఎలా రాయకూడదనే విషయంలో ఒకప్పటి తూనిక రాళ్ళు ఇప్పుడు మారిపోయాయి. పాత సాహిత్య పునాదుల్లోంచి కొత్త సాహిత్య భవనాలు నిర్మాణం కావాలి!

కవి అన్నవాడికి తెలుగు పదాలు బాగా తెలిసి ఉండాలి. ఇంతకు మునుపు మనం చెప్పుకున్నట్టు తెలుగు పద భండారంగా తనను తాను తీర్చి దిద్దుకోగలిగినవాడు గొప్ప కవిత వ్రాస్తాడు.

కవిత్వం అనేది భావ ప్రకటనకు సంబంధించిన విషయం., భావాలను ప్రకటించటానికి భాష ముఖ్యం అది సమృద్ధిగారాకపోవటం వలన గొప్ప స్థాయిలో కవిత చెప్పలేకపోతాడు కవి.

చంటి పిల్లలకు ఏదో చెప్పుకోవాలని ఉంటుంది. కానీ, చెప్పటం ఎలాగో తెలీక, చెప్పేందుకు సరైన పదం తెలీక, తెలిసినపదమే అయినా దాన్ని ఎప్పుడు ఎక్కడ ఎలా వాడాలో తెలీక వాళ్ళు భోరున ఏడ్చేస్తారు. ఎందుకు ఏడుస్తున్నాడంటే, ఎలా చెప్పాలో తెలీక ఏడుస్తున్నాడు. అది తెలిస్తే కవితలే చెప్పేవాడు కదా!

ఏడుపులోంచే కవిత్వం పుట్టిందనీ, శోకం శ్లోకం అయ్యిందని మన పెద్దవాళ్ళు చెప్తారు.

లోకం కోసం ఏడ్చేవాడే కవి! కవి ఎంత ఏడిస్తే అంత పదసంపద వెలికి వస్తుంది!!

# పద్యంలో కరకరలు

*"నరసింహ కృష్ణరాయని*
*కరమరుదగు కీర్తి వెలసె, కరిభి ద్గిరిభి*
*త్కరి కరిభి, ద్గిరి గిరిభిత్*
*త్కరి భిద్గిరి భిత్తురంగ కమనీయంబై"*

(తెనాలి రామకృష్ణ - చాటువు)

మన సినిమాల్లో హీరోలు రెండు మూడు దెబ్బలు తిని, పెదవి చిట్లి ఆ నెత్తురు చూసుకున్నాక అప్పుడు పౌరుషం తన్నుకొచ్చి ఎగిరెగిరి తంతారు. మొదట దెబ్బ కొట్టే అవకాశం శత్రువుకు ఇవ్వకూడదని శాస్త్రం. మన సినిమాలు నాటకీయత కోసం పెదవి చిట్లే సీను చూపిస్తారు.

తెనాలి రామలింగ కవి మామూలు కవి కాడు. కవివీరుడు. అంటే తిక్కనకవిగారిలాగా కత్తిపట్టి యుద్ధాలకెళ్ళే వాడని కాదు! అవతలివాడు కళ్ళుతిరిగి కిందపడి గిలగిలాడేలా పదప్రయోగాలు చేసి, దెబ్బ తీయటం ఒక్కటే ఆయనకు తెలిసిన విద్య.

నోరున్నవాడిదే రాజ్యం అని నిరూపించిన కవి తెనాలిరామలింగడు.

కవిత్వం వండటం వచ్చిన మొనగాడు మాత్రమే వండగలిగే వంటకం ఈ పద్యం.

ఇందులో ఆయన కరినీ గిరినీ ఎంచుకున్నాడు. రెండో అక్షరం "ర" ఉండేలాగా పదాలు పేర్చుకున్నాడు. కృష్ణరాయలుతో పద్యం మొదలు పెట్టాలి. 'ర'కారం రెండో అక్షరం కావాలంటే, కృష్ణరాయలి బంధుమిత్రువుల పేరుచెప్పి వారికి బంధువైన కృష్ణరాయా.. అని రాయాలి. లేదా శత్రువులపేర్లు వెదికి శత్రువా అని సంబోధించాలి. బాగా వెదికాడు.

కృష్ణరాయలు తండ్రిపేరు నరసరాయలు. తమిళులకు తండ్రి పేరు ముందు చెప్పుకునే సాంప్రదాయం ఉంది. రామస్వామి వెంకటరామన్ అంటే రామస్వామిగారి కొడుకు వెంకటరామన్ అని!

గౌతమీ పుత్ర శాతకర్ణి, మాదయగారి మల్లన... ఇలా తండ్రుల పేర్లో తల్లుల పేర్లో ముందు చెప్పుకునే సాంప్రదాయాన్ని తెలుగువాళ్ళూ పాటించారు. తెనాలి రామలింగడు నరసింహ కృష్ణరాయా!" అంటూ ఈ పద్యాన్ని మొదలుపెట్టాడు. ఆయన చేతికి అరుదైన కీర్తి దక్కిందంటాడు.

ఇంక అక్కణ్ణించీ ఈ పద్యంలో కేవలం పదాల కరకరలే తప్ప భావాల ఘుమాయింపు లేవీ ఉండవు. తను వండదల్చిన ఆ లడ్డూ పదార్థం తినడానిక్కాదు,

ఎదుటివాడి పళ్ళూడగొట్టటానికి కదా...! వర్ణించేది కృష్ణరాయలి కీర్తిని! అది అరుదైంది. ఆ కీర్తి తెల్లగా ఉందని చెప్పాలి. అందుకని తెల్లని అరుదైన విషయాల్ని ఎంచుకున్నాడు.

కరిభిత్– గజాసురుణ్ణి చంపినవాడు శివుడు. ఆయన తెల్లగా ఉంటాడు.

గిరిభిత్కరి– పర్వతాల రెక్కల్ని తన వజ్రాయుధంతో నరికిన ఇంద్రుడి ఏనుగు 'ఐరావతం' తెల్లనిది.

కరిభిద్గిరి– గజాసురుణ్ణి చంపిన శివుడి కొండ కైలాసం'. అది తెల్లగా ఉంటుంది.

కరిభిద్గిరి భిత్తురంగ కమనీయం– ఇలా కరిభిత్తు, గిరిభిత్కరిభిత్తు అయినశివుడి తురంగం అంటే వాహనం నంది. అది తెల్లగా ఉంటుంది. అది కమనీయం. కమనీయమైనవి ఉత్సవ శోభని కలిగి తెల్లగా ఉంటాయి.

కృష్ణరాయల కీర్తిని అరుదైన తెల్లని విశేషాలతో పోల్చి అంతటిది అని చెప్పటమే కవి ఆశించిన ప్రయోజనం. ఈ కరకరల కవిత్వానికి ఇంతకు మించి ప్రయోజనం లేదు. డబ్బాలో రాళ్ళు పోసినట్టు గడగడలాడిస్తే నోరుతెరుచుకు వింటారు జనం. కొన్ని పద్యాలను ఇలా ప్రయోగించి, సభారంజకత్వాన్ని సాధించవచ్చు.

ఆపాతమధురం అని ఒక చక్కని ప్రయోగం ఉంది. అంటే వినంగానే గొప్పగా ఉందనిపించటం! వినగానే బావుందనిపించింది అంటే, బాగా వినగా వినగా గొప్పగా లేదనిపిస్తుందనే వ్యంగ్యం కూడా ఈ మాటలో ఉంది.

ఈ పద్యం కూడా ఆపాతమధురమే. ఆపాతం అంటే, ముంచు కొచ్చినట్టు వెల్లువలా వచ్చి మధురంగా ఉన్నదనిపించటం. పకోడీలు కరకరమంటూ ఆపాతమధురంగా ఉంటాయి. ఆ తరువాత కదా కడుపులో గడబిడ పుట్టి వాటి అసలు సంగతి తెలిసేది! కరిభిత్, గిరిభిత్కరిభిత్ పద్యం అర్థం తెలిసే వరకూ అది మధురమే! ఆ తరువాత తెల్లబోవటమే మనవంతు అవుతుంది!

ఇవి స్టేజీ మీద చప్పట్లు కొట్టించుకోవటానికి తప్ప సాహిత్య ప్రయోజనం నెరవేర్చుందుకు ఉపయోగించే ప్రయోగాలు కావనే అంటాను!

# పద్యంలో మినీకవిత

*రైతు కాలు తగిలి రాళ్ళు ప్రాణము పొందు,*
*రైతు కన్ను పడిన రాయి మెరయు*
*రైతు చెయ్యి తగిలి రాళ్ళు పంటగ మారు*
*రైతు గాలి సోకి రాయి పసిడి*

*(రైతు – రాయి – డా. రావి రంగారావు అశ్వత్థవృక్షం పద్యకవితాసంపుటి నుండి)*

సీతారాముల పెళ్ళయ్యాక రామలక్ష్మణ భరత శతృఘ్నుల్ని తన ఇంటికి భోజనానికి పిలిచాడు జనకుడు. సీత చెలికత్తెల్లో ఒకతె రాముడి దగ్గరకు వచ్చి "మీ ఊళ్ళో పాయసం తాగితే మగపిల్లలు పుడతారటగా?" అనడుగుతుంది. ఈ కొంటె ప్రశ్నకి అంతే కొంటెగా "మీ ఊళ్ళో పొలం దున్నితే ఆడపిల్లలు దొరుకుతారటగా?" అనడుగుతాడు రాముడు.

అయినా, రాజులకు పొలం దున్నాల్సిన కర్మం ఏమిటీ?అనే సందేహం కలగొచ్చు. వ్యవసాయ సంస్కృతిని ప్రజలకు అలవాటు చేయటానికి రాజు స్వయంగా నాగలి పట్టి పొలం దున్నేవాడు. రైతే రాజు అనేది ఉత్తుత్తి నినాదం కాదు. వాన రాకడ తెలుసుకోవటం, ఏ ధాన్యానికి గిట్టుబాటు ఉంటుందో ఊహించటం, ఏ రకమైన పంటలు ఈ ఏడాది గొప్పగా పండుతాయో గ్రహించటం అందుకు అనుగుణంగా వ్యవసాయం చేయటం మనకు ఆనూచానంగా వస్తూన్న అలవాటే!

'రాజే రైతు' గా ప్రసిద్ధుడైన జనకుడి తర్వాత రైతైన రాజు మరొకడు కన్పించడు. హల్యం అంటే దున్నబడిన భూమి. ద్విహల్యం అంటే రెండుసార్లు దున్ని పదును పెట్టిన భూమి. అహల్యం అంటే దున్నబడని భూమి. అహల్య భూముల్లో రాళ్ళూ, రప్పలూ, తుప్పలూ ఉంటాయి. అలాంటి రాళ్ళనేలను శుభ్రం చేసి దున్నాడు రాముడు. ఆయన పాదం తగిలి రాళ్ళు ప్రాణం పోసుకున్నాయి. పంటలు పండాయి. కడుపు నిండింది. రాతిని నాతిని చేసిన రామపాదం కథ ఇది. రైతు కాని వాడు రాజు అయితే వ్యవసాయం దండగ అనే అనుకుంటాడు. రైతే రాజైతే వ్యవసాయమే పండుగ!

డా. రావి రంగారావు అశ్వత్థవృక్షం పేరుతో ఒక పద్య ఖండకావ్య సంపుటి వెలువరించాడు. పైన పేర్కొన్న పద్యం ఈ గ్రంథంలోది. రైతును రాజుగా చిత్రిస్తూన్న ఈ ఖండికలో రైతు పాదం సోకితే రాళ్ళు ప్రాణం పొందుతాయనీ, రైతు కన్ను పడితే రాళ్ళు మెరుస్తాయనీ, రైతు చెయ్యి తగిలితే రాళ్ళు పండుతాయనీ, రైతు గాలి సోకితే రాయి పసిడి అవుతుందనీ అంటాడు కవి.

డా. రావి రంగారావు ఎంత వచనకవో అంత పద్య కవి! మినీ కవితా ఉద్యమ ఆద్యుల్లో ఒకడు. అత్యంత ఆధునిక భావాలు కవితలో వెలయించిన నవభావకవి. 1975-80ల్లో కవిత్వం చెప్పటం ప్రారంభించిన రోజుల్లో కుందుర్తి ఆంజనేయులు గారి ప్రభావం మా బోటి యువకవుల మీద ఎక్కువగా ఉండేది. కుందుర్తిగారు వచనకవితా పితామహుడిగా వాసికెక్కినవాడు. కుందుర్తి, రెంటాల, ఏల్చూరి ముగ్గురూ నయాగరా కవులుగా ప్రసిద్ధులు. పద్యకవిత్వంలో భావాలు ప్రాచీనంగానూ, వచన కవిత్వంలో భావాలు ఆధునికంగానూ ఉండాలనే ఆలోచన కుందుర్తి గారిది. పద్యంలో ఆధునిక సామాజిక అంశాలను ప్రస్తావిస్తే అది సూటూ బూటూ వేసుకుని తిరుపతి కొండకు వెళ్ళినట్టు ఉంటుందనే వారాయన.

డా రావిరంగారావు ఆ సిద్ధాంతానికి అపవాదుగా ఆధునిక, అభ్యుదయ భావజాలంతో 1981లో 'అమృతవృక్షం' పద్యసంపుటి వెలువరించాడు. మినీకవితలకు లక్ష్య లక్షణాలను ప్రతిపాదించినట్టే సరళీకృత పద్యరచన క్కూడా ఒక ఒరవడిని దిద్దటానికి ఆయన చేసిన కృషి గొప్పది. మినీకవిత స్వరూప స్వభావాల గురించి 1979-80 భారతి తదితర పత్రికల్లో అనేక వ్యాసాలు వ్రాయటం ద్వారా మినీకవిత ఒక ప్రత్యేక కవితా రూపంగా స్థిరపడేందుకు కారకుడయ్యాడు. కవిత్వం ఎంత సంక్షిప్తంగా, ఎంత సరళంగా ఉండాలో అంత లోతుగా, గంభీరంగా కూడా ఉండాలనేది రంగారావు భావన. జనరంజకం అనే గుణం కోల్పోయి, కవిత్వం సామాన్యుడిని చేరలేకపోతోందంటాడు.

భావకవిత, అభ్యుదయకవిత, వచనకవిత, దిగంబర కవిత, విప్లవకవితల తరువాత అంతగా కవులు ఉద్యమించి వ్రాసింది మినీకవితనే! కవితా పరిణామక్రమాన్ని ఎవరూ ఆపలేరు. ఇస్మాయిల్ గారితో ప్రారంభమైన తెలుగు హైకూలతో సహా ఈనాటి నానీలు, రెక్కల వంటి కవితా ప్రక్రియలన్నీ లఘు రూపాలే! ఇది తెలుగు కవితలో రూపపరంగా వచ్చిన ఒక మార్పు. దీర్ఘ కవితలు, సుదీర్ఘకవితల మధ్య నేటి లఘురూపాలు తామరాకుల మధ్య తామర పూవుల్లా ప్రకాశిస్తున్నాయి.

రావి రంగారావు వ్రాసిన ఈ అశ్వత్థవృక్షం పద్యకవితా సంపుటిలో 'రైతు-రాయి' పేరుతో వ్రాసిన ఈ చిన్న ఖండిక మినీకవితా రూపాన్ని ప్రతిబింబిస్తుంది. కవిత్వం అనేది విమానంలోంచి ఊరుని చూసినట్టుగా ఉండకూడదనీ, ఆటో ఎక్కి ఊరంతా తిరిగి నట్టు ఉండాలనీ రావి రంగారావు భారతిలో ఒకసారి వ్రాశాడు. 'అశ్వత్థ వృక్షం' మనల్ని అలా ఆటోలో తిప్పుతుంది.

తన కవిత్వం వావిలాల గోపాలకృష్ణయ్య లాంటి దని సగర్వంగా ప్రకటించుకున్న కవి రావి రంగారావు.

# పరిశోధనల్లో అగస్త్యుడి తమ్ముళ్ళు

*కంటికి నిద్ర వచ్చునె? సుఖం బగునె రతికేళి? జిహ్వకున్*
*వంటక మించునే? యితరవైభవముల్ పదివేలు మానసం*
*బంటునె? మానుషంబు గలయట్టి మనుష్యున కెట్టివానికిన్*
*గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు దనంతటి వాడు గల్గినన్*

(శ్రీనాథుడు - కాశీఖండం)

వింధ్యపర్వతానికి తనకన్నా ఎత్తైన వాడు ఎవడూ లేడని గర్వం. నారదు డొచ్చి, "హిమాలయాలు నీకన్నా ఎత్తైనవి" అన్నాడు. తనకన్నా ఎత్తైన వాడు ఒకడున్నాడనేసరికి వింధ్యుడికి హిమవంతుడంటే విపరీతమైన ద్వేషం కలిగింది. మద మాత్సర్యాలకు లోనయ్యాడు. ఆ సందర్భంలో శ్రీనాథుడు చెప్పిన పద్యం ఇది. కాశీఖండం కావ్యంలోది ఈ సన్నివేశం.

"కంటకంలాంటి శత్రువు ఒకడున్నాడని తెలిశాక ఎవరికైనా కంటికి నిద్ర వస్తుందా? రతికేళి సుఖంగా అనిపిస్తుందా? తిండి సహిస్తుందా? వైభవాలు మనసుకు ఆహ్లాదాన్నిస్తాయా?" అంటాడు వింధ్యుడు. కోపంతో విపరీతంగా పెరగటం మొదలు పెట్టాడు. ఎవరెష్టుని మించి ఆకాశం హద్దులు దాటి సూర్యగమనానికి అడ్డుగా పెరిగాడు. దాంతో జనం అగస్త్యుడితో మొరపెట్టుకున్నారు. అగస్త్యుడు వింధ్య దగ్గరకు వచ్చాడు. వింధ్యుడు వంగి తన శిరసు వంచి అగస్త్యుడి కాళ్లకు మొక్కాడు.

"నేను దక్షిణాపథానికి వెడ్తున్నాను, తిరిగి వచ్చేవరకూ ఇలాగే వంగి ఉండు" అని ఆదేశించి వెళ్ళి పోయాడు అగస్త్యుడు. వెళ్ళిన వాడు దక్షిణాదిలోనే స్థిరపడిపోయాడు. వింధ్యుడు అలాగే వంగి ఉండిపోయాడు.

ఇదీ వింధ్యను వంచిన అగస్త్యుడి కథ.

దక్షిణాపథాన వింధ్య దాటగానే ఆంధ్ర నగరాలు వస్తాయి. ఆంధ్రలో అగస్త్యుడు వైదికధర్మాలు ఎక్కువగా ప్రచారం చేశాడు. తెలుగు వారితో అగస్త్యుడి అనుబంధానికి చాలా సాక్ష్యాలున్నాయి.

ఇల్వలుడు, వాతాపి అనే ఇద్దరు సోదరులు నరమాంస భక్షకులైన రాక్షసులు. వాళ్ళ దగ్గర సంజీవని విద్యవుంది. దారిన పోయే వాళ్ళను మోసగించి చంపి తినడం వారి జీవన విధానం.

వాతాపిని మేకలా మార్చి అగస్త్యుడికి వండి పెట్టాడు ఇల్వలుడు. సంజీవని మంత్రంతో ఆవాతాపిని బతికిస్తాడు. వాతాపి తనను తిన్నవారి పొట్టచీల్చుకుని బయటి వస్తాడు. ఇద్దరూ కలిసి ఆయన్ను పంచకు తింటారు. ఇదే వాళ్ల వ్యూహం.

కానీ, వాతాపిని బతికించటానికి ముందే అగస్త్యుడు జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం అనేస్తాడు. వాతాపి జీర్ణం అయిపోయాడు. అందుకే తెలుగుతల్లులు

"జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుర్రము తిన్న గుగ్గిళ్ళు జీర్ణమై
ఏనుగు తిన్న వెలక్కాయ జీర్ణమై
భీముడు తిన్న పిండివంటలు జీర్ణమై
అర్జునుడు తిన్న అప్పాలు జీర్ణమై
అబ్బాయి తిన్న పాలు ఉగ్గు జీర్ణమై
కుంది లాగా కూర్చొని
నంది లాగా లేచి
తాంబేలు లాగా తాళి
చల్లగా ఉండాలి
శ్రీరామ రక్ష
నూరేళ్ళాయుస్సు" అని పాడుతుంది తెలుగుతల్లి.

బిడ్డకు పాలు తాగించాక ఈ పాట పాడి పొట్టమీద చేత్తో రాసి, కాళ్ళుచేతులు ఆడిస్తూ తారంగం కొట్టిస్తుంది. పాలు త్రాగేప్పుడు బిడ్డ పాలతోపాటుగా గాలిని కూడా పీల్చుకుంటాడు. పాలివ్వగానే పడుకోబెడితే ఈ గాలిపొర పైన ఉన్న పాలను నెట్టుకొంటూ బయటకొచ్చేస్తుంది. త్రాగిన పాలన్నీ వాంతి అవుతాయి. అందుకని, తారంగం కొట్టిస్తే గాలి, పైకిపోయి పొట్టలో పాలు కిందకి దిగుతాయి. పాలుతాగగానే వాంతులవటం ఆగుతుంది. ఇది అగస్త్యుల వారు మనకు నేర్పిన విద్య.

వనవాస కాలంలో సీతారామలక్ష్మణులు అగస్త్యుడి ఆశ్రమాన్ని సందర్శించారు. "ఇక్కడికి దగ్గరిలో పంచవటి అనే గొప్ప వనం ఉంది, అక్కడే గోదావరి ప్రవహిస్తూంది. అక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకో" అని రాముడికి సూచించింది అగస్త్యుడే! "సీతను భద్రంగా కాపాడుకో", అని ముందస్తు హెచ్చరిక చేసిందీ ఆయనే!

అగస్త్యుడు సప్తమహర్షుల్లో ఒకడుగా ప్రసిద్ధుడు. సముద్రాన్ని అపోశనం పట్టాడని ఆయన గురించి చెప్తారు. అగ(నగ) అంటే పర్వతం, అస్తి అంటే తోసేయటం, పర్వతాల్ని తోసేయ గలవాడని అర్థం. మొత్తంమీద మహాశక్తిమంతుడు అగస్త్యుడు. వేదాలలో కొన్ని ఋక్కులు కూడా చెప్పాడు. ఆయన అతి ప్రాచీనుడు!

అగస్త్యుడు తిరుపతి దగ్గర కళ్యాణి, భీమ, సువర్ణముఖి నదులు కలిసే చోట నిత్య పూజలకు శివలింగాన్ని ప్రతిష్ఠించి నివాసం ఉండేవాడనీ, ఆకాశరాజ పుత్రిక

పద్మావతిని పెళ్ళాడి భార్యతో సహా శ్రీనివాసుడు వచ్చి ఆయన ఆశ్రమంలో కొన్నాళ్ళున్నారనీ ఐతిహ్యం. అగస్తీశ్వర క్షేత్రంగా ఇది ప్రసిద్ధి.

తెలుగు నేలమీద అగస్త్యుడి కార్యక్రమాలు వైదిక సంస్కృతిని పరిచయం చేయటానికి, పరిరక్షించటానికీ ఉద్దేశించినవిగా వుంటాయి.

ఇక్కడి నుండి తమిళనాడుకు చేరిన అగస్త్యుడు తన వైదిక ప్రచారానికి స్థానిక భాషను కూడా ఉపయోగించు కున్నట్టు కనిపిస్తుంది. తమ భాషకు వ్యాకరణ కర్తగా తమిళులు అగస్త్యుణ్ణి గౌరవిస్తారు. సిద్ధ వైద్య సాంప్రదాయంలో అగస్త్యుణ్ణి సాంప్రదాయ ప్రవర్తకుడిగా చెప్పుకుంటారు. మొత్తం మీద అగస్త్యుడి కార్యక్రమాలు తెలుగు, తమిళ, మళయాళ ప్రాంతాల్లో ఎక్కువగా కేంద్రీకరించి జరిగాయి.

అగస్త్యుణ్ణి తమిళులు స్వంతం చేసుకున్నారు. స్వంతం చేసుకోగలగటం గొప్పే!. కానీ, అది అతిశయోక్తులకు, అభూత కల్పనలకు దారి తీయకూడదు.

తమిళ ప్రాచీన భాషాకేంద్రంలో కేవలం సంగమ సాహిత్యం మీద అనేక పరిశోధనా ప్రాజెక్టుల్ని చేపట్టినట్టు అక్కడ అధికారులు చెప్తున్నారు. ఒక ప్రియుడు తన ప్రియురాలికి కట్టుకునేందుకు ఆకులు ఇచ్చిన కథను బట్టి, సంగమ సాహిత్యం ఆకులు కట్టుకుని తిరిగే ఆదిమ కాలం నుండీ ఉన్నదని వాళ్ళు చెప్తుంటే ఆశ్చర్యం వేసింది. పురాణాగాథలు, స్థలపురాణాలు చరిత్రగా భావిస్తే ప్రమాదమే కదా!

జైన బౌద్ధ సాహిత్యాలలో ఆంధ్రుల గురించి ఉన్న ఆధారాలను మనం పట్టించుకోవట్లేదు. కానీ, లేని ఆధారాలతో తమిళంలో కోట్ల రూపాయల పరిశోధనలు సాగుతున్నాయి.

'అగస్త్యభ్రాత' అంటే అగస్త్యుడి తమ్ముడు అని ఒక జాతీయం ఉంది. అగస్త్యుడు కలశం లోంచి పుట్టాడు. ఆయనకు అన్నదమ్ములెవ్వరూ లేరు. లేని వాటిని ఉన్నట్టుగా చెప్పటాన్ని 'అగస్త్యభ్రాత' అంటారు. అగస్త్యుడి తమ్ముళ్లపైన పరిశోధనలు సాగితే వింధ్య పర్వతం తిరిగి లేచి నిల్చునే ప్రమాదం ఉంది.

# "పాముపక్క మీద నిద్ర"

ఏకా భార్యా ప్రకృతిముఖరా చంచలా చ ద్వితీయా
పుత్ర స్త్వేకో భువన విజయీ మన్మథో దుర్నివారః
శేషశ్శయ్యా శయన ముదధౌ వాహనం పన్నగారిః
స్మారం స్మారం స్వగృహచరితం దారుభూతో మురారి

(చాటువు)

కొందరు పైకి నవ్వుతూ కనిపిస్తారు. కానీ ఇంట్లో పరిస్థితి అంత సంతోషంగా ఉండకపోవచ్చు. "ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీలమోత" అనే సామెత ఉండనే ఉంది. సోక్రటీస్ అంతటి వాడికే ఇంటిపోరు ఇంతింత కాదయా...అన్నట్టు అయ్యింది కదా పరిస్థితి. [STALKiNG]

వెంటాడటం, వేధించటం అనే అర్థంలో స్టాకింగ్ అనే మాట ఇప్పుడు బాగా వ్యాప్తిలో ఉంది. హరాజ్‌మెంట్ అంటే వేధింపు. ఇంటిమిడేషన్ అంటే వత్తిడి పెట్టడం. ఇవి రెండూ కలిస్తే స్టాకింగు అవుతుంది. రాక్షసుల్నే ఓడించిన సాక్షాత్తూ విష్ణుమూర్తి కూడా స్టాకింగుని ఎదుర్కోవాల్సి వచ్చింది. అదెలాగో వివరిస్తున్నాడు చాటుకవి ఈ శ్లోకంలో:

విష్ణుమూర్తి భార్యల్లో ఒకామె జ్యేష్ఠాదేవి. ఆమె వాచాలి. నోరు తెరిస్తే ఎంత మాటైన అనగలదు.

మరో బార్య లక్ష్మి. డబ్బున్నావిడ! కానీ డబ్బుకుండే అవలక్షణాలన్నీ ఆమెకున్నాయి. ఒక్కక్షణం ఒక్కచోట నిలవదు.

సుఖంగా పడుకునే అవకాశం ఉన్నదా అంటే నిద్రించేది "పాముపడక" మీద! పాముమీద పడుకుని ఏం నిద్రిస్తాడు...?

ఇల్లు సుఖంగా ఉందా అంటే అది నడిసముద్రంలో ఉంది. తుఫానొచ్చినా ఉప్పెనొచ్చినా ధైర్యంగా బతకలేని పరిస్థితి.

మన్మథుడనే కొడుకు ఉన్నాడు కానీ, ఈ భూమండలం మొత్తాన్నీ జయించిన వాడిలా అంతా తనదే అన్నట్టు తిరుగుతుంటాడు.

ఎక్కడికైనా వెళ్ళాలంటే, గ్రద్దనెక్కి తిరగాలి.

ఏదీ సుఖంలేని పరిస్థితి. స్మారం స్వగృహచరితం దారుభూతో మురారి...తన ఇంటి పరిస్థితి తలచుకుని ఒక్కసారి కొయ్యబారి పోయాడట విష్ణుమూర్తి.

వేధించటం అనే పనిని ఎవరో వచ్చి చేయాల్సిన పని లేదు. దానికదే పరిస్థితులు అలా సమకూరి బాధిస్తాయి. దూర ప్రయాణానికి ఆర్టీసీ బస్సెక్కితే మీకు రిజర్వు చేసిన సీటు వెనక్కి వాలనిదో విరిగినదో అనుకోండి... ఎవరో వచ్చి వేధించేపని లేకుండానే మనం వేదనకు గురౌతాం. ఇలాంటి వేధింపుని stalking అంటారు. unwanted or obsessive attention by an individual or group towards another person అని దీనికి నిర్వచనం.

స్టాకింగ్ అనే పదం అమెరికన్ పత్రికల సృష్టి. గొప్పవాళ్లను సామాన్యుడు పెట్టే ఇబ్బంది అనే అర్థంలో దీన్ని వాడుకలోకి తెచ్చారు. భార్యాభర్తలమధ్య సయోధ్య లేకపోవటం, కొడుకులు తల్లిదండ్రుల పట్ల 'పట్టనితనం'తో ప్రవర్తించటం లాంటి సమస్యలు కూడా దీని పరిధిలోకే వస్తాయి. రక్షణ లేకపోవటం, మానసిక వేదన కలగటం ఇవన్నీ స్టాకర్ల వలన కలిగే బాధలు. ఎన్నింటినని తప్పించుకుని ఎంత దూరం అని పారిపోగలడు మనిషి...?

సాక్షాత్తూ ఆ విష్ణుమూర్తే కొయ్యలాగా అయిపోయాడట. "ఆ వార్త విని కొయ్యబారిపోయాడు" అంటూ ఉంటాం కదా! కొయ్యబారటం అనే తెలుగుజాతీయాన్నే "స్మారం స్వగృహచరితం దారుభూతో మురారి" అని సంస్కృతంలో అన్నాడు ఈ చాటుకవి. కాబట్టి ఈ కవి తెలుగువాడు కావచ్చు కూడా! ఏ స్వగృహచరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం...'సంసారాల చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం' అని మనం పాడుకోవాల్సిన స్థితే చాలా ఇళ్ళలో కనిపిస్తుంది.

"మత్కుణా, మశకా రాత్రౌ, మక్షికా యాచకా దివా/పిపీలికా చ భార్యా చ దివారాత్రౌ చ బాధతే!" అనే చాటువు ఒకటుంది. నల్లులూ దోమలూ రాత్రిపూట బాధిస్తాయి. ఈగలూ బిచ్చగాళ్ళూ పగలు బాధిస్తారు. చీమలు, భార్యా రాత్రింబవళ్ళూ బాధిస్తారు అని ఈ శ్లోకానికి అర్థం.

ఏ భర్తా తన భార్య 'బంగారం' అనడు. అలాగే ఏ భార్యా తన భర్త బంగారం అంటే ఒప్పుకోదు. కాబట్టి ఇక్కడ భార్య అనే పదాన్ని భార్యాభర్తా ఇద్దరికీ వర్తింపచేసే చదువుకోవాలి.

స్టాకింగ్ చేసే వాళ్లమీద రకరకాల నిర్వచనాలున్నై. గృహహింస పరిధిలోకి వచ్చే అంశం ఇది. భర్త లాంటి సంబంధీకులు, ఆఫీసుల్లో సహోద్యోగుల్లాంటి సంబంధం లేనివాళ్ళు, ఊరికే దారినపోతూ బాధించే పరాయి వ్యక్తులు, పై అధికారులు, ఇరుగూపొరుగూ వాళ్ళు... వీళ్ళంతా మానసికంగా బాధించే (మెంటల్ అసాల్ట్) హింసావిధానాలన్నీ స్టాకింగ్ కిందకే వస్తాయి.

భర్త హింసిస్తుంటే విడాకులిచ్చి ఇంకో పెళ్ళి చేసుకోవచ్చు. పై అధికారి లేదా తోటి ఉద్యోగి హింసిస్తుంటే ఆ ఉద్యోగం మానేసి ఇంకో కంపెనీలో చేరవచ్చు. లేదా ఇంకో ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చు. బాధించేవాళ్ళు పక్కింటి వాళ్లైతే ఇంకో ఇల్లు చూసుకుని వెళ్ళిపోవచ్చు. కానీ ఇంట్లో నిత్యహింస తప్పించుకోవటానికి ఎక్కడికని పారిపోగలడు మనిషి? ఈ భార్యనో ఈ భర్తనో, ఈ కొడుకునో మార్చి ఇంకొకర్ని తెచ్చుకోలేరు కదా!

ఏడిపించే స్టాకర్లలో ఆడవాళ్ళూ ఉంటారు, మగవాళ్ళూ ఉంటారు. అభిమానులూ ఉంటారు. కానీ, ఏడ్చేవాళ్ళలో ఆడవాళ్ళే ఎక్కువ. మగాళ్ళు పైకి ఏడ్వకపోవచ్చు. అందుకని విష్ణుమూర్తి దుఖాన్ని చూసి ఈ చాటుకవిగారు తానే ఏడ్చేశాడు, 'పాము పడక' మీద పడుకోవటానికి విష్ణుమూర్తుల వారు ఎంత బాధపడ్డాడో అని తాను బాధపడ్డాడు. మరి ఆ పాముపక్కమీద అక్కడే పడుకోవటానికి ఆ భార్య ఎంత బాధపడి ఉంటుందో కదా! దాని గురించి కవులు వ్రాయరేమిటా అనేదే బాధ!

# పాలు-నీళ్ళు-వీళ్ళూ!

*"క్షీరము మున్ను నీటికొసగెన్ స్వగుణంబులు దన్ను జేరుటన్*
*క్షీరము దస్తమౌట గని చిచ్చుటికెన్ వెతచే జలంబు, దు*
*ర్వార మహృద్విపత్తి గని వహ్ని జొరంజనె దుగ్ధ, మంతలో*
*నీరము గూడి శాంతమగు, నిల్చు మహాత్ముల మైత్రి యే గతిన్"*

(భర్తృహరి నీతి శతకం, ఏనుగు లక్ష్మణకవి)

పాలలో నీళ్ళు కలిస్తే ఆ నీటికి పాలగుణం వస్తుంది. పాలు తనకు ఆశ్రయం ఇచ్చి, గౌరవం కల్పించాయన్న కృత్ఞతతో పాలు కాగిపోతున్నప్పుడు నీరు ఆవిరై పాలను కాపాడుతుంది. నీరు ఆవిరై పోతుంటే, తన స్నేహితుడు వీడిపోతున్నాడనే బాధతోనూ, ఇందుకు కారణమైన అగ్నిమీద కోపంతోనూ పాలు రివ్వున పొంగి, ఆ పొయ్యినే ఆర్పేస్తున్నాయి.

స్నేహం అంటే ఇలా పాలు-నీళ్ళలా ఉండాలంటుంది భర్తృహరి సూక్తి.

భర్తృహరి నీతి శతకాన్ని ఏనుగు లక్ష్మణకవి తెనిగించాడు. ఈ పద్యం లక్ష్మణకవి గారిది.

అధికారపార్టీ పాలకుండ లాంటిది. వ్యతిరేకపార్టీ లోంచి నీళ్లు ఆబగా వచ్చి పాలపార్టీలో కలిసిపోతానని అడుగుతాయి. పాలు తమ పార్టీ కండువా కప్పి, అక్కున చేర్చుకుంటాయి. అలా నీళ్ళు పాలలో కలిసిపోతాయి.

పాలలో కలిసిన నీటిని కూడా పాలే అంటారు. పాలతో ఉంటే ఎక్కువ ప్రజాసేవ చేయొచ్చని అందులో చేరినట్టు నీళ్ళు ప్రకటిస్తాయి. పాలు పలుచనై పోయినా సరే, పాలకుండ నిండటమే పాలకుల ధ్యాస!

పొయ్యి మీద పెట్టినప్పుడు కుండకు కష్టకాలం దాపురిస్తుంది. అప్పుడు స్నేహితులైన నీళ్ళు ఆవిరై పాలు మాత్రం సురక్షితంగా ఉంటాయి! నీళ్ళు అని తెలిసినా పాలు కండువా కప్పి స్వాగతం చెప్పేది అందుకే!

నీళ్ళు లేకపోతే పాలు చిటికలో పొంగి పోయి, కుండ అడుగంటి పోతుంది.

కుండలో పాలు పదిలంగా ఉండాలంటే అందులో నీళ్ళుండాల్సిందేనని ఆధునిక ప్రజాస్వాముల సిద్ధాంతం.

పాలలో కలిస్తే నీళ్ళు మంచివే! కుండ నిండుగా ఉన్నంతకాలం అధికారానికి ఢోకా ఉండదు. కుండలో స్వచ్ఛ క్షీరమే ఉండాలని రాజ్యాంగం నిర్దేశించలేదు.

వెనకటికి ఓ సినిమాలో "పాలలో నీళ్ళు కాక ఇంకేం కలుపుతారు? నీళ్ళు కలపకుండా పాలు తాగ గలడా ఎవడైనా, అజీర్తి పుట్టి చస్తాడు" అంటాడు పాలాయన.

పాలకులు ఈ పాలాయన లాంటివాళ్ళే! 'పాలకుండ' అనే పాలక పార్టీలో నీళ్ళదే ప్రాధాన్యత. పాలకు నీళ్ళు తోడు సై దోడు కూడా!

"నేను ఒకప్పుడు అక్కడ కాగి ఆవిరైన వాణ్ణే! మళ్ళీ నా పుట్టింటికే నేను వెళ్తున్నాను....అని ఫిరాయించిన ప్రతిసారీ నీళ్ళు బుకాయిస్తూనే ఉంటాయి.

పాలను ఉద్ధరించటం ద్వారా దేశ సేవ చేస్తున్నానని మనల్ని నమ్మమంటాయి నీళ్ళు.

సీను రివర్సు అయ్యిందనుకోండి, పాల కుండలోంచి కాసినన్ని పాలు వెళ్ళి నీలకుండలో కలిశాయనుకోండి... ఆ పాలని ఎవరైనా నీళ్ళే అంటారు గానీ పాలు అనరు. నీళ్ళ కుండను పొయ్యి మీదపెడితే నీళ్ళే ఆవిరి అవుతాయి. పాలు అలానే ఉంటాయి. చివరికి మిగిలేవి పాలే! వచ్చిపోయేవి నీళ్ళే!

'పయ:" అనే పదానికి పాలు, నీళ్ళు అని రెండు అర్థాలూ వున్నాయి. పాలమనసు నీళ్లమనసూ ఒకటే కాబట్టి రెంటికీ ఒకే పేరు పెట్టి ఉంటారు.

భర్తృహరి క్షీరనీర న్యాయం వ్రాశాడు కాబట్టి, మనుషులంతా పాలూ నీళ్లలా కలిసిపోవాలని చాలామంది ఈ పద్యం మీద వ్యాఖ్యానించారు.

పాలు పాలు కావు, నీళ్ళూ నీళ్ళు కావు అనే పరిస్థితి నడుస్తున్న ఈ రోజుల్లో, నిజానికి రెండు కుండల్లో ఉన్నవి నీళ్ళేపాలే! అధికార పార్టీ కుండ పెద్దది. ప్రతిపక్ష పార్టీ కుండ చిన్నది...అంతే!

పొయ్యెక్కిన ప్రతిసారీ చిన్నకుండ ఎక్కువ ఖాళీ అవుతుంటుంది. ఆ మేరకు పెద్ద కుండ లాభం పొందుతుంటుంది. పాలు కలిసిన నీటికన్నా, నీళ్ళు కలిసిన పాలు ఎక్కువ లాభం పొందుతుంటాయి. పాలు పాలతో స్నేహం చేసినా, నీళ్లతో స్నేహం చేసినా పెరుగుదలే ఉంటుంది. కానీ, నీళ్ళకు పాల వలన వొరిగేదేమీ ఉండదు.

నీళ్ళు కూడా తాము తాత్కాలికంగా లాభం పొందుతున్న భ్రమలో ఉంటాయి. కానీ, చివరికి ఆవిరైపోతుంటాయి. నీళ్ళకు నీళ్ళలో ఉన్నప్పటి గౌరవం పాలలో ఉంటుందనేది కూడా భ్రమే!

నీళ్ళకు పాల అవసరం కన్నా పాలకు నీళ్ల అవసరమే ఎక్కువ అనేది ఇందులో శుక్రనీతి!

స్నేహం అనేది పాలు + పంచదారలా ఉండాలే గానీ, పాలు + నీళ్లలా ఉండకూడదనేది శర్కర నీతి.

# పెట్టెపూజ

*ఊరక సజ్జనుండొదిగి యుండినసైన, దురాత్మకుండు ని*
*ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా*
*చీరలు నూరు అంకములు చేసెడివైనను బెట్టెనుండగాఁ*
*జేరి చినింగిపోఁ గొఱుకు చిమ్మట కేమి ఫలంబు భాస్కరా!*

(మారయ వెంకయ్య భాస్కర శతకం)

రోడ్డు మీద మనం పోతుంటాం...నడుచుకుంటూనో, సైకిలు మీదో, మోటారు వాహనం మీదో! ఎంతో జాగ్రత్త గానే పోతుంటాం. కానీ, వెనక నుండో, పక్కల నుండో ఎవడో వచ్చి బండి మన మీద కెక్కించేస్తాడు. మనల్ని ఆస్పత్రి పాలు చేస్తాడు. దీన్ని బట్టి అర్థం అవుతోం దొక్కటే... మనం మాత్రమే మంచిగా ఉన్నంత మాత్రాన మంచి జరుగుతుందనే హామీ ఏమీ లేదని!

మనిషన్నాక ఏదోకటి చేస్తుండాలి. ఏ పనీ చెయ్యని వాడికన్నా మంచో చెడో ఏదో ఒకటి చేసేవాడే నయం. చెడ్డవాణ్ణి నయానో భయానో మంచి దార్లోకి తేవచ్చు. కానీ, ఏ పనీ చేయని మంచివాడి వలన ఒరిగేదేమీ ఉండదు కదా! ఒక్కోసారి మంచితనం అసమర్థతగా మారిపోయే ప్రమాదం ఉంది.

మంచివాళ్ళకన్నా సమర్థులే గొప్ప" అని, మంచితనం సమర్థతని చంపేస్తుందని ఇంగ్లీషువాడి నమ్మకం. పైన చెప్పిన పద్యంలో "ఊరక ఒదిగి ఉండే సజ్జనత" గురించి ప్రస్తావన ఉంది. అలా అనటంలో చాలా లోతైన అర్థమే ఉంది....

ప్రస్తుతం మన సమాజం గ్రామీణ సంస్కృతి లోంచి వాణిజ్య సంస్కృతిలోకి మళ్ళుతున్న ఒక సంధి దశలో ఉంది! తరాలుగా వస్తున్న ఆచార వ్యవహారాలన్నీ గ్రామీణ సంస్కృతికి సంబంధించినవి! ముత్తాత బాగోగులు కూడా మునిమనవడు చూసే వ్యవస్థ లోంచి వచ్చాం మనం. ఇప్పుడు అమ్మా నాన్నల్ని వృద్ధాశ్రమాల్లోకి తరలించే వాణిజ్య సంస్కృతిలోకి మళ్ళుతున్నాం.

చదువుల పేరుతో పిల్లల్ని హాస్టల్లో పారేసి, వాళ్లతో ఆత్మీయ అనుబంధాలు పెంచుకోలేని తల్లిదండ్రులు చివరికి ఆ పిల్లలచేతే తిరస్కరించ బడుతున్నారు. వాణిజ్య సంస్కృతిలో ఇలా వ్యవహరించటాన్ని చెడ్డపనిగా భావించరు! వాణిజ్య సంస్కృతి తీరే అంత! అది ఆత్మీయానుబంధాల చుట్టూ కాకుండా డబ్బు చుట్టూ తిరుగుతుంటుంది.

వాణిజ్య సంస్కృతిలో "ఊరక ఒదిగి ఉండే సజ్జనత" వలన ఏ ఉపయోగమూ ఉండదు. ప్రజలు కూడా "నువ్వెంత మంచివాడివైతే నాకెందుకు, నా పని పూర్తి చెయ్యి...

ఎంతకావాలో చెప్పు" అని బహిరంగంగానే అంటారు. ఈ లోకానికి మంచివాళ్లతో పనిలేదు, పని చెయ్యగల వాళ్లతోనే పని, వాడు లంచగొండి అయితేనేం...?

400 యేళ్ళ క్రితం భాస్కర శతకం రచించిన కళింగ కవి మారయ వెంకయ్య (మారవి) అరసవిల్లి సూర్య దేవాలయం సూర్య భగవానుడిని స్తుతిస్తూ భాస్కర శతకం వ్రాశాడు. భాస్కరా అనే మకుటంతో ప్రతీ పద్యంలోనూ నీతి బోధ, సామాజిక విమర్శ, సమస్యకు పరిష్కారాలు కనిపిస్తాయి. అద్భుతమైన కవిత్వ సౌందర్యం కారణంగా ఈ శతకం బాగా ప్రసిద్ధి పొందింది. ప్రతి విషయాన్నీ చక్కని పోలికతో వర్ణిస్తాడు కవి. పైన పేర్కొన్న పద్యం ఈ శతకంలోది. "ఊరక సజ్జనుండొదిగి యుండిననైన" అనే వాక్యం ద్వారా ఈ నాటి పరిస్థితిని ఆనాడే ఊహించాడు మారవి కవి!

మన సమాజంలో అతి మంచి తనం ప్రదర్శిస్తో ఒదిగి ఉండేవాళ్ళు, ఏ పనీ చేయకుండా ఊరకే ఉండే వాళ్ల సంఖ్య ఎక్కువ. పనిమంతులే తక్కువ సంఖ్యలో ఉంటారు. ఆ కొద్ది పనిమంతుల్లో మంచీ, చెడు- రెండు రకాల వాళ్ళూ ఉంటారు. వాళ్ళలో చెడ్డవాళ్ళ సంఖ్య తక్కువే ఉంటుంది. కానీ, ఈ తక్కువ సంఖ్యాకులే అధిక సంఖ్యాకులైన మంచివాళ్ళ పట్ల హాని కారకు లౌతున్నారు. అలాంటి దురాత్మకులు "నిష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా" ఉంటారు... ఊరికే మంచిగా కూర్చున్నంత మాత్రాన ఏ ప్రమాదమూ ఉండదనుకోకండీ...ఓర్వలేక అపకారం చేయటమే గొప్పగా భావించే దురాత్ములుంటారు...వాడి జోలికి మనం వెళ్ళక పోయినా వాడి వలన జరిగే అపకారం ఆగదు" అని హెచ్చరిస్తాడు కవి. !

ఎంతో ఖరీదైన చీరని కొని, కట్టుకుంటే వెలిసి పోతుందనీ, చిరిగి పోతుందనీ పెట్టెలో పెట్టి పూజ చేసినంత మాత్రాన బట్ట చెడకుండా ఉంటుందనే హామీ లేదు. చిమ్మెట పురుగు పట్టి తెగ కొరుకుతుంది. పెట్టె పూజ సమస్యకు పరిష్కారం కాదు. రోడ్డు మీదకు వెడితే యాక్సిడెంటౌతుందని కదలకుండా ఇంట్లో కూర్చోవటం ప్రాణాలను పెట్టెపూజ చేయటమే అవుతుంది. ఇంట్లో ఉంటే జారి పడి కాలు విరగదన్న గ్యారంటీ ఏమీ లేదు కదా! కాబట్టి, పెట్టెపూజ ఆలోచన ఏ విధంగానూ సరికాదంటాడు భాస్కర శతక కారుడు. మనం యాక్సిడెంటు చేయకుండానూ, మనం యాక్సిడెంటు అయిపోకుండానూ నొవ్వక, నొప్పించక తిరిగే చాకచక్యం పెంచుకోవాలే గాని, మాంత్రికుడి ప్రాణాలు సప్త సముద్రాల కావల మర్రిచెట్టు తొర్రలో చిలకలో ఉన్నట్టు వ్యవహరించకూడదని దీని తాత్పర్యం.

చెడు చేయటానికన్నా మంచి చేయటానికి ఎక్కువ సాహసం కావాలి! చెడు అందరూ చేసేదే కాబట్టి, దానికి ప్రత్యేకత ఏమీ ఉండదు. మంచి స్థిరంగా ఉంటుంది... కాబట్టి, దానికి సాహసం, నేర్పు, చాకచక్యం ఇలాంటివన్నీ కావాలి. అవి లేనప్పుడు "పెట్టెపూజ మంచితనం" వలన ఒరిగేదేమీ ఉండదంటున్నాడు భాస్కర శతక కర్త.

# ప్రపంచ మహాపాపం

*వెలది జూదంబు పానంబు వేట పలుకు*
*ప్రల్లదనంబును దండంబు బరుసదనము?*
*సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత*
*యనెడు సప్త వ్యసనముల జనదు తగుల?*

(మహాభారతం)

భారతీయులకు ఏడు కొండలు, ఏడు ద్వీపాలు, ఏడడుగులు, ఏడుగురు ఋషులు ఏడుగురు మాతృకలు, ఏడు స్వరాలు, ఏడు ద్వీపాలు, ఏడు సముద్రాలు, ఏడు గుర్రాలు. ఏడు ధాతువులు ఇలా ఏడు సంఖ్య చాలా ముఖ్యమైంది. దివ్య కురాన్ కూడా ఏడు స్వర్గాలను చెప్తుంది. ఏడు సంఖ్య పవిత్రమైనది కూడా!

ఏడు సంఖ్యతో మనకు కొన్ని అశుభాలు కూడా కనిపిస్తాయి. పైన పద్యం సప్తవ్యసనాల గురించి వివరిస్తోంది.

వెలది అంటే స్త్రీ. స్త్రీలోలత్వం వ్యభిచారం మొదటి వ్యసనం.

జూదం రెండవ వ్యసనం.

పానం అంటే మద్యపానం మూడో వ్యసనం.

వేట లేదా జీవహింస నాలుగో వ్యసనం.

పలుకు ప్రల్లదనం అంటే పరుషంగా మాట్లాడటం ఐదవ వ్యసనం.

'దండంబు పరుసదనం' అంటే కఠినంగా పాలించటం. దండం (గావెల్) అనేది అధికార చిహ్నం. దాన్ని నియంత పోకడలతో నిర్వహించటం ఆరవ వ్యసనం. అంటే అధికార దుర్వినియోగం అని అర్థం

"సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత" అంటే డబ్బును పనికిమాలిన వాటికి దుబారాగా ఖర్చు చేయటం ఏడవ వ్యసనం ఈ ఏడు వ్యసనాల జోలికి పోవద్దంటోంది మహాభారతం.

"దేవుడు ఆరు విషయాలని ద్వేషిస్తాడు, మరియు ఏడవ దానిని అతని ఆత్మ ద్వేషిస్తుంది"(సామెతలు 6:16-19) అని బైబిల్ కూడా ఏడు మహాపాపాలను ప్రస్తావిస్తుంది.

అహంకారంతో నిండిన కళ్ళు, అబద్ధం చెప్పే నాలుక, అమాయకుల రక్తాన్ని చిదించే చేతులు, కుతంత్రాలు చేసే హృదయం, తప్పుడు మార్గంలో నడవటానికి ఆరాటపడే పాదాలు, అబద్దాల కూటసాక్ష్యం, అన్నదమ్ముల మధ్య కలహాలు పుట్టించటం ఈ ఏడూ బైబిల్ చెప్పిన పాపాలు. దుబారా చెయ్యటం (luxuria), అధికంగా తినటం/త్రాగటం (gula), డబ్బు పై దురాశ (avaritia) అజాగ్రత్త/ నిరుత్సాహం (acedia) కోపం (ira), అసూయ (invidia), అహంకారం (superbia) ఈ యేడు కూడా బైబిల్ ప్రకారం ఘోరమైన పాపాలే!

తీవ్రమైన లైంగికవాంఛ, అతిగా తినటం/తాగటం, దురాశ, బద్ధకం, కోపం, అసూయ, అహంకారం, ఇలా క్రైస్తవగ్రంథాల్లో మరో ఏడింటినీ మహాపాపాలుగా వివరించారు.

మొత్తం మీద పాపాల జాబితా వేరుగా ఉన్నా వాటి సంఖ్య మాత్రం ఏడు అంకె చుట్టూనే తిరుగుతోంది. ఇటీవల అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ తన దేశంలోకి 7ముస్లిం దేశాల ప్రజల ప్రవేశంపై నిషేధం విధించాడు. ఆయన బుర్ర కూడా ఈ 7 సంఖ్య చుట్టూనే తిరుగుతోంది. ఏడు వ్యసనాలు, ఏడు మరణకారక పాపాలు, ఏడు ఘోరమైన పాపాలు ఇన్ని ఉన్నాయని తెలిసిన క్రైస్తవుడే అయినా, ఆయన ఆ 7 పాపాలను చేయటానికి ఏ మాత్రం వెనుకడుగు వేయాలనుకోక పోవటమే విచిత్రం.

మహాభారతం చెప్పిన "పలుకుప్రల్లదంబును, దండంబు బరుసదనము" అనే వ్యసనాంశాలు ట్రంపుగారి ధోరణికి బాగా అద్దం పడతాయి. సీఎం అరవింద్ కేజ్రీవాల్ ప్రభుత్వం మీద సాక్షాత్తు ఆ రాష్ట్ర లెఫ్టినెంట్ గవర్నర్ నజీబ్ జంగ్ ఏడు అవినీతి నేరాలు చేసినట్టు సి బి ఐకి ఫిర్యాదు చేశాడు.

ఏడు రకాల పాపిష్టి అమ్మాయిల్ని పెళ్ళి చేసుకోవద్దని చాణక్యుడు తన కామశాస్త్రంలో మగాళ్ళకు మాత్రమే సూచించాడు. పాపిష్టి మగాళ్ళ గురించి కూడా చెప్పే ఉంటాడు గానీ అది లుప్తమై ఉండొచ్చు. లేదా దీన్నే మగాళ్లకూ అన్వయించుకోవాలని భావించి ఉండొచ్చు.

మొత్తం మీద, అనగనగా ఒకరాజు కథలో మాదిరి ఎండని 7 చేపల్లా ప్రపంచం మొత్తానికీ వర్తించే 7 మహాపాపాలు క్రీస్తుకాలం నుండీ సాగిపోతూనే ఉన్నాయి. ఏడు జన్మల పాపాలనటం తెలుగు వారికి ఎక్కువ అలవాటు. స్త్రీ లౌల్యం, జూదం లాంటి సప్తవ్యసనాలూ భారతంలో చెప్పినా, బైబిల్లో చెప్పినా ఇంకెవరు చెప్పినా ఆ తప్పులు చేసేప్పుడు అది మహాపాపం అని గుర్తు చేసి, పక్కకు మళ్ళించేవిగా ఉంటాయని మన పెద్దవాళ్ళ నమ్మకం.

ఈ హెచ్చరికలు అన్ని వ్యసనాల సమయాల్లోనూ బాగానే గుర్తుకొస్తాయి. కానీ, ఒకే ఒక్కసారి ఏదీ గుర్తుకు రాని స్థితి ఏర్పడుతుంది. ఆ స్థితి ఎన్నికల సమయంలో ఓట్లు వేసేందుకు బూతు లోపలకు వెళ్ళాక ఏర్పడుతుంది. మైండ్ బ్లాంక్ అయి పోతుందన్నమాట. అంతే! పడకూడని వాడికి ఓటు పడిపోతుంది.

ఇది కూడా ఒక వ్యసనమే! ఓటేసేప్పుడు ఒళ్ళు తెలీని స్థితి. కళ్ళు మూసుకుని ఓటేయటం అనేది 8వ వ్యసనం. ఏడు వ్యసన పాపాలను భగవంతుడు ద్వేషిస్తే, ఈ 8వ పాపాన్ని దేవుడి ఆత్మ ద్వేషిస్తుందని మనం భాష్యం చెప్పుకోవాలి.

సమస్తమైన సామాజిక అరాచకాలకీ ఓటేసేప్పుడు జనం కళ్ళు మూసుకోవటమే మూలకారణం అవుతుంది. అమెరికన్ ఓటరుకైనా, తెలుగు ఓటరు కైనా ఇదే సూత్రం వర్తిస్తుందని ఋజువైపోయింది. కళ్ళు మూసుకుని ఓటేయటం ప్రపంచ మహాపాపం.

# భక్తిబేహారులు

*అక్షర పక్షపాతమున నర్థము నూళ్ళ నొసంగ, నుబ్బునన్*
*భిక్షు జటాధరాధికులు భిన్న నిజవ్రతులౌదు, రైన దు*
*ర్భిక్ష రుజా శిశు చ్యుతులు పెక్కగు, భక్తియు చాలు, దానఁద*
*త్పక్షభితత్వమే యఘముఁ దార్పదు, శంక్ దలంగుమయ్యేదన్*

(ఆముక్తమాల్యద 4.242)

ప్రభుత్వానికి అక్షర పక్షపాతం ఉండకూడదని కృష్ణదేవరాయలు బల్లగుద్ది భజాయించి మరీ చెప్తున్నాడీ పద్యంలో! చదువుకున్నవాడు తిన్నగా ఉంటే "సాక్షరా" అవుతాడనీ, వాడి బుద్ధి వికటిస్తే సర్వం తిరగబడి "రాక్షసా" అవుతాడనీ సంస్కృతంలో ఒక నీతి శ్లోకం ఉంది. కృష్ణదేవరాయలు దాన్ని దృష్టిలో పెట్టుకునే ఈ మాటలన్నాడు.

మేధావుల కన్నా కూలినాలి ప్రజలకే లోకజ్ఞానం ఎక్కువ. కూరగాయల మార్కెట్టు కెళ్ళి ఐదారు రకాల కూరలు తీసుకుని ఎంతైందంటే నోట్లోనే గడగడా కూడేసి ఇంతని చెప్పేస్తుంది కూరలమ్మి! చదువుకున్నవాడు సెల్లు తీసి, అందులో కాలిక్యులేటర్ తెరచి, ఒక్కో కూరగాయ ఖరీదూ నొక్కి కూడతాడు. అందుకే, చదువుకున్న వాళ్లకన్నా చాలా సందర్భాల్లో కూరలమ్మియే మేలు. కాబట్టి, చదువుకున్నాడు కదా అని పురస్కారాలు ఇచ్చే ముందు జాగ్రత్తగా ఆలోచించు. ఆ పేరుతో జటాధరాధికులు అంటే మతతత్వ వాదులు, బాబాలు, మఠాధిపతులూ "ఉబ్బుతారు" అంటాడు. అంటే, ఒళ్ళు పొగరెక్కి వ్యవహరిస్తారన్నమాట. సాక్షరులు రాక్షసులౌతారు. కాబట్టి అక్షర పక్షపాతం లేకుండా పురస్కారాలను (పూర్వంరోజుల్లో అగ్రహారాలు వగైరా) ఆలోచించి ఇవ్వాలన్నాడు రాయలవారు.

సాధు సన్యాసులక్కూడా లోకోత్తరమైన, లోక హితాన్ని కోరే బాధ్యతలున్నాయి. వాళ్ళ బాధ్యతల్ని వాళ్లు ప్రతిఫలాపేక్ష రహితంగా నెరవేర్చాలి. ప్రధాన మంత్రులూ, ముఖ్యమంత్రులూ, మంత్రులూ, అధికారులూ అదేపనిగా మఠాలు, బాబాల ఆశ్రమాలను సందర్శించటం వలన, "శాంక్టిటీ ఆఫ్ శాంక్టోరం (ఆశ్రమ పవిత్రత) అంటామే అది దెబ్బతింటుంది. లోకానికి దారి చూపించ వలసిన వ్యక్తులు చెడిపోతే లోకానికి అపకారమే కదా! అందువలన అరాచకం ప్రబలుతుంది. దుర్భిక్షం ఏర్పడు తుంది. రోగాలు వ్యాపిస్తాయి. వయసు మీరకుండానే మనుషులు అర్ధంతర చావులు పొందుతారు..." అని హెచ్చరించాడాయన.

స్వాతంత్ర్యోద్యమకాలంలో గాంధీ ప్రభావం వలన దేశంలోని వనరులన్నీ జాతీయోద్యమం కోసం వినియోగం అయ్యాయి. ముఖ్యంగా తెలుగు నేల మీద ఆ

రోజుల్లో కంచి, పుష్పగిరి లాంటి కొద్ది ప్రాచీన పీఠాలు తప్ప ఇప్పటి లాగా వీధివీధికీ ఒక బాబా గారు ఆ రోజుల్లో మనకు కనిపించరు.

ప్రజల్లో వితరణ అనేది ఆ రోజుల్లో జాతీయోద్యమానికి మళ్ళింది. స్వాతంత్ర్యం వచ్చాక ప్రజలను ఏకోన్ముఖం చేసి దేశానికి ఉపయోగపడే రీతిలో మళ్ళించే ఏక నాయకత్వం మనకు లేకుండా పోయింది. ఉన్న నాయకుల్లో ఆత్మాశ్రయులేగానీ, పరోపకార నాయకత్వం కొరవడడం వలన జనంలో ఉన్న వితరణను సొమ్ము చేసుకోవటానికి సాధుసన్యాసులూ బాబాలు పుట్టగొడుగుల్లా పుట్టుకు రాగలిగారు.

గజ్జల మల్లారెడ్డి తెలుగునాట భక్తిరసం డ్రైనేజీ స్కీములేక రోడ్లమీదకు ప్రవహిస్తోందని అనేవారు. ఇటీవల టీవి ఛానళ్ళు మరీ బరితెగించి ప్రచారం ఇవ్వటం వలన భక్తిరసం కుళ్ళి కంపెత్తుతోంది. అక్షర పక్షపాతం వలన వలన దేశానికి జరిగిన నష్టం ఇదే!

"భక్తియు చాలు" అన్నాడు రాయలవారు. వాళ్లంటే నీకు భక్తి ఉంటే మనసులో ఉంచుకో...అంతేగానీ, దేశానికి రాష్ట్రపతిగా ఉండి, ప్రధానమంత్రిగా ఉండి లేదా మరో ఉన్నత స్థాయిలో ఉండి నువ్వు బాబాల చుట్టు తిరుగుతూ వాళ్ళ కాళ్లకు మొక్కుతూ ఉంటే అది దేశానికి చెడు కలిగిస్తుందన్నాడు.

ప్రభుత్వాధిపతుల మద్దతు వలన బాబాల చుట్టు మాఫియాలు చేరతారని రాయలవారు ఆనాడే ఊహించి చెప్పాడు. "ఓ ప్రభుత్వాధీసులారా! మీరంతా సాధుసన్యాసులకు సాగిలబడి మొక్కకండి. సన్యాసులకు దూరంగా ఉండండి. అందువలన లోకానికి మేలు, మీకు పుణ్యం కలుగుతాయి. ఈ విషయంలో ఎలాంటి అనుమానం పెట్టుకోకండీ..." అన్నాడాయన.

అనుచితమైన భక్తిని భక్తిబేహారుల పట్ల పెంచుకోవద్దని ఆయన మరీ మరీ నొక్కి చెప్తున్నాడు. యథా రాజా తథాప్రజా కాబట్టి, ప్రభుత్వం చేసే వారిని చూసి ప్రజలు కూడా అదే దారిన నడుస్తారు. జనం తాకిడి పెరిగిందంటే తూరీయాశ్రమ ధర్మాలకు తిలోదకాలిచ్చి సర్వసంగ పరిత్యాగులు సంచీలు నింపుకునే పనిలో పడతారు. ఆశ్రమాల్లో రేపులు జరినా, హత్యలు జరిగినా ఎవరూ మాట్లాడలేని స్థితి ఏర్పడుతుంది. ఒక స్వామీజీ "సుఖానికి పెళ్ళే కావాలా?" అనడిగాడంటే రాజసన్మానం వలన ఎంత అపకారం జరుగుతుందో అర్థం అవుతోంది.

దేవుడి సంగతి దేవుడు చూసుకుంటాడు. మనుషుల సంగతి నువ్వు చూడవయ్యా పాలకుడా!

# భాషా సాంస్కృతిక విధానం

*ఱేడు పరాపరోక్తుల నెఱింగి విచారణ సేయదేని, మా*
*రేడు [illegible] తన్ననుసరించిన శ్రీఫల మిచ్చుచుండ్యు నే*
*రేడుస [illegible]ఁడే, యయ్యది భరించు ద్విజ ప్రకరమునెల్లన్ను బూ*
*[illegible] ఱేఁడే, యయ్యది చరించెడి సత్పథమందుఁ బొందుగన్*

*(తిరుపతి వేంకట కవుల 'గీరతం' నుండి)*

ప్రభుత్వానికి భాషా సాంస్కృతిక విధానం ఒకటి ఉండాలి. కృష్ణదేవరాయలు ఒక చారిత్రక వ్యక్తిగా నిలిచి పోయి, వందలాది అనుకూల కథలు అతని చుట్టు అల్లుకోవటానికి ప్రధాన కారణం ఆయన కవులకు, కళాకారులకు, కళలకు, దేశభాషలకు ప్రోత్సాహం ఇవ్వటమే!

ఈ సూక్ష్మాన్ని ఈ కాలపు ఱేడులు(ప్రభువులు) గుర్తించలేక పోవటం వలన మాజీ ముఖ్యమంత్రు లెందరో జనం స్మృతి పథంలోంచి క్రమేణా కనుమరుగై పోతున్నారు.

"కళల్ని నువ్వు బతికించు. కళ నిన్ను బతికిస్తుంది" అనే సూక్తి ప్రతి రాజకీయనాయకుడికీ వర్తిస్తుంది

కళ బతకాలి. కళాకారుడూ బతకాలి. బతికేందుకు దారులు వేయటమే సాంస్కృతిక విధానం. తెలుగు భాషాభివృద్ధి, పరిశోధనలు, సాహిత్యం, పుస్తక ప్రచురణ, గ్రంథాలయాలకు ప్రాణం పోయటం, తెలుగువారి సాంప్రదాయక కళలను విద్యార్థు లందరికీ నేర్పించటం, మద్రాస్ అడయారులోని కళాక్షేత్రం, కేరళ త్రిస్సూరులోని 'కళామండలం' స్థాయిల్లో ఒక గొప్ప కళా విద్యా సంస్థను నెలకొల్పటం, లలిత కళలు శిల్పకళల పరిరక్షణ, అకాడెమీలను పునరుద్ధరించే వాగ్దానాన్ని నిలబెట్టుకోవటం, శాస్త్ర సాంకేతిక సాహిత్యాన్ని ప్రచారంలోకి తేవటం, భాషాభివృద్ధికి, ఒక 'సాధికార సంస్థ' నెలకొల్పటం, కవులు కళాకారుల్లో అర్హులైన వారికి సంక్షేమ పథకాలు వర్తింప చేయటం ఇవన్నీ జరగాలి. జరిపే సంకల్పం ఉండాలి. వాటి నిర్వహణ అర్హులు, సమర్థుల చేతుల్లో ఉంచాలి. ఈ చివరిదే చాలా ముఖ్యమైన అంశం.

రాష్ట్రాభివృద్ధికి ఇరవై యేళ్ళ విజన్ డాక్యుమెంటు తయారు చేసుకున్న ప్రభుత్వం సాంస్కృతిక విధానానికి కూడా తయారు చేయకపోవటం కళాపోషణ లేకపోవటంతో సమానమే! "తెలుగదేల యన్న దేశంబు తెలుగు" అని కమ్మగా పాడతారు గాని, ఆ తెలుగు అతీగతీ పట్టించుకోరు. "నో పార్కింగ్ ఫర్ త్రీ వీలర్స్" అని రిక్షావాళ్ల

కోసం కూడా ఇంగ్లీషులోనే బోర్డు పెట్టే అధికారుల్ని ఉద్యోగంలోంచి తీసేయకుండా పోషించే ప్రభుత్వం కళాపోషణ చేయగలదా?

భాషోద్యమం బలంగా తన వాణిని వినిపించిన ప్రతిసారీ ఇంటర్మీడియట్ వరకూ తప్పనిసరిగా తెలుగు నేర్పించాలని ఒక జీవోని ప్రభుత్వం విడుదల చేస్తుంది. కాంగ్రెస్ ప్రభుత్వం, తెలుగుదేశం ప్రభుత్వం కూడా ఇలాంటి జీవోలు ఇచ్చాయి. కానీ, విచిత్రంగా ఆ జీవోలు అమలు కావు. అమలు చేయాలని ఇంకో జీవో ఇచ్చినా అదీ అమలు కాదు. రాష్ట్రంలో పరిస్థితి ఇది.

కవి గానీ, కళాకారుడు గానీ కన్నడంలోనో మళయాళంలోనో లేకపోతే అరవంలోనో పుట్టాలి. తెలుగులో పుట్టకూడదు. పుడితే జీవిత కాల అజ్ఞాతవాసమే శిక్ష. అంతర్జాతీయ స్థాయి రచన తెలుగులో వ్రాస్తే, ఇలాంటివి పోవని ప్రచురణకర్త వేయడు. రచయితే స్వంతంగా వేసుకున్నా పుస్తక విక్రేతలు తమ షాపుల్లో పెట్టి అమ్మరు. అమ్మినా పాఠకులు, గ్రంథాలయాల వారు కొనరు. ఇలాంటి స్థితిలో వ్రాసిన దానికి వెలుగు చూసే (out-let) అవకాశం లేకపోవటాన గొప్పగొప్ప సాహితీ వేత్తలు రాయని భాస్కరు లౌతున్నారు. తెలుగులో జ్ఞానపీఠాలు తక్కువని ఎద్దేవా చేస్తారు గానీ తేగల సత్తా ఉన్నవారికి ప్రోత్సాహం ఏదీ?

రాయలవారి పద్యం సాంస్కృతిక విధానంకల్గిన ప్రభువు(ఱేడు) గురించే చెప్తుంది. పరాపరోక్తులు తెలిసి, యుక్తాయుక్తా లెరిగి కవులకు, కళాకారులకు, కళలకు మేలు చేసే వాడు కాకపోతే, అలాంటి ఱేడు పాలనలో మారేడు కూడా తానే ఱేడు నన్నట్టు వ్యవహరిస్తుంది. తనచుట్టూ భజంత్రీలను చేర్చుకుని వాళ్లచేతుల్లో శ్రీఫలాలు పెడుతుంది. శ్రీ ఫలం అంటే విబూది పండు! చివరికి బూడిద విదిలిస్తుందన్నమాట! నేరేడు చెట్టు కూడా ఱేడుగా చెలామణి అయి, గాలిపక్షులకు ఆశ్రయం ఇస్తుంది. పూరేడు (పుప్పొడి) కూడా తానూ ఱేడనే నంటూ గాల్లో తిరుగుతుంది. “అసలు ఱేడు” తిన్నగా లేకపోతే ఇలాంటి నకిలీ ఱేడులు ముత్యాలముగ్గు కాంట్రాక్టరు లాగా ‘కళాపోసన’ చేస్తుంటారు.

తిరుపతి వేంకట కవులకీ, వేంకట రామకృష్ణ కవులకీ వివాదం వచ్చినప్పుడు, ఆ వివాదాన్ని తేల్చగల ప్రభువు గట్టివాడై ఉండాలంటూ తిరుపతి వేంకట కవులు చెప్పిన పద్యం ఇది.

# భాషాలాభం-భాషా భేదం

*"తుదముట్టఁగ నీ కబ్బము/పదిలంబుగాఁ జదివినట్టి బాలుర కోలిం*
*బొదలును భాషాజ్ఞానము/కుదురుం గొదలేక నీతికుశలత్వంబున్".*

(పరవస్తు చిన్నయసూరి నీతిచంద్రిక)

చిట్ట చివరి పేజీ దాకా ఈ పుస్తకాన్ని జాగ్రత్తగా, శ్రద్ధగా ఏకబిగువున చదివిన విద్యార్థులకి మానసిక వికాసం, నైతిక వర్తనతో పాటు భాషాజ్ఞానం కుదురుతుందని, కుశలత్వం అంటే నిశితంగా పరిశీలించే చాకచక్యం పెరుగుతుందని పరవస్తు చిన్నయ సూరిగారు 'నీతిచంద్రిక' కృతి ప్రశంస సందర్భంలో ఈ పద్యం వ్రాశారు.

చిన్నయ సూరి వచన రచనా మార్గదర్శకుడు. సంఘసంస్కారపరుడు. బాలవ్యాకరణ కర్త. భాషాభిజ్ఞుడు. సంగీత వేత్త. "సుజనరంజనీ" అనే పత్రిక సంపాదకుడుగా కూడా వ్యవహరించాడు. ఇప్పటికి 200 యేళ్ళ క్రితమే డిగ్రీ పరీక్షలకు వెళ్ళే విద్యార్థులకు ఉపయోగపడే సమాచారం ఈ సుజనరంజని పత్రిక ద్వారా ప్రచురించేవాడట. చిన్నయ నన్నయను అభిమానించాడే గానీ, ఆయన నన్నయ కాలంనాటి మనిషిగా జీవించలేదనటానికి ఈ పత్రికే సాక్ష్యం.

చిన్నయ సూరి కాలానికి ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం తమ అధికారుల్ని సమర్థవంతంగా పాలించటం కోసం స్థానిక భాషలు నేర్చుకోవాలని ఆదేశించింది. అలా తెలుగు నేర్చుకోవాలని వచ్చే తెల్లదొరలకు సంస్కృతంలో ఉన్న ఆంధ్రశబ్దచింతామణినే చెప్పేవాళ్లు. దానివలన తెలుగు జనభాష తెల్లదొరలకు తెలియకుండా పోయింది.

ఇంగ్లీషు వాళ్ళు భారతీయ భాషలు నేర్చుకోవటానికి ఇలా అనవసరంగా కష్టపడవలసి వస్తోందని భావించి, థామస్ బాబింగ్'టన్ మెకాలే అనే అధికారి భారతీయులకే ఇంగ్లీషు నేర్పించే విద్యావిధానం (teaching a Western curriculum with English as the language of instruction) అమల్లోకి తెచ్చాడు. ఇది The English Education Act of the Council of India -1835గా ప్రసిద్ధి. అది మొదలు భారతీయ భాషల పతనానికి నాందీ పలికాడు మెకాలే!

అప్పటి వరకూ కోర్టుభాషగా ఉన్న పర్షియన్ స్థానే ఇంగ్లీషును ప్రవేశపెట్టాడు. 180 యేళ్ళ క్రితం ఇంగ్లీషు చదువులకు బీజావాపన అలా జరిగింది. పాశ్చాత్య విద్య ఉన్నతమైంది (Western learning was superior) అనేది మెకాలే నినాదం. అరబ్బీ, సంస్కృతం, ఇతర భారతీయ భాషల్లో అప్పటి ఈస్టిండియా కంపెనీ చేపట్టిన

ప్రచురణలన్నింటిని వెంటనే ఆపి వేయించాడు. సంస్కృతం తదితర స్థానిక భాషలకు ప్రోత్సాహం నిలిపి వేశాడు.

దీని ఫలితంగా ఇంగ్లీషు వాళ్లతో పాటు, తెలుగు వాళ్ళు కూడా తెలుగు నేర్చుకోవటం మానేశారు. ప్రామాణికత, శాస్త్రీయత లేని భాషగా తెలుగు ముద్రపడిపోయింది. గ్రంథాలలో వాడే తెలుగు భాష (గ్రాంథిక భాష) సంస్కృత మయం గానూ, జనం నాలుకల మీద తెలుగుభాష ఇంగ్లీషు సంకరంగానూ మారిపోయింది. ఈ పరిస్థితుల్లో తెలుగు కావ్యాలలో భాష అయోమయ పరిస్థితిలో పడింది. తెలుగు కవికి గౌరవం తగ్గి పోయింది.

19వ శతాబ్ది చివరి దాకా తంజావూరులో మరాఠీ రాజులు, మదురైలో నాయక రాజులు స్వతంత్రాన్ని నిలుపుకుని పాలించగలిగారు కాబట్టి, అక్కడ కొంతవరకూ తెలుగు భాషకు ఆదరణ నిలబడింది.

తక్కిన తెలుగు నేల యావత్తూ భాషాభిమానం శూన్యమైన స్థితిలో నడిచింది.

వ్యాకరణం, నిఘంటువు ఇవి రెండూ భాషకి ప్రాణప్రదం. వీటి మీద భాషా సేవకుడు బ్రౌను దొర దృష్టి పెట్టాడు. బ్రౌన్ దగ్గర కొంతకాలం పని చేసిన చిన్నయ్యసూరి గారికి తరువాతి కాలంలో "అర్బత్ నాట్" ఆదరణ దొరికింది. ఆ బలంతో తెలుగు భాషకి శాస్త్ర ప్రాతిపదిక ఏర్పడటం కోసం వ్యాకరణం మీద ప్రధానంగా చూపు సారించాడు చిన్నయ సూరి.

ప్రాచీన తెలుగు కవుల పదబంధాలు ఆధారం చేసుకుని, బాలవ్యాకరణాన్ని బిగువైన సూత్రాలతో కంఠస్థం చేయడానికి అనువుగా ఆయన రూపొందించాడు. కవి సమర్థతకు, పద ప్రయోగ స్వేచ్ఛకూ పెద్ద పీట వేశాడు.

'ప్రయోగశరణం వ్యాకరణం' అనే సూక్తి ప్రకారం కవి ప్రయోగాలు లేదా కొన్ని సందర్భాల్లో జన ప్రయోగాలు కూడా వ్యాకరణ సూత్రాలకు మూలం అవుతాయి. ఎవరూ సృష్టించక పోతే భాష ఎలా పుడ్తుందనే ప్రశ్న గొప్పది!

సొగసైన వాక్య నిర్మాణంతో మిత్రలాభ, మిత్రభేదాలను 1853లో చిన్నయ సూరి తెలుగు చేశాడు. కోలా శేషాచల కవి సూరి సమకాలికుడు. ఆయన 1854లో వ్రాసిన "నీలగిరి యాత్ర"లో వచనం సూరి వచనానికి దగ్గరగా ఉండటానికి బహుశా ఇప్పుడు మనం చెప్పుకున్న సామాజిక, రాజకీయ పరిణామాలు కారణం కావచ్చు. ప్రామాణిక భాష ద్వారా భాష ఔన్నత్యాన్ని నిలబెట్టడం వాళ్ళ లక్ష్యం. గ్రాంథికం వ్యావహారికం అనే అంశాలకన్నా భాష ప్రామాణికతే ముఖ్యం ఆరోజుల్లో!

సాధారణంగా పద్యాలలో పద ప్రయోగాలు ఛందో వ్యాకరణాలకు అనువుగా ఉంటాయి కాబట్టి, ఆ పదసంపదను వచనానికి ఆపాదించే ప్రయత్నం చిన్నయగారు చేశాడు. ప్రామాణిక భాష కోసం పడిన తాపత్రయమే ఇదంతా!

గిడుగు వారి వ్యావహారిక భాషోద్యమం తరువాత పుట్టిన మనకు సూరి గద్దుభాష ఇబ్బందికరంగానే ఉండొచ్చు. కానీ, ఆ పరాయి పాలనా కాలంలో, భాషా వ్యతిరేక వాతావరణంలో భాష ప్రామాణీకరణానికి చిన్నయ సూరి పడిన శ్రమకు వెలకట్టలేం!

అసలైన తెలుగు పదాలు వ్యావహారిక భాషలో కన్నా సూరి వాడిన భాషలోనే ఎక్కువ! ఇప్పటి మనం డు, ము, ఉ, లు తీసేసి సున్నాపెట్టి వ్రాస్తే అదే వ్యావహారికం అనే భ్రమలో వ్రాస్తున్నాం. నిజమైన జనభాష నేటి సాహిత్య భాషగా లేదనేది నిజం.

వాడుక భాషకు సంస్కృతం దేనికి? సంస్కృత పదం గానీ, ఆంగ్లపదం గానీ లేకుండా మనం ఒక్క వాక్యాన్ని వ్రాయగలమా? వ్యావహారిక భాషోద్యమం నిజంగానే తెలుగు భాషను రక్షించిందా...? స్వచ్ఛమైన తెలుగుపదాలు వెలుగులోకి వచ్చాయా...? భాషాలాభం, భాషాభేదాలు జనాన్ని చేరాయా...? ఇప్పుడు మనం వ్రాస్తున్నది ప్రామాణిక తెలుగు వచనమేనా...?

మన ఆలోచనాపరిధి మరింత విస్తరిస్తే భాష విషయంలో జరగవల్సిందేమిటో బోధ పడ్తుంది.

భాషాభివృద్ధి కోరేవారు అధికారభాష అమలుకోసం ప్రభుత్వం వైపు ఊరక చూస్తూ కూర్చున్నారు. ప్రభుత్వంలో వ్యక్తులకు ఎవరి ప్రాధమ్యాలు వారికుంటాయి. అయ్యేలా చేసేవాడు ఒకడుంటే అవకుండా చేసేవాళ్ళు అధికులుంటారక్కడ. ఆరు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికారభాష కాకపోవటానికి ప్రభుత్వంలోని వ్యక్తులు, అధికారులే కారకులు. వారి సంగతి అలా ఉంచండి...మేధావులు ఏం చేస్తున్నారు...? ఎక్కువమంది ప్రభుత్వ నిష్క్రియాయాపరత్వాన్ని తిట్టటానికే ఎక్కువకాలం వినియోగిస్తున్నారు. మనం పూనుకోవాల్సిన పనులు కూడా కొన్ని ఉన్నాయి.

ఆంగ్ల పదాలకు, పాలనాపరమైన ఇతర పదాలకు సమానమైన తెలుగు పదాలను ఉద్యోగులకు అందించకుండా, వాళ్లని తెలుగులో పాలించటం లేదని తిట్టి ఉపయోగం లేదు పాలనా రంగంలో అనుభవం ఉన్న తెలుగు భాషాభిమానులు ఇందుకు పూనుకోవాలి.

ఆంగ్లపదాల ఉచ్చారణను యథాప్రకారం ఎలా పలుకుతున్నామో అలా వ్రాయటానికి మన లిపిలో తెచ్చుకోవలసిన మార్పుల మీద గట్టి చర్చ జరగలేదు, లిపి సంస్కర్తలూ పట్టించుకోలేదు. వాటి విషయమై భాషాపండితులు ఆలోచన సాగించాలి

అలు, అలూల్ని అరు, అరూల్నీ, బండిరాల్నీ తీసేసి ఛాందసవాదం మీద విజయం సాధించామని చాలా మంది అంటూ ఉంటారు. ఈ వర్ణాలు కేవలం సంస్కృత

పదాలకే గానీ, తెలుగు నుడులకు వర్తించేవి కావు. అవి ఉంచినా తీసేసినా తెలుగుకు ఒరిగేదేమీ లేదు. అవి తెలుగు లిపి సంస్కరణకు సంబంధించిన వర్ణాలు కానేకావు. కొన్ని సంస్కృత పదాలను తప్ప వాటిని ఉపయోగించాల్సిన తెలుగు మాటలు లేవు. ఆ సంస్కృత పదాలను ఏ కారణం చేతనైనా తెలుగులో వ్రాయవలసి వచ్చినప్పుడే వాటి అవసరం వస్తుంది. ఋగ్వేదాన్ని రుగ్వేదం అని వ్రాస్తే అది తెలుగు భాషాభివృద్ధి పరిధిలోకి వచ్చే అంశం కాబోదు. దానివలన తెలుగుభాషకు జరిగే మేలులేదు.

వర్ణాలు ఎక్కువగా ఉంటే భాషకు కలిగే అవమానం ఏమీ లేదు. ఏ భాషాపదాన్నైనా దాని సహజ ఉచ్చారణ చెడకుండా తెలుగులో వ్రాయటానికి కావలసిన అక్షర సంపద తెలుగు కలిగి ఉండాలి. తెలుగులో కొత్త తెలుగు వర్ణాల సృష్టి కంప్యూటరులో జరగాలి. ఇతర భాషాపదాల ఉచ్చారణను వ్రాయటమే వాటి ఉపయోగం.

మారుతున్న సామాజిక పరిస్థితుల కనుగుణంగా తెలుగు భాషలో రావలసిన మార్పుల గురించి ఆలోచించాలి.

ఆధునిక సాంకేతికతా ప్రయోజనాలను ఇంగ్లీషుతో సమానంగా తెలుగు భాషకు అందించేందుకు సాంకేతిక నిపుణులు భాషాభిమానంతో ప్రయత్నించాలి. యంత్రానువాద ప్రక్రియలో ఎదురయ్యే సమస్యలు, పరిష్కారం గురించి నూతన పరిశోధనలు జరగాలి

ప్రాంతీయ పదాలుగా ముద్రపడి, నిరాదరణకు గురౌతున్న మాండలిక పదాలను తెలుగు జాతీయ పదాలుగా గుర్తించే ప్రయత్నాలు చేయాలి. వాటిమీద ప్రాంతీయ ముద్ర వేసినందువలన అవి పొందవలసిన గౌరవం పొందక పోగా, ఇతర ప్రాంతాల వారికి అందనివి అవుతున్నాయి. మాండలికాలను కూడా ప్రధాన నిఘంటువులో చేరుస్తూ, ఒక సమగ్ర నిఘంటు నిర్మాణం జరగాలి.

వ్యావహారిక భాషకు వ్యాకరణాంశాలమీద కూడా తగిన స్థాయిలో చర్చలు జరగలేదు. వ్యాకర్తలు పూనుకుంటే గానీ వాడుకభాష నియమబద్ధం కాలేదు.

కొత్త తెలుగు నుడి ప్రయోగాలను చేరుస్తూ ఒక పదనిధి లేదా వర్డ్‘బ్యాంక్ లాంటివి ఏర్పడాలి.

ఈ విధమైన ప్రయత్నాలకు ప్రభుత్వంతో పని లేదు. వ్యక్తులస్థాయిలోను, సాంకేతిక సంస్థల స్థాయిలోనూ, విశ్వవిద్యాలయాల స్థాయిలోనూ చేపట్టవలసిన పనులే ఇవన్నీ!

భాషాలాభం సమకూరాలంటే ప్రజలస్థాయిలో ఇవి ముందు జరగాలి!

భాషాభేదం అంటే సంస్కృత, ఆంగ్ల పదాలకు మాత్రమే లాభాన్ని కోరడం అని చెప్పాలి. తెలుగు భాషోద్యమం ఈ ధోరణిని తీవ్రంగా ఖండిస్తుంది!

# మగ ఏడుపులు

*ఱెక్కలు రావు పిల్లలకు, ఱేపట నుండియు మేతగానమిం*
*బొక్కుచు గూటిలో నెగసి పోవగ నేరవు, మున్ను తల్లి యీ*
*దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కినిక్కి న*
*ల్దిక్కులు జూచుచున్న వతి దీనత, నెట్లు భరింతు నక్కటా!*

(శ్రీ మదాంధ్ర మహా భాగవతము - 7/63)

భార్యలు ఊరెడితే భర్తలు ఎంజాయి చేస్తారని చాలా మంది కథలు, కార్టూన్లు సృష్టిస్తారు గానీ, పిల్లల్ని ఇంట్లో వదిలి భార్య ఊరెడితే అప్పుడు తెలుస్తుంది అయ్యగార్ల సంగతి.

ఈ దేశంలో భర్త లేకపోయినా స్త్రీ జీవించగలదు. కానీ భార్య లేకపోతే భర్తకు ఒక్క పూట కూడా గడవదు.

భర్త పోతే తోడుమనిషి పోయాడని ఏడుస్తుంది భార్య. భార్య పోతే ఇల్లెలా నడుస్తుందని ఏడుస్తాడు భర్త. వంటెవరు చేస్తారు? ఇల్లెవరు ఊడుస్తారు? అంట్లెవరు కడుగుతారు? బట్టలెవరు ఉతుకుతారు? పిల్లల్నెవరు సాకుతారు? అందుకని భార్య లేదని మగాళ్ళు ఏడుస్తారు.

భార్య ఉన్నంత సేపూ వేధించుకు తినటం, 'నుయ్యో గొయ్యో చూసుకుంటా'నని ఆమె ఏడవటం, 'చస్తే చావు, ఈడ్చి పారేస్తా'... అని అతను అరవటం...ఇవి చాలా ఇళ్ళలో నిత్య కృత్యాలే! కానీ, ఒక్క రోజు భార్య ఇంట్లో లేకపోతే తలకిందులై పోతాడు మగాడు.

ఇదేదో మహిళా ఉద్యమం ఉధృతంగా నడుస్తున్న ఈ నాటి సామాజిక పరిస్థితి గురించి కాదు. పోతనగారి నాటికే ఈ ధోరణి ఉంది. ఆయన తన భాగవతంలో ఇలాంటి కథే ఒకటి చెప్పాడు: ఉశీవర రాజ్యాన్ని పాలించే సుయుజ్ఞడనే రాజు యుద్ధంలో మరణించాడు. శవం చుట్టూ చేరి భార్యలు, బంధువులూ ఏడుస్తున్నారు. అది చూసి సాక్షాత్తూ యముడు ఓ బ్రాహ్మణ బాలుడి రూపంలో అక్కడికి వచ్చాడు. ఆ ఏడ్చే వాళ్ళందరినీ ఊరడించేందుకోసం వాళ్లకు ఈశ్వర తత్వాన్ని బోధిస్తాడు. ఆ క్రమంలో ఈ 'కథ చెప్పాడు...

అడవిలో ఓ చెట్టు మీద అడవి పిచ్చుకల జంట సుఖంగా ఉన్నాయి. ఆ సమయంలో ఓ వేటగాడొచ్చి"భార్యపిచ్చుక"ని పట్టి రెక్కలు విరిచి సంచీలో వేసుకున్నాడు. అప్పుడు "భర్తపిచ్చుక" ఏడుస్తూ ఇలా అంది: "అయ్యయ్యో! మన పిల్లలకు ఇంకా రెక్కలు కూడారాలేదు. అవి ఎగర లేవు. తెల్లవారిందగ్గర్నుంచీ అవి

ఆకలో మొర్రో అంటూ గోలచేస్తాయి, నువ్వెప్పుడొచ్చి అన్నం పెడతావా... అని నీకోసం నిక్కినిక్కి చూస్తాయి. వాటి ఏడుపు వినటానికే భరించ లేనంతగా ఉంటుంది. ఇంకనుండి చచ్చినట్టు వాటికి ఆహారం నేనే తెచ్చి పెట్టవలసి వస్తుంది కదా!" అని భర్త పిచ్చుక ఏడ్చినట్టు వ్రాశాడు పోతన గారు. "మగఏడుపులు" ఎలా ఉంటాయో ఈ పద్యం మనకువివరిస్తోంది

బతికున్నంత కాలం భర్త ఎంత అన్యాయం చేసినా, తన భర్త చనిపోయి తనకు అన్యాయం చేశాడనే అంటుంది భార్య. అనుకుంటుంది కూడా! కానీ, భర్తలు మాత్రం అలా అనుకోరు. అదే తేడా!

ఉశీవర దేశ రాజు పోయాడని రాణులు ఏడ్చినప్పుడు యముడు భార్య పోతే ఏడ్చిన భర్త కథ చెప్పినట్టు పోతనగారు వ్రాయటంలో విచిత్రం లేదు. లోకం తీరు చెప్పాడు యముడు. అదే ఈశ్వర తత్త్వం అంటే! లోకాన్ని నడిపించేది ఈశ్వరుడైనప్పుడు లోకం తీరు ఈశ్వర తీరే అవుతుంది కదా! దాన్నే చెప్తున్నాడు ఈ పద్యంలో పోతనగారు...

అందరు మగాళ్ళు ఇలానూ, అందరు ఆడాళ్ళు అలానూ ఏడవాలనే రూలేమీ లేదు. ఏడవటానికి కారణాలు వేరుగా ఉంటాయనేది మాత్రం నిజం. సామాజిక వ్యవస్థ తీరే అంత!

మనుషులందరూ పరస్పరం ఆధారపడి బతికితేనే అది సమాజం అనిపించుకుంటుంది. కానీ, భార్యా భర్తల విషయానికి వచ్చే సరికి మాత్రం భార్యని తాను పోషిస్తున్నానని, అందుకు కృతజ్ఞతగా భార్య ఆజన్మాంతం అణిగి ఉండాలనీ భర్తల్లో ఓ బలమైన భావం సర్వత్రా కనిపిస్తుంది.

భార్య సంపాదన మీద ఆధారపడి బతికేవాడిక్కూడా ఇలాంటి ఆలోచనే ఉంటుంది...తనవలనే కదా ఆమె సుఖంగా వుందని!

అసలు రహస్యం ఆమె పోయినప్పుడే తెలుస్తుంది... అందుకే మగజాతి అలా ఏడుస్తుంది!

# మగానుభావులు

*వాదులాని తోడ, వాట్లీని తోడను,*
*బూతు తోడc దిండి పోతు తోడను*
*నటమటీని తోడ, నడియరి తోడను,*
*వెలకు నెత్తమాడవెరవు కాదు,*

*(ఉత్తర హరివంశం నాచన సోమనాథుడు)*

సత్యభామ కృష్ణుడు జూదం ఆడే సందర్భం. ఇక్కడ నాచన సోమనాథుడు వ్రాసిన పద్యాలు చాలా అసక్తి దాయకంగా ఉంటాయి. అంతఃపురంలో సత్యాకృష్ణు లిద్దరూ చెరో వేపు కూర్చుని గవ్వలాడుకుంటూన్నారు. ఈ ఆటని సోమన 'నెత్తమాడటం' అన్నాడు.

ప్రాకృతంలో నెత్త అంటే కన్ను. పాచికలమీద చుక్కలుంటాయి. వీటిని నెత్తలు (కళ్ళు) అంటారు. నెత్తమాడటం అంటే పాచికలాడటం. మహాభారతంలో ధర్మరాజు, శకునీ ఎదురూ బొదురూ కూర్చుని ఆడినవి పాచికలు. సత్యాకృష్ణులు ఆడుతున్నవి గవ్వలు.

తెలుగు, కన్నడ భాషలో గవ్వల్ని 'నెత్త' అంటారు. నత్తగుల్లలు, నత్త అనే పురుగు ఇవన్నీ గవ్వలకు సంబంధించిన పదాలే! గవ్వలాడేప్పుడు గవ్వ తిరగబడితే కన్ను అనీ, బోర్లా పడితే గుడ్డి అనీ పిలుస్తారు.

సత్యాకృష్ణులు పాచికలతో ఆడారా.. గవ్వలతో ఆడారా..?ఉత్తర హరివంశం తృతీయాశ్వాసానికి వ్యాఖ్య వ్రాసిన వేదము వెంకట రామన్ గారు నెత్తమాడటం అంటే గవ్వలతో ఆడటమేనని. అది శకుని ఆడిన మాయా జూదం లాంటిది కాదనీ వివరణ ఇచ్చారు.

"ఓ తరుణి, నేను నెత్తము
నీతో నాడునెడ రుక్మిణి కనుంగొను,ని
న్నాతి మఱియాడ, నీవుం జూతింతియ,
పంత మడుగు చోc దెల్పుటకున్" సత్యతో నెత్తాలాడేప్పుడు రుక్మిణి రిఫరీ లా ఉంటుందనీ, ఆమెతో ఆడేప్పుడు నువ్వు రిఫరీలా ఉండాలనీ కృష్ణుడు ముందే సత్యతో ఒప్పందం కుదిర్చాడు.

"ఆట మధ్యలో ఈ మధ్యవర్తితో పనేమిటీ?" అని కొంచెం విసుగ్గా చూసింది సత్య. పందెం ఎంత అనేది తేల్చటానికి ఒక వ్యక్తి కావాలి కదా అన్నాడు కృష్ణుడు.

మహాభారతంలో ఒడ్డెను-ఓడెను అనటమే వినిపిస్తుంది. అవి అజ్ఞాత

అరణ్యవాసాల దాకా వెళ్ళే ప్రమాదకర పందాలతో కూడుకున్నవి. శ్రీకృష్ణసత్యల నెత్తాలాట అంత ప్రమాదకరమైంది కాదు. కానీ, పందెం పందెమే కదా!

ఆనాడు కురుసభలో జరిగింది "అభిమతాక్షముల్ తాల్చి మాయావిదుండు" ఆడిన ఆట. అంటే, తను కోరుకున్నట్టుగా పడే దొంగ పాచికలతో ఆడినవి "అభిమతాక్షములు" ఇందులో కూడా అక్షములు 'కళ్ళు' అనే అర్థంలో కనిపిస్తాయి.

కానీ, కృష్ణుడు సత్యభామ ఆడింది బహుశా ఇళ్ళలో కూచుని ఆడవాళ్ళు మగవాళ్ళూ సరదాగా ఆడుకునే గవ్వలాటే అయి ఉంటుంది. ఇంట్లో వాళ్లంతా కూర్చుని పేకాడుకున్నా ఓకు కింత అని డబ్బులు పెట్టి ఆడటం తెలుగిళ్లలో సాధారణమే!

శ్రీకృష్ణ, సత్యలు డబ్బులతోనే పందాలు కాసుకుని గవ్వలాడుతున్నారు.

ఋగ్వేదంలో ద్యూత సభల గురించి కూడా ఉంది. కవష ఐలూష పుత్రుడు చెప్పిన "సభామేతి కితవః" అనే ఋక్కులో "నేనే గెలుస్తా!" అంటూ జబ్బలు చరుచుకుంటూ సభకి వెళ్ళినట్టు ఉంది.

ఇప్పటికీ జూదం అనేది ఒక వ్యసనంగానే ఉంది. బహుశా ఇది "కంపల్సివ్ గాంబ్లింగ్ సింద్రోమ్" అనే ఒక మానసిక వ్యాధి కావచ్చు. పబ్బులూ, బార్లూ, నైట్ క్లబ్బుల్లో జరిగేదంతా ఋగ్వేద కాలంలోనూ జరిగింది. మనవాళ్ళలో మగానుభావులకు కొదవేం లేదు. చాలామంది దృష్టిలో సభ అంటే జూద సభే! క్లబ్ అటే, పేకాట క్లబ్బే!

జూద సభల్లో కూర్చున్న వాళ్లని సభికులు అంటారు. సభికులంటే జూదగాళ్లని! ప్రజాహితం కోరి జరిగే సాహిత్య, సాంస్కృతిక సభల్లో పాల్గొనే వాళ్లని సభికులు అనకూడదు. వాళ్లని సభాసదులు అనటం మానమర్యాదలతో కూడుకున్న సంబోధన. సభాసదులు సభికులు కారాదు..

సత్యభామ అంతఃపురంలో ఇప్పుడు శ్రీ కృష్ణసత్యలు సభికులు. కృష్ణుడు రుక్మిణి పేరెత్తేసరికి సత్యకు ఒళ్ళు మండి ఇలా అంది:

"ఊరికే వాదులాడేవాడితో డబ్బెట్టి జూదం ఆడకూడదు.

అలాగే వాట్లీడే వాడితో కూడా ఆడకూడదు.. వాటు అంటే కొట్టడం. కొట్లాడే లేదా పోట్లాడే వాడితో అస్సలు ఆడకూడదట.

బూతుతో పొరబాటున కూడా ఆదొద్దు. నోరు తెరిస్తే బూతు మాటలు వచ్చే వాళ్లతో జాగ్రత్తగా ఉండాలి.

ఇంక తిండిపోతుతో కూడా ఆడకూడదు. వాడు ఆటమీదకన్నా తిండి మీద శ్రద్ధ ఎక్కువ బెడతాడు. వాడితో ఆడితే మనసు రంజుగా ఉండదు.

అటమటీడుతో కూడా ఆడవద్దంటుంది. అటమటీడు అంటే మోసకాడు.

అడియరితోనూ ఆడవద్దంది. అంటే పాద సేవకుడు. సేవకులతో కూర్చుని ఎప్పుడూ ఆడకూడదు. వీళ్ళతో వెలకు అంటే డబ్బు పెట్టి నెత్తమాడటం మంచిదికాదంటుంది సత్య.

మొత్తానికి ఈ మాటలు కృష్ణుడికి ఎక్కడో తగిలాయి. సత్య చెప్పిన లక్షణాల్లో ఎన్ని తనకున్నాయా అని వితర్కించుకుని, ఆ తిట్లన్నీ తగిలేలా ఉన్నాయని గుర్తించాడు. దానికి సమాధానంగా తరువాతి పద్యంలో ఓ పరిచారికని పిలిచి, "సత్య ఆడనంటోంది గానీ, వెళ్ళి జాంబవతిని పిలుచుకు రా" అంటాడు.

అలా ఎదురు దెబ్బ తీసే సరికి తన ఇంట్లో తన సవితితో తన భర్త కూర్చుని ఆడుతుంటే తాను కాఫీ టీలు అందించాల్సిన పరిస్థితి సత్యకు ఎదురయ్యింది. మోసగాడితో ఆడటమే కాదు, ఆడక పోవటం కూడా ప్రమాదమే!

# మనం మనలా మనాలి

*"గాహాణయ గేయాణయ*
*తంతీ సద్దాణ పోధ మహిళాణ*
*తాణం సొచ్చియ దండో*
*జే తాణ రసం సయాణంతి"*

(గాథాసప్త శతి)

మాట పాట ఆట అన్నీ ఒకదాని వెనక ఒకటిగానే వచ్చాయి. నాదం వీటన్నింటికన్నా ముందు పుట్టింది. ఆమాటకొస్తే మనిషి కన్నాముందే పుట్టింది. కోయిల పాట, నెమలి ఆట సంగీత నాట్యాలకు కులగురువులు. వేదాలు ప్రకృతిని అనుసరించాయి. భారతీయ సంగీతానికి మూలం వేదాలలోని స్వరాలే!

సామవేదం భారతీయ సంగీతానికి మూలం. ఇందులో ఏడు నుండి పది స్వరాలు వాటి సంగతులు, గమకాలూ ఉన్నాయి.

మరికొంత కాలానికి సంగీతంలో వాది-సంవాది, ఆరోహణ-అవరోహణ, మంద్ర-తారా స్థాయిలు మొదలైన ప్రక్రియలు వచ్చాయి.

సంగీత కళకు లక్ష్య లక్షణాలు నిర్మించి వ్యాప్తికి తేవటంలో ఆంధ్రుల పాత్ర గొప్పది. క్రీస్తు పూర్వం చివరి శతాబ్దాలు – క్రీస్తుశకం తొలి శతాబ్దాల నాటి తొలి ఆంధ్రుల చరిత్రని సూచించే అమరావతి, భట్టిప్రోలు నాగార్జునకొండ, గోలి మొదలైన బౌద్ధ స్తూపాలలో ఇంకా ఇతర శిల్ప సంపదలో ఎన్నో రకాల వీణలు, వేణువు, మృదంగం లాంటి వాద్యాలు మనకు కనిపిస్తాయి.

శాతవాహన ప్రభువు హాల చక్రవర్తి సంకలనం చేసిన 'గాథాసప్తశతి' లో ఆనాటి ఆంధ్రుల సంగీత ప్రావీణ్యతని తెలియచెప్పే ఆధారాలు దొరుకుతాయి.

పైన చెప్పిన పద్యం గాథా సప్తశతిలో ప్రాకృతభాషలో ఉన్న ఒక గాథ. దానికి రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు "గాథలందు గేయ గతులందు వీణెల/పలుకులందుఁ బ్రోడ మెలంతలందుఁ/గలుగు మేలి రసము గనుఁ గొనలేనివా/రవని నున్న వారి కదియె శిక్ష" అని అనువాదం చేశారు.

గాథలు (ఆనాటి ఒక కవితా ప్రక్రియ). గేయాలు, తీగవాయిద్యాలు. అందమైన స్త్రీలు వీళ్ళంతా అందించే మేలి రసాల్ని చవిగొనలేని వాళ్ళు ఈ భూమ్మీద ఉంటే, అలా ఉండటమే వాళ్లకు శిక్ష...అంటుందీ గాథ.

ఒక మాటలోని రసాన్ని, ఒక పాటలోని రసాన్ని ఒక పండులోని రసాన్ని, ఒక

వంటకంలోని రసాన్ని, ఆస్వాదించటం చేతకాక పోతే ఆ వ్యక్తి కోల్పోయేది ఎక్కువ. అది ఎన్ని లీటర్ల ఆల్కాహాలు తాగినా పొందగలిగేది కాదు.

సాధారణంగా ఆల్కాహాలికులు త్రాగని ఇతరుల్ని పట్టుకుని కించపరుస్తూ "మందు కొట్టవు, సిగరెట్లు తాగవు, మాంసం తినవు, వ్యభిచారం చెయ్యవు...ఇంకెందుకు వెధవ బతుకు బతకటం..." అంటూంటారు. సంగీత సాహిత్య స్వారశ్యాలు తెలీని ఆ వ్యక్తుల బ్రతుకు అంతకన్నా వృథా కదా!

రెండు వేల యేళ్ళనాటి హాలుడు సేకరించిన ఈ గాథని చెప్పిన ఆంధ్రుడు సంగీతసాహిత్యాలంటే మక్కువ లేని వాళ్ళను అదే మాట అంటున్నాడు. మాట, పాట, ఆటల్ని ఆస్వాదించలేని వాళ్ళ జీవితం నిరర్థకం. అలాంటి వాళ్ళకు ఈ భూమ్మీద వాళ్ళలా రాయిలా జీవించటమే ఒక శిక్ష అని!

భాషా సంస్కృతుల పరిరక్షణ అంటే రెండు వేల యేళ్ళకు పైగా తెలుగు ప్రజల జీవితాలతో ముడిపడి నడిచిన మన చరిత్ర పరిరక్షణ. సంస్కృతి అనేది మన జీవన విధానం. సంగీత సాహిత్యాది కళలు దానిని ప్రదర్శిస్తాయి. పదిలపరుస్తాయి. ప్రబోధిస్తాయి. కవులూ, కళాకారులూ తమ బాధ్యతను నెరవేరుస్తారు. తరువాత తరానికి ఆ సంస్కృతీ దివ్వెను అందిస్తారు. ఒకతరం నుండి ఇంకో తరం ఆ దివ్వెను అందుకుని మరింత వెలుగులు నింపుకుంటూ సాగిపోతుంది.

మధ్యమధ్య సామాజిక రాజకీయ పరిణామాలు ఒక్కోసారి ఈ దివ్వెను కొడిబారేలా, తడి ఆరేలా చేస్తుంటాయి. కవులు కళాకారులే పూనుకుని దివ్వెను మళ్ళీ మళ్ళీ సంరక్షిస్తుంటారు.

మధ్య యుగాలలో మహమ్మదీయ దాడులు, 18వ శతాబ్దిలో విదేశీ వాణిజ్య కంపెనీల దాడులతో పోలిస్తే అమెరికా ప్రభావిత వ్యామోహ పూరిత పాశ్చాత్య తరహా ఆధునిక జీవన విధానం, అంధప్రపంచీకరణం, కుటుంబ వ్యవస్థ విధ్వంసం ఇలాంటి ఇప్పటి అనర్థాలు తాటాకు చప్పుళ్ల లాంటివే!

మాతృభాష గతంలో అలాంటి ప్రతి సందర్భంలోనూ ప్రమాదాలను ఎదుర్కొంది. అందువలన సమాజ నవీకరణానికి సంబంధించిన పదజాలం మన భాషలో అభివృద్ధి కాకుండా పోయింది.

తొలి యుగాలలో సంస్కృతం, మధ్య యుగాలలో ఉర్దూ పర్షియన్ భాషలు, బ్రిటిష్ యుగంలో ఆంగ్లం దేశీయభాషల్ని అణగద్రొక్కేందుకే కంకణం కట్టుకున్నాయి. వివిధ కళలతో పాటు చేనేత సహా గ్రామీణ సాంకేతిక వృత్తి విద్యలన్నీ విధ్వంసం అయ్యాయి. హిందూస్థానీ సంగీతం ఉత్తరాదిలో భారతీయ సంగీతాన్ని కమ్మేయగా, దక్షిణాదిలో విజయనగర ప్రభువులు, నాయకరాజులు ఇంకా ఇతరులు భారతీయ సంగీత రీతుల్ని పరిరక్షించారు.

విజయనగర సామ్రాజ్య కృషి వలనే కర్ణాటక సంగీతం అనే పేరు స్థిరపడినట్టు "తంజావూరు, ది సీట్ ఆఫ్ మ్యూజిక్" గ్రంథంలో డా ఎస్ సీతగారు పేర్కొన్నారు.

భాషా సాహితీ వేత్తలు, వివిధ రంగాలకు చెందిన కళాకారులే సంగీత సాహిత్యాది కళల పరిరక్షకులు. వాటి పట్ల మక్కువని పోగొట్టుకోకుండా అభిరుచిని కొనసాగించటం ప్రజాధర్మం.

కళల పట్ల అభిరుచి అనేది మనిషన్న వాడి కనీస కర్తవ్యం అనీ, అది దేశీయంగా ఉండాలనీ, దేశీయతను గౌరవించటం ఆత్మాభిమానాన్ని ప్రదర్శించటమేననీ, ప్రతి ఒక్కరూ గుర్తించాలి.

అమెరికా అనేది 'భూతాల' స్వర్గం అని తేలిపోయాక మన యువతరం ఆలోచనల్లో దేశీయత పట్ల చిన్నచూపు తగ్గుతుందని ఆశిస్తున్నాను. ఆరోజు ఎంతో దూరంలో లేదు కూడా! సమాజ పాశ్చాత్యీకరణం, అమెరికా భక్తి, ఆంగ్లభాషా వ్యామోహాలను కావాలని పనిగట్టుకుని తెలుగు సమాజం మీద రుద్దిన పాపం మన విద్యావ్యవస్థదే! విద్యావ్యవస్థ చేసిన ఈ పొరబాటుకు ఇప్పటికే రెండుతరాలు దెబ్బతిన్నాయి. విద్యాసంస్థలు. విద్యాధికారులు, నేరుగా ప్రభుత్వాలు ఈ పాపంలో భాగస్వాములు కాగా అర్థంలేని ఆంగ్లభాషా వ్యామోహపరులైన తల్లిదండ్రులు ఈ ఆటతో పావులౌతున్నారు.

అభివృద్ధి అంటే కాళ్ళదగ్గర పాలకుండని తన్నుకోవటం కాదు. దాన్ని మెరుగుపరచి అంతర్జాతీయ స్థాయికి తీసుకు వెళ్ళటం అనే దిశలో ప్రభుత్వ ఆలోచన సాగాలి!

చేనేత, కుమ్మరం, కమ్మరం లాంటి గ్రామీణ సాంకేతిక కళల్ని కులముద్రతో కాకుండా సాంకేతిక కళలుగా అభివృద్ధి చేస్తే, కులాల కతీతంగా అందరూ వాటిని నేర్చుకుంటారు. వారిలో కొందరైనా అంతర్జాతీయ ప్రమాణాలను నెలకొల్పుతారు.. మార్పు అనేది అక్కణించి మొదలు కావాలి.

మనం అమెరికా లాగా మారటం కాదు, మనం మనలా అమెరికాని మించే సాధకులం కావాలని జాతి విద్వేషానికి బలైన అమరుడు కూచిభొట్ల శ్రీనివాస్ మరణం మనకు పాఠాలు నేర్పుతోంది. కళలు, సాంకేతిక కళలే మన ఉనికిని చాటుతాయి. మన అస్థిత్వాన్ని నిలుపుతాయి.

మనం ఎదగాలి! మనం మనలా ఎదగాలి! మనం మనలోనే ఎదగాలి! మనం ఆంగ్లంలా ఎదగాలనుకోకూడదు.

# మూడు ప్రాచీన తెలుగు మాటలు

*పియమహిళా సంగామే సుందరగత్తేయ భోయణీ రొద్దే*
*అటుపుటురటుం భణంతే ఆంధ్రేకుమారో సలోయేతి*

(ఉద్యోతన - కువలయమాల)

బహుశా తెలుగు వారి సాంఘిక చరిత్రలో తెలుగు వారి వ్యక్తిత్వాన్నీ, తెలుగు మాటల్నీ వర్ణించిన అత్యంత ప్రాచీనమైన ఆధారం బహుశా ఇదే కావచ్చు. ఇది, క్రీ. శ. తొలిశతాబ్దాలకు చెందిన ఉద్యోతనుడు అనే కవి ప్రాకృతభాషలో వ్రాసిన 'కువలయ మాల' కథలోది. ఈ ప్రాకృతానికి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ఇలా తెలుగులోకి అనువదించారు:

"అందగత్తెలన్నా యుద్ధరంగమన్నా సమానంగా ప్రేమిచే వాళ్ళు, అందమైన శరీరాలు గల వాళ్ళు, తిండిలో దిట్టలు అయిన ఆంధ్రులు అటు, పుటు, రటు అనుకొంటూ వస్తుండగా చూచాడు" ఇదీ దీని భావం. డా. జి.వి. సుబ్రహ్మణ్యం గారు "తెలుగుతల్లి" కవితా సంకలనంలో దీన్ని చేర్చారు. ఆ విధంగా పరిశీలకుల దృష్టిలోకి ఇది వచ్చింది. వికిపీడియా వారు దీన్ని ఉదాహరించాక అందరికీ తెలిసింది.

తెలుగు వాళ్ళు ఎంత సరసులో అంత యుద్ధ జీవులనీ, చూడ చక్కగా ఉంటారని, దేహపుష్టితోపాటు తిండిపుష్టి కూడా కలిగిన వాళ్లని, అటు, పుటు, రటు అంటూ తిరుగుతుంటారనీ దీని భావం. అత్యంత ప్రాచీన తెలుగు మాటలు ఈ మూడూ! ఇవి శౌర్యానికి సంబంధించిన మిలిటరీ పదాలు.

అటు: 'అటు' అనే మాట తెలుగులో శుష్కింప చేయటం, నీరసం చేయటం లాంటి అర్థాల్లో ఇప్పటికీ బాగా వాడుకలో ఉన్నపదమే! "అట్టు"(దోసె) అంటే తడి ఆరేలా కాల్చింది అని! 'అడుగంటు' అనే మాట కూడా ఇలాంటిదే!

పుటు: 'పుటు' అంటే కొత్తదనం, పాతను రూపుమాపటం లేదా రిపేరు చేయటం లాంటి అర్థాల్లో వాడకంలో ఉన్న పదం. పొటమరించటం అంటే అంతకు ముందులేని నూతనోత్తేజం అని అర్థం. "చిటిపొటిసొమ్ములు పెట్టుక పుటపుటగా వీధి వెంట పొరిగిండ్లబడిన్" అనే ప్రయోగంలో ఇనుమడించిన ఉత్సాహంతో అనే అర్థంలో పుటపుటగా వెళ్ళినట్టు (The act of breaking forth) కనిపిస్తుంది.

రటు: 'రటు' అనే మాట పెద్ద కల్లోల ధ్వని, ఉపద్రవం అనే అర్థాల్లో కనిపిస్తుంది. "నోటి కూటికి రాటు తెచ్చుకొంటిగదాయని" లాంటి ప్రయోగాలున్నాయి. రాటుపడటం అంటే కష్టాల్లో పడటం.

ఈ విధంగా 'అటు, పుటు, రటు' అనేవి శత్రుభీకరతకూ, విజయోత్సాహానికి, నూతనత్వానికీ సంకేతాలుగా కనిపిస్తాయి. ఆనాడు తెలుగు వాడికి మూడే సూత్రాలు...

అటు, పుటు, రటు... అంతే! శత్రువుని 'అటు' చేసి (నాశనం), పుటపుటగా (విజయోత్సాహంతో) సంచరిస్తూంటారు. వాళ్ళ జోలికి వెళ్ళడం అటే రాటు(కష్టం) కొని తెచ్చుకోవటమే నన్నమాట!

ప్రాచీనాంధ్రుల చారిత్రక అంశాలను తెలుగేతర చరిత్ర కారులు అయిష్టంగానే వ్రాశారు. తెలుగు చరిత్రకారులు కూడా మరింత లోతుల్లోకి వెళ్ళటానికి గట్టి ప్రయత్నాలు చేసినట్టు కనిపించదు. సహజంగానే చరిత్రవేత్తలు పురావస్తు ఆధారాలను మాత్రమే అంగీకరిస్తారు. లిపి ఉన్నదో లేదో తెలీని కాలానికి సంబంధించి భాషకు శాసనాధారాలు ఎలా దొరుకుతాయో చరిత్రవేత్తలకే తెలియాలి.

లిపికన్నా భాష ముందు పుట్టింది. దైవ ప్రార్ధనలు, లాలిపాటలు, ప్రేమపాటలు, పనిపాటలు ఇవన్నీ భాషతోటే పుడతాయి. భాష అభివృద్ధి కొద్దీ అవి కూడా విశిష్ట సంపన్నంగా ఉంటాయి. లిపి ఏర్పడిన తరువాత ఆ సంపన్న సాహిత్యం అక్షరబద్ధం అవుతుంది.

భాష ప్రాచీనత వేరు. సాహిత్య ప్రాచీనత వేరు. కావ్యాలు దొరకలేదు కాబట్టి భాష లేదనే వాదన అర్థం లేనిది. అత్యంత ప్రాచీన కాలానికి చెందిన ప్రాకృత సాహిత్యంలో తెలుగు వారి వ్యక్తిత్వాన్ని సాక్ష్యంగా ఈ మూడు తెలుగు మాటలు దొరికాయి. భాష ప్రాచీనతకు ఇంతకన్నా ఆధారాలు ఏం కావాలి?

పురావస్తు ఆధారాలు అంటే కేవలం ఆ నాటి ప్రజలు వాడిన వస్తువులు, శాసనాలు వగైరా మాత్రమే కాదు, భాష కూడా ఒక ఆధారమే. ఇది లింగ్విష్టిక్ ఆర్కియాలజీ అనే చరిత్ర విభాగానికి చెందిన భాషాశాస్త్ర విషయం.

ఒక భాషాపదం యొక్క ప్రాచీనత ఆ జాతి ప్రాచీనతకు తిరుగులేని సాక్ష్యం అవుతుంది.

తెలుగు ప్రాచీనం! తెలుగే ప్రాచీనం!!

అందుకు భాషాపురావస్తు ఆధారాలు అనేకం ఉన్నాయి. చరిత్రకారులు వాటిని స్వీకరించటం మొదలు పెట్టాలి. అంతే!

ప్రసిద్ధిచెందిన కోటలు ఆనాటి ఆంధ్రరోజులకు ఉన్నాయని క్రీ.పూ. చివరి శతాబ్దాలలోనే వ్రాశారు. 'అటుపుటూరటు'లైన ఆంధ్రుల శౌర్యచిహ్నాలకు ఈ విదేశీయాత్రికుల వ్రాతలే సాక్షాలు.

# మూడోకాలు

*సీ. తల్లి మదేక పుత్రక, పెద్ద, కన్నులు*
*కానదిప్పుడు మూఁడుకాళ్ళ ముసలి ।*
*ఇల్లాలు గడు సాధ్వి ఏమియు నెఱుఁగదు*
*పరమ పాతివ్రత్య భవ్య చరిత ।*
*వెనుక ముందర లేరు నెనరైన చుట్టాలు*
*లేవడి ఎంతేని జీవనంబు।*
*గానక కన్న సంతానమ్ము శిశువులు*
*జీవనస్థితి కేన తావలంబు ।*
*తే. కృపఁ దలంపఁ గదయ్య యో నృప వరేణ్య*
*యభయ మీవయ్య యో తుహినాంశు వంశ ।*
*కావఁ గదయ్య యర్థార్థి కల్పశాఖి*
*నిగ్రహింపకుమయ్య యోనిషధ రాజ ।*

(శ్రీనాథుడి శృంగారనైషధం-ప్రథమాశ్వాసం)

శృంగారనైషధం నలదమయంతుల కథ. నలుడు, దమయంతీ ఇద్దరి మధ్యా ప్రేమబంధం ఏర్పడటానికి కవి ఒక హంసను చక్కగా ఉపయోగించాడు. ఈ హంస కొలనులో విహరిస్తూ నలుడికి పట్టుబడుతుంది. తనను రక్షించి వదిలి పెట్టమని నలుని ఇలా వేడుకుంటుంది హంస :

"మా అమ్మకి ఒక్కణ్ణే కొడుకుని, మా అమ్మ ముసలిది, అంధురాలు, భార్య అమాయకురాలు, చూసే చుట్టాలెవరూ లేరు, పిల్లలు పసివాళ్ళు, కరుణించి వదిలిపెట్టవయ్యా" అని! నలుడు కరుణించినట్టు కన్పించలేదు. ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడే బుర్ర చురుకుగా పనిచేయాలి. హంసకు ఓ ఉపాయం తట్టింది.

"నన్ను వదిలిపెడితే దమయంతి నిన్ను వరించేలా రాయబారం చేస్తానంటుంది.

నలుడికీ దమయంతికీ పరిచయం కలపటానికి ఈ హంసోపాఖ్యానాన్ని ఉపయోగించుకున్నాడు శ్రీనాథకవి.

హంస మొత్తుకోలులో ఇక్కడ శ్రీనాథుడు ప్రయోగించిన తేట తెలుగు పదాలు గొప్పవి. " "కన్నులు కానదిప్పుడు" "మూఁడుకాళ్ళ ముసలి" "వెనుక ముందర లేరు నెనరైన చుట్టాలు" "లేవడి ఎంతేని జీవనంబు", "గానక కన్న సంతానమ్ము శిశువులు" ఇలా శ్రీనాథుడు ఆనాటి జనం నాలుకలమీద ఆడే మాటల్ని అలవోకగా ప్రయోగించాడు. తన ముసలి తల్లి దీనత్వం గురించి రాజుకు చెప్పుకొవటం ద్వారా

ముసలితనం మోయలేని బరువని, వారి సంక్షేమాన్ని కనికరంతో ప్రభుత్వం పట్టించుకోవాలనే సందేశాన్ని కవిగారు అందిస్తున్నారు.

"తెలియుట యెన్నడు దేహి తనంతట" అనే పదంలో అన్నమయ్య ఇలా అంటాడు:

"కొన్నాళ్ళు బాల్యము కొన్నాళ్ళు కౌమార
మన్నిట గొన్నాళ్ళు యౌవనము
పన్నిన ముదిమియు బైపై గొన్నాళ్ళు
వున్నతి నంతట నుడుగుట గలది" అని!

కొన్నాళ్ళు బాల్యాన్ని, కొన్నాళ్ళు కౌమారాన్ని, కొన్నాళ్ళు యౌవనాన్ని ధరించి ఈ దేహంతో నడుస్తూ ఉన్నాం. ఆ తర్వాత ముదిమి పైన పడ్తుంది. అక్కడితో ప్రాణాలు ఉడుగుతాయి. ముసలితనం నిండుజీవితంలో ఒక తప్పనిసరి అధ్యాయం. దాని గురించి మనం ఆలోచిస్తున్నది తక్కువ. పెన్షన్లు, ఇన్సూరెన్సులూ, ఫిక్సెడ్ డిపాజిట్ల గురించి ఆలోచిస్తారు గానీ, ముదిమి వయసులో ఆరోగ్యభద్రత గురించి ఆలోచిస్తున్నవాళ్ళు కూడా తక్కువే! మన వార్ధక్యం ఇడుముల పాలు కావటానికి ముందుగానే తగిన జాగ్రత్తలు తీసుకోకపోవటం కూడా ఒక కారణమే!

వొట్టిపోయిన గొడ్డు విషయంలో మనుషులు ఏ విధంగా ఆలోచిస్తున్నారో, ఇళ్ళలో ఆధారపడి జీవిస్తున్న ముసలి తల్లిదండ్రుల గురించి కూడా అలానే ఆలోచిస్తున్నారు. వృద్ధుల పట్ల ఇళ్ళలో నిత్యం జరిగే హింస నుండి వృద్ధుల సంరక్షణకు ఎలాంటి చట్టపరమైన భద్రతా మన దేశంలో లేదు. గృహహింస చట్టంలో వయోవృద్ధులకు ఎలాంటి భద్రతా లేదు. రోజు కూలీలుగా, కాంట్రాక్ట్ లేబరర్లుగా దినదిన గండంగా రోజులు వెళ్ళమార్చే వయోవృద్ధుల భద్రత గురించి ఆలోచన ప్రభుత్వాలకు ముఖ్యంగా వుండాలి.

రాష్ట్రంలో వృద్ధాశ్రమాలు ఎక్కువగా ప్రైవేట్ వ్యక్తుల దాతృత్వం మీదే నడుస్తున్నాయి. రాష్ట్రంలో ప్రభుత్వ వృద్ధాశ్రమా లనేవి మనకు ఎక్కడాకనిపించవు.

వృద్ధులను కుటుంబం నిరాదరించినప్పటికీ, సమాజం వారిని ఆదరించాలి. అది ప్రభుత్వం ద్వారా జరగాలి.

భర్త చనిపోయిన స్త్రీలకు పెన్షన్ పథకం లాంటి పథకాల ద్వారా కొందరికి ప్రభుత్వ చేయూత ఉన్నప్పటికీ, గృహహింస బారినుండి వారికి రక్షణ ఏమీ లేదు.

వృద్ధ కళాకారులకు ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ వారు పెన్షన్లు ఇస్తున్నారు. అది గొప్ప విషయమే! డబ్బు చేతికిస్తే రెండు నెత్తిన మొట్టి అవి లాక్కుని ఇంట్లో కూర్చోబెట్టే పుత్రరత్నాలకు కొదవలేని సమాజం మనది.

ప్రతి ఇంట్లోనూ వయోవృద్ధులు ఎంతమంది ఉన్నారు? వారి స్థితిగతులు ఏమిటీ? వారి ఆరోగ్యం, వారి సుఖజీవనం గురించిన సర్వే జరగాలి. ఇంటింటికీ

మలేరియా డిపార్ట్‌మెంట్ వారు వచ్చి కుశలాలు కనుక్కున్నట్టే వృద్ధుల పేర్లు నమోదు చేసుకుని వాళ్ళ కుశలాలు కూడా కనుక్కొంటూ ఉండాలి. కొద్ది సేపు మాట్లాడితే, ఆ ఇంట్లో వృద్ధులపట్ల నిరాదరణ ఉన్నదనేది ఇట్టే అర్థం అయిపోతుంది. ప్రభుత్వం వారు అడుగుతున్నారు...అనే భయం ఉన్నప్పుడు మూలనున్న ముసలమ్మలకు, ముసలయ్యలకూ కొంత ఊరట ఉంటుంది.

వృద్ధులకు ప్రభుత్వ అభయం ఉన్నదని, వారిని కించపరిచేందుకు ఎవరు ప్రయత్నించినా శిక్షార్హమని ప్రభుత్వం ఒక చట్టం తీసుకురావాలి. దాన్ని విస్తృతంగా ప్రచారంలోకి తేవాలి. ప్రభుత్వ వృద్ధాశ్రమాలు ప్రతి ఊరిలోనూ మానవతా దృక్పథంతో పని చేసేవిగా నెలకొల్పాల్సిన అవసరం ఉంది. వృద్ధులబాధ్యత ప్రభుత్వం తీసుకోవాలి. "వెనుక ముందర లేరు నెనరైన చుట్టాలు" అనే దుస్థితిలో ఉన్న మూఁడుకాళ్ళ ముసలికి బాసటగా సమాజమే నిలవాలి. ఆ మూడో కాలుగా ప్రభుత్వం నిలవాలి.

ఉత్తినే కథ కోసం మానవభాష మాట్లాడగలిగే ఒక హంసను తెచ్చేస్తే కథాకథనాలు హాయిగా సాగిపోవచ్చు. కానీ, శ్రీనాథుడు లోకజ్ఞానం కలిగినవాడు. అందుకే, హంస తన ప్రాణం కాపాడితే అనకుండా తన ముసలితల్లిని ఆదుకుంటే తాను ఫలానా కార్యం నెరవేరుస్తాననిపించటం కవి ప్రదర్శించిన విజ్ఞత - సామాజిక బాధ్యత కూడా !

కవిత్వాన్ని ఇలానే చూడాలి. 'వేదాలలోని ధర్మాన్ని ఏరి, నేను అభివృద్ధి కోసం, ప్రగతి కోసం ఈ అణుశాస్త్రాన్ని చెప్తున్నాను" అంటూ కణాదుడు వైశేషిక దర్శనాన్ని మొదలు పెడతాడు. కవి ప్రదర్శించ గలిగిన సామాజిక బాధ్యత ఈ విధంగా వుంటుంది!

వేదాలను ఒక మతం వారు తమ మత గ్రంథాలుగా భావించుకోవచ్చు. వేదాలు ఒక మతంకోసం వ్రాసిన గ్రంథాలు ఎంతమాత్రమూ కాదు. ఒక తరం మనుషులు తమ కోసం తమకు ధర్మంగా భావించుకున్న వాటిని ప్రోది చేసిన గ్రంథాలవి. వాటిలోంచి మనకు కావలసిన ధర్మాన్ని ఏరుకోవాలంటాడు కణాదుడు. ప్రాచీన సాహిత్యాన్ని ఈ కోణంలోంచే చదవాలి.

# మెలట్టూరు నాట్యనాటక కళ

*"డింభా! యేమని బల్కెదౌ యిటుల పాటింపంచు యేకాని యా*
*అంబోజాక్షుడు సర్వ వస్తువుల నుండంచున్ మరిన్నొప్పుగా*
*రంభబొందుచు బల్కినావు గదరా! అట్లైన బాగాయె యీ*
*స్తంభంబందున జూపుమింక నరగున్ చెన్నంద యా చక్రినిన్"*

(మెలట్టూరు వెంకట్రామశాస్త్రి ప్రహ్లాద చరిత్రము)

కూచిపూడి నాట్యకళకు సిద్ధేంద్ర యోగి ఎంతటివాడో తమిళనాట తంజావూరు భాగవత మేళాకు మెలట్టూరు వెంకటరామశాస్త్రి అంతటి వారు. సిద్ధేంద్రయోగి మొత్తం భాగవత కళకు ప్రవర్తకుడైతే, మెలట్టూరు వెంకటరామశాస్త్రి మెలట్టూరు గ్రామంలో భాగవత మేళాకళకు పునరుజ్జీవనం కల్పించిన సంగీత, నాట్య వేత్త. గొప్ప కవి.

తెలుగు భాగవతుల కుటుంబానికి చెందిన మెలట్టూరు వెంకట రామశాస్త్రి శ్రీవత్స గోత్రీకుడు. నారాయణతీర్థుల నుండి ఈయన తండ్రి గోపాలకృష్ణయ్య నారసింహ దీక్ష తీసుకున్నాడనీ చెప్తారు. తంజావూరును నాయకరాజుల తరువాత పాలించిన మహారాష్ట్ర రాజుల్లో శరభోజీ (క్రీ.శ. 1800-32) శివాజీ 1832-55)ల కాలం నాటి వాడు. ఇంచుమించుగా సమకాలికుడు. త్యాగయ్య కన్న కొంచెం పెద్దవయసు వాడు కావచ్చు ఆయన.

వెంకటరామశాస్త్రి 11 నాట్య నాటకాలు, ఇంకా అనేక తత్త్వ కీర్తనలు, కీర్తనలు, చిందులు, భక్తికృతులు కూడా వ్రాశారు. ప్రహ్లాదచరిత్రము వీరి ప్రసిద్ధ నాట్య నాటకం. నరసింహ జయంతి రోజున తంజావూరు దగ్గరి మెలట్టూరులో రాత్రి తెల్లవార్లూ ప్రహ్లాదచరిత్ర నాట్యనాటకాన్ని భక్తి ప్రపత్తులతో ప్రదర్శిస్తారు. అటు హిరణ కశ్యపుడికీ, ఇటు ప్రహ్లాదుడికి చెప్పలేక తల్లడిల్లే లీలావతి పాత్ర ఈ నాటకంలో గొప్పగా చిత్రించబడింది.

'పువ్వుల్లో వాసన, నువ్వుల్లో నూనె, శబ్దంలో అర్థం, చెరకులో రసం, శరీరంలో జీవం, ప్రణవంలో పరబ్రహ్మం ఉన్నట్టు, ఆ హరి అణూవణువులోనూ ఉంటాడు, జాగ్రత్తగా వెదికి పట్టండి' అని హిరణ్య కశ్యపుడు అంటూన్నప్పుడు ఆ పాత్ర పట్ల మనకు జాలి కలుగుతుంది. డింభకా అనే మాట పోతనగారిది. వెంకట్రామశాస్త్రిగారు 'డింభా' అన్నాడు.

ఈ స్తంభంలో ఉంటాడా? అనడిగాడు. ఉంటే చూపించమన్నాడు.

వెంటనే ప్రహ్లాదుడు "దేవ దేవ ఇదే సమయమయ్యా-ఈ స్తంభమున ఆవహించి

నన్ను బ్రోవుమయ్యా" అని పాడతాడు. ఇక్కణ్ణించీ హిరణ్యకశ్యప వధ, నరసింహావతార ఘట్టం నరాలు ఉప్పొంగేలా సాగుతుంది.

అప్పుడు నరసింహుని పాత్ర ప్రవేశం జరుగుతుంది. ఆ పాత్రధారి నాటకానికి ముందు నరసింహ దీక్ష తీసుకుని కాలంపాటు పరమ పవిత్రంగా నియమావళి ప్రకారం జీవిస్తాడు. మండల (40 రోజుల) వ్రతదీక్ష అది!

మెలట్టూరు గ్రామ దేవాలయంలో నరసింహ ముఖాకృతి (మాస్క్) ని ఒక అద్దాల బీరువాలో భద్రపరచి ఉంచారు. నాటకం రోజున ఈ ముఖాకృతిని ఊరేగింపుగా తెచ్చి, వేదికపైన ఉంచుతారు. నరసింహుడి పాత్ర వచ్చే సమయంలో ఈ ముఖాకృతిని పాత్రధారి ధరిస్తాడు. అతను నటనలో నిజంగా నరసింహుడిగా లీనమైపోతాడు. అతని ఆవేశం పట్టతరం కానంత ఉద్రేకంగా సాగుతుందీ ఘట్టం.

మెలట్టూరులో ఈ భాగవత మేళాను రెండు సంఘాలవారు అభినయిస్తున్నారు. ప్రపంచవ్యాప్తంగా వారి ప్రదర్శనలు జరుగుతున్నాయి. వారంతా తెలుగు వారే. కానీ, వారికి తెలుగు చదవనూ వ్రాయనూ రాదు. మెలట్టూరు వెంకటరామశాస్త్రి గారి ప్రహ్లాద చరిత్రము, ఇతర నాట్యనాటకాలు తెలుగులో ఉన్నవాటిని వీళ్ళు తమిళ భాషలో వ్రాసుకుని భద్రపరచారు.

తంజావూరులో తెలుగు వారి స్థితి గతులను పరిశీలించేందుకు మూడేళ్ళ క్రితం శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారితో కలిసి వెళ్ళినప్పుడు, ఈ మెలట్టూరును సందర్శించే అవకాశం నాకు కలిగింది. మెలట్టూరు భాగవత కళాకారుడు శ్రీ మహాలింగం గారు అనేక తాళపత్ర గ్రంథాలను మాకు చూపించారు.

శ్రీ బుద్ధప్రసాద్ మరియు ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ ప్రోత్సాహంతో తమిళ లిపిలో ఉన్న ప్రహ్లాదచరిత్రము వ్రాత ప్రతిని పరిష్కరించి తెలుగులోకి మార్పు చేయించి ప్రచురించారు. డా. ఎన్ వి దేవీ ప్రసాద్, శ్రీ ఎన్ శ్రీనివాసన్ సంపాదకులుగా మెలట్టూరు మేళా నాట్యనాటక ట్రస్ట్ వారు దీన్ని ప్రచురించారు.

కూచిపూడి అగ్రహారాన్ని తానీషా భాగవత మేళా కళాకారులకు దానంగా ఇవ్వటానికన్నా ఒక శతాబ్ది ముందే తంజావూరు నాయకరాజులు ఈ తెలుగు భాగవత మేళా కళాకారులకు తంజావూరు దగ్గర సాంస్కృతికంగా అప్పటికే పేరొందిన మెలట్టూరు గ్రామాన్ని దానంగా ఇచ్చారు. ఈ రెండు నేలల మీద భాగవత మేళాలు తెలుగు వారి ప్రతిభకు తార్కాణంగా సజీవం అయ్యాయి.

ఇక్కడో ముఖ్య విషయం చెప్పుకోవాలి. ఇంట్లో స్తంభాన్ని కూలగొట్టుకుంటే కొంపకూలుతుందనే జ్ఞానం లేని వాడేమీ కాదు హిరణ్యకశ్యపుడు.

ఆ కాలంలో తెలుగునేల మీద స్తంభ దేవతారాధన కూడా ఉండేదనటానికి

అనేక చారిత్రక సాక్ష్యాలు ఉన్నాయి. ఖమ్మం, కంభం, కంభంపాడు లాంటి ఊళ్ళపేర్లు, ప్రతి ఇంట్లోనూ తులసికోట, ప్రతి గుళ్ళోనూ ధ్వజస్తంభం ఈ స్తంభ దేవతారాధనకు సాక్ష్యంగా మనకు కన్పిస్తాయి. తెలుగునేల మీద ఒకప్పుడు స్తంభాన్ని దేవతగా పూజించే వారనేది నిర్వివాదాంశం.

శైవ వైష్ణవ వైరాలు తీవ్రంగా ముదిరిన కాలానికి సంబంధించిన కథ ఇది కావచ్చు. స్తంభదేవత శక్తి స్వరూపిణి. వైష్ణవ సాంప్రదాయవాదులు ఈ స్తంభారాధకులూ సంలీనం చెందినందువలనే స్తంభం మట్టుమీద చెక్కిన వరాహనరసింహుని విగ్రహాలు అనేకం మనకు కన్పిస్తాయి.

వీళ్ళకు వ్యతిరేకంగా లింగారాధకుల మీద దాడిచేసిన వాడు హిరణ్యకశ్యపుడు. అతను కూర్చింది దేవతా మూర్తిఅయిన స్తంభాన్నేగాని ఇంట్లో స్తంభాన్ని కాదు.

బాబ్రీ మసీదు విధ్వంసం లాంటి చర్యే ఇది. ఫలితంగా విష్ణు ఆరాధకులూ, స్తంభారాధకులూ ఏకమై హిరణ్య కశ్యపుణ్ణి కొట్టారు. సంఘర్షణల తరువాత సహజంగా జరిగే సంలీనాల వలన చెంచులూ, కోయలూ ఇతర ఆదిమ జాతులూ ఏకం అయ్యాయి.

నరసింహావతారం తెలుగు నేల మీద ఇలాంటి సంఘటనలతో ముడిపడిన కథ. ఈ కథలోని చారిత్రకాంశాలను వెదకటం అంటే తెలుగు భాష మూలాలను వెదకటమే!



# రాజుగారి ఏడుగురు కొడుకులు

**కూపస్తటాక ముద్యానం ।**
**మండపం చ ప్రపా తథా ।**
**జలదానమన్నదానం ।**
**అశ్వత్థారోపణం తథా ।**
**పుత్రశ్చేతి చ సంతానం ।**
**సప్త వేదవిదో విదు ।**

అనగనగనగా... అంటూ సాగదీసి, ఒకరాజుకు ఏడుగురు కొడుకులు అని మొదలెడుతుంది తెలుగు కథ.

ఈ కథను వింటున్నప్పుడు రాజుగారి కొడుకులకు సంబంధించినవే కథలా...? బంగారు పుట్టలో వేలెడితే సామాన్యుడి కొడుకుని చీమకుట్టదా ...? ఇలాంటి ప్రశ్నలు అనేకం తలెత్తుతాయి.

సామాన్యుడి కొడుకు ఏడిస్తే మీరూ నేను మాత్రం పట్టించుకుంటామా? రాజుగారి కొడుకు ఏడిస్తే మాత్రం పత్రికలన్నీ బ్యానర్ పెట్టి రాస్తాయి. ఇది ఈనాటి సంగతే కాదు. ఆదినుండీ అదే తంతు. అందుకని తెలుగు కథ రాజుగారి ఏడుగురు కొడుకులతో మొదలౌతుంది. ఎవరీ ఏడుగురు కొడుకులు?

స్కాంద పురాణంలో పైన చెప్పిన శ్లోకం ఉంది. ఈ శ్లోకంలో సప్తసంతానం అంటే ఏవో వివరంగా ఉంది.

1. **కూపం.** ప్రతి ఊరికీ ఊరుమ్మడి బావి ఉండాలి. అవి తాగునీటి అవసరాన్ని తీరుస్తాయి. ఆ బావిలో నీటిని వాడుకునే హక్కు అందరికీ సమానంగా ఉండాలి. కాబట్టి బావి మొదటి సంతానం
2. **తటాకం :** ప్రతి ఊళ్ళోనూ చెరువు ఉండాలి. అవి కేవలం పశుపక్ష్యాదుల అవసరాలకోసం, అలాగే సాగు కోసం ఉపయోగపడేవిగా ఉండాలి. చెరువుని రెండో సంతానం అన్నారందుకే!
3. **ఉద్యానం :** ప్రతి ఊళ్ళోనూ కనీసం ఒకటైనా పార్కు ఉండాలి. వాహ్యాళి కోసం మాత్రమే కాదు, పచ్చదనం కోసం కూడా ఉద్యానం కావాలి. పూర్వం ఉద్యానాల్లో సాయంత్రం పూట రేడియో పెట్టి పాడిపంటలు, ప్రాంతీయ వార్తలు, ఢిల్లీ వార్తలూ వినిపించేవాళ్ళు. ఇప్పుడలాంటివి పెద్ద బోర్ అనే స్థితికి మనమే వెళ్ళాం. పార్కుల్ని వినియోగించుకోవటాన్ని మానింది మనమే!

అందువలన అవి కబ్జాదారుల హస్తగతం అయితే ఆశ్చర్యం ఏముంది...? పార్కును మూడో సంతానంగా చెప్పారు.

4. **మండపం :** ప్రతి ఊరికీ ఒక మండపం ఉండాలి. అంటే టౌన్ హాలు లాంటిదన్నమాట. పెళ్లిళ్లనుండి తద్దినాలవరకూ ఊళ్లో ఒక మండపం అవసరం ఉంది. ఊరుమ్మడి అంశాల చర్చలక్కూడా ఒక సభామండపం (టౌన్‌హాల్) కావాలి కద! అందుకని మండపాన్ని నాలుగో సంతానంగా చెప్పారు.

5. **జలదాన మన్నదానం :** ఇప్పుడంటే రాజకీయ పార్టీలు ఫ్లెక్సీలనే తడికలుగా పెట్టి చలివేంద్రాలు కడుతున్నారు. వాటిలో ఓ కుండెడు నీళ్లు పెట్టి వచ్చే ఎన్నికల్లో ఎంపీ అయిపోవాలని ఆ చలివేంద్ర దాతలు ఆశపడుతున్నారు. చలివేంద్రం లేదా చలివెందల అనే మాటలో చల్ అంటే చల్ల! మజ్జిగ కుండలు పెట్టి ఇరవై నాలుగ్గంటలూ దాహార్తిని తీర్చే మొనగాడైతే ఎంపీ టిక్కెట్ ఆశించినా అర్థం ఉంటుంది. గుక్కెడు నీళ్లిచ్చి లంకెల బిందెలు కొట్టేయాలనుకోవటం ఎంత దురూహ...! చలివేంద్రాల్లో దాహార్తితో పాటు మజ్జిగ కలిసిన రాగి జావ గానీ, అంబకళం అంటే మజ్జిగ కలిసిన జొన్న జావ గానీ కుండలో పోసి ఉంచాలి. అన్నార్తిని కూడా అవి తీర్చేవిగా ఉండాలి. అలాంటి చలివేంద్రాన్ని ఐదో సంతానం అన్నారు.

6. **అశ్వత్థారోపణం :** అంటే రావి చెట్టును మొలకెత్తించటం, ప్రతి ఊళ్ళోనూ ఒకటైనా రావి, తెల్లమద్ది, మర్రి, వేప, చింత లాంటి మహా వృక్షం ఉండాలి. చెట్టుని ఆరవ పుత్రుడు అంటుందీ శ్లోకం.

7. **పుత్రుడు :** ఏడవ సంతానంగా పుత్రుణ్ణి పేర్కొందీ శ్లోకం. నిజమైన పుత్రుడు ఆఖర్న వచ్చాడు. నుయ్యి, చెరువు మొక్క వగైరా నిజపుత్రుడికన్నా ఎక్కువ పుత్రసమానం అని దీని బావం

ఏడుగుర్ను కొడుకులూ సమృద్ధిగా ఊళ్ళో ఉంటే ఏ వూరైనా రాజధానికన్నా గొప్పదే! చెరువులు పూడ్చి, మొక్కలు నరికి, పార్కులు ఆక్రమించి, చలివేంద్రాలను బూటకం చేసి, ఊరుమ్మడి సభామందిరాలను కూలగొట్టి, ఖరీదైన భవనాలు కట్టే విధంగా ఎవరు పాలించినా ఏడుగురు బిడ్డల తండ్రి కాలేడని దీని భావం.

రాజు సంతాన వంతుడు కావాలి, ఎంత సంతాన వంతుడైతే అంత గొప్పగా పాలించినట్టు... అని అర్థం చేసుకోవాలి.

ఈ ఏడుగురు కొడుకుల్లో ఏ బిడ్డ ఏడ్చినా లోపం తండ్రిదే!

# రాణించిన రాజు

*"సుకవులకు సారమై బహు కుకవులకెద శూలమై యకుంఠిత*
*ధారై చకిత చకిత వాద్యములై వికసించును బెద్ద కెంప విభు సత్కవితల్"*

*(కెంపెగౌడ వ్రాసిన గంగా గౌరీ విలాసం యక్షగానం లోంచి)*

కంచిలో ఉండే ఒక తెలుగు కుటుంబం మొదట మైసూరుకు దగ్గరగా ఉన్న ఆవటీ అనే ఊరులోనూ, తర్వాత ఈనాటి బెంగుళూరుకు దగ్గరగా ఉన్న ఎలహంక అనే ఊరులోనూ స్థిరపడ్డారు. విజయనగర ప్రభువుల కొలువులో ఈ కుటుంబం ఎలహంక పాలకులుగా పనిచేశారు. కెంపమ్మ వీళ్ళ కులదైవం. మూడో తరంలో కెంపమ్మ దయవల్ల పుట్టిన పిల్లవాడికి 'కెంప నంజుగౌడ' అని పేరు పెట్టారు. అతని వంశీకులంతా ఆ తరువాత కెంప వంశీకులయ్యారు.

కెంపనంజుగౌడ పెద్ద కొడుకు పెద కెంపగౌడ. ఇతన్ని కన్నడంలో హిరియ కెంపగౌడ అని పిలుస్తారు. గౌడ అనేది నాయక లాంటి ఒక బిరుదునామం. గౌడరికం పొందిన వాళ్ళని దీని భావం. ఇతను 1513 నుండీ 1569 వరకూ కృష్ణదేవ రాయలికీ, అచ్యుత దేవరాయలికీ సామంతుడిగా పాలించాడు. ఎలహంకకు దగ్గర్లో శివసముద్రం అనే ప్రాంతం ఉంది. అక్కడ అనువైన చోట రాజధాని నగరాన్ని నిర్మించాడు. 1537లో ప్రారంభమైన ఈ నగరం బెంగుళూరుగా ప్రసిద్ధి పొందింది.

కెంపగౌడ ఇక్కడ ఎర్రమట్టితో కోట కట్టించాడు. రాజధాని నిర్మాణానికి సానుకూలత కుదరనప్పుడు అతని కోడలు లక్ష్మమ్మ స్వయంగా తన బలిరక్తంతో సింహద్వారాన్ని తడిపి ఆత్మార్పణ చేసుకుంది. బెంగుళూరులో కొరమంగల అనే చోట ఈ లక్ష్మమ్మకు గుడి కట్టించాడు. ఆమె నేటికీ పూజ లందుకుంటోంది.

విజయనగర సామ్రాజ్య పతనం తరువాత ఈ నగరం సుల్తానుల చేతుల్లో పడింది. శివాజీ సవితి సోదరుణ్ణి ఈ నగరానికి పాలకుడిగా నియమించారు. ఇతని సోదరులే తంజావూరులో మరాఠా పాలకులయ్యారు. తంజావూరు చేజిక్కిన తరువాత ఈ నగరాన్ని మైసూరు ఒడయార్ పాలకులకు అమ్మేశారు. అది మళ్లీ హైదరాలి, టిప్పుసుల్తాన్ల చేతుల్లోకి వెళ్ళింది. టిప్పుసుల్తాన్ మరణం తరువాత బ్రిటిష్ వాడు వచ్చి తిష్టవేశాడు.

బెంగళూరు నగరంలో కెంపగౌడను తెలుగు వాడిగా చెప్పుకోరుగానీ, ఆ నగర నిర్మాతగా ఎంతగానో గౌరవిస్తారు. అక్కడ బస్టాండుకీ, విమానాశ్రయానికీ ఆయన పేరే పెట్టారు. 'కెంపాంబుధి' పేరుతో పెద్ద చెరువునీ, ప్రక్కనే గంగానదీశ్వరాలయాన్నీ కట్టించాడయిన. హల్సూరు సోమేశ్వరాలయం ఇంకా చాలా దేవాలయాలు

కట్టించాడు. ఒక యోగి సూచన మేరకు తవ్విస్తే, అక్కడ పెద్దమొత్తంలో డబ్బు, శివలింగం దొరికాయని ఆ డబ్బుతో సోమేశ్వరాలయం కట్టించాడనీ ప్రతీతి. గంగా గౌరీ విలాసం అనే యక్షగానాన్ని స్వయంగా రచించి, ఈ సోమేశ్వరుడికి అంకితం ఇచ్చాడు. పైన పద్యం ఇందులోదే!

సుకవులకు రుచికరంగానూ, కుకవులకు గుండెల్లో శూలంగానూ, అకుంఠిత ధారామయంగా తన కవిత్వం సాగుతుందనీ, అది చకిత చకిత వాద్యాలై వికసిస్తుందనీ, పెద్ద కెంప విభుడుగా తన పరిచయం, తన కావ్య పరిచయం చేసుకున్నాడిందులో!

కన్నడ రాజధాని బెంగళూరు నగరాన్ని ఒక తెలుగువాడు అద్భుతమైన ప్రణాళికా రచనతో నిర్మించాడు. ఈ నగరం కట్టక మునుపు ఆకలి గొన్న ఈ రాజుకు బాటసారి అనుకుని ఒక ముసలమ్మ గుగ్గిళ్ళు పెట్టిన స్థలం కాబట్టి ఈ నగరానికి బెంగళూరనే పేరు వచ్చిందని స్థలపురాణం లాంటి చరిత్ర చెప్తోంది.

కానీ కన్నడ, తుళు భాషల్లో "బెణ్గ" అంటే ఎర్రచందనం. తెలుగులో వేగిస అంటారు. ఆ ప్రాంతంలో ఒకప్పుడు ఎర్రచందనం అడవులు ఉండేవి! బెణ్గని బట్టే ఇది బెంగళూరు అయ్యింది. 1831లో బ్రిటిష్ వాళ్ళు ఇక్కడ ప్రాంతీయ కార్యాలయాన్ని ఏర్పరచుకున్నారు. విన్‌స్టన్ చర్చిల్ కొన్నాళ్ళు ఇక్కడ జూనియర్ ఆఫీసర్‌గా ఉన్నాడు. ఆ సమయంలో బెంగుళూరు క్లబ్బుకు చెల్లించాల్సిన 13 రూపాయల బకాయి అక్కడ బకాయిల పుస్తకంలోను రికార్డెడ్‌గా ఉన్నదట.

కెంపగౌడ కుమారుడు ఇమ్మడి కెంపరాయడు "ఎలహంకనాడు ప్రభువులైన కెంపనంజయ గౌని వారి పౌత్రులైన యిమ్మడి కెంపగౌనయ్య" అంటూ తన పరిచయం చేసుకుంటూ బెంగుళూరు ముత్యాలపేటలో రంగనాథ దేవాలయంలో వేయించినతెలుగు శాసనంలో వ్రాసుకున్నాడు.

తమిళనాడులో పుట్టి కన్నడ దేశంలో స్థిరపడిన కెంపగౌడ పూర్వులైన తెలుగువారు తమ తెలుగుదనాన్ని నిలుపుకోవటం విశేషం. తెలుగులో రచనలు కూడా చేయటం ద్వారా కెంపగౌడ తాను పదారణాల తెలుగువాడిగా చాటుకున్నాడు.

ఏను మోమువాఁడు నిగురుసాయము వాఁడు
నెలబాసికము వాఁడు వలపు కాఁడు
చిలువ సొమ్ములవాఁడు, తెలిమేనుగలవాఁడు
నీలకంఠము వాఁడు నీటుకాఁడు
వేఁడి కన్నలవాఁడు, లేడిఁబట్టినవాఁడు
జగము లేలెడు వాఁడు జాలకాఁడు
జడలు మోసిన వాఁడు వెడనిల్తు పగవాఁడు

చుట్టాలు గలవాఁడు, సొగసు కాఁడు
మింటి సిగవాఁడు పెనుగొండవింటివాఁడు
లీలహాసము వాఁడు నా మేలువాఁడు
అలరునీ గుర్తులకు నలువైన వాఁడు

అనిన గౌరితో చెలి వ్యంగ్యమనుచు బలికె" ఇలా అచ్చతెలుగులో సాగుతుంది కెంపరాయుడి రచన. ఏనుమోము వాడనీ, బూడిద పూసుకుని ఉంటాడనీ, నెలబాసికం వాడనీ, పాములను ఆభరణాలుగా ధరిస్తాడనీ, నీటుకాడనీ, వేడి కన్ను కలవాడనీ... ఇలా సాగుతుందీ పద్యంలో శివుడి వర్ణన. పరమ మాహేశ్వరులైన శివగణాన్ని కలిగిన వాడని చెప్పటానికి చుట్టాలు గలవాడు అంటాడు.

"దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం" గ్రంథంలో డా. నిడుదవోలు వెంకట్రావు గారు కెంపగౌడ వంశ చరిత్రని తెలిపే తాళపత్ర పుస్తకం ఒకటి దొరికిందనీ, దాన్నిబట్టి వీళ్ళు తెలుగు వారేనని తెలుస్తోందని వ్రాశారు.

తెలుగు వాళ్ళు తెలుగునేలమీదే కాదు తెలుగేతర ప్రాంతాల్లో కూడా రాణిస్తారనటానికి కెంపగౌడ కథ ఒక సాక్ష్యం. రాణించిన తెలుగురాజు కెంపగౌడ!

# లెక్కలేనితనం

*కమనీయ భూమి భాగములు లేకున్నవే*
*పడియుండుటకు దూది పరుపులేల? ।*
*సహజంబులగు కరాంజలులు లేకున్నవే*
*భోజన భాజన పుంజమేల? ।*
*వల్కలాజిన కుశావళులు లేకున్నవే*
*కట్టదుకూల సంఘంబులేల? ।*
*గొనకొని వసియింప గుహలు లేకున్నవే*
*ప్రాసాద సౌధాది పటల మేల? ।*
*ఫలరసాదులు కురియవే పాదపములు*
*స్వాదుజలముల నుండవే సకల నదులు*
*పొసగ భిక్షము బెట్టరే పుణ్య సతులు*
*ధన మదాంధుల కొలువేల తాపసులకు*

*(పోతన ఆంధ్ర మహా భాగవతం)*

సాధారణంగా మన అవసరాలన్నీ పొరుగువారి వాడకం మీద ఆధారపడి ఉంటాయి. వాళ్ళింట్లో టీవీ ఉంటే మనింట్లో లేకపోవటం కొరతే!

'ఎవరి స్తోమత కొద్దీ వారు' అనే సూక్తి వ్యావసాయిక సమాజంలో చెల్లింది. మనం వ్యావసాయికయుగం లోంచి ఆర్థికయుగంలోకి, అక్కణ్ణించీ ఇప్పుడు వాణిజ్యయుగంలోకీ మళ్ళుతున్న స్థితిలో ఉన్నాం.

స్వాతంత్ర్యానికి పూర్వం మన సంస్కృతికీ, ఆ తరువాత సంస్కృతికీ ఎంత తేడా ఉందో స్వాతంత్ర్యానికన్నా ముందే పుట్టిన పెద్దలకు బాగా తెలుసు. ఈ కొత్త మిలీనియంలో మన ఆలోచనల్లో పెనుమార్పు లొచ్చాయి. ఇవి ఇప్పటి ప్రతి ఒక్కరికీ అనుభవైక వేద్యమే!

ఆదాయం పెరక్కపోయినా మన అవసరాలు, వాటి ధరలూ విపరీతమైనాయి. అయినా లెక్కలేనితనం ప్రస్తుతం రాజ్యం ఏలుతోంది. పోతనగారు ఈ లెక్కలేని తనాన్ని ప్రశ్నిస్తూ వ్రాసిన పద్యం ఇది. ఇప్పటి మనకోసమే వ్రాశాడా అనిపిస్తుంది.

"ఆరుబయట వెన్నెట్లో పచ్చని ప్రకృతి మధ్య కాలుష్యం లేని గాలి పీలుస్తూ సుఖంగా కమ్మగా నిద్రించే అదృష్టాన్ని వదులుకుని, ఏసీ రూముల్లో విషరసాయనాలతో తయారైన స్పాంజి పరుపుల మీద పడుకోవాలని కోరుకుంటున్నాం.

కూడు కుడిపే చెయ్యి కాబట్టి దాన్ని కుడిచెయ్యి అంటారు. అంబటి చెయ్యి అనికూడా అంటారు. ఉత్తరాది వారైతే ఒక చేత్తో రోటీని పట్టుకుని రెండో చేత్తో తినే అలవాటుంటుంది. ఇలా ఆహారాన్ని నోటికందించడానికి కరాంజలులు (దోసిళ్ళు) ఉండగా స్పూన్లు, ఫోర్కులు పట్టుకుని భోజన భాజన పుంజంగా తినటాన్ని గొప్ప అనుకుంటున్నాం.

మాన సంరక్షణ కోసమే బట్ట కట్టుకోవటం అయితే, సాధారణ నూలు వస్త్రాలు ఆ ప్రయోజనాన్ని నెరవేరుస్తాయి. అయినా మనం బంగారు జలతారు అల్లిన పట్టు పీతాంబరాల కోసం వెంపర్లాడతాం.

ఇల్లు వలన కలిగే ప్రయోజనం వాతాతపాల నుండి రక్షించుకోవటమే అయితే, బహుళ అంతస్థుల ఆకాశ హర్మ్యాలు, ప్రాసాద సౌధాది పటలాలు దేనికి?

మొక్కలు ఫలరసాదుల్ని వర్షిస్తున్నాయి. నదులు తియ్యని నీటిని అందిస్తున్నాయి. అడక్కుండానే అన్నపూర్ణ లాగా అన్నదానం చేస్తున్నారు పుణ్య సతులు. కానీ, కోరికలు చావడం లేదు.

ధనంతో మదమెక్కినవాళ్ళని సేవిస్తున్నారు,.ఏమి బాముకొందామని?'' అనడుగుతున్నారు పోతన ఈ పద్యంలో!

నిజానికి ఈ పద్యం మిమ్మల్నీ నన్నూ అలా గుహల్లో జీవించాలని చెప్పటానికి ఉద్దేశించింది కాదు.

పరమ భోగాలు అనుభవిస్తూ, పడతుల పొందులో పాపాలు చేస్తూ , వేలకొలది ఎకరాల్లో ఆశ్రమాలు కట్టుకొని మోక్ష ప్రాప్తి గురించి ప్రవచనాలు చెప్పే వాళ్ళని ఎత్తి పొడుస్తున్నాడీ పద్యంలో పోతన.

తలకు రంగేసుకు వచ్చి, దేహం మీద వ్యామోహం వదలాలని మనల్ని ప్రబోధిస్తాడు ఓ స్వామీజీ! ఇలాంటి సాధుపుంగవాలకు దూరంగా ఉండాలనేది ఈ పద్యం సారాంశం.

అయితే, ఇందులో మానవమాత్రులమైన మనకు తగిలేదేమీ లేదనుకోవద్దు.

విలాసవంతమైన ఆశ్రమాల్లో జీవించే మేకవన్నె పులుల్ని అలా ఉంచితే, మన సంగతి ఏంటని కూడా ప్రశ్నించు కుందాం!

అన్నీ ఉన్నా, ఇంకా ఏమేమో కావాలనే కోరికతో ప్రకృతిని పాడు చేస్తూ జీవిస్తున్నాం.

అత్యంత ఎండామండిత ప్రదేశం అయిన తెలుగునేలమీద అపార్ట్‌మెంట్ల సంస్కృతి పెరిగాక, ఎండ ముఖం తెలీకుండా పగటి పూట కూడా ఇంట్లో లైట్లు వేసుకుని జీవిస్తున్నాం. అందువలన ఎముకలు కుళ్ళిన, వయసు మళ్ళిన వారిగా మారిపోతున్నాం.

జీవించటం కోసం ప్రాణప్రదమైన ఆహారం అనేది వదిలేసి, రుచికోసం మషాలాలు, చింతపండు రసాలు కుమ్మరించిన ఆహారం గొప్ప అనుకుంటున్నాం.

కోతిరోజుల్లో మాన సంరక్షణ కోసం ఆకులు కట్టుకున్నారు. ఆ రోజులే నయం. ఇప్పుడు ఖరీదైన బట్టలూ, కోతి చేష్టలూ పెరిగిపోయాయి.

ఈ 21వ శతాబ్దిలో లెక్కలేని తనం ఎక్కువౌతుందనీ, ఎయిడ్స్ వస్తుందిరా అంటే మందు లేసుకోవచ్చు లెమ్మనే వాళ్లు పుడతారనీ, తనకోసం తనకుటుంబం కోసం మాత్రమే కాకుండా తన తరువాత పది తరాల వాళ్ళక్కూడా ఇప్పుడే సంపాదించి దాచే తత్వం ఉన్నవాళ్ళు పాలకులుగా మారతారని, యథా రాజా తథా ప్రజా లాంటి మనుషుల సంఖ్య పెరుగుతుందనీ పోతనగారు ఊహించ గలిగాడు కాబట్టే, సాధారణ జీవితంలో ఉన్న సౌఖ్యం ఆడంబరాలతో కూడిన విలాస జీవితంలో ఉండదని సూచిస్తున్నారు.

లెక్కలేని తనం, తనకూ, తన వలన ఇతరులకూ నష్టం కలిగించేదే నంటారాయన.

ప్రతీదీ డబ్బుతో కొనేయవచ్చనే దృష్టి వాణిజ్య సంస్కృతి లక్షణం. అమ్మానాన్నా బంధాన్ని కూడా డబ్బుతో ముడిపెట్టి ఆలోచించే వింతధోరణి మన సమాజంలో కూడా ప్రవేశించడం బాధాకరం.

ఒక సినిమాలో 'అయితే నాకేంటి?" అంటుంటుండా నటుడు. ఈ అయితే నాకెంటి ధోరణి సమాజానికి చెరువు ఎంతచేస్తుందో ఎవరూ గమనించట్లేదు. నాకేంటనే వాడికి తెలీయకుండానే వాడి అవసరాలను సమాజం తీరుస్తుంది.

ఒక్కరోజు పాలతను రాకపోతే, ఒక్కరోజు గ్రాస్‌బండ ఆలస్యం అయితే, ఒక్కపూట కరెంటు లేకపోతే, "ఈనాకెంటి?" అనేవాళ్ళే లోకం కుళ్ళిపోయిందని.

# వలస జీవులు

*"రేరే రాసభ! వస్త్రభారవహనాత్కుగ్రామ మశ్నాసి కిం*
*రాజాశ్వావసథం ప్రయాహి, చణకా భ్యూషాన్సుఖం భక్షయ*
*సర్వా న్పుచ్ఛవతో హయా ఇతి వదంత్య త్రాధికారే స్థితాః*
*రాజా తైరుపదిష్టమేవ మమతే, సత్యంతటస్థాః పరే"*

(సంస్కృత చాటువు)

ఓ గాడిదా! బట్టల బరువు మోస్తూ ఈ పల్లెటూళ్ళో ఏం తింటావు? రాజధానికి వెళ్ళి అక్కడ అశ్వశాలలో చేరు. గుర్రాలకు శనగ గుగ్గిళ్ళు పెడతారక్కడ. తోక కలిగినవాటినన్నింటినీ గుర్రాలుగానే జమేసుకుంటారు. వాళ్ళు చెప్పిందే రాజు నమ్ముతాడు. రాజు నమ్మాడు కాబట్టి తెలిసినా మిగతావాళ్లంతా నోరెత్తరు. అందుకని, రాజుగారి కొలువుకు పొమ్మంటాడు కవి ఈ చాటువులో! కర్త ఎవరో తెలియన్ పద్యాల్ని చాటు పద్యాలంటారు.

కర్త ఫలానా అని వ్రాసినప్పటికీ, ఆయా సందర్భాలకోసం సరదాగానో, కోపంగానో, చెప్పే విడి పద్యాల్ని కూడా చాటువులనే అంటారు.

ప్రభుత్వోద్యోగం వస్తే జీవితం స్థిరపడినట్టే ననే భావన చాలామందిలో ఉంది. తాను ప్రభుత్వోద్యోగి కావటం తన పూర్వజన్మ సుకృతం అనే అభిప్రాయం కూడా అధికంగానే ఉంది. ప్రభుత్వోద్యోగం వచ్చాక తాము ఈ సమాజంలో ఒక భాగం అనుకునే వాళ్ళు అరుదుగా ఉంటారంటాడు ఇంకో కవి.

అడిదము సూరకవి రామలింగేశ్వర శతకం అని ఒక పుస్తకం వ్రాశాడు. అందులో ప్రభుత్వోద్యోగుల అరాచకాలను ఎండగట్టే పద్యాలు చాలా ఉన్నాయి. "మాన్యంబులీయ సమర్థుడొక్కడు లేడు/మాన్యముల్చెఱుప సామంతులంద/రెండిన యూళ్ళ గోడెరిగింపడెవ్వడు..." అంటూ ఆ పుస్తకంలో ఒక సీసమాలిక వ్రాశాడు. సీతారామరాజనే ఒక రాజుగారి గురించిన పద్యం ఇది. ఆయనకు జనం దగ్గర డబ్బుని, ఆస్తుల్ని లాక్కుని వేధించటం ఒక సరదా! రాజుగారికి తగ్గట్టుగానే ఆయన అధికారులూ ప్రవర్తిస్తారు. అవినీతిపరుడు పాలకుడైతే, అధికారుల పంట పండినట్టే ఏ యుగంలో అయినా! రాజు ప్రజలమీద కాక ప్రభుత్వం మీద నిరంకుశంగా ఉంటే ప్రజలకు మేలు కలుగుతుంది. లేకపోతే అధికారులకు మాత్రమే మేలు కలుగుతుంది.

తాసిల్దారు స్థాయి వ్యక్తి ఇంట్లో వందల కోట్లు అక్రమ్క సంపాదన దొరుకుతోందంటే ప్రభుత్వ వ్యవస్థ ఎంత ఉదాసీనంగా ఉన్నదో ఊహించుకోవటానికి అర్థశాస్త్ర

పాండిత్యమేమీ అక్కరలేదు. సీతారామరాజుగారి అధికారులు కూడా గుడి మాన్యాల్ని, అగ్రహారాల్నీ ఆక్రమించుకోవటం మొదలు పెట్టారు. అవినీతి పాలకుడి రాజ్యంలో ఫలానా అధికారి ఈ తప్పు చేశాడని చెప్పగలిగే ధైర్యం ప్రజలకు ఉండదు.

పంటలు పండని ఊళ్లను పట్టించుకోకుండా పండిన చోట పెత్తనం చేసే అధికార గణం నిస్సందేహంగా అవినీతిపరుల కూటమేనంటాడు అడిదము సూరకవిగారు ఈ పద్యంలో!

పేదవాడి బీదరికానికి పరిష్కారం ఆలోచించకుండా ఎవ్వరి మీద ఎంతపన్ను వేస్తే ఎంత కమీషను ముట్టుందో లెక్కలు గట్టే పనిలో ఉంటారు అవినీతి పరులైన అధికారులెప్పుడూ! "ఇట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి రాజు ననవలె గాక దుర్ణయులననగ నేమి పనియున్నది?" అని ప్రశ్నిస్తాడు. ఇలాంటి వ్యక్తులకు ఉన్నతాధికారాలు ఇచ్చిన రాజుని అనాలంటాడు.

పెమ్మయ సింగ ధీమణీ అనే మకుటంతో ఒక శతకం ఉందిట. దానిలో కొన్ని పద్యాలు మాత్రం చాటువులుగా దొరుకుతున్నాయి. అందులో ఒక పద్యంలో సత్యం లేని ఊళ్ళో, తన సమ్మతి చెందని ఊళ్ళో, సాధు సాంగత్యం అంటే మనుషులనదగినవారే లేని ఊళ్ళో డబ్బు రంధి మితిమీరిన ఊళ్ళో, ఇతరుల్ని శత్రువులుగా చూసే ఊళ్ళో, అప్పు దొరకని ఊళ్ళో, కాపురం చేయకూడదని వ్రాశాడు.

ఇవ్వాల పల్లెల్నుండి తండాలు తండాలుగా ప్రజలు వలసలు పోతున్నారంటే అక్కడ ఇలాంటి అంశాలే చెలామణీలో ఉండటం కారణం. ఒక భూమి పుత్రుడు సాక్షాత్తూ కన్నతల్లి లాంటి భూమిని వదులుకుని పోతున్నాడంటే, పాలనా వ్యవస్థ ఘోరంగా ఉన్నదనే అర్థం. పట్టణాల్లో అంతా సవ్యంగా ఉన్నదని పల్లె ప్రజలు తరలి వస్తున్నారనుకోవటం పొరబాటు. పట్టణాలు పాముల పొదరిళ్ళని వాళ్లకూ తెలుసు! అయినా ఎందుకొస్తున్నారు...? పూట గడవాలి కదా...అందుకని!

పంటచేలలో బండరాళ్ళ విత్తనాలు నాటితే ఆకాశ హర్మ్యాలు పండుతాయి. నాగళ్ళు అటకెక్కుతాయి. రైతు రిక్షావాడిగానో ముఠాకూలిగానో మారతాడు. రైతుభార్య పదిళ్లలో పనిమనిషిగా మారుతుంది. రూరల్ ఎట్మాసిఫియర్, రివర్ వ్యూ, పొల్యూషన్ ఫ్రీ- అంటూ నిజభవనదారులు(రియల్ ఎస్టేట్ వ్యాపారులు) ఇచ్చే ప్రకటనలను చూసి పట్టణవాసులు ఎక్కి తిరిగే పడవకార్లు పల్లె దారిన పడతాయి.

పల్లెనే నమ్ముకుని చావో బతుకో ఇక్కడే అంటూ అన్ని అవమానాలూ భరిస్తున్న ఒక కొంగకి పట్టణం నుండి ఇలా వచ్చిన ఒక హంస కనిపించింది. ఆ రెండింటి మధ్య సంభాషణ ఇలా సాగింది:

నువ్వెవరివి? నీ ముఖం కాళ్ళు ఇలా ఎర్రగా ఉన్నాయేమిటీ?"

"నేను హంసని"

"ఎక్కడుంటావు?"

"దూరంగా మానస సరోవరంలో"

"దానవిశేషమేమి తెల్పుమా?"

"బంగారు కలువలు, మంచి ముత్యాలూ ఉంటాయక్కడ"

"నత్తలుంటాయా"

"ఆ నత్తలంటే ఎలా ఉంటాయో మాకు తెలీదు"

నత్తలు కూడా తెలియవా?" అని పకపకా నవ్వాయట కొంగలు. ఇది కూడా ఒక చాటు పద్యమే! చాటుపద్యమణిమంజరిలో ఉంది.

పల్లెలో మిగిలిపోయిన బక్క బకాలకు ఆకలొక్కటే తెలుసు. నత్తలుంటాయా అని అవి ఆశగా అడిగాయి. బంగారు చెంచా నోట్లో పెట్టుకుపుట్టిన వాడికి ఆకలి తెలీదు, బంగారు కలువలు వాళ్లకు గొప్ప. నత్తలంటే ఏవిటని అడిగాయి.

వలస జీవుల గురించి ప్రభుత్వం ఒక విధానాన్ని అనుసరించాల్సిన అవసరాన్ని ఈ కథ చెప్తోంది.

# వాలుకుర్చీ వేదాంతం

*తన కలిమి, ఇంద్రభోగము*
*తన లేమియె సర్వలోక దారిద్యంబున్*
*తన చావు జగత్ప్రళయము,*
*తన వలచినయదియె రంభ, తథ్యము సుమతీ...*

లోకంలో పడక కుర్చీ మేథావులు కొందరుంటారు నిండు కుండలాంటివాళ్ళు. తొణకరు, బెణకరు. రేపు ఆ కుండే ఖాళీ అయితే, తలకిందులైపోతారు, కుండకూడా అంతే! నిండుగా ఉన్నంత సేపూ లోకం అంతా సుభిక్షం అంటుంది. కుండఖాళీ ఐతే తల్లకిందులై, గగ్గోలు పెడుతుంది. ఘటవాయిద్యం లాంటిదే ఇదంతా! చాలా మంది జీవితాలలో కనిపించే నిష్ఠుర సత్యం ఇది.

తమకు కడుపునిండుగా ఉంటే "జనం సుఖంగా ఉంటున్నారని, పంటలు బాగా పండుతున్నాయనీ అంటాడు. తనకు ఆకలి మండిపోతుంటే లోకం గొడ్డు పోయిందని, ప్రభుత్వ పాలన బాగాలేదని అందోళన చేస్తాడు. లోక దారిద్ర్యాన్ని అంచనా వేయటానికి తన భావదారిద్ర్యాన్ని ఉపయోగించాలనుకోవటమే ఇక్కడ సూత్రం.

ఇలాంటి మేథావి వర్గాన్ని పడకకుర్చీ వేదాంతులు అంటారు. ఈజీఛైర్ ఫిలసాఫర్లన్నమాట! వీళ్ళు వీధి అరుగు మీద వాలుకుర్చీలోవాలి, కూర్చుని దారినపోయే దానయ్యలతో అమెరికాను బాగు చేయటం గురించి, రష్యాను దారిలో పెట్టటం గురించి చాలా ఐడియాలు ప్రవచిస్తుంటారు. టకార ప్రయోగాలతో సమాచారాన్ని ఊదరగొడ్తుంటారు, ఆయనట... ఈవిడట... అంటూ! అదిగో ద్వారక అంటే ఇవిగో ఆలమందలు అంటారు. అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష లాంటి భావాలు వీళ్ళవలనే ప్రబలుతాయి. తర్కానికి నిలవని భావజాలాన్ని లోకం మీదకు ప్రసారం చేస్తుంటారు.

తమిళ సంగమ సాహిత్యంలో ఆకుల బట్టలు కట్టుకున్న ఒక స్త్రీ గురించి ఉంది కాబట్టి, తమిళ భాష ఆకులు కట్టుకునే రోజుల్నించి అంటే కనీసం ఏడేనిమిది వేల యేళ్ళ నుండీ వుందనే ప్రచారం ఇలాంటి వాలుకుర్చీ వేదాంతం లాంటిదే! "కనీసంలో కనీసంగా ఈ సంఖ్య చెప్తున్నాం. మా లెక్కప్రకారం కనీసం యాభైవేల యేళ్ళనుండీ తమిళం ఉంది" అన్నారు తమిళపీఠాధిపతి స్వయంగా! అప్పటికి ప్రపంచంలో ఏ భాషైనా ఉన్నదా? అనడిగాడు నా బోటి భాషాదభూతి. లేదు. అప్పటికీ భాషనేదే లేదు. తమిళం ఒక్కటే ఉంది. దానిలోంచే అన్ని భాషలూ పుట్టాయి అని ఆయన

సూత్రీకరించాడు సదరు తమిళ భాషతల్పశాయి. ఇది తాంబూలాలు ఇచ్చేశాను తన్నుకు చావమనటం కన్నా ప్రమాదకర ధోరణి. ఇప్పుడీ విషయాన్ని నిరూపించటానికి కోట్ల రూపాయల ప్రాజెక్టులు నడుస్తున్నాయక్కడ. అక్కటా...!

సుమతీశతకంలోని ఈ పద్యం 'వాలుపడక సీను'ల తత్వాన్ని ఎండగడుతుంది. వీళ్ళు వీధి అరుగుదాటి లోకంలోకి రారు. వాస్తవాన్ని చూడరు. చూసినా పట్టించుకోరు. పట్టించుకున్నా నిజం చెప్పరు. ఒకవేళ చెప్పినా అందులో అర్ధసత్యాలు, పావు నిజాలూ మాత్రమే ఉంటాయి.

"తనకు గొప్ప కలిమి ఉన్నప్పుడు, లోకం అంతా ఇంద్రభోగం అనుభవిస్తోందంటాడట. తనకు లేమి కలిగితే సర్వలోకంలోనూ దారిద్ర్యం తాండవిస్తోదంటాడు. తనకు చావు పరిస్థితి వస్తే, జగత్ప్రళయం వస్తోందంటాడు. అక్కడితో ఆగుతాడా...? తను వలచిందే రంభ అని అడ్డగోలుగా వాదిస్తాడు. ఇది తథ్యము సుమతీ... అంటాడు సుమతీ శతక కారుడు.

వెనకటికి ఒక డాక్టరుగారు "నా ప్రాక్టీసులో ఇన్ని పుళ్ళు కోశాను, ఒక్కడికి కూడా నా కొచ్చినంత బాధ రాలేదు" అన్నాడట. తన బాధని లోకం బాధగా రుద్దడం, లోకం బాధ తన బాధకన్నా తక్కువేనని తూకాలు వేయటం విచిత్రం.

న్యూరో ఫిలాసఫీ అనే వైద్యవేదాంత విభాగం ఒకటి ఉంది. బాధపడేవ్యక్తిని చూసినప్పుడు మనం కూడా బాధ పడే తత్వాన్ని ఈ శాస్త్రంలో "మిర్రర్ టచ్ సైనస్థీషియా" అంటారు. అనస్థీషియా అగటే బాధ తెలీకుండా ఉండటం. సైనస్థీషియా అంటే బాధ తెలియటం. ఎదుటిమనిషి కాలుకు దెబ్బతగిలినప్పుడు మన కాలు నొప్పి పెట్టకపోయినా మనసు మాత్రం అయ్యో అనుకుంటుంది. ఇది అద్దంలో ప్రతిబింబాన్ని ముద్దాడటం లాంటిది. అందుకే మిర్రర్ టచ్ సైనస్థీషియా అన్నారు. ఇది మనసున ప్రతి ఒక్కరికీ వర్తించే అంశమే! ఇది నాడీ వేదాంతం... న్యూరో ఫిలాసఫీ!

వాలుకుర్చీ వేదాంతం ఇందుకు భిన్నమైంది. తనకు బాధ పుట్టినప్పుడు లోకం అంతా బాధలోనూ దిగుల్లోనూ కూరుకు పోయిందంటాడు. తనకు సుఖంగా ఉంటే లోకంలో కష్టాలే లేవంటాడు. తనకు ఇష్టమైనది అందరూ మెచ్చేదంటాడు. తనకు నచ్చనిదాన్ని, ఎవ్వడూ ఇలాంటివి ఇష్టపడ దంటాడు. పొట్లకాయ లేదా కాకరకాయ అంటే ఇష్టత లేనివాడు "వీటిని తినే మనుషులు కూడా ఉంటారా అని ఆశ్చర్యం" ప్రకటిస్తాడు. "తావలచినదే రంభ" అనే ధోరణిగాళ్ళ వలన లోకానికి అపకారం జరుగుతుంది.

ఇదొకరకం మానసిక అనస్థీషియా!

# వ్యక్తిత్వానిదే గెలుపు

*"అప్పన మెంతగావలె నహంకరణంబు దొఱంగి యిచ్చినన్*
*గప్పము పేర, నేడు నొడికారితనంబున మోసపుచ్చగా*
*నుప్పులు దెత్తురే! సమరయోగ్యతలంబున వైరికోటితో*
*నుప్పునబట్టె లాడునెడ నుప్పులు దెత్తురు గాక యాదవుల్"*

నాచన సోమన క్రీ.శ. 14వ శతాబ్ది నాటికవి. హరిహరనాథునికి ఉత్తరహరివంశం అంకితంగా ఇచ్చుకున్నాడు. ఇందులో పరమ శివభక్తులైన హంస డిభకులు తమకు మంత్రిగా ఉన్న జనార్దనుడనే పరమ విష్ణుభక్తుణ్ణి కృష్ణుడి దగ్గరికి రాయబారం పంపుతారు... "రాజసూయ యాగం చేస్తున్నాం. యాగానికి కావలసిన ఉప్పుని కప్పంగా పంపించు..."అని!

దానికి శ్రీ కృష్ణుడి సమాధానం ఈ పద్యం...

"అడిగింది కేవలం ఉప్పే! కానీ వ్యక్తిత్వాన్ని చంపుకోవటానికి అప్పనం (కప్పం) ఎంతకావాలి? ఉప్పురాయి ఇచ్చినా, మేరు పర్వతం ఇచ్చినా, కప్పం కప్పమే! కప్పం కట్టామంటే అవతలి వాడి దగ్గర ఊడిగానికి సిద్ధపడ్డట్టే కదా!మన వ్యక్తిత్వాన్ని చంపుకున్నట్టే కదా...!" అంటాడు కృష్ణుడు.

వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోలేని రాజీ బతుకు కూడా ఒక బతుకేనా...? కష్టాలకు ఎదురీదైనా, వ్యక్తిత్వాన్ని కాపాడుకునే వాడే విజేత! మనవైన ఆలోచనలు, నిర్దిష్ట అభిప్రాయాలు, నిర్ణయాలు మన వ్యక్తిత్వాన్ని నిర్ణయిస్తాయి. వ్యక్తిత్వం లేనివాడి దగ్గర వజ్రాయుధం ఉన్నా రాణించదు! ఎక్కడి మాటలు అక్కడ చెప్పి పబ్బం గడుపుకు పోవాలనుకునే వాడికి దాస్యమే తప్ప ఎప్పటికీ ఆధిపత్యం కలగదు. మన ఉనికిని మనం చాటుకోగలిగే తత్వాన్ని జాతీయులందరూ పెంచుకోగలిగితే జాతి రాణిస్తుంది. కృష్ణుడంటాడు:

"అప్పనమెంతగావలె= తమ దాసుణ్ణి అని ఒప్పుకున్నాక కప్పం ఎంతయితే ఏమిటీ...?

అహంకరణంబు దొఱంగి యిచ్చినన్ కప్పము పేర: అహంకరణాన్ని అంటే వ్యక్తిత్వాన్ని చంపుకుని కప్పం పేరుతో ఇచ్చిన తరువాత.

నొడికారతనంబున మోసపుచ్చగా నుప్పులు దెత్తురే= యాగానికి వస్తూ కాసింత ఉప్పు పట్రా అని తెలివిగా మాట్లాడి మమ్మల్ని మోసపుచ్చాలని చూడకు. పిడికెడు ఉప్పే కదా అనుకుని అమాయకంగా కానుకలు తెచ్చేస్తామనుకోకు...అది కానుక కాదు, కప్పం అని మాకు తెలుసు!

సమర యోగ్యతలంబున వైరికోటితో= యుద్ధరంగంలో ఈ హంస డిభక మూకలతో

ఉప్పునబట్టె లాడునెడ నుప్పులు దెత్తురుగాక యాదవుల్= 'ఉప్పునబట్టెలాట' అనేది ఒక పోటీ లాంటిది. మన ప్రాచీన గ్రామీణ క్రీడ. ప్రత్యర్థుల్ని తప్పించుకుంటూ అవతలి వేపుకు దూసుకు వెళ్ళి గోలు కొట్టినట్టు ఈ ఆటలో అవతల వేపున ఉన్న ఉప్పుని దోసిల్లో పట్టుకు రావటం ఈ ఆట విధానం.

మీ హంస డిభకులతో ఉప్పునబట్టెలాట ఆడి తప్పకుండా ఉప్పు తీసుకొస్తాం... యుద్ధంలో గెలిచి తీరుతాం... అంటాడు కృష్ణుడు.

మహాభారతంలో కృష్ణుడు రాయబారిగా ఎలా వ్యవహరించాడో, ఉత్తర హరివంశంలో ఈ జనార్ధనుడు కూడా కృష్ణుడితో అలాగే రాయబారం నడిపిస్తాడు. అక్కడ దుర్యోధనుడు ఎలా మాట్లాడాడో ఇక్కడ కృష్ణుడు అలానే మాట్లాడినట్టు నాచన సోమన చేసిన ఈ వర్ణనలో కనిపిస్తుంది.

చరిత్రను మనం ఎవరి పక్షం వహించి చదువుతామో వాళ్ళు చేసిందంతా ఒప్పుగానూ, ఇతరులది తప్పుగానూ భావిస్తాం. దుర్యోధనుడి మాటలు అహంకారం అయితే, కృష్ణుడన్నది "అహంకరణ దొంగకుండా కాపాడుకోవటం"గా, అంటే ఆత్మాభిమానం చాటుకోవటానికి మాట్లాడినట్టుగా పండితులు వ్యాఖ్యానిస్తారు.

చరిత్ర పాఠకుడు ఉన్నతమైన వ్యక్తిత్వం కలవారి పక్షం వహిస్తాడెప్పుడూ!

కృష్ణరాయబారాన్ని జనార్దనుడి రాయబారాన్ని ఒకే గాటన కట్టి చూడకూడదు. అలాగే దుర్యోధనుడి అహంకార పూరిత ప్రేలాపనల్ని, కృష్ణుడి ఆత్మాభిమాన ప్రకటనతో కూడా పోల్చకూడదు.

కృష్ణుడు మాట్లాడిన మాటలు వ్యక్తిత్వం వక్రీకరించబడిన వాడి నోటి నుండి వచ్చినప్పుడు అవి ప్రమాద హేతువౌతాయి. మాటలవే అయినా వాటిని అన్నదెవరన్నది ప్రశ్న!

ఉన్నత వ్యక్తిత్వం ఉన్నవాడి చేతిలోనే వజ్రాయుధం రాణిస్తుంది.

# వ్రాద్దామా? రాద్దామా?

*"ఝషభషలైన కొన్ని యపశబ్దములన్ కృతిఁజెప్పి కావ్య పౌ*
*రుషములకొళ్ళుగట్టుకుని రూఢికి నెక్కదలంచి శేముషీ*
*ధిషణులమంచు వాదులకు దియ్యముగాఁ గవులాడు వాక్యముల్*
*విషకబళంబుఁగా దలఁచి వీనులఁబెట్టరు సత్కవీశ్వరుల్"*

దక్షిణాంధ్ర యుగంలో అంటే 16-17 శతాబ్దాలలో తంజావూరులో పుట్టిన తెలుగు సాహిత్యం మొదటి దశ తెలుగు వారైన నాయకరాజుల కారణంగా వర్ధిల్లితే, రెండవదశ మరాఠారాజుల కారణంగా వర్ధిల్లింది.

అది మౌలికంగా తమిళ రాజ్యం అయినప్పటికీ ఈ మరాఠారాజులు తెలుగు నేర్చుకుని అచ్చతెలుగులో చక్కని తెలుగు సాహిత్యాన్ని సృష్టించారు. శాహాజీ, వెంకోజీ, శరభోజి, తులజాజి... ఇలా చాలామంది మరాఠారాజులు తెలుగులో కావ్యాలు, యక్షగానాలు, వీధినాటకాలతోపాటు, అనేక రామాయణాలు కూడా ఆ కాలంలో వెలిశాయి.

తొలి మరాఠా తెలుగుకవి శాహాజీ (శాహ ప్రభువు) చాలా రచనలు చేశాడు. 'భక్తవత్సలవిలాసం' అనే నాటకం వాటిలో ఒకటి. తంజావూరులోని సరస్వతీ గ్రంథాలయంలో ఈ నాటక ప్రతి ఉంది. దీని ప్రారంభంలో సూత్రధారి మహిషాసుర మర్దినికి కేలుమోడ్చిన తరువాత కుకవుల్ని తిడుతూ ఈ పద్యం వ్రాశాడు.

"ఝషభషలైన కొన్ని అపశబ్దాల్ని యథేచ్ఛగా ప్రయోగిస్తూ అది తమ కావ్యపౌరుషం అంటూ, వాటిని రూఢికి తెచ్చి కీర్తిని కొట్టేయాలని చూసేవాళ్ళ రచనల్ని విషపు ముద్దలుగా భావిస్తారు సత్కవీశ్వరులు" అని ఈ పద్య భావం.

"ఝషభషలైన అపశబ్దాలు" అంటే ఏమిటి? ఝష అనే సంస్కృత పదానికి బీర, చేప అడవి, మొసలి అనే అర్థాలున్నాయి. 'ఝష నయని' అంటే చేప వంటి కన్నులు గల స్త్రీ అని! సంస్కృతంలో భష, భషకం అంటే కుక్క. 'ఝష' అని వ్రాయాల్సిన చోట 'భష' అని వ్రాసి, ఇది కూడా ఆ అర్థమే అని దబాయించే వాళ్లని ఈ పద్యంలో నిందించాడు శాహ ప్రభువు. వ్రాయడం అన్నా- రాయడం అన్నా ఒకే అర్థం అని దబాయించటం లాంటిదే ఝషని - భష అనటం అని దీని భావార్థం.

అలా వ్రాసినందు వలన భాషకు ఒరిగేది గానీ, భాష పెరిగేది గానీ ఏమీ ఉండదు. కేవల నాజూకుతనం నాణ్యతకు ప్రమాణం కాబోదు. మాట్లాడే లేదా వ్రాసే ప్రతి అక్షరం ఎందుకోసం ఉద్దేశించామో ఆ ప్రయోజనాన్ని అది నెరవేర్చాలి.

అమృతాంజనాన్ని రాస్తారు. అక్షరాన్ని వ్రాస్తారు. రెండింటికీ వేర్వేరు వర్ణాలు ఉండగా వాటిని వాడుకోవటానికి నామోషి దేనికీ?

కన్యాశుల్కం నాటకంలో 'శషభిష' కూడా ఇలాంటి ప్రయోగమే! గిరీశం తన శిష్యుడికి చదువు చెప్పే నెపం మీద అగ్రహారంలో తిష్టవేయాలని ఎత్తు ఎత్తాడు. అతన్ని చూదగానే శిష్యుడి తండ్రి అగ్నిహోత్రావధాన్లు ఆ విషయం పసిగట్టేస్తాడు. 'ముక్కోపికి ఉండనే ఉంది మందు ముఖస్తుతి' అనే ఆర్యోక్తి ప్రకారం... పొగడ్తల దండకం ఎత్తుకుంటాడు గిరీశం. "మీలాంటి చప్పన్నభాషలూ వచ్చిన మనిషి యక్కడా లేడనీ, సంస్కృతం మంచినీళ్ల ప్రవాహంలా తమరు మాట్లాడతారనీ, తమలాంటి విదూషకుణ్ణి యక్కడా చూళ్లేదనీ డిప్టీకలక్టరుగారు శలవిస్తూండేవారు. కవితారసం ఆయన్లా గ్రెహించేవారేరీ? నాకవిత్వవంటే ఆయన చెవికోసుకుంటారు. మహారాజావారిదర్శనం కూడా నాకు చేయించారండి..." ఇలా మాట్లాడతాడు గిరిశీం.

గిరీశం పొగడ్తలకు అగ్నిహోత్రావధాన్లు ధుమధుమలాడతాడు "ఈ శషభిషలు నాకేం పనికిరావు. యితడి వైఖరి చూస్తే యిక్కడే బసవేసేటట్టు కనపడుతూంది. మాయింట్లో భోజనం యంతమాత్రం వీలుపడదు.." అనేస్తాడు.

ఇక్కడ శషభిషల్ని శుష్కపొగడ్తలనే అర్థంలో గురజాడవారు ప్రయోగించాడు. అవి పొగడ్తలైనా, వాగ్దానాలైనా, ప్రసంగాలైనా సారం లేదా రసం లేకపోతే శుష్కంగా ఉంటాయి. పరమ భయానక రాక్షసుడిలా కనిపించే వ్యక్తిని చంద్రబింబం లాంటి మోము, మల్లెపువ్వు లాంటి మనసు అని పొగిడ్తే అవి శషభిషలన్నమాట.

'ఝషభష' అనే సంస్కృతపదమే తెలుగులో శషభిషగా మారి ఉంటుందా? శషభిషల్లేకుండా చెప్పడం అంటే సందేహాతీతంగా చెప్పడం అనే అర్థంలో ఈ పదాన్ని ప్రస్తుతంఎక్కువగా వాడుతున్నాం. ప్రధాన నిఘంటువుల్లో శషభిష, ఝషభషలకు అర్థాలు లేవు. దివాకర్ల రామభాస్కరం గారు సంకలనం చేసిన తెలుగు ప్రాసపద నిఘంటువులో మాత్రం 'శషభిష' అంటే ఘూంథాం అనుట అని, 'ఝషభష' అంటే పలుకలేని మాట అనీ అర్థాలు ఇచ్చారు. ఒక నిర్దిష్టమైన అర్థం లేనప్పుడు ఎవరికి తోచిన అర్థాన్ని వాళ్ళు చెప్పుకోవటం సహజం.

తెలుగులో 'బిస' అంటే గడియారంలో ఉండే(స్ప్రింగు)కీలు, యంత్రం అనే అర్థాలతో పాటు సులువైన ఉపాయం అని కూడా ఉంది."అచ్చటం గ్రుచ్చికానరాకుండ మునుమున్న మృగయుండు బిసయొడ్డి సంఘటించిన కాలి బోనులం బడి" లాంటి కవిప్రయోగాలు ఉపాయం పన్నటం అనే అర్థంలో ఉన్నాయి. 'బిసి' అంటే, గట్టిగా బిగించి కట్టటం. బిసిబిసి మాటలు అంటే పిల్లలు మాట్లాడే తొకతొక పలుకులు.

క్రీ.పూ. 5-4 శతాబ్దాలనుండీ క్రీ.శ. 5-6 శతాబ్దాల వరకూ తెలుగునేలమీద ఆంధ్రం, ప్రాకృతం, పాళీ భాషలమధ్య పదాల రాకపోకలు బాగా విస్తృతంగా జరిగాయి. ప్రాకృతం, పాళీ, సంస్కృతం భాషలు మాట్లాడే వారితో తెలుగు ప్రజలకు సాన్నిహిత్యం పెరిగినకొద్దీ ఆయా భాషల్లోని శ, ష వర్ణాలతో కూడుకున్న పదాలు తెలుగులోకి రావటం ఎక్కువైంది.

సంస్కృతంలో శ, ష, స, హ వీటిని ఊష్మా లంటారు. శ, ష రెండు అక్షరాల్నీ తెలుగులో 'స' గానే మన పూర్వులు పలికారు. దోషం -దోసం గానూ, దోశ-దోసె, దోసియగానూ ఇప్పటికీ పలికే అలవాటుంది. క్రమేణా శ, ష లను తెలుగీకరించు కున్నాం. 'చేసినాడు, వ్రాసినాడు, పోసినాడు, తీసినాడు ఇలాంటి మాటలకు 'యా' చేర్చి, 'చేశాడు', 'రాశాడు', 'పోశాడు', 'తీశాడు' అని పలికేందుకు, వ్రాసేందుకూ దీనివలన సానుకూలత ఏర్పడింది. తెలుగు భాషలో 'శ-ష బిస' (పట్టు) పెరిగింది. కానీ, 'అన్నప్రాశన' ని 'అన్నప్రాసనం' అన్నట్టుగా, సకారాన్ని శ-షే లతో 'యా' అని పలకటం ఇష్టం లేని పండితులు రాశాడు, చేశాడు లాంటి ప్రయోగాలను అపభ్రంశాలుగానూ, అప్రాచ్యపు మాటలుగానూ భావించబట్టే, "ఇలాంటి శషభిషలు నాకు గిట్టవు" లాంటీ ప్రయోగాలు ఏర్పడ్డాయి.

మనం అనుకుంటాం గానీ, రైలు రోడ్డు లాంటి ఆంగ్లపదాల్లాగానే చాలా సంస్కృతపదాలు తెలుగులో తెచ్చి అంటించినట్టే ఉంటాయి. అతుకు అతుకే! శ-ష లను తెలుగు వర్ణమాలలో కలుపుకున్నాం కాబట్టి, ద్రావిడ సూత్రాలకు అనుగుణంగా వాటిని తెలుగులో మాట్లాడినట్టు వ్రాయటం సాధ్యం అయ్యింది.

bank, mat, rat, లాంటి మాటల్ని 'యా' అని వ్రాయటానికి సంస్కృతంలోనూ, తెలుగులోనూ వేరే వర్ణం లేదు. ఇంగ్లీషు వాళ్లకీ లేదు. ఇంగ్లీషులో 'A'ని 'అ' గానూ, 'ఎ' గానూ, 'య' గానూ మూడువిధాలా పలుకుతారు. మన వర్ణాలను అలా వేర్వేరు రీతుల్లో పలికే సాంప్రదాయం మనకు లేదు. అందువలన బాంకు, బ్యాంకు, బ్యాంకీ, బేంకు ఇలా వ్రాయాల్సి వస్తుంది.

మనవి కాని పదాలను వ్రాయటానికి మన భాషలో తగిన వర్ణాలు ఉండి తీరాలని ఎక్కడుందీ?

సంస్కృతం విషయంలో వర్ణమాలను మనం సంస్కృతానికి సంబంధించినవే వాడుతున్నాం కాబట్టి, సంస్కృత పదాలు వ్రాయాల్సి వచ్చినప్పుడు ఱ, ఋ, ౠ ఇలాంటి వర్ణాలున్న సంస్కృతపదాలను వ్రాయటానికి మన వర్ణమాలలో అక్షరాలను కూర్చుకో గలిగాం. ఇంగ్లీషు, ఫ్రెంచి, జెర్మనీ, లాంటీ విదేశీ భాషాపదాలను ఉచ్చారణకు తగ్గట్టుగా తెలుగులో వ్రాయాల్సి వచ్చినప్పుడు అదనపు అక్షరాలను

వర్ణమాలలో చేర్చవలసి వస్తుంది. అది భాషను పెంచుకోవటానికే! దాన్ని భాషను అమ్ముకోవటంగా ఎవరైనా భావిస్తే పొరబాటే.

క్రీ.శ. 7-10 శతాబ్దాల మధ్యకాలంలో ఆంధ్రభాషా స్వరూపంలో పెనుమార్పులు వచ్చాయి. ఱ, ళ లు న, లగా మార్పుచెందాయి. ఱ, ర రెండూ సంకరం కావటం ప్రారంభమయ్యింది. సంస్కృతపదాలలో ఋకారాన్ని రికారంతో పలకటం మొదలయ్యింది. ఇదే అలవాటు ఋగ్వేదాన్ని రిగ్వేద-Rigveda అనటానికి కారణం.

ఱ, ఋ, ౠ వర్ణాలతో అచ్చతెలుగు మాటలుండవు. అవి సంస్కృతపదాలే! వాటిని తెలుగులో వ్రాయటానికి మాత్రమే ఆ వర్ణాలు ఉపయోగపడతాయి. సంస్కృత పదాన్ని తెలుగులో వ్రాస్తున్నప్పుడు ఱ కు బదులుగా ర వ్రాస్తే అది నాజూకు దనం కావచ్చునేమో గానీ, తెలుగుభాషకు ప్రయోజనకరం కాబోదు.

ఇతర భాషాపదాలను వ్రాయటానికి కొత్తకొత్త వర్ణాన్ని సృష్టించ గలగాలి. కంప్యూటరు లిపిని తయారు చేసే వారందరూ కలిసివస్తే అది సాధ్యమే!

# సంసారంలో తారాశశాంకం

*"లోకములోనఁ గొందఱబలుల్ సతులన్ దనియింప లేక న*
*స్తోకమనీష నవ్య పురుషుల్ తమభామలనంటకుండఁ దా*
*టాకులలోన వ్రాసిరి పరాంగనఁగూడిన పాపమంచు న*
*య్యాకులపాటుఁజూచి యిపుడాకుల సాటొదవె న్మనంబునన్"*

*(శేషము వేంకటపతి-శశాంక విజయము)*

కొన్ని కథలు విచిత్రంగా ఉంటాయి. ఇప్పటి మన 'లైంగికనీతి' అనే కోణంలోంచి చూస్తే చాలా ప్రేమకథలు ఘోరంగా కనిపిస్తాయి. కొన్ని కథల్లో బూతును పరిమార్చాలని కవులు ప్రయత్నిస్తే కొన్ని కథల్లో బూతుని పెంచిన వాళ్ళు కూడా ఉన్నారు. తార, చంద్రుల ప్రేమకథలో నీతీ, బూతూ, సందేశం మూడూ ఉన్నాయి.

**నీతి :** భర్త సుఖపెట్టకపోయినా భార్య గాడి తప్పకూడదు.

**బూతు :** భర్త క్యాంపుకు వెళ్ళినప్పుడూ భార్య ఎంతకైనా తెగించవచ్చు.

**సందేశం :** భార్యాభర్తలిద్దరూ దాంపత్యాన్ని సమాన స్థాయిలో ఇచ్చిపుచ్చుకునే విధంగా పరస్పర అవగాహనతో మెలగాలి

దేవీ భాగవతంలో చెప్పిన కథ ప్రకారం బృహస్పతి భార్య 'తార' చంద్రుణ్ణి బలవంతంగా తనకు అనుకూలుణ్ణి చేసుకుంటుంది. బృహస్పతి తనభార్యని తనకిచ్చేయమంటాడు. ఆమె వస్తానంటే తీసుకు పొమ్మంటాడు చంద్రుడు. దిక్కులేక బృహస్పతి ఇంద్రుడి దగ్గరకు వెళ్ళి చంద్రుడి మీదకు దాడికి వెళ్ళాలని కోరాడు. ఇంద్ర-చంద్ర యుద్ధం సాగుతుంటే బ్రహ్మగారు వచ్చి యుద్ధం ఆపించి, తారను బృహస్పతికిప్పిస్తాడు.

తార అప్పటికే గర్భవతి. బుధుడిని ప్రసవిస్తుంది. ఆ పిల్లవాడికి నేను తండ్రినంటే నేను తండ్రినని బృహస్పతి-చంద్రుల మధ్య మళ్ళీ రగడ జరుగుతుంది. చంద్రుడే తన బిడ్డకు తండ్రి అని తార సాక్ష్యం చెప్తుంది. బ్రహ్మగారు బుధుణ్ణి చంద్రుడికి అప్పగిస్తాడు. చంద్రుడికి గ్రహాధిపత్యం ఇస్తాడు.

దక్షప్రజాపతి తన 27మంది కూతుళ్ళనూ చంద్రుడికిచ్చి పెళ్ళి చేస్తాడు. వాళ్ళంతా అశ్వని, భరణి కృత్తిక వగైరా 27 నక్షత్రాలుగా వెలుగొందారు. స్థూలంగా ఇదీ కథ.

చంద్రునికి గ్రహాధిపత్యం ఇవ్వటం అంటే చాంద్రమాన గణనకు ప్రాధాన్యత నివ్వటం అనే ఏకైక లక్ష్యం చుట్టూ ఈ కథని అల్లినట్టు కనిపిస్తుంది.

తెలుగువారు చాంద్రమానాన్ని, ఇతరులు సౌరమానాన్ని అనుసరిస్తారు. ఈ కథలో

ఎక్కడా సూర్యుడు లేదా, సౌరమానం అనే మాటలు లేకుండా చంద్రాధిపత్యాన్ని బ్రహ్మచేత ప్రకటింప చేయటాన్ని గమనించవచ్చు.

దేవీభాగవతంలో త్రిమూర్తులు అత్రి–అనసూయ దంపతులకు పిల్లలుగా పుట్టిన కథ కనిపిస్తుంది. విష్ణువు అంశన దత్తాత్రేయుడు, శివుడి అంశన దూర్వాశుడు, బ్రహ్మ అంశన చంద్రుడు పుట్టినట్టు దేవీభాగవతం చెప్తుంది.

కథ ఎందుకు పుట్టినా కవులు తారా చంద్రుల విలాసాన్ని చిలవలు పలవలు చేశారు.

శేషము వెంకటపతి కవి తన శశాంక విజయం కావ్యంలో ఒక అడుగు ముందుకేసి, అత్రిమహర్షి చంద్రుణ్ణి బృహస్పతి దగ్గరకు చదువుకు పంపినట్టు, చంద్రుడిలో యౌవనారంభానికే అతను సమస్త కళల్లోనూ ఆరితేరినట్టు, ముగ్ధ సౌందర్యంతో విరాజిల్లినట్టూ వ్రాశాడు. బృహస్పతి కన్నా చిన్నవయసుదైన తార తన భర్త దేవలోకానికి వెళ్ళిన సమయం చూసి, యవ్వనవంతుడైన చంద్రుణ్ణి కామించి లొంగదీసుకున్నట్టు అందులో వర్ణించాడు.

లోకంలో కొందరు లైంగిక సమర్థత లేని మగాళ్ళు తమ భార్యల్ని సంతృప్తి పరచలేక, పైకి పెద్ద మనుషులుగా కనిపిస్తూ, ఉత్తుత్తి మాటలతో రోజులు గడిపేస్తూ, తాటాకులమీద "పరస్త్రీలతో కూడితే పాపం" అని గొప్పగా వ్రాశారు– ఆ తాటాకుల పాటు చూసి అదే నిజం అనుకుని మనసులో భయాలు పెట్టుకోవద్దంటుంది తార.

తార మాటల్లో పైకి అవినీతి కనిపిస్తోంది గానీ, ఆమె ప్రశ్నలకు ఈనాటికీ జవాబు లేదు. తనకు లైంగిక సంతృప్తినివ్వని భర్తతో తాను ఎందుకు కాపురం చేయాలి?

సందర్భం వచ్చింది కాబట్టి ఒక విషయాన్ని ప్రస్తావిస్తాను: ఈ రోజుల్లో కోట్లు ఖర్చుపెట్టి పెళ్లిళ్లు చేస్తున్నారు. ఆ పేరుతో జాతీయ ఆహార సంపద చాలా దుర్వినియోగం అవుతోంది. తినేది తక్కువ, పారేసేది ఎక్కువ. ఉత్పత్తి చేయని వాడికి వృథా చేసే అధికారం లేదనే చట్టం లేదు కదా! పన్నులు వేయటంలో మొనగాళ్ళమని చెప్పుకునే ప్రభుత్వం వారు ఆహార సంపదని వృథా చేస్తున్న విందుభోజనాలమీద 50–70% జి ఎస్ టి వేస్తే వృథా తగ్గి, జాతీయాదాయం పెరుగుతుంది కదా! ఇది వేరే సంగతి.

అంత ఖర్చు పెట్టి చేసిన పెళ్ళిళ్లలో ఎంతమంది దంపతులు తమ మొదటి పెళ్ళిరోజు వేడుకలు చేసుకుంటున్నారో సర్వే ఉన్నదా? ఎంతమంది విడాకులకోసం కోర్టు కెక్కుతున్నారో, ఎన్ని సంబంధాలు– పదికాలాలపాటు నిలబడ్తున్నాయో గుర్తించారా? కొత్త సంసారులు విడాకులకు ఎగబడటానికి సామాజిక కారణం

ఉన్నదా? ఒక వైద్యుడిగా నా పరిశీలనలో ఎక్కువమంది ఆడపిల్లల తరపు వాళ్ళు తమ అల్లుడికి పురుషత్వం లేదని చెప్తున్నారు.

ఆరోజున తార చెప్పింది, చేసింది కూడా అదే! ఈ ముసలి బృహస్పతి -ఎంత బుద్ధిమంతుడైతే నాకేంటి... నాకు సంతృప్తి లేనప్పుడు అనడిగింది? ఇల్లు వదిలేసి వచ్చేసింది.

ధర్మశాస్త్రాల్లోనూ, న్యాయ శాస్త్రాల్లోనూ ఆమె ప్రశ్నకు సమాధానం కనిపించదు. ఒక స్త్రీ తన భర్త పుంస్తవ లోపాన్ని ప్రశ్నిస్తోంది. బ్రహ్మగారు పెద్దమనిషిగా వచ్చి, నచ్చచెప్పి తారను తిరిగి భర్త దగ్గరకు పంపి ఉండవచ్చు. కానీ, ఆమె లేవనెత్తిన సమస్యకు పరిష్కారం నచ్చచెప్పటంలో లేదుకదా!

వత్తిళ్ళతో కూడుకున్న ఉద్యోగాలు ఆదాయాన్ని సమకూరుస్తున్నాయేమోకానీ, ఆలూమగల సుఖసంసారాన్ని సంతోషంగా సాగనీయని మాట చాలామంది విషయంలో నిజం. భార్యాభర్తలిద్దరూ ఉద్యోగులైతే ఈ పరిస్థితి మరీ ఎక్కువగా ఉంది.

పగలు మాత్రమే పనిచేసే అమెరికా వాడికోసం రాత్రిళ్ళు తిళ్ళూ, ధ్రిళ్ళూ వదులుకుని సుఖాన్ని త్యాగం చేస్తున్న మన ఉద్యోగుల సంఖ్య ఎక్కువ. ఉద్యోగ వత్తిడి కారణంగా వారిలో దాంపత్య బంధాన్ని త్యాగం చేసుకోవాల్సిన పరిస్థితి చాలా మందికి కలుగుతోంది. దీనికి పరిష్కారం ఆ యా వ్యక్తులు వ్యక్తిగతంగా ఆలోచించుకోవలసిందే!

లేకపోతే చంద్రుళ్ళు గెలుస్తారు, బృహస్పతులు గతులు కోల్పోతారు.

# సాహిత్యానికి రాజపోషణ

*"ధనముండుట పరిపాటియె*
*ధనమె సర్వంబుగాదు, ధనముండియు స*
*ద్వినియోగ బుద్ధిఁకలిగిన*
*మనుజుని భాగ్యంబె లోకమాన్యతఁ గాంచున్"*

(దువ్వూరి రామిరెడ్డి)

"ఎవరి దగ్గరైనా డబ్బుండటం సాధారణ విషయం. అవసరాలకు మించి డబ్బుండటం, మితి మీరి డబ్బుండటం కూడా పరిపాటే! డబ్బే సర్వస్వం కాదు. కాకూడదు కూడా! అలాగని డబ్బు లేకుండా ఏ పనీ జరగదు. కాబట్టి, డబ్బున్నవాడికి దాన్ని చక్కగా వాడే మంచి బుర్ర ఉంటే అది అతని భాగ్యం...దాని వలన లోకంలో గొప్ప గౌరవాలు పొందుతాడు" అంటారు కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు.

సాహిత్య పోషణ అనేది సమస్త కళల పోషణ అనే విస్తృతార్థంలో వాడుతున్న మాట! సాహిత్య పోషణ అంటే, మడులూ, మణులూ ఇవ్వటం కాదు. రచనలకు లేదా కళలకు తగిన పారితోషికం ఉండాలి. అవి గౌరవపూర్వకంగా అందించాలి. అంతకు మించి సాహిత్యం, కళలు సర్వోన్నతంగా వికసించేందుకు అనువైన వాతావరణం కావాలి.

తెలుగులో జాతీయ స్థాయి పురస్కారాలు తక్కువనీ, జ్ఞానపీఠాలు ముగ్గురేననీ, అంతర్జాతీయ ఖ్యాతి మన భాషలో ఎవ్వరికీ దక్కలేదనీ ప్రతి ఒక్కరూ బాధపడ్తుంటారు.

సాహిత్యానికి పరిమితమై ఆలోచిస్తే, ఈ బాధపడే వారిలో పుస్తకం కొని చదివే అలవాటున్న వారు తక్కువ. పుస్తకాన్ని పాఠకులు కొనరు. లైబ్రరీలు అసలే కొనవు.

2012-13 నుండీ గత నాలుగైదేళ్ళుగా ఒక్క పుస్తకాన్నీ గ్రంథాలయం వాళ్లు నెంబరిచ్చి కొన్న పాపాన పోలేదు. ప్రజలు కడ్తున్న పన్నులో గ్రంథాలయ పన్ను కూడా వుంది. పన్నులు పళ్ళూడగొట్టి వసూలు చేస్తున్నప్పుడు గ్రంథాలయాల ద్వారా కొత్త పుస్తకాలు ఎందుకు కొనరు? ఇలాంటి అన్యాయాన్ని నిరోధించే ఒక ప్రాథికారిక సంస్థ మనకే వుంటే గ్రంథాలయ శాఖ ఇంత నిర్లక్ష్యం వహించి వుండేది కాదు.

పుస్తకాలు అమ్ముడు పోవు కాబట్టి, సాహిత్య విలువలున్న పుస్తకాలను ప్రచురణ కర్తలు అచ్చువెయ్యరు. రచయిత స్వంతంగా ప్రచురించుకుంటే దాన్ని పుస్తక విక్రేతలు అమ్మరు. ఇలాంటివి ఎవరూ కొనరండీ... అని మొహానే ఛీంర్డించి పంపేస్తారు. అథవా అమ్మినా డబ్బులు తిరిగి ఇచ్చే దాఖలాలు తక్కువ. ఈ స్థితిలో మహారచయితలు

రాయని భాస్కరులుగా మిగిలిపోతున్నారు. వ్రాసిన దానికి 'ఔట్ లెట్' ఏదనే ప్రశ్నకు సమాధానం లేదు.

కేరళ, కర్ణాటక, బెంగాల్ లాంటి రాష్ట్రాల్లోంచి అత్యున్నత పురస్కారాలు పొందిన వారు ఎక్కువగా ఉండటానికి అక్కడ సాహిత్యానికి అనువైన వాతావరణం ఉండటం కారణం. తెలుగు నేలమీద అలాంటిది లేదు! వస్తుందనే ఆశ లేనప్పటికీ ఆశావాదాన్ని వదులుకోలేము కదా!

ప్రాచీన సాహిత్యం, పద్యం, ఛాందసవాద సాహిత్యాలకు పక్షపాతం వహించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ముప్ఫై ఏళ్ళక్రితం తనను తాను నరుక్కొంది. ఆ తరువాత వచ్చిన తెలుగు విశ్వవిద్యాలయం అకాడెమీ చేసిన తప్పులు సరిదిద్దక పోగా అది మార్కులు డిగ్రీలు ఇచ్చే మామూలు విశ్వవిద్యాలయం స్థాయికి తనను తాను కుదించుకుంది.

దీనికి తోడు మన అలసత్వం కారణంగా జాతీయస్థాయిలో తెలుగు భాషకు ప్రాతినిధ్యం వహించే వ్యవస్థని ఈ మూడు దశాబ్దాల కాలంలో మనం నిర్మించుకో లేకపోయాం. మనగోడు వినేవాడు ఇటు రాష్ట్రంలోనూ, అటు కేంద్రంలోనూ ఒక్కడూ లేడు. అరకొర పరిశోధనలతో కాలం గడిచిపోతోంది.

తెలుగు భాష పరిస్థితి అంతకన్నా ఘోరంగా ఉంది. తెలుగు భాషోద్యమం రాజకీయ వత్తిడి తెచ్చి సాధించిన ప్రాచీనతా హోదా వలన వచ్చే నిధుల్ని విశ్వవిద్యాలయాలు, పరిశోధకులు పరిశోధనా ప్రాజెక్టులకోసం ఉపయోగించాలి. ఆ నిధులు ప్రభుత్వ ఖాతాలో జమ అయ్యేవి కావు. గత ఐదేళ్ళుగా మనలోని "పట్టనితనం" వలన ఆ నిధులు వెనక్కి పోతున్నాయంటే బాధకలగటం సహజం.

సాహిత్యానికి రాజపోషణ అంటే వివిధ ప్రభుత్వ శాఖలతో పాటు, అకాడెమీలు, విశ్వవిద్యాలయాలు, సాహితీ సంస్థలు, వదాన్యులైన వ్యక్తులు, సాహిత్యకార్యకర్తలు సమష్టిగా చేసే కృషి అని అర్థం. భావజాలాలు ఏవైనా స్వంత వృత్తి వ్యాపకాలను పక్కనబెట్టి సాహిత్యం కోసమే జీవించేంతగా కార్యకర్తలు పనిచేయటం వలన విజయాలు సాధించిన సాహితీ సంస్థలు మనకు బాగానే ఉన్నాయి. వారి త్యాగాల వలనే తెలుగు నేలమీద ఈ మాత్రం అయినా సాహిత్యం బ్రతికుంది.

దువ్వూరి రామిరెడ్డి గారు చెప్పినట్టు, సాహిత్యం కోసం, కళలకోసం "ధనముండియు సద్వినియోగ బుద్ధిఁ కలిగిన మనుజుని" ఉనికి మనకు లేదు. ప్రభుత్వాలకు ఆ దృష్టి కూడా లేదు.

భాషా సాహిత్యాలకోసం ఎవరు ఏ కొద్దిమేలు చేసినా, చనిపోయాక కూడా బ్రతికుంటాడు. ముఖ్యమంత్రి అయినా సామాన్యుడైనా ఇదే నీతి.

# స్వచ్ఛప్రేమ

**'అనగ్న దర్శనమ్ చైవ న కామ్యామ్ చ మైథునమ్**
**ద్వౌ మేషౌ శయన అభ్యాశే సదాబద్ధౌ చ తిష్ఠతః**
**ఘృత మాత్రాః తథాహారః కాలమ్-ఏకంతు పార్థివ**
**యది ఏషా సమయః రజన్యావత్ కాలంచ తె ధృధః**
**తావత్ కాలం తు వత్స్యామె త్వత్తః సమయ ఏషనః'**

*(హరివంశం-1-26-14,15,16)*

"రాజా! నువ్వు నగ్నంగా ఎప్పుడూ నా కళ్లలో పడకూడదు. నాకు ఇష్టమైనప్పుడే నువ్వు నాకు దగ్గరవ్వాలి. నా మంచం పక్కనే రెండు మేకలుంటాయి. అందుకు నువ్వు అభ్యంతరం చెప్పకూడదు. నేను రోజుకొకసారి నెయ్యి మాత్రమే తింటాను. ఈ నియమాలను నువ్వు అంగీకరించి అమలుచేసినంతకాలమే నీతో కాపురం ఉంటాను" అంటూ షరతులు విధించింది ఊర్వశి. అంగీకరించాడు పురూరవుడు.

పురూరవుడు చంద్రవంశపు రాజు. షట్చక్రవర్తుల్లో ఒకడు. 'ఇళా' దేవి పుత్రుడు. ఋగ్వేదం ప్రకారం సూర్యుడు, ఉషస్సులకు సంబంధీకుడు. మహాభారతం ప్రకారం ఇళ ఆయనకు తల్లీ, తండ్రి కూడా! విష్ణుపురాణం ప్రకారం బుధుడు ఆయన తండ్రి. పురూరవ వంశానికి ఆయన ఆద్యుడు. కౌరవ పాండవులు ఆ వంశీకులే! ఊర్వశి అర్జునుణ్ణి కోరినప్పుడు "నేను పురువంశం వాణ్ణి, మా మూలపురుషుడైన పురూరవుడికి నువ్వు భార్యవి. కాబట్టి నాకు తల్లి వరస నీది" అన్నాడని ఊర్వశి కోపించి అర్జునుణ్ణి పేడివైపొమ్మని శపించినట్టూ మహాభారతంలో ఉంది.

ధర్మార్థ కామాల్లో ధర్మానికే ఎక్కువ గౌరవం ఇచ్చాడని అర్థ, కామాలు రెండూ పురూరవుణ్ణి ఊర్వశికి దూరం అవుతావని శపించాయని పద్మపురాణం వ్రాసింది. పురూరవుడు అంతటి ధర్మపరుడు.

వాయుపురాణంలో చంద్రవంశం, సూర్యవంశాల మధ్య జరిగిన అనేక యుద్ధాల ప్రస్తావన ఉంది. చంద్రవంశ రాజు పురూరవుడు, అతని రాణి ఈరా. ఈమె వంశీకులే ఈనాటి ఇరాన్ ఏర్పడటానికి కారకులు. ఇర్యా లేదా ఇరాన్ అంటే ఆర్యుల భూమి అని అర్థం.

100 అశ్వమేధ యాగాలు చేసి, అనేక యుద్ధాల్లో సాయంచేసి ఇంద్రుడికి మిత్రుడయ్యాడు పురూరవుడు. అతని గౌరవార్థం దేవసభలో ఊర్వశి నృత్యకార్యక్రమం ఏర్పాటు చేశాడు ఇంద్రుడు. సరస్వతీదేవి వ్రాసిన లక్ష్మీస్వయంవరం అనే నృత్యనాటకానికి భరతముని నాట్యాన్ని కూర్చాడు. దాన్ని ఊర్వశి అభినయిస్తోంది.

పురూరవుడి మీద మోహం కొద్దీ, పురుషోత్తమా అనబోయి, పురూరవా అంది. భరతముని కోపించి ఆమెకు దేవలోక ప్రవేశాన్ని నిషేధించాడు. ఊర్వశి పురూరవుడితో భూలోకం చేరింది. ఊర్వశికి దేవలోకం గుర్తు రానంత జాగ్రత్తగా చూసుకోసాగాడు పురూరవుడు.

గంధర్వులు ఊర్వశి మేకల్ని అపహరించారు. అదిగమనించి ఊర్వశి తన మేకలు పోయాయని అరుస్తుంది. ఉలిక్కిపడి లేస్తాడు పురూరవుడు. సరిగ్గా అప్పుడే ఆ గదిలో వెలుతురు ప్రసరింపచేస్తారు గంధర్వులు. పురూరవుడు ఆసమయంలో నగ్నంగా ఉండి ఊర్వశి కళ్లలో పడ్డాడు. అంతే! షరతు ప్రకారం ఆమె అదృశ్యం అయిపోయింది. "స్త్రీలు నక్కల్లాంటి వాళ్ళు, వాళ్ళను నమ్మి స్నేహం చెయ్యకు, స్త్రీలనీ, దొంగల్నీ నమ్మకు" అని చెప్పి ఊర్వశి వెళ్ళిపోయినట్టు దేవీభాగవతంలో ఉంది.

'కేశి' అనే రాక్షసుడితో పోరాడి ఊర్వశిని తన విక్రమంతో పురూరవుడు కాపాడాడు. అందుకని ఆ ఇద్దరి ప్రేమకథని కవికులగురువు కాళిదాసు 'విక్రమోర్వశీయం' పేరుతో నాటకంగా వ్రాశాడు. పురూరవుడికీ, ఊర్వశికీ సంబంధించిన కథలు ఋగ్వేదంలోనూ విష్ణు, మత్స్య పురాణాల్లోనూ, కథాసరిత్సాగరంలోనూ, భాగవతంలోనూ ఉన్నాయి. మత్స్యపురాణ కథాక్రమాన్ని కాళిదాసు అనుసరించాడంటారు.

"ఊర్వశీ చ అబ్రవీత్ ఐలాం స-గర్భాహం త్వయా ప్రభో/సంవత్సరాత్ కుమారాహ్ తె భవిష్యంతి న సంశయః" సంవత్సరానికి ఒక రాత్రి వస్తాను. నువ్వు నాతో గడపవచ్చు. ఆ విధంగా భవిష్యత్తులో ప్రతి ఏడాదీ ఒక కుమారుణ్ణి నాద్వారా నువ్వు పొందవచ్చు" అని ఊర్వశి అన్నట్టు ఋగ్వేదం 10వ మండలం ఊర్వశీ పురూరవ సంవాదంలో ఉంది.

ఇలా ఏడాదికి ఒకసారి వస్తూ పోతూ ఒకసారి ఊర్వశి పురూరవుడితో అంది:"దేవతలు నీపట్ల చాలా గౌరవ భావంతో ఉన్నారు. దేవలోకంలో గాంధర్వులకు ఎలాంటి స్థానం ఉన్నదో నీకూ అలాంటి 'సమత'ని వరంగా ఇవ్వాలని భావిస్తున్నారు. స్వయంగా దేవలోకం వచ్చి ఆ వరం పొందు. అప్పుడు శాశ్వతంగా దేవలోకంలోనే మనం ఉండవచ్చు" అంటుంది ఊర్వశి. ఋగ్వేదం ఇక్కడ ప్రయోగించిన 'సమత' అనే మాట విశేషమైంది! ఇల్లరికానికి వెళ్ళే అల్లుడి లాంటిది పురూరవుడి పరిస్థితి. సమత ఉంటేనే అత్తారింట్లో అల్లుడికి ఆదరణ!

ఊర్వశీ పురూరవుల ప్రేమకథలో అమలినశృంగార భావన ఎక్కువగా కనిపిస్తుంది. ఆ ఇద్దరూ నిజానికి గాఢంగా ప్రేమించుకున్నారు. పురూరవుడి కోసం దేవలోకవాసాన్నే ఊర్వశి త్యాగం చేసింది. ప్రేమించటం వరకూ ఆమె ఎలాంటి షరతులూ

పెట్టుకోలేదు. ఆమె ప్రేమ నిర్మలమైంది. కానీ, అతన్ని లైంగికంగా కలిసేందుకు ఆమె చాలా నిగ్రహాన్ని పాటించింది. ప్రేమ అమలినం. అది అవధులు లేనిది. కానీ, లైంగికత మలినం. దానికి కట్టుబాట్లు అవసరం. అది బరితెగించి జరగకూడదు. స్వీయ నియంత్రణ ఉండాలి.

అందుకే, లైంగిక సుఖాన్ని స్త్రీ ఇష్టానికి వదిలేయాల్సిన అంశంగా ఆమె తన షరతుల్లో పేర్కొంది. లైంగికతను రెచ్చగొట్టే ఆహారాన్ని ఆమె వ్యతిరేకించింది. సౌమ్యతనిచ్చే నెయ్యి మాత్రమే తింటానంది. రెండు మేకల్ని పక్కనే కట్టేసుకుని పడుకుంటానంది. కాముకతకు లోనౌతే స్త్రీ తన పురుషుడికి బానిసౌతుంది. అందుకని, కట్టు తప్పితే ఏ క్షణానైనా వదిలేసి పోవటానికి ఒక అవకాశం చేతిలో అట్టేపెట్టుకుంది. ఇది కొంగున కట్టేసుకోవటానికి కాదు, మొగుడు అతను అదుపులో తాను ఉండటానికే!

ఋగ్వేదంలోని ఊర్వశీ పురూరవుల ప్రేమకథలో లైంగికత, సంతానప్రాప్తి అనే అంశాలు ఉన్నప్పటికీ, అందులోని అమలిన శృంగార భావన చాలా ముఖ్యమైన అంశం. ఋగ్వేదంలోని ఈ అమలినశృంగార నాయకి ఊర్వశిని మహాభారతం, ఇతర పురాణాలు దేవవైవేశ్యగా చిత్రించి, ఆమె ఔచిత్యాన్ని దిగజార్చాయి.

ఊర్వశి స్వచ్ఛప్రేమకు, స్త్రీ స్వేచ్ఛకు, స్వచ్ఛంద లైంగికతకు ప్రతీక. స్త్రీ ఇచ్చినపుడే పురుషుడు పుచ్చుకోవాలనే వాదానికి ఆమె ఆద్యురాలు.

# సీమస్వరాలు

*"హరుడెక్కి తిరుగాడునట్టి యాబోతు*
*నీసేద్యంబునకు ముఖ్య జంతువయ్యె*
*బలభద్రమూపున బరగు నాగేలు*
*నీ వ్యవసాయంబునకు ముఖ్యంబు గాదె*
*వైదేహి నవనికి వెలువరించిన కర్రు తగ*
*నీకు ముఖ్య సాధనము గాదె*
*కాలుండు జీవులగట్టెడి పాశంబు నరయ*
*నీకొక పరికరంబు గాదె*
*నలఘు దివ్యోపయోగమైనట్టి జంతు*
*పరికరంబులు నొగి వాడబడుటవలన*
*నీవు దివ్య సముండవై నెగడినావు*
*హాలికా! నీకు సాటిలేరవనియందు"*

కొన్ని వాస్తువులకు వాటిని వాడేవారి వలన పేరు వస్తుంది. లడ్డూ అంటే తిరుపతి వెంకన్న, ఉండ్రాళ్ళంటే వినాయకుడు గుర్తొచ్చినట్టే, గద అనంగానే భీముడు, వీరఖడ్గం అనగానే టిప్పుసుల్తాన్ వగైరా యాదికొస్తారు.

కొందరికి కొన్ని అలా హక్కుభుక్తాలౌతాయి. కందపద్యాన్ని యోగి వేమన స్వంతం చేసుకోవటం లాంటిదే ఇది. పంచె కొంగుని లాల్చీ జేబులో దూర్చి, చేతిలో చుట్ట పీకతో గుప్పున పొగవదుల్తూ విలాసంగా నిలబడే భంగిమ ఒక్క గిరీశానికే దక్కుతుంది. ఎవరి శైలి (స్టయిల్) వాళ్లది.

ఎ. వి సుబ్బారెడ్డిగారు తొలితరం రాయలసీమ జాతీయోద్యమ కవుల్లో ముఖ్యుడు. ఈ పద్యంలో ఆయన వివిధ ప్రతీకల్ని రైతు సేద్యం కోసం ఉపయోగించటాన్ని ప్రస్తావించటం ద్వారా, రైతే అధికుడని చాటుతాడు.

"శివుడెక్కి తిరిగే ఎద్దు పొలం దున్నటానికి నీకు ముఖ్య జంతువయ్యింది, బలరాముడు భుజాన మోసే నాగలి నీ వ్యవసాయానికి మూలం అయ్యింది. సీత అంటే నాగేటి చాలు. నాగలి కర్రు నేలను దున్నేప్పుడు ఏర్పడే 'చాలు' (సీత) లో దొరికింది కాబట్టి ఆమెను సీత అన్నారు. సీతను ఈ అవనికి తెచ్చిన ఈ 'కర్రు' (లోహంతో చేసిన నాగలి కొన) వ్యవసాయానికి ప్రధానం కదా! ఆఖరికి యముడి చేతిలో ఉండే పాశం కూడా నీకు 'పగ్గం'లాగా ఉపయోగపడ్తుంది. ఇలా

దివ్యోపయోగమైన పరికరాలన్నింటినీ వాడి నువ్వుకూడా దివ్య సముడివయ్యావు, రైతన్నా! నీకెవరు సాటి..." అని కీర్తిస్తున్నాడీ పద్యంలో కవి.

జోడెడ్లూ, నాగలి, దాన్ని పట్టిన రైతు బొమ్మ వ్యవసాయానికి ఆవూ-దూడ పాడి పరిశ్రమకు దివ్యప్రతీకలు.

వాటిని ఎన్నికల గుర్తుగా చేశాక అవి ప్రాధాన్యత కోల్పోయాయి. శ్రీరంగనాథుడి అభయహస్తాన్ని రాజకీయ పార్టీకి ఎన్నికల గుర్తుగా కేటాయించాక ఏమయ్యిందో చూశాం గదా! దివ్యమైన వాటిని దివ్యసములు వాడినప్పుడే వాటికి ప్రాధాన్యత, పవిత్రత, ప్రాచుర్యం కలుగుతాయి. నాగలి, నాగలి కర్రు, ఎడ్లపగ్గాల్లాంటి వ్యవసాయ పరికరాలను తమ సింబల్స్'గా వాడుకున్న దివ్యులు వాటికి ప్రతిష్టనే తెచ్చిపెట్టారు. గ్రామీణ వ్యవస్థలో పెద్దకొడుకు నాగలి పట్టుకుని పొలానికి పోయి పొలం పనులు చూస్తాడు. అందుకే, బలరాముడు హలధారుడు కాగా, చిన్నకొడుకు పశువుల్ని మేపుకొస్తాడు కాబట్టి, కృష్ణుడు గోపాలుడయ్యాడు. కూతురు పాలు పితుకుతుంది. అందుకని, ఆమెను దుహిత అన్నారు. హలం అంటే నాగలి. నాగలితో భూమిని దున్నటాన్ని హల్యం అంటారు. ద్విహల్యం, త్రిహల్యం అంటే రెండుసార్లు, మూడుసార్లు దున్నిన భూమి అని! అహల్యం అంటే రాళ్ళూ రప్పలు, తుప్పలతో నిండిన 'అసలు దున్నని నేల'. రాముడు వచ్చి వ్యవసాయాన్ని ప్రారంభిస్తే, అహల్యగా ఉన్న రాతినేల హల్యం అయ్యింది. రాతిని నాతిని చేసిన కథలో ఇలా వ్యవసాయ మూలాలు కనిపిస్తాయి.

ఏ ప్రభువు వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తాడో అతను రాముడు. ఏ ప్రభుత రైతుకు చేదోడై నిలుస్తుందో అదిరామరాజ్యం, ఏ వ్యవస్థ పంట భూములను పవిత్రంగా కాపాడుకొంటుందో అది రామాయణం. వ్యవసాయాన్ని దండగమారిగా చేసి సంక్రాంతి జరుపుకునే హక్కు మనకెక్కడుంటుందీ...?

ఎ. వి సుబ్బారెడ్డి గారు "హాలికుడు" మకుటంతో వ్రాసిన ఖండకృతిలోది పైన పేర్కొన్నఈ పద్యం. 1934 సెప్టెంబరు 8 సంచికలో 'శ్రీ సాధన పత్రిక'లో దీన్ని ప్రచురించారు. 'సీమ సాహితీ స్వరం-శ్రీ సాధన' పేరుతో 'సాధన' సంచికల్లోని విశేషాలను డా అప్పిరెడ్డి హరినాథరెడ్డి ఒక పుస్తకంగా వెలువరించారు. సీమసాహితీ స్వరాలను స్వంత డబ్బు ఖర్చుపెట్టి ఇలా వెలుగులోకి తేవటానికి సిద్ధపడిన యువమిత్రుడు హరినాథరెడ్డికి జేజేలు. ఈ తరం యువతీ యువకుల్లో ఇలాంటి నిబద్ధత అరుదు.

రాయలసీమ ప్రాంతంలో 'శ్రీ సాధన' పత్రిక ద్వారా పప్పూరు రామాచార్యులు గారు, కోస్తాజిల్లాల్లో 'కృష్ణాపత్రిక' ద్వారా ముట్నూరు కృష్ణారావుగారూ జాతీయోద్యమం కోసం చేసిన కృషి అనన్య సామాన్యం. ఆ మహానుభావులు నిలిపిన సాహిత్య సంపదకు మనం వారసులం.

# సూర్యసిద్ధాంతకర్త దీర్ఘతముడు

*"అస్య వామస్య పలితస్య హోతుస్తస్య భ్రాతా మధ్యమో అస్త్యశ్నః ।*
*తృతీయో భ్రాతా ఘృతపృష్ఠో అస్యాత్రాపశ్యం విశ్పతిం సప్తపుత్రమ్ ॥*
*సప్త యుఞ్జన్తి రథమేకచక్రమేకో అశ్వో వహతి సప్తనామా ।*
*త్రినాభి చక్రమజరమనర్వం యత్రేమా విశ్వా భువనాధి తస్థుః ॥*

*(ఋగ్వేదము - మండలము 1 - సూక్తము 164,*
*అధర్వణవేదము - కాండము 9 - సూక్తము 9)*

ఋగ్వేదంలో "అస్య వామస్య పలితస్య హోతుస్తస్య భ్రాతా" అనే ఈ ఋక్కుతో మొదలయ్యే సూక్తం చాలా ప్రసిద్ధి చెందింది. సూర్యుడి ప్రాధాన్యత, సౌరకుటుంబంలో భూమి ఒకటిగా ఉండటం, ఈ భూమ్మీద వృక్ష జంతుజాలాలు అవతరించటం, చివరిగా మానవుడి ఉనికిని చాటే 52 ఋక్కులు ఈ సూక్తంలో ఉన్నాయి.

సాధన, శోధనల ద్వారా నిగ్గుతేలిన సత్యాలే శాస్త్రాలుగా నిలుస్తాయి. ఆనాటి మహర్షులు, వారూ ఋషితుల్యులే... అనేక శాస్త్రవిషయాలను దర్శించేందుకు చేసిన ప్రయత్నాల సంపుటీకరణాలు వేదాలు. వ్యాసుడు వాటిని సంకలనం చేశాడు. నశించినపోయినవి పోగా ఉన్నవాటిని ఒకచోట చేర్చాడు.

దీర్ఘతమోమహర్షి తాను దర్శించిన సౌర కుటుంబ వ్యవస్థను, పాలపుంతలోని అనేక సూర్యుల కూటమినితన ఋక్కులలో కవితాత్మకంగా చెప్పుకున్నాడు. ఋగ్వేద కాలంలో ఋషులు అనుసరించిన విధానం అదే! ఋషి కానివాడు కావ్యం వ్రాయలేడు. ఋక్కులు అసలే వ్రాయలేడు.

"అస్య వామస్య పలితస్య హోతు" అంటే పూజనీయుడైన, తెల్లని స్వచ్ఛమైన వాడైన జగత్పాలకుడు సూర్యుడు అని! సౌరకుటుంబంలో సూర్యుడు పెద్దన్న! రెండవ సోదరుడు వాయువు. మూడవ సోదరుడు అగ్ని. ఈ ముగ్గురూ ఆహుతులు అందుకొంటున్నారు. తన సోదరులు అగ్ని వాయువుల మధ్య ఏడు కిరణాలతో సూర్యుడు లోకానికి దర్శనం ఇస్తున్నాడు. వీళ్ళంతా అదితి పుత్రులే! వీరిది ఒకే కుటుంబం. అదే సౌర కుటుంబం.

సూర్యుడిది ఏకచక్ర రథం. దానికి ఏడు గుఱ్ఱాలు పూన్చి ఉన్నాయి. ఒకే గుఱ్ఱం ఏడు పేర్లతో లాగుతోంది. చక్రానికి మూడు నాభులు ఉన్నాయి. అవి శిథిలంకానంత దృఢమైనవి. సర్వలోకాలూ వాటినే వానినే ఆశ్రయించి ఉన్నాయి. ఏడుగురు అక్కచెల్లెళ్ళు ఈ రథం ముందు నడుస్తున్నారు. ఇందులో ఏడు గోవులు లేక కిరణాలు లేక స్వరాలు ఉన్నాయి. వేగవంతుడు, అందగాడైన ఆదిత్యుడి స్వరూపం అతి

నిగూఢం. అతని కిరణాలు పాలుపితుకుతాయి. అంటే తెల్లని కాంతిధారల్ని ప్రసరిస్తాయి. అవి తేజః స్వరూపాలు.

"కోదదర్శ ప్రథమం జాయమానం" మొట్టమొదటగా పుట్టిన ప్రాణిని ఎవడు చూశాడు? అది అస్థిరహితం. అంటే వెన్నెముక లేనిది. వాటికి ఎముకలు ఎప్పుడు కలిగాయి? ఎప్పుడు ఈ భూమి నుండి ప్రాణం, రక్తం పుట్టాయి? ఆత్మలు ఎక్కడి నుంచి పుట్టాయి? ఈ జిజ్ఞాస తీరటానికి ఎవ్వరి దగ్గరకు ఎవరు వెడతారు....?" ఇలా ప్రశ్నిస్తూ సాగుతుందీ సూక్తం.

"ఇవి సందిగ్ధాలు, దేవరహస్యాలు. ఒక సంవత్సరపు సూర్యుడి కోసం ఏడు సోమయజ్ఞాలు చేసిందెవరు? ఆరు లోకాల్ని నిలిపి ఉంచిందెవరు? జన్మరాహిత్యాన జీవించే జీవుడెవ్వడు?

'ద్యులోకం'లో ఉన్న సూర్యుణ్ణి భూమాత పూజించింది. సూర్యుడు తండ్రి. భూమి తల్లి! వారిద్దరి సంగమంతో భూమాత గర్భం ధరించి రసాలను దాల్చింది. వారిద్దరు సస్యాల్ని ఫలింప చేయటం గురించి మాట్లాడుకొంటున్నారు. ఆమె గర్భంలో జలాలను దాల్చిన మేఘం ఉంది. వర్షజలం కురిసింది. మేఘవాయు కిరణ సంయోగం భూమిని సస్యశ్యామలం చేసింది... ఇలా సౌరకుటుంబవ్యవస్థ గురించి వివరించటానికి దీర్ఘతముడు ప్రయత్నించాడు.

భూమి, ఆకాశం, అంతరిక్షం ముగ్గుర్నీ తల్లులన్నాడు. అగ్ని, వాయువు, సూర్యుడు ముగ్గుర్నీ తండ్రులన్నాడు. ఆదిత్యుడు ఆ తలిదండ్రులతో ఊర్ధ్వాన ఉన్నాడని పేర్కొన్నాడు.

"సత్యాత్మకమైన ఆదిత్యుడి పన్నెండు ఆకుల చక్రం స్వర్గం చుట్టూ భ్రమిస్తుంటుంది. (తిరుగుతుంటుంది) ఆ చక్రంలో అగ్ని 360 పగళ్లు, 360 రాత్రుల రూపంలో 720గా ఉంటుంది...." అంటాడు.

ఋతువులు, మాసాల విభాగాల గురించి వివరిస్తాడు. ఋతువుల ఆకు చక్రంలో భువనాలన్నీ ఇమిడి ఉన్నా యన్నాడు. సమానమైన అంచులు కలిగిన కాలచక్రం శిథిలం ఎరుగనిది, అది నిరంతరం పరిభ్రమిస్తూనే ఉంటుందన్నాడు. ఈ సూక్తం లోనే "ద్వాసపర్ణా సయుజాసఖాయా" అనే ప్రసిద్ధ ఋక్కుని ఉదహరించాడు. జీవాత్మ, పరమాత్మలనే రెండు పక్షులు ఒకే దేహంలో లేదా ఒకే రావి చెట్టుమీద నివసిస్తుంటాయి. జీవాత్మ దాని ఫలాల్నిఆరగిస్తుంది. పరమాత్మ దేన్నీ అనుభవించ కుండా ద్రష్టమాత్రంగా ఉంటాడు" అన్నాడు.

సూర్యుడు ఎలా ఉంటాడో, వెలుతురు ఎలా ఉంటుందో, వాన ఎలా కురుస్తుందో కంటితో చూసి ఎరగని జన్మతః అంధుడు దీర్ఘతమసుడు అనేక వేల సంవత్సరాల క్రితమే, ప్రపంచంలోనే తొలిసారిగా సూర్యసిద్ధాంతాన్ని ప్రతిపాదించిన తీరు ఆశ్చర్యం కలిగిస్తుంది.

దీర్ఘతమ లేదా దీర్గతమస మహర్షి గొప్ప పరిశోధకుడు. ఆయన అంధుడు కావటంవల్ల ఆయనకు 'దీర్ఘతముడు' (చిరకాలం చీకటిలో ఉండేవాడు) అనే పేరు వచ్చింది. ఆయన సూర్యుడు తదితర గ్రహాల మీద పరిశోధనల కోసం వెలుగును అతిగా చూసి చూపు పోగొట్టుకున్నాడని కొందరంటారు.

దీర్ఘతముడికి వివిధ భార్యల ద్వారా జన్మించిన కుమారులలో అంగ, వంగ, కళింగ, ఆంధ్రులు ఉన్నారనే కథ కూడా ఉంది. ఆంధ్రులకు అది గర్వకారణమే! 'దీర్ఘతమస' గోత్రంకూడా ఉంది. తెలుగువారు, కాళింగులు కూడా దీర్ఘతమోమహర్షి వారసులనటం గర్వకారణమైన విషయమే!

దీర్ఘతమసుడు అంగీరస ఋషిపరంపరకు చెందినవాడు. ఆంగిరసునికి తొమ్మిదిమంది కుమారులు, ఎనిమిదిమంది కుమార్తెలు. బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మానస, బృహస్పతి, సమావర్తన, ఉతథ్య, బృహన్మంత, బృహద్భాను వీళ్లంతా కుమారులు కాగా, రాకా, సినీవాలి, కుహూ, అర్చిష్మతి, మహిష్మతి, మహామతి, యోగసిద్ధి వీళ్ళు కుమార్తెలు. వీరిలో ఉతథ్యుని కుమారుడు దీర్ఘతమసుడు. కక్షివంతుడు, గోతముడు, నోధస్సుడు, వామదేవుడు లాంటి ప్రసిద్ధ ఋషులు ఈయన సమకాలికులు! ఋగ్వేదంలో ప్రసిద్ధి చెందిన చక్రవర్తి భరతుడికి ఈయన పురోహితుడు.

దీర్ఘతమసుడి చరిత్ర చాలా విచిత్రమైంది. ఉచితానుచితాల విచికిత్సలోంచి పుట్టాడు దీర్ఘతమసుడు. తన తల్లి గర్భాన ఉన్నప్పుడే వేదాలను గ్రహించిన మేధావిగా ఆయన గురించి ఋగ్వేదంలోనే కథలున్నాయి. అతని బాబాయి బృహస్పతి వలన అతని తల్లి మమత అత్యాచారానికి గురౌతుంది. అది కూడదని గర్భస్థ శిశువుగా ఉన్న దీర్ఘతమసుడు అన్నందుకు బృహస్పతి శాపానికి గురై అంధుడిగా పుట్టినట్టు ఒక ఐతిహ్యం ప్రచారంలో ఉంది.

అతని జీవితం అంతా అవమానాలతోనే సాగుతుంది. భార్య ప్రద్వేషిణి అతన్ని ఈసడించి:

పతియు భరియించుఁ గావున భర్తయయ్యె ! భామ భరియింపఁబడుఁగాన భార్య యయ్యెఁ
బరఁగ నవి మనయందు వీడ్వడియె నిన్ను! నేన యెల్లకాలము భరియింతు గాన. (ఆంధ్ర మహాభారతం1-4-228)

భార్యను భరిస్తాడు కాబట్టి మగడిని 'భర్త' అంటారు. భర్తచేత భరింపదగింది కాబట్టి ఇల్లాలిని 'భార్య' అంటారు. కానీ, నేను ఎల్లకాలం నిన్ను భరించాల్సి వస్తోంది అని ఈసడించిందట. ఆమె కొడుకులు కాళ్ళూ చేతులూ కట్టేసి అతన్ని నదిలో పారేస్తారు. ఈ కథని బట్టి, ఈయన పుట్టి అంధుడు కాకపోవచ్చుని, సూర్యుడి

మీద పరిశోధనల్లో పడి కళ్ళు పోగొట్టుకున్నాడనే వాదన నమ్మశక్యంగా కనిపిస్తుంది.

ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న దీర్ఘతముణ్ణి బలి అనే రాజు రక్షిస్తాడు. తన రాజ్యానికి తీసుకుపోయి సత్కరిస్తాడు. ఆయనకు సంతానం లేకపోవడం వల్ల తన భార్య సుధేష్ణకు "మీ ద్వారా ఉత్తమ సంతానం కలిగేట్లు చేయం"డని కోర్తాడు. కానీ, సుధేష్ణ తన దాసిని పంపుతుంది. ఆ తరువాత దీర్ఘతముడు రాజుతో ఈ రాజ్యాన్ని దాసీ పుత్రులు ఏలగలరని చెప్తాడు. రాజు తన భార్యకి నచ్చచెప్పి మళ్ళీ పంపుతాడు. ఆ విధంగా సుధేష్ణ ద్వారా దేవరన్యాయం ప్రకారం అంగరాజు అనే పుత్రుడు కలుగుతాడు.

మహాభారతంలో ఇదే కథ పునరావృతం అవుతుంది. సత్యవతి అంబ, అంబాలికల్ని వ్యాసుడి దగ్గరకు పంపటానికి ఈ దీర్ఘతముడి కథచెప్పి, ఇది దేవర న్యాయం అనీ, సత్సాంప్రదాయమేననీ నచ్చచెప్తుంది.

ఈ కథకు ఓ కొసమెరుపు ఉంది.

పతిహీనలయిన భామిను ! లతిధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలం
కృత లయ్యెదు మాంగల్యర ! హిత లయ్యెదుఁ గృపణవృత్తి నిదియు మొదలుగన్.
(ఆంధ్ర మహాభారతం1-4-230)

భర్తని వదిలేసిన భార్య ఎంతటి ధనవంతురాలైనా, ఉత్తమకులంలో పుట్టిందైనా ఇప్పటినుండి దయనీయంగా అలంకారాలు, తాళిబొట్టు లేనివారుగా అయ్యెదరు గాక ! అని శపించాడట. ఇది దీర్ఘతముడు ఇచ్చిన శాపం.

ఆయన జీవిత చరిత్రని అలా ఉంచితే, "అస్య వామస్య పలితస్య హోతు" అంటూ మొదలయ్యే ఈ సూక్తాన్ని మేధావులు తప్పకుండా చదవాలి. ఇది అనేక ఆలోచనల్ని మనలో కలిగిస్తుంది. సృష్టికి మూలాలను వెదికిన తొలి శాస్త్రవేత్తల ప్రయాస అర్థం అవుతుంది.

# స్వదస్తూరీతో విధివ్రాత

*నీరము తప్త లోహమున నిల్చి యనామకమై నశించు, నా*
*నీరమె ముత్యమట్లు నళినీదళ సంస్థితమై తనర్చు, నా*
*నీరమె శుక్తిలో బడి మణిత్వము గాంచు సమంచిత ప్రభం,*
*బౌరుష వృత్తు లిట్లధము, మధ్యము, నుత్తము గొల్చు వారికిన్*

(భర్తృహరి సుభాషితాలు సుభాషితరత్నావళి, ఏనుగు లక్ష్మణకవి)

'సుభాషిత త్రిశతి' అనే సంస్కృత లఘుకావ్యంలో భర్తృహరి నిత్య జీవితంలోని సంఘటనలతో పోల్చి మనసుకు హత్తుకునేలా 300 సుభాషితాలు వ్రాశాడు. వీటిని ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన, ఏనుగు లక్ష్మణ కవి ప్రభృతులు తెలుగులోకి అనువాద రచనలు చేశారు. వీటిలో 1797 నాటి ఏనుగు లక్ష్మణ కవిగారి అనువాదం ప్రసిద్ధం. పైన చెప్పిన పద్యం ఈ లక్ష్మణకవిగారిదే! లక్ష్మణ కవి గారి అనువాదపద్ధతి సరళంగా ఉంటుంది. మనసు పెట్టి చదివితే టికా తాత్పర్యాల అవసరం లేకుండానే అర్థం అవుతుంది.

కాలే ఇనుప పెనం మీద నీళ్ళు పడితే చురచురమంటూ వేడికి ఆహుతై పోతాయి. అవే నీళ్ళు తామరాకు మీదపడ్డప్పుడు ముత్యాల్లా తళతళమంటాయి. ముత్యాల చిప్పలో పడితే మణికాంతులతో మెరుస్తాయి. ఎక్కడ విధి చేస్తున్నామో అక్కడ మన పరిస్థితిని బట్టి మన జీవితం ఆధారపడి ఉంటుంది. ఒకే ప్రతిభ కలిగిన వ్యక్తులు వివిధ వృత్తి వ్యాపకాల్లో వివిధ రకాలుగా రాణిస్తున్నారు. ప్రతిభ ఒక్కటే చాలదు, నిర్వహించే విధిని బట్టి, ఆ స్థావరాన్ని బట్టీ ఉత్తమ మధ్యమ అధమ స్థాయిల్లో ప్రతిభకు రాణింపు ఉంటుంది. గొప్ప ప్రతిభా వంతులు కూడా విధి అనే అగ్నికి ఆహుతై పోతుంటారు. సెంటర్లో రద్దీగా ఉండే షాపులో జరిగే వ్యాపారం, ఊరు శివార్లలో షాపుకు ఉండదు. అది వాడి విధి, ఇది వీడి విధి.

విధి అంటే డ్యూటీ! ఒక నాటకంలో రాముడు వేషం వేసిన నటుడే ఇంకో నాటకంలో బంటు వేషం వేస్తాడు. దేని ప్రాముఖ్యత దానిదే! విధి అంటే అది. విధికి వేదాంతపరమైన అర్థమే కాదు, సామాజికమైన అర్థాన్ని చెప్పుకోగలగాలి! అదృష్టాన్ని బట్టి విధి ఉండదు. స్వదస్తూరీతో మనకు మనమే వ్రాసుకునే. విధిని నిర్వహిస్తున్నాం.

ఎవరి విధి వాళ్లది. కుక్క విధి కుక్క చేయాలి. గాడిద విధి గాడిద చేయాలి. కుక్క విధిలో కూడా దాని స్థావరాన్ని బట్టి మార్పు లుంటాయి. పెంపుడు కుక్క విధి నిర్వహిస్తున్నప్పుడు చంకనెక్కి, పన్నీటి స్నానాలాడి, విందారగిస్తుంటుంది. ఊరకుక్క విధి నిర్వహిస్తున్నప్పుడు చెత్తకుండీ దగ్గర కారట్లాడుతుంది. పోలీసు కుక్కగా

పనిచేస్తున్నప్పుడు నేరపరిశోధనలో సహకరిస్తూ ఉంటుంది. ఏదైనా దాని విధిని బట్టే దాని ప్రతిభ వెలుగులోకి వస్తుంది. అంతా "విధిరాత" అని, అది విధాత (బ్రహ్మ) వ్రాశాడనీ మనం అనుకుంటాం గానీ, మన విధిని చాలా వరకూ మనమే వ్రాసుకుంటూ ఉంటాం.

కొందరు తెలివి తేటలతో ఉన్నత స్థితికి వెడతారు. కొందరు ఏ తెలివీ లేకపోయినా రాణిస్తారు. కొందరు అద్భుతమైన మేధావులు కూడా చేసేది లేక దిక్కు తోచక విధి అనే అగ్నికి ఆహుతైపోతారు. జీవితం ఇంతే! ఏనుగు వచ్చి మెళ్ళో దండవేసి రాజును చెయ్యాలంటే అన్ని వేళలా అందరికీ అయ్యే పని కాదు. అందరికీ ఇన్'కం టాక్సు, కమర్షియల్ టాక్సు శాఖల్లో ఉద్యోగాలు రమ్మంటే రావు, చదువుకుని కూడా రిక్షాలు, ఆటోలు, టాక్సీలూ తోలుతున్న వాళ్ళున్నారు. ఏ వృత్తిలో ఉన్నా ఎవరి విధి వాళ్లది. విధిని బట్టే రాణింపు ఉంటుంది.

రోజులు మారిపోతుంటాయి. రాజులు మారిపోతుంటారు. ఒకప్పుడు కుక్క ముఖం చూస్తే మహా పాతకాలు చుట్టుకుంటాయనే వారు. ఎలుకల బాధా నివారణార్థం పిల్లులు పెంచుకునే వారు. పిల్లిని చంపితే వెయ్యి గుళ్ళు కట్టించినా ఆ పాపం పోదనే వారు. అంత ఇష్టంగా పిల్లుల్ని పాలు పోసి పెంచుకునేవాళ్ళు. ఇప్పుడు బుజ్జి కుక్కపిల్లలకు గిరాకీ ఎక్కువ. వేలు పోసి కొంటున్నారు. చివరికి పిల్లిది ఊరకుక్క బతుకే అయ్యింది. విధి అంటే ఇదే! దేశకాలమాన పరిస్థితులు విధుల్ని ప్రభావితం చేస్తుంటాయి. అందులో మనమూ భాగమే!

కన్యాశుల్కం రోజుల్లో రెవిన్యూ శాఖలో గుమాస్తా అయితే చాలు, డిప్టీ కలెకటేరు అయినంత గొప్ప! ఇప్పుడు తల్లిదండ్రులు "మా వాడు సాఫ్ట్'వేర్" అని ఘనంగా చెప్పుకుంటున్నారు. ఒక నాటికి మా వాడు రచయిత అండీ, కవి అండీ అని ఘనంగా చెప్పుకునే రోజులు రావచ్చు. శ్రీనాథుడు, పెద్దన లాంటివారికి అంతటి గౌరవం దక్కిందంటే, వాళ్ల విధికి రాజాశ్రయం తోడవటమే కారణం. పెద్దన కత్తి పట్టి యుద్ధంలో పాల్గొన్నవాడే! శ్రీనాథుడు నాగలి పట్టి వ్యవసాయం చేసినవాడే. విధులు బాగా ఉన్నంత కాలం మన 'హవా' నడుస్తుంది.

వ్యవసాయం అనే విధిని తనకు తానే వ్రాసుకున్న శ్రీనాథుడు కృష్ణా నదికి వరదలొచ్చి, పండిన పంటంతా కొట్టుకుపోతే, 'బొడ్డుపల్లిలో గొడ్డేరి మోసిపోతి'నని వాపోయాడు. బహుశా వ్యవసాయం కారణంగా దుర్మరణం పొందిన తొలి రైతు శ్రీనాథుడే కావచ్చు.

శ్రీనాథుడికి కనకాభిషేకం చేసిన రాజు మారిపోయి, కొత్త రాజొచ్చాడు. వరదలొస్తే నాకేంటి, పన్ను కట్టాల్సిందే నన్నాడు కొత్తరాజు. కట్టలేకపోయాడు శ్రీనాథుడు.

ముత్యపు చిప్పలో నీటి చుక్క లాగా. తామరాకు మీద నీటి బొట్టులాగా ప్రకాశించిన శ్రీనాథుణ్ణి చివరికి కొరత వేశారు. కాలే ఇనుము మీద పడి ఆవిరైపోయా డాయన. తన విధే తనను కబళిస్తుంటుంది ఒక్కోసారి!

# క్షేత్రయ్య గారి పర్యావరణ కవిత

*ప:  లలనామణిరో ఈ భావము తెలుపవే లలితముగానిపుడు*
*అ.ప.  వెలదిరో మా మువ్వ గోపాలుని దయచేత వేడుకగా దెలుపవే ఓ బాల!*
*చ: అలివేణి నీ దేశమేమంటేను అపుడు చెట్టు చూపెను*
*చెలి నీ యూరి పేరేమని యడిగితే చెట్లు రెండు చూపెను*
*చిలుకల కొలికి నీ చెలుల పేరేమంటేను చెట్లు రెండు చూపెను*
*పలుమారు నీ జాతి పేరేమని యడిగితే వదరి చెట్టే చూపెనే ఓ బాల :లలనా:*
*చ. నక్షత్ర నఖ నీకు హితమేమని అడిగితే పక్షి హితవని అనెను*
*లక్షణవతి నీదు చెక్కిట నేమంటె పక్షి యున్నదనెను*
*వక్షస్థలాన ఉన్నది యేమంటే పక్షి యున్నదనెను*
*సూక్ష్మముగ నీ పేరేమని యడిగితే పక్షి పేరే చెప్పెనే ఓ బాల... :లలనా:*
*చ.  వారిజానన నీకు యెన్నేండ్లాయెనంటే ఊరి పేనే చూపెను*
*చేరి నీ తోడబుట్టువు లెవరంటే ఊరి పేనే చెప్పెను*
*తీరుగా మెరసెదు మేలుంగర మేమంటే ఊరి పేరే చూపెను*
*ఓ రమణి నీ మోముందున్నది యేమంటే ఊరిపేరే చెప్పెనే ఓ బాల..." :లలనా:*

ఇది మహాకవి క్షేత్రయ్య పదాలలోదొరికిన ఒక అపురూప పర్యావరణ కవిత. ఈ పాటలో దాగిన రహస్యం గురించీ పెద్దగా చర్చ జరగలేదు. ఇదంతా పొడుపు కథ పద్ధతిలో సంకేత్మకంగా సాగుతుంది.

క్షేత్రయ్యను బూతు కవితలు వ్రాశాడని ఆయన స్వంత ఊరు కృష్ణాజిల్లా మొవ్వ నుండి గ్రామస్థులంతా వెళ్ళగొట్టారని చాలామంది వ్రాశారు. కానీ, క్షేత్రయ్యకి జన్మభూమంటే ఎంత ప్రేమో ఈ పాట చాటి చెప్తుంది. క్షేత్రయ్య సృష్టించిన మువ్వగోపాలుడి నాయిక 'రతిమతి' కాదు, 'ప్రకృతికాంత' అని చెప్తోందీ పాట. తన దేశం చెట్టు, తన ఊరు చెట్టు, తన ఊపిరి చెట్టు, తన మనుషులు చెట్టు, అసలు తన జాతే చెట్టు అని గర్వంగా చెప్పుకుంటోంది ఆ మువ్వగోపాలుడి నాయిక... తన ఇష్టం, తన కష్టం, తన మనసు అన్నీ ఆ పక్షిలాంటి వంటోంది. తన ఊరు తనలా యవ్వనంతో కళకళ లాడుతుందనీ, తన ఊళ్ళో అంతా అక్కచెల్లెళ్ళలా కలిసి మెలిసి ఉంటారని, తన ఊరు తన మోమంత అందమైందనీ, మెరిసే మేలుంగరం లాంటిదనీ చెప్పుకుంటోంది. ఇంతకన్నా పర్యావరణ కవిత ఇంకోటి కన్పించదు.

ఆరుద్రగారు "మువ్వ" శబ్దం 'మొవ్వ' ఎలా అయ్యిందీ అని ప్రశ్నిస్తూ, క్షేత్రయ్య

పుట్టిన ప్రాంతం మీద అనేక సందేహాలు వెలిబుచ్చాడు, క్షేత్రయ్య చెంజి లేదా జింజి ప్రాంతానికి చెందినవాడు కావచ్చని, కృష్ణాజిల్లావాడు కాకపోవచ్చనీ వ్రాశాడు. ఎక్కడ పుట్టినా ఈ తెలుగుబిడ్డ తెలుగు నేల నాలుగు చెరగులా విఖ్యాతిని పొందాడు.

అన్నమయ్య పదాలు భక్తి ప్రధానంగా సాగితే, క్షేత్రయ్య పదాలు మధుర భక్తి ప్రధానంగా సాగాయి. భగవంతుడు ఒక్కడే పురుషుడు. మిగతా వాళ్ళంతా స్త్రీలే. భక్తుడు ఇలా స్త్రీ భావనతో, ప్రేయసి భావనతో భగవంతుణ్ని ఆరాధించడమే మధురభక్తి! జీవాత్మ, పరమాత్మలో విలీనమయ్యే భావనా సాహిత్యమే ఈ మధుర భక్తిలో ఉంటుంది. మీరాబాయి కృష్ణుడి ప్రియురాలిగా తనను తాను భావించుకుని వ్రాసినట్టే క్షేత్రయ్య కూడా తననే నాయికగా చేసుకుని ఆ పరమాత్ముడితో సంయోగాన్ని వర్ణించుకున్నాడు. "ఏమిర వరద! నీ మోము చిన్నబోయినది-నా మనసు నీ మనసు ప్రేమనిండి యుండగ" "నీవే వచ్చితివి-నేను వచ్చినట్ల-భావముఁ దెలిసి మువ్వ గోపాల! నేడు మాయింటికి" లాంటి పదాలు ఈ అభిప్రాయానికి చక్కని సాక్ష్యాలు.

తిరుపతి, కడప, శ్రీశైలం కంచి, శ్రీరంగం, మధుర, తిరువళ్ళూరు, పాలగిరి చెన్నకేశవుడు, ఇనగలూరు ఇనపురి స్వామి, గుంటూరు జిల్లా బెల్లంకొండలో చలుపు చక్కరపురీశుడు, శ్రీశైలం మల్లికార్జునుడు, హంపి హేమాద్రి నిలయుడు, కడప వెంకటేశ్వర స్వామి ఇందరినీ దర్శించి వాళ్ళపై పదాలు వ్రాశారు. భద్రాచలం రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న క్షేత్రయ్యను భద్రాచలానికి స్వాగతించి సత్కరించి పంపాడు. "కంచివరదా!" అంటూ మువ్వగోపాలునితో పాటు వరదరాజస్వామిని "చెల్లబో! పాలగిరి చెన్నుడే వీఁడుకొమ్మా?" అని పాలగిరి చెన్నుణ్ణీ, తిల్ల గోవిందస్వామి అంటూ, చిదంబరం గోవిందస్వామిని, ఇంకా చాలామంది దేవుళ్లని నాయకుడిగా భావించి పదాలు వ్రాశాడు. వివిధరాజుల దగ్గరకు వెళ్ళినప్పుడు "భామరో! తిరువళ్ళూరి వీరరాఘవ!" ఇలా ఆ రాజుల రూపంలో పరమాత్మని ఊహించి పదాలు వ్రాశాడు . రాజులు ఆయన్ని తమ సంస్థానాలకు ఆహ్వానించి సత్కారాలు చేయటానికి ఇది కూడా ఒక కారణం కావచ్చు.

క్షేత్రయ్య పదాల్ని కేవల శృంగార పదాలుగా భావించటం వలన వాటిలో ప్రతీపదానికీ సహజంగానే నీచశృంగారమే కనిపిస్తుంది. అది జుగుప్సని కలిగిస్తుంది కూడా! అందుకే, నృత్య కళాకారులే క్షేత్రయ్యను బ్రతికించుకుంటూ వచ్చారు.

అన్నమయ్య కూడా శృంగార పదాలు వ్రాశారు. అలివేలుమంగ, శ్రీ వేంకటేశ్వరునికి సంబంధించిన వియోగ సంయోగ శృంగారాలే! అయినా, క్షేత్రయ్య పైన వచ్చినంత చెడ్డ విమర్శ అన్నమయ్యపై రాలేదని కొందరంటారు. 1950లలో వేటూరి ప్రభాకరశాస్త్రి అన్నమయ్య రచనల్ని వెలుగులోకి తెచ్చేవరకూ 400

యేళ్ళపాటు ఆయన గురించి ఎవరికీ తెలీదు. అన్నమయ్య శృంగార పదాల మీద విమర్శ రాక పోవటానికి ఇదొక కారణం.

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య (1595-1660). ఇంటిపేరు మొవ్వ అంటారు. క్షేత్రం అంటే ఒక ప్రదేశం. వివిధ ప్రదేశాలు తిరిగాడు కాబట్టి క్షేత్రయ్య అయ్యాడని కొందరు, క్షేత్రం అంటే ఆత్మ కాబట్టి ఆత్మజ్ఞాన సిద్ధుడిగా క్షేత్రయ్య అనే పేరు వచ్చిందని మరికొందరూ భావిస్తున్నారు.

శ్రీపాద పినాకపాణిగారు నాట్యోపయోగకరమైన క్షేత్రయ్య పదాలకు స్వరాలు కట్టి, సంగీతానికి పనికివచ్చే విధంగా వ్రాశారు. ఇప్పుడు సంగీత కచ్చేరీల్లో కూడా క్షేత్రయ్య పదాలు వినిపిస్తున్నాయి.

తంజావూరు విజయరాఘవ నాయకుడు తననుతాను రాసలీలా కృష్ణుడిగా ఊహించుకుని తన వెయ్యిమంది రాణుల్నీ ఒకేసారి రప్పించి వాళ్ళతో కృష్ణుడిలానే రాసలీలలు నిర్వహించాడని రంగాజమ్మ వ్రాసింది. క్షేత్రయ్య జీవించిన యుగం అలాంటిది. క్షేత్రయ్య కవిత్వాన్ని కూడా ఆ గాటనే కట్టారు పండితులు. క్షేత్రయ్య మధుర భక్తి శృంగార పరమైన పదాల పరంపరలో దొరికిన వాటిలో ఈ పర్యావరణ కవిత ఉండటమే గొప్ప విషయం.

# భాషా శ్రామికుడు డా॥జి.వి. పూర్ణచందు

శ్రీ వాడ్రేవు సుందరరావు



డా॥ జి.వి. పూర్ణచందు తెలుగు భాషా ప్రేమికులలో గొప్పవాడు. తెలుగు భాషను మనసారా ప్రేమించి, తెలుగుతనాన్ని హృదయంతో గౌరవించి, తెలుగు చరిత్రను ఆత్మలో నింపుకొని, తెలుగు మాటకు అంజలి ఘటించి, తెలుగు భాషా సాహిత్య వికాసాభ్యుదయాలకు తన క్రియాశీలతను సర్వాత్మనా సమర్పించి తెలుగు వెలుగును విశ్వవ్యాప్తం చేయడానికి అహర్నిశలూ శ్రమిస్తూ, ఆ మహా ప్రయత్నానికి రచయితగా, కవిగా, కాలమిస్టుగా, ప్రచురణ కర్తగా, పరిశీలకుడిగా, సంపాదకుడిగా, వక్తగా, వ్యాఖ్యాతగా, నిర్వాహకుడిగా, నిర్ణాయకుడిగా త్రికరణశుద్ధిగా గత నాలుగు దశాబ్దాలుగా అంకితమైన వర్తమానపు గొప్ప తెలుగు భాషా ప్రేమికుడే డాబబజి.వి.పూర్ణచందు. ప్రాచీన పాశ్చాత్య ఖండాలలో తెలుగు జెండా రెపరెపలాడడానికి కారకులైన కొద్దిమంది మాన్యమహోదయులలో అగ్రశ్రేణికి చెందిన, తెలుగు భాషా ప్రేమికుడు డా॥ జి.వి.పూర్ణచందు.

వృత్తిరీత్యా ఆయుర్వేద వైద్యుడని. ప్రవృత్తిరీత్యా తెలుగు భాషా ప్రేమికుడాయన. అనాదినుండీ ఎందరో సాహితీమూర్తుల సస్యకేదారంగా విలసిల్లిన కృష్ణాతీరమే పూర్ణచందు జన్మభూమి.

కృష్ణా జిల్లాలో విజయవాడ సమీపంలోని కంకిపాడులో 1957వ సంవత్సరం ఏప్రిల్ 23వ తేదీన జన్మించిన పూర్ణచందుకు ఇది షష్టిపూర్తి సంవత్సరం. ఆయుర్వేద వైద్యుడిగా, తెలుగు భాషా శ్రామికుడిగా అహర్నిశలూ శ్రమిస్తున్న, మహోన్నత భాషా ప్రేమికుడికి వైభవంగా తెలుగువారు షష్టిపూర్తి జరపవలసిన దివ్యఘట్టం ఇది.

జి.వి.జి.కె. చంద్ర మౌళేశ్వరరావు, శ్రీమతి సత్యప్రసన్నల సంతానమైన పూర్ణచందు, నాగార్జునా విశ్వవిద్యాలయ పరిధిలోని విజయవాడ ప్రభుత్వ ఆయుర్వేద వైద్య కళాశాలలో బి.ఏ.ఎమ్.ఎస్. చదువుకొని, గత నలభై అయిదేళ్ళుగా విజయవాడలోనే ప్రజలకు ఆయుర్వేద వైద్యాన్ని అందిస్తూ దేశీయ వైద్య విధానానికి మంచి నమ్మకాన్ని కలిగిస్తున్నారు. వైద్యుడిగా ఆయన సేవలు చాలా గొప్పవి. ఆయుర్వేద వైద్యుడిగా రోగనిర్ధారణ, నివారణ చేయడంలో ఆయనకు ఆయనే సాటి. 1982లోనే తన లక్ష్యసాధన కోసం శుశ్రుత ఆయుర్వేద స్పెషాలిటీ ఆసుపత్రిని

స్థాపించి, ఇంగ్లీషు వైద్యానికి అందని, అంతు చిక్కని అనేక వ్యాధుల్ని నయం చేసిన మంచి వైద్యుడాయన.

వైద్యవృత్తిని తపస్సుగా భావించే పూర్ణచందు, ఆయుర్వేద వైద్యానికి గొప్ప ప్రాచుర్యం తీసుకురావడానికి ఎంతగానో శ్రమించారు. ఆయుర్వేద రహస్యాలను వర్తమాన ప్రపంచానికి తెలియజెప్పడంలో ఆయన చేసిన కృషి చాలా గొప్పది. దాదాపుగా నలభై ఆయుర్వేద గ్రంథాలను వెలువరించారు. ఆధునిక కాలంలో, ఆయుర్వేదానికి సంబంధించి ఇన్ని రచనలు చేసినవారు, బహుశా పూర్ణచందు ఒక్కరే అనుకుంటా. వీరి వైద్య రచనలు తెలుగులోనే కాదు, కన్నడ భాషలో కూడా ఎంతో ప్రాముఖ్యతను సంపాదించుకొన్నాయి.

పూర్ణచందులో కనిపించే గొప్ప లక్షణాలలో ఒకటి ఆయన తెలుగు భాషాభిమానం. తెలుగుతనంపై నమ్మకం. తెలుగువారి గత సంస్కృతిని, విశిష్టతని వర్తమానంతో కలిపి ముందు తరాలకందించే ప్రయత్నం ఆయన జీవన విధానం. అందుకే, తెలుగువారి ఆహార చరిత్రపైన "ఆహారవేదం" లాంటి తొమ్మిది పరిశోధనా గ్రంథాల్ని రచించి, జాతికి అందించారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన "మన ఆహారం" పూర్ణచందు రచనల్లో ఎన్నదగ్గవి.

వర్తమాన ప్రపంచాన్ని తీవ్రంగా సంక్షోభ పరుస్తున్న వాటిలో చాలా ప్రమాదకరమైనది ఫాస్ట్‌ఫుడ్ పేరిట చలామణి అవుతున్న వంటలు, కలుషితమైన నూనెలు. ఇటువంటి ప్రమాదకరమైన పరిస్థితులలో ఏది ఉత్తమమైన ఆహారం అని తెలుసుకోవడం కూడా అసాధ్యమైపోతోంది. ఈ సంక్షోభ నివారణలో డాక్టర్ జి.వి.పూర్ణచందు వంటివారు నిర్వహిస్తున్న పాత్ర ఎంతగానో ప్రశంసనీయం.

"ఆయుర్వేదం, మన ఆరోగ్యం, అరచేతిలో ఆయుర్వేదం, వండర్‌వరల్డ్" వంటి అనేక వైద్యపరమైన పత్రికలకు సలహాదారుగా, తెలుగు ప్రజలకు ఆహార సంబంధమైన జాగృతిని కల్పించడంలో ఆయన చేస్తున్న కృషి చాలా ఉంది. ఇంచుమించు 30 పత్రికలలో వైద్యపరమైన శీర్షికలు నిర్వహించారు. ప్రస్తుతం తొమ్మిది దిన, వార, మాస పత్రికలలో ధారావాహికంగా రచనలు చేస్తూ ఆరోగ్యానికి, ఆహారానికి మధ్యగల గొప్ప అనుబంధాన్ని ప్రపంచానికి వివరిస్తున్నారాయన. అంతేకాదు, నేషనల్ మెడికల్ అసోసియేషన్ ఆంధ్రప్రదేశ్ అధ్యక్షుడిగా, ఆ సంఘ వ్యవస్థాపకులలో ఒకరిగా, ఆయుర్వేద పట్టభద్రుల సంక్షేమానికి ఎంతగానో తోడ్పడడమేకాదు, నవ్యాంధ్రప్రదేశ్‌లో విజయవాడలోని ఏకైక ఆయుర్వేద కళాశాల ఉనికి ప్రశ్నార్థకం అవుతున్నప్పుడు దానిని నిలిపిన ఘనత కూడా ఆయనకు చెందుతుంది.

అంతేకాదు, విజయవాడ విద్యాధర లయన్స్ కంటి ఆసుపత్రి వ్యవస్థాపక అధ్యక్షుడిగా పదివేల కంటి ఆపరేషన్లు ఉచితంగా జరిపించిన ఘనత ఆయనది.

అందుకే లయన్స్ అంతర్జాతీయ సేవాసంస్థ, అంతర్జాతీయ అధ్యక్షుడి బంగారు పతకంతో పూర్ణచందుని సత్కరించింది. నిజంగా, ఇది ఆయన ఒక్కరికే కాదు, తెలుగు వారందరికీ గర్వకారణం. ఇదంతా, వైద్య సేవకుడిగా ఆయన సాధించిన గొప్ప ప్రగతి, గొప్ప ఫలితం.

డా॥ జి.వి.పూర్ణచందులోని మరొక గొప్ప కోణం, ఆయన తెలుగు భాషా ప్రేమ. తెలుగుజాతి ప్రాచీనతని ఎలుగెత్తి చాటి తెలుగుభాషా వికాస ప్రస్థానాన్ని మరింత సమర్థవంతంగా నడిపించడంలో, తెలుగు భాషా సంస్కృతులకు జాతీయ, అంతర్జాతీయస్థాయి గౌరవాన్ని మరింతగా అందించడంలో ఆయన చేసిన కృషి, చూపిన పట్టుదల, పడిన శ్రమ, చేస్తున్న ప్రయత్నం ఎంతగానో శ్లాఘనీయం.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యుడిగా తన ఇరవై ఏటనే ఎంపికైన ఆయన గత ముప్ఫై ఏడేళ్ళ కాలంలో 104 విశేషమైన రచనలు చేయడం జరిగింది. వారి మొదటి గ్రంథం "అమలిన శృంగారం". వివిధ సాహిత్య, సామాజిక, ఆరోగ్య అంశాలపైన దాదాపుగా ఆరు వందలకు పైగా వారి వ్యాసాలు ప్రచురించబడ్డాయి. సుమారు పది ఆరోగ్య మాస పత్రికలకు సలహాదారుడిగా ఉండడమే కాక, తొమ్మిది పత్రికల్లో ప్రస్తుతం వీరి ఫీచర్స్ నడుస్తున్నాయి.

ఒకవైపు వైద్యవృత్తి, మరొకవైపు సామాజిక సేవా కార్యక్రమాలు, ఇంకొకవైపు భాషా వికాస సభలు, వేరొకవైపు కుటుంబ జీవితం... వీటన్నిటికీ తోడుగా విస్తృతమైన ఈ రచనా వ్యాసంగం. అందుకే, వేమకోటి శాంతారావు వీరి సాహితీ జీవన గమనంపై పరిశోధన చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పట్టాని అందుకొన్నారు. ఈ పరిశోధనా పత్రానికి త్రిపురనేని గోపీచంద్ గోల్డ్‌మెడల్ రావటం అదనపు ఆకర్షణ.

తెలుగు కవిత్వంలో అధునాతన ప్రక్రియగా, ముప్ఫైఐదేళ్ళ క్రిందట మొగ్గతొడిగిన మినీకవితా ఉద్యమానికి సారథ్యం వహించి, తెలుగునేలలో ముఖ్యమైన అన్ని ఊర్లలో వందకుపైగా మినీ కవితా ప్రదర్శనలు ఏర్పాటుచేసి, ఆ ప్రక్రియకు గొప్ప ప్రాచుర్యాన్ని కల్పించిన ఘనత నిస్సందేహంగా డా॥ పూర్ణచందుకే చెందుతుంది.

ఋగ్వేదకాలం నేపథ్యంగా వ్రాసిన వీరి ఇతిహాసిక నవల "సప్తసింధు", గుర్రం జాషువా మిలీనియం పురస్కారాన్ని అందుకొంది. ఆంధ్రుల రాజధాని అమరావతి అనే ఊహని పన్నెండేళ్ళ క్రితమే సూత్రప్రాయంగా ప్రస్తావించిన దూరదృష్టి వీరిది. అంతేకాదు... తెలుగు భాషోద్యమారంభానికి నాందీ గీతాన్ని తన "మాటల ముచ్చట్లు" గ్రంథంలో ఎన్నడో ప్రస్తావించారాయన. 2004లో భాషోద్యమం ప్రారంభం కాగా 2003లోనే వారి గ్రంథం భాషోద్యమాన్ని కోరుతూ వెలువడింది.

తెలుగు భాషా ప్రాచీనతని నిరూపించే వీరి గ్రంథం "నైలు నుండి కృష్ణ" దాకా, తొలి ద్రావిడ మానవుడి ఆవిర్భావాన్ని వివరించే గొప్ప పరిశోధనా గ్రంథం. దీనికి తెలుగు విశ్వవిద్యాలయ కీర్తి పురస్కారం లభించింది. వీరి "తెలుగే ప్రాచీనం" అనే గ్రంథానికి వచ్చిన హిందీ, ఆంగ్లానువాదాలు తెలుగు భాషకు ప్రాచీన ప్రతిపత్తిని కల్పించడంలో ఎంతగానో తోడ్పడ్డాయి. ఇంతకన్నా రచనకు, రచయితకు సార్థకత ఏముంటుంది? 2013లో జరిగిన "ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్" మహాసభల్లో "స్థానిక చరిత్ర"ల విభాగానికి అధ్యక్షత వహించి, వీరు చేసిన అధ్యక్షోపన్యాసంలో కృష్ణాతీర చరిత్ర పరిశీలనకి కొత్త మార్గం సూచించబడింది.

లండన్ మహానగరంలో యుక్తా సంస్థ ఏర్పాటు చేసిన ప్రపంచ తొలి తెలుగుచరిత్ర మహాసభల్ని విజయవంతం చేయడంలో జి.వి.పూర్ణచందు చేసిన కృషికి నేను ప్రత్యక్ష సాక్షిని. దేశంలోని అనేక విశ్వవిద్యాలయాలలో తెలుగువారి ఆహార చరిత్రపై వీరు చేసిన ప్రసంగాలు, తెలుగు చరిత్రలో మరుగునపడ్డ మరో కోణాన్ని ఎంతో శక్తివంతంగా ఆవిష్కరించాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

దీనికి తోడుగా కృష్ణాజిల్లా రచయితల సంఘ కార్యదర్శిగా తెలుగు భాషాభివృద్ధికి తోడ్పడే ఎన్నో సభల్ని, సెమినార్లని రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో నిర్వహించారు పూర్ణచందు. డాక్టర్ పూర్ణచందు ప్రచురిత రచనలు, శీర్షికలు కలిపి దాదాపు 150 వరకూ వున్నాయి. మొత్తం ప్రచురణల్లో 7 వైజ్ఞానిక గ్రంథాలు, 4 నవలలు, 3 కవితా సంపుటాలు, 8 పరిశోధనా గ్రంథాలు, 2 జీవిత చరిత్రలు, 8 సాహిత్య విమర్శనా గ్రంథాలు, 25 వైద్య గ్రంథాలు, 12 ఆహార వైద్య గ్రంథాలు, 11 సామాజిక రచనలు, 2 రేడియో నాటికలు ఉన్నాయి. అంతేకాక వీరు సంపాదకత్వం వహించిన గ్రంథాలు మొత్తం 15. దాదాపు 30 పత్రికల్లో శీర్షికలు నిర్వహించారు. ఈ విధంగా ఆయన సృష్టించిన సాహితీ సంపద ఎంతో విలువైనది!

డా॥ జి.వి.పూర్ణచందు నాలుగు దశాబ్దాలుగా అవిశ్రాంతంగా చేస్తున్న కృషి కేవలం సమాజ శ్రేయస్సును కాంక్షించే, తెలుగునేల సౌభాగ్యాన్ని ఆకాంక్షించేవే. ఇందులో ఆయనకు వ్యక్తిగతమైన ఏ కోరికాలేదు. ఎటువంటి కీర్తి కాంక్షా కానరాదు. అయినా, వీరి కృషిని, ఆ పట్టుదల వెనుకనున్న తపనని, ఆసక్తిని, నిస్వార్థతని గుర్తించిన ఎందరో పూర్ణచందుని సత్కరించారు. ఘనంగా సన్మానించి ప్రశంసా పత్రాలను, బహుమతుల్ని అందజేశారు. అసంఖ్యాకంగా లభించిన అటువంటి సత్కారాలలో చెప్పుకోదగిన వాటిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు అందించిన 2013వ సంవత్సరపు ఉగాది పురస్కారం ఒకటి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ

నారా చంద్రబాబు నాయుడు వీరిని సత్కరించి, వీరి కృషిని ప్రశంసించారు. ద్రావిడ విశ్వవిద్యాలయం, ఆచార్య నాగార్జునా విశ్వవిద్యాలయం, కృష్ణా, ఉస్మానియా, ఆంధ్ర, వెంకటేశ్వరా, అలీఘర్ ముస్లిమ్ విశ్వవిద్యాలయం, తంజావూరు విశ్వవిద్యాలయం వంటి అనేక విశ్వవిద్యాలయాలు పూర్ణచందు జాతికి, భాషకు చేసిన సేవను గౌరవించి సన్మానించాయి. 2016లో గిడుగు రామమూర్తి పురస్కారాన్ని, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతికశాఖ అందించింది. 2011లో ఉత్తర అమెరికా తెలుగు సంఘం, 2012లో యునైటెడ్ కింగ్‌డమ్ తెలుగు సంఘం వీరిని ఘనంగా సత్కరించాయి. తెలుగు విశ్వవిద్యాలయం కీర్తిపురస్కారం ఇచ్చి గౌరవించింది. తెలుగులో ప్రసిద్ధులైన కవుల, రచయిత పేర్ల మీదుగా ఏర్పాటు చేయబడిన పురస్కారాలన్నీ అందుకొన్న వ్యక్తి పూర్ణచందు ఒక్కరే. అంతేకాదు విజయవాడ దుర్గామల్లేశ్వరస్వామి దేవాలయంతో సహా అనేక దేవాలయాలలో కూడా వీరి కృషికి తగిన సత్కారం లభించింది. వీటన్నింటికీ తోడుగా... ఇటీవల రాష్ట్రేతర తెలుగు సమాఖ్య ముంబాయి తెలుగు సమాఖ్యల సంయుక్త ఆధ్వర్యంలో బొంబాయిలో జరిగిన మహాసభల్లో డా॥ జి.వి.పూర్ణచందుకి జీవన సాఫల్యతా పురస్కారాన్ని మారిషస్ దేశపు ఉపాధ్యక్షుడు అందించి, ఘనంగా సత్కరించారు.

ఇన్ని పురస్కారాలు అందుకొన్నా... ఎంతో కీర్తి గౌరవాల్ని స్వంతం చేసుకొన్నా, డా॥జి.వి.పూర్ణచందులో కన్పించే గొప్ప లక్షణం, ఆయన స్నేహశీలత, సౌజన్యత. మాటల్లోగానీ, చేతల్లో గానీ గర్వపు ఛాయలు కూడా కానరావు ఆయనలో. నవ్వుతూ పలకరిస్తూ... చిరునవ్వుతో ఎదుటి మనిషికి సమాధానం అందిస్తారు. ఎప్పుడు ఫోన్ చేసినా, ఎవరు ఫోన్ చేసినా ఓపికగా సమాధానం చెప్పడంలో ఆయనకు ఆయనేసాటి. నిజానికి కళా సాహిత్యాల అంతిమ లక్ష్యం మనిషిని మనీషి చేయడమే. పూర్ణచందు విషయంలో ఇది అక్షరాలా వాస్తవమయ్యింది. అందుకే. డా॥ పూర్ణచందుని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

షష్టిపూర్తి పెళ్ళికొడుకైన పూర్ణచందు, శతాధిక సంవత్సరాలు ఆనందంగా, ఆరోగ్యంగా జీవించి, తెలుగు భాషా సాహిత్య సేవలో, ప్రజారోగ్య పరిరక్షణలో చరితార్థులు కావాలనేది నా కోరిక. అది సఫలం చేయాలని చదువుల తల్లి సరస్వతిని ప్రార్థిస్తున్నాను.

**శుభం.**

***(64 కళలు.కామ్ సౌజన్యంతో)***

డా॥ జి.వి. పూర్ణచందు షష్టిపూర్తి మహోత్సవ

# పుస్తక యజ్ఞం

## శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్టు ప్రచురణలు

1. **ముక్కాలు** (మూడు భాషలలో వెలువడుతున్న కవితాసంపుటి)
2. **కాంతిస్వప్న** (పదచిత్ర వచనకావ్యం)
3. **పరిపూర్ణ జీవి డా॥ జి.వి.పూర్ణచందు** (పూర్ణచందు సాహితీ జీవన యానం)

## శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణలు

1. **తెలుగుధీర** (చారిత్రక నవల)
2. **చిగురులు వేసిన కలలు** (స్వాతిలో ప్రచురితమైన నవల)
3. **నిండుయవ్వనం** (సంసారవేదం)

## తి.తి.దే. ఆర్థిక సహాయంతో వెలువడిన ప్రచురణలు

1. **పద్యానుభవం** (సాహిత్య విమర్శ వ్యాసాలు)
2. **ఆరోగ్యంకోసం ఆహారం**
3. **ఆహారం - ఆరోగ్యం** (సందేహాలు - సమాధానాలు)

## విక్టరీ పబ్లికేషన్స్ ప్రచురణలు

1. **తెలుగుకోసం - తెలుగుభాష, సంస్కృతి, చరిత్ర, సాహిత్యం**
   (డా॥ జి.వి.పూర్ణచందు సాహిత్య వ్యాసాల సంపుటి)
2. **చిరంజీవులు**
   (వేదయుగం నుండి నేటివరకూ శాస్త్ర, సాహిత్య రంగాలకు పరిపుష్టినిచ్చిన మహనీయుల జీవిత చరిత్రలు)
3. **రామాయణాలలో వింతలు - విశేషాలు** (పరిశోధనా గ్రంథం)



# తెలుగు పున్నమి చంద్రుడు పూర్ణచందు

తెలుగు పద్యంలో నేటి సమాజపోకడలకు, అవినీతిమయ పాలనకు తగిలే చురుకులున్నాయి. వ్యక్తిత్వ వికాసం ఉంది. నాణ్యమైన ఆలోచనలున్నాయి. వాటిని వెలికితెచ్చే ప్రయత్నం చేశాడు డా. జి వి పూర్ణచందు. పద్యం వెయ్యేళ్ళనాటిదైనా ఈ సమాజానికి అన్వయించవచ్చని తన వ్యాఖ్యానం ద్వారా నిరూపించాడు.

అందరిలా ఆలంకారిక విశేషాలు కాకుండా, పద్యాన్ని ఆసరా చేసుకుని మరుగున పడిన అనేక చారిత్రక విశేషాలు త్రవ్వి తీశాడు. వ్యాప్తిలో ఉన్న కొన్ని అపోహల్ని నిర్భయంగా ఖండించాడు. తెలుగుభాష మూలాలను వెదకులాడే ప్రయత్నం చేశాడు.

గత నలబై యేళ్ళకాలంలో పూర్ణచందు 107 పుస్తకాలు వెలువరించాడు. వివిధ పత్రికల్లో 34 శీర్షికలు నిర్వహించాడు. సంపాదకత్వం లేదా సహ సంపాదకత్వం వహించిన 24 ఉద్గ్రంథాలు ఆకరగ్రంథాలుగా ప్రసిద్ధి పొందాయి. అనేకసార్లు పునర్ముద్రణ పొందిన వైద్యగ్రంథాలు, తెలుగువారి ఆహారచరిత్ర గ్రంథాలు, భాషా పరిశోధనా గ్రంథాలు పూర్ణచందును బహుపార్శ్వీన శేముషీగుణసంపన్నుణ్ణి చేశాయి.

"ముక్కాలు" కవితా సంపుటిని మూడుభాషల్లో ఒకేసారి ప్రచురించి తనదైన నవ్యకవితారీతిని సృష్టించాడు పూర్ణచందు. భాషోద్యమ సైనికుడిగా, తెలుగుభాష మూలాలు త్రవ్వి, అపారమైన ముడిసరుకు తెచ్చి, కొనసాగవలసిన పరిశోధనలుగా పరిశోధకులకు అందించాడు. నైలు నుండి కృష్ణదాకా, తెలుగే ప్రాచీనం, ఆహారవేదం, తరతరాల తెలుగురుచులు, సప్తసింధు, తెలుగుధీర గ్రంథాలు పరిశోధకుడిగా పూర్ణచందును చిరస్మరణీయుణ్ణి చేశాయి.

ప్రతిరోజూ తప్పనిసరిగా ఒక రచన చేయాల్సినంతగా 10 మాస, వార దిన పత్రికల్లో ప్రస్తుతం శీర్షికలు నిర్వహిస్తున్నాడు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం మరియు ప్రపంచ తెలుగు రచయితల మహాసభల ప్రధాన కార్యదర్శిగా అనితర సాధ్యమైన రీతిలో కార్యక్రమాలు నిర్వహించాడు. క్షణం తీరిక లేకుండా, అలుపెరుగని రీతిలో పనిచేసే పూర్ణచందు తెలుగుపున్నమిచంద్రుడిలా సార్థకనామధేయి. సాహితీవేత్తగా, సాహితీ సేవకుడిగా పూర్ణచందు కృషి చిరకాలం నిలిచిపోతుంది.

"పద్యానుభవం"మన ప్రాచీన సాహిత్య సంపదను కొత్తకోణంలో నిర్వచించిన ఒక విశిష్టరచన.

గుత్తికొండ సుబ్బారావు,

అధ్యక్షుడు, శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్టు.

210

